# పీఠిక

వంగదేశమందంతట పేరుప్రతిష్ఠలు గాంచి, ఆంగ్ల, బంగాలీ భాషలలో ననేకగ్రంథములు రచియించిన రమేశ చంద్రదత్తుగారి 'స్లేవ్ గరల్ ఆఫ్ ఆగ్రా' (Slave Girl of Agra) అను ఇంగ్లీషు గ్రంథమున కీనవల ఆంధ్రీకరణము. ఇది తెలుఁగులో సుప్రసిద్ధ నవలలు రచియించి ప్రఖ్యాతిగాంచిన బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారిచే నాంధ్రీకరింపఁబడినది అత్యద్భుతనవలారచయిత యగు శ్రీలక్ష్మీనరసింహముగారికి 'ఆంధ్రాస్కాట్' అను బిరుదు వచ్చిన విషయ మాంధ్రలోకమునకు విదితము. వీరు రచియించిన నవలలు తెనుఁగు దేశములోఁ బ్రతియింటఁ జదువఁబడుచున్న వను మాట యతిశయోక్తిగాదు.

ఈ 'దాసీకన్య' మిక్కిలి రసవంతమైన నవల. ఇందలి కథాకల్పన మతి విచిత్రము. బంగాలీదేశీయుల సాంఘికాచారవ్యవహారములు, సంప్రదాయములు ఈ నవలఁ జదివినవారికి కరతలామలకముగఁ దెలియును. ఢిల్లీచక్రవర్తియైన యక్బరుపాదుషా కాలపు కథయగుటచే మొగలాయీసామ్రాజ్యవైభవము, అప్పటి ఢిల్లీదర్బారు ఠీవి, అంతఃపురముల సొగసు, మొగలాయిరాణుల యొక్క వేషభాషలు, అంతఃపురరహస్యములు అతిసుందరములై చదువరుల నానందసముద్రములో ముంచివేయును. ఢిల్లీపాదుషా యంతఃపురములో పరిచారికయైన తార్తారదేశపుస్త్రీ జలేఖాయను దాసీకన్య యొక్క మాయలు, చమత్కృతులు, విలాసములు వర్ణనాతీతములై యున్నవి.

ఇందలి కథానాయికా నాయకుల గుణపోషణ మత్యద్భుతము. అక్బరు పెద్దకుమారుఁడైన జహాంగీరు వలచిన మెహరున్నిసా యను

మారుపేరు గల 'నూర్జహాన్' అను జగత్ప్రసిద్ధ నాతిమణియొక్క విలాసములు, హొయలు ఇందు చక్కగా వర్ణింపఁబడినవి. ఈనవలా రాజము చదివినకొలది పాఠకులను విస్మయసాగరమున ముంచి వేయును.

మాతృక చదివి చెప్పుటకు, చెప్పినది వ్రాయుటకు తగిన లేఖరి లేనిదే ఏమియు చేయలేని స్థితిలో, షష్టిపూర్తి యైనపిదప గూడ ఈ పెద్దనవలను తమ సహజమృదుమధురశైలిలో నాంధ్రీకరించి మా మండలియందలి యభిమానముచే మాకు దయచేసిన శ్రీలక్ష్మీ నరసింహంపంతులుగారికి మేము కృతజ్ఞతా పూర్వకమైన యనేక నమస్కారములు లాచరించుచు, ఆంధ్రులుకూడ శ్రీ పంతులుగారికి తమ కృతజ్ఞతను వెల్లడింతురని నమ్ముచున్నాము.

1934 ఏప్రియల్. ప్ర కా శ కు లు

.

మొగలాయివంశమున కాభరణమును మహమ్మదీయ సార్వభౌములలో నగ్రగణ్యుడు నయిన యక్బరుచక్రవర్తి హిందూస్థానమును బరిపాలించు చుండెను. తూర్పుఖండములో నాంగ్లేయసామ్రాజ్యమును సంస్థాపించు టకై గాఢమైన పునాదులు వేయుచుండిన యెలిజబెత్ రాణి యింగ్లాండు దేశము నేలుచుండెను. ఆ కాలమున క్రీ. శ. 1590 సంవత్సరమున నొకనాటి సాయంకాలమున ముగ్గురు హిందూపిల్లలు గంగానదీ తీరమున నాడుకొనుచుండిరి. ఆ స్థలము మిక్కిలి సుందరమై చరిత్రాత్మకమై వీరుల చేష్టితములకు నాస్పదమై యుండెను. పరమపావనమై యతి విశాలమైన యీనది వందలకొలది మైళ్ళు తూర్పుగా బ్రవహించి యచ్చోట వంపుదిరిగి, రాజమహలు కొండలచుట్టును దిరిగి దక్షిణాభిముఖమై ప్రవహించుచున్నది. ఈ యిసుకదారిగుండ బశ్చిమము నుండి దండయాత్రాతరంగములు సారవంతమైన వంగదేశము భూములపై బలుమారు వచ్చిపడెను. అనేక వంశములకు మూలపురుషులయిన మహాశూరులాయువు పట్టువంటి యీస్థానమున దమ జయధ్వజముల నిలిపి రాజ్యములు స్థాపించిరి. గౌరు, టాండా, రాజమహల్ మున్నగు పట్టణములు నేడు జనశూన్యములై దారిద్ర్యదేవతానిలయములై యుండినను, మున్నొకనాడవి హిందూమహమ్మదీయ మొగలాయి ప్రభువులకును మహాశూరులకును రాజధానులై యుండెను. పదునాఱవ శతాబ్దమున జరిగిన ఘోరయుద్ధము లీప్రాంతమున దృఢమనోబలమును ప్రశంసనీయ బాహుబలమును గల ప్రభువులు, నాయకులు, పలువురుపుట్టి పెరుగుటకు హేతువులయ్యెను. వీరు వంగదేశము యొక్క భాగ్యాభాగ్యములను నిర్ణయించినట్టి యనేకయుద్ధములలో నొకపక్షముననో, రెండవపక్షముననో చేరి పోరాడుచుండిరి.

పైనఁ జేర్కొనఁబడిన పిల్లలు ముగ్గురు ఇసుకలో నాడుకొనుచుండిరి. వారివెనుక తూర్పుగా సారవంతములైన మూర్శిదాబాదు మండలపు బయళ్ళుండెను. అవి పచ్చని వరిచేలతోడను, నేఁటికిని ప్రపంచములో నెంచును సాటిలేని తీయనిమామిడిపండ్లనొసగుచు శ్యామాయమానములైన మామిడితోఁపులతోడను నిండియుండెను. వారియెట్టయెదుట గంగానది గాంభీర్యముతోఁ బ్రవహించుచుండెను. దానికావల రాజమహాలు కొండలయొక్క నక్రశిఖరములు కనఁబడుచుండెను సరకుతో నిండిన వందలకొలది నావలు రాత్రి కచ్చట లంగరు వేయఁబడియుండెను. ఆనావలు బంగాళా దేశమందలి పంచదారను, ధాన్యమును, లవణమును, వస్త్రములను, పట్టుసరకును నుత్తరహిందూస్థానమునకుఁ దీసికొనిపోయి, విహార దేశమందలి పప్పుదినుసులను, కాశీనగరమందలి యిత్తడిసరుకును చక్రవర్తులకు రాజధానులైన మహాపట్టణములందుఁ జేయఁబడిన విన్నాణపుసరకులను వంగదేశమునకుఁ దెచ్చుచుండును. ఏమన గంగానది యుత్తరదేశవాణిజ్యమునకు సాధనమైన గొప్ప రాచబాట. ఆనదీప్రవాహమున నెగువకు దిగువకు రాకపోకలు సేయుచు మాతృవక్షస్థలమున బిడ్డలు ప్రాఁకునట్లు, నోడలు సంచారముచేయుచుండఁగాఁ జూచిన పెద్దలు నేఁటికిని గొంతయున్నారు. వాణిజ్యమిప్పుడు రైలుబండ్లమీఁద జరుగుటచే నతిత్వరితముగ జరుగుచున్నది. పడవలమీఁద నెడ్లబండ్లమీఁద జరిగిననాఁటికంటెఁ బయనము నేఁటికాలమున మిక్కిలి సుఖకరముగా జరుగుచున్నది. అప్పుడు జీవనమింతకంటె నెక్కువ సుఖకరముగా నుండెను. స్త్రీలు, పురుషులు వంశక్రమాగతములైన తమతమ వృత్తులలోఁ బరిశ్రమలుచేసి పాటుపడి యెక్కువ విశ్రాంతిగలిగి ప్రశాంతములైన తమగ్రామములలోఁ బ్రాచ్యదేశములకు సులభమైన నిరాడంబరజీవనము జేయుచుండిరి.

మినుకుమినుకు మను చుక్కలవెలుఁగున వారి ముప్పురిలో నిరువురు

మగపిల్లలు నిసుకతోను, మట్టితోను, కఱ్ఱముక్కలతోను నిండ్లు కట్టు చుండిరి. వారు చేయుచున్న పని నిశ్శబ్దముగా గమనించుచు నిగనిగ లాడు సుందరనేత్రములు గల యొక యాఁడుపిల్ల సమీపమున నిలిచి యుండెను. చీకఁటిలో గలిసిపోయిన మామిడితోపులు తప్ప సమీప మున నున్న పీరనగరము కనఁబడుటలేదు. అక్కడక్కడఁ జెట్లక్రిందఁ జిన్న చిన్న దీపములు మాత్రము కొన్ని పొడగట్టుచుండెను. నదిప్రక్క మాత్రము సందడిగ నుండెను. పడవవాండ్రు పగలెల్లఁ బాటుపడియుం డుటచేఁ దనకు వచ్చిన పాటలు పాడుకొనుచుండిరి. సాయంకాలపు వంటనిమిత్తము ప్రతిపడవమీఁద ప్రొయిలో నిప్పు వేయఁబడెను.

ఆ మగపిల్ల లిద్దఱు సమానవయస్సు గలవారు. అనఁగాఁ బదునై దేండ్లప్రాయముగలవారు. కాని, యాకారములందును, స్వభావము లందును సామ్యములేక భిన్నులై యుండిరి. శిరీషుఁడు బలము, దేహ పుష్టిగలవాడు. కుచ్ఛితవృత్తిలేక మనస్సులోనున్నది సయికిఁ జెప్పు వాఁడు. వయస్సు పదునై దేండ్లయినను యువకున కుండదగినంత బల దర్పము లతనికిఁ గలిగెను. చాలమంది బాలకులవలెనే యతఁడుగూడ శాంతస్వభావము గలవాడు. నరేంద్రుఁడు పచ్చనిచాయయు మృదు వైన యంగములు గల సుకుమారి. ఇట్టి లక్షణములు మన దేశమున సత్కులప్రసూనతను దెలియఁజేయుచుండును. తుమ్మెద ఱెక్కలవంటి నల్లనిముంగురులు పసిఁడిచాయల నీను నరేంద్రుని నెమ్మొగముపై వ్రేలుచుండెను. ఆ యిసుకతిన్నియలమీఁదఁ బరువులెత్తుచున్నప్పుడు వాని నల్లని కన్నులానందపూరితములై నల్లగలువల సొబగును జూఱ లాడెను. కాని, యతఁడు కోపశీలుఁడు. చీటికిమాటి కతని కాగ్రహము వచ్చుచుండెను. కోపసూచకములైన నల్లజీరలాతని మొగమునఁ గనఁ బడినపుడు దృఢకాయుఁడైన యాతని చెలికాఁడు సుకుమారుఁడైన యా పిల్లవానిజోలికిం బోక శాంతపడుచుండును.

గొప్పవంశమునఁ బుట్టకపోయినను ధనసంపద లేకపోయినను శిరీషుఁడు యుక్తాయుక్త వివేకజ్ఞానము, శాంతము, సుఖజీవనమునకు సాధనమైన కార్యదీక్షయుఁ గలిగియుండెను. నరేంద్రుఁడన్ననో యొక సంస్థానమునకు వారసుఁడై యా దేశమంతట గౌరవింపబఁడు పేరు ప్రతిష్ఠలుగల గొప్పకుటుంబమునకు జెందియుండెను. అతఁడు కుశాగ్రబుద్ధి. చక్కఁదనమువలెనే బుద్ధికుశలతగూడఁ దలిదండ్రులనుండి బిడ్డలకు సంక్రమించునుగదా! కాని శాంతము మొదలైన యుత్తమలక్షణము లాతనికడ లేవు. అవి లేనిచో నెంతటి తెలివితేటలున్నను నవి నిష్ప్రయోజనములై జీవితము దుఃఖభాజనమగును.

నక్షత్రముల కాంతిని సైకతగృహము కట్టుచున్నప్పుడు నరేంద్రుఁడానాఁడు తనకార్యమున జయమునొందక పరాభవము పొందవలసినవాఁడయ్యెను. సామాన్యముగా నతఁడు తెలివిగలవాఁడు నేర్పరియునైయుండెను. కాని యానాఁడు నిశ్శబ్దముగా గమనించుచున్న యా బాలికయొక్క చూపులచేత నతఁడెందుచేతనో కంపితుఁడై కృతకృత్యుఁడు కాలేకపోయెను. హేమలత మిక్కిలి సుకుమారమైన పండ్రెండేండ్లబాలిక. ఆమెస్వభావము మిక్కిలి మధురమైనది. నరేంద్రుఁడామెను బాల్యమునుండి యెఱుఁగును. సిన్నవాండ్రకొండొరులపై నుండునట్టి గాఢానురాగముతో నతఁడామెను ప్రేమించుచుండెను. తనవంటి తలిదండ్రులులేని బిడ్డయొక్క మనోవ్యథలు బాధలు నతఁడామెతోఁ బలుమాఱు రహస్యముగా జెప్పుకొనుచుండును. అప్పుడప్పుడు తన మనోగర్భితములైన కోరికలన్నియుఁగూడ నామెతో జెప్పుచుండును. ఆమెయు జాలిగలిగి చెవియొగ్గి వానిగోడవలు వినుచుండును. మెత్తనిమనస్సుగల యా బాలిక వానిగోడవ నాదరముతో వినెనేగాని యతని మనోవ్యథయేమో యెందుకతఁడు కుందుచున్నాఁడో యామె తెలిసికొనలేదు. కాని, యాతని నిమిత్తమై యామెవలెఁ బరితాపపడు

వారు మంచిమాటలతో నూరడించువారు మఱియొకరులేరు. ఆ విధముగా నాబాలుఁడును బాలికయుఁ బరస్పరానురాగయు గలిగి పెరుగు చుండిరి.

శిరీషుఁడు తరువాతఁ గొంత కాలమునకు వచ్చెను. అతనికాబాలిక మిత్రమై వానితో నాడుకొనుచుండెను. శిరీషున కంతకన్న నేమియు నక్కఱలేదు. కలలోనైనను శిరీషుఁడా చక్కని బాలికను జేపట్టవలెనని తలంపలేదు. తండ్రికామె యొక్కతెయె బిడ్డ. ఆయన యాప్రాంతమున గొప్పపలుకుబడి గలవాఁడు. అయినను బ్రశాంతములై నిరంతర మాలోచనను సూచించు నాతనికనులు గంభీరమైన యాశయమును సామాన్యులూహింపఁజాలని మనోనిశ్చయమును దెలుపుచుండును. అతనికోరిక లేవో మనోగర్భితములై యుండెను. కాని వాగ్రూపమున బయలువెడల లేదు.

నేఁటిరాత్రి హేమలత శిరీషుఁడు చేయుచున్న పనివంక శ్రద్ధగలిగి చూచుచుండుటచేత నతఁడెంతయును సంతసించుచుఁ దనపని నోపికతోఁ జేయుచుండెను. నరేంద్రుఁడు మనశ్శాంతిలేక యుద్రేకపూరితుఁడై హేమలతాశిరీషులవంక నీర్ష్యాప్రేరితుఁడై చూడఁదొడఁగెను. ఇట్లొకయరగంట జరిగెను. శిరీషుఁడు చేయుచున్నపని ముగిసెను. ఆ యిసుకయిల్లంత చక్కగాఁ ద్వరగా నిర్మింపఁబడినందుకు సంతసించి హేమలత చప్పట్లుగొట్టెను. ఆమెనవ్వు తేలుకుట్టువలె నరేంద్రు నూరించెను. వానిచేతులు వడఁకెను. కట్టుచున్న యిసుకయిల్లు నేలఁగూలెను. నరేంద్రుఁడు నిశ్చేష్టితుఁడై నిలువఁబడెను. అప్పుడు హేమలతచేయి తనచేతితోఁ బట్టుకొని శిరీషుఁడు నరేంద్రునికడకుఁబోయి "ఓయీ నరేంద్రుఁడా! ఈపూఁట నీవేమియు జేయలేదేమి? గొప్ప నేర్పరినని డాబులుగొట్టుచుందువే యా నేర్పరితనమేది?" యని యడిగెను.

నరేంద్రుఁడు పడిపోయిన తనయిసుకయిల్లు పూర్తిగాఁ బడిపోవునట్లు

గాలితోఁ దన్ని "యీపూఁట నేనేమియుఁ జేయఁదలఁచుకొనలేదు" అని పెంకెతనముతో నుత్తరము జెప్పెను.

అనవుడు శిరీషనరేంద్రుల కీ క్రిందివిధముగ సంభాషణము జరిగెను.

"అట్లయిన నేటియొద్దునకు నీవు నన్నేల రమ్మంటివి? ఈమెను నీ విక్కడ నింత సేపెందుకుంచితివి? ఈపాటి కీమెతండ్రి బిడ్డనుగురించి విచారించుచుండునే."

"ఆయన నన్నడిగినప్పుడు నేనాయనకు జవాబు చెప్పెదను నీకు మాత్రము నేను జెప్పదలఁచుకోలేదు."

"నీ మోటతనము నీ తెలివితేటలకు సరిపోయినది. నీయిల్లేగాక, నీ శీలముగూడ గూలిపోయినది."

"ఈయిసుకయిల్లు కూలిపోయినను నేను కాపురముండుటకు మంచి యిల్లున్నదిలే లోకములో నాదియని చెప్పి తల దాఁచుకొనుటకైన దొప్పెడు కొంపలేనివార లనేకులున్నారు."

ఇది శిరీషునకు మిక్కిలి యవమానకరమైన మాట. ఏలయన నతఁ డాకాలమున హేమలతతండ్రియొక్క యనుజీవియై వారిపోషణములో నుండెను అతనికి మిక్కిలి కోపమువచ్చెను గాని దానినడఁచుకొని నరేంద్రుని స్థితికిని, గౌరవమునకును, దగిన తెఱఁగున నిట్లు బదులు చెప్పెను. "నరేంద్రుఁడా! నేను నాస్థితిగతుల నెఱుఁగుదును. అందుకు నేను సిగ్గుపడవలసిన పనిలేదు. నీవుగూడ నీస్థితిగతుల నెఱిఁగి మీ తాతగారి పేరుప్రతిష్ఠలు నిలుపవలయునని కోరుచున్నాను."

"ఇప్పుడైన మా తాతగారివంశమును పేరుప్రతిష్ఠలును నీకు జ్ఞాపకమువచ్చినవి. మంచిదే. పూర్వము మా తాతగారి కన్నులముందఁట నిలుచుటకైన యర్హతలేక గడగడ వడఁకువారు, నాకాయన విడిచి పోయిన సంస్థానమును హరించుటకు వెనదీయనివారై యున్నారు. ఈ పన్నుగడలు పాపము నీకుఁగూడ కొన్ని తెలిసియే యుండవచ్చును.

"నరేంద్రా! నీయిష్టమువచ్చినట్లు ప్రేలుకో! హేమలత నింటికిదీసి కొనిపోయెదను. తండ్రి యామెను వెదకికొనుచుండును."

"శిరీషుఁడ! హేమలతకు సంరక్షకుఁడుగా నిన్నెవరేర్పఱచిరి? ఎంతకాలమునుండి నీవామెను సంరక్షించుచుంటివి?" అని నరేంద్రుఁడు భయంకరముగాఁ బలికి, హేమలత శిరీషునిచెంతకుఁ బోవుచుండుట కోర్వలేకపోయెను.

"నేనామెకు సంరక్షకుండనుగాను. కాని, నీవంటి పిచ్చివానినుండి యామెను సంరక్షించుట నాసంకల్పము."

"వెనుకకువెళ్లు. ఏటియొడ్డున నాడుకొనుట కామె నాతోవచ్చినది గనుక నేనే యామెనింటికిఁ దీసికొనిపోయెదను." అని నరేంద్రుఁడు చేతులు గట్టిగాఁజఱచి పలికెను.

"నరేంద్రా! ఇంతకన్న మంచిమర్యాద నీవు నేర్చికొన్నతరువాత నీ వామెనింటికిఁ దీసికొనిపోవచ్చును. కాని, నీవంటి మోటవానితో నేనామెను నేఁడు పంపను."

"వెళ్లు వెనుకకు వెళ్లు. నీచుఁడ! ఆమెప్రక్కను నిలుచుట కర్హత గలిగినవాఁడే యామెను దీసికొనిపోవును."

ఈనూతనపరాభవముచేత బలిష్ఠమైన శిరీషుని దేహము కంపింప, నతఁడు నరేంద్రునివంకఁ జూచుచు నిలువఁబడి, కోపము నాపుకొని యుత్తరము చెప్పఁదలఁచుకొనక భయపడుచుఁ బ్రక్కనిలిచిన హేమలతమీఁదఁ జేయివైచి యింటికిఁబోవుటకై నాలుగడుగులు వైచెను.

ఇది నరేంద్రునికి మిక్కిలి దుస్సహమయ్యెను. ప్రత్యుత్తరమీయకయె శిరీషుఁడుచేసిన యీ తిరస్కారమును నరేంద్రుఁడు వెఱ్ఱియెత్తినట్లు మెలఁగి తటాలునఁ దనయావద్బలముతోను శిరీషునిపైఁబడి కొట్ట సాగెను. హేమలత భయముతో నడఁకి పెద్దకేకవైచెను. నరేంద్రుఁడు శిరీషునకుఁ జాలఁడు. కోపావేశముతో మీఁదఁబడిన నరేంద్రుని నడుము బట్టుకొని పైకెత్తి యాతఁడు గుభాలున నేలఁబడవైచెను.

ఆబాలికయెదుటనే తనకింత గొప్పపరాభవము జరుగుటచే దానిని సహింపలేక, శరీరము నిండ నలుముకొన్న నిసుకయు, మట్టియు దులుపుకొనుచు లేచి యొక పెద్దరాయి దీసి దానిని శిరీషునిపై విసరెను. ఆరాయి వాని కుడికంటికిఁ గొంచెము మీఁదుగాఁ దగిలెను. లోతుగా గాయము పడెను. శిరీషుఁ డిసుకతిన్నెపైఁ గూర్చుండి బట్టతో నెత్తురొత్తుకొనుచుండెను. హేమలత మాటాడక నిదియంతయుఁ జూచుచుండెను. దుర్నయపరుఁడైన నరేంద్రునివంక దిరస్కారసూచకములైనచూపులను శిరీషునివంక సాదర నిరీక్షణములను బఱపెను. అవ్వల నామె కంటినుండి బాష్పములు జాఱెను. ఆమె వెంటనే యేటికిఁ బోయి చీరకొంగు నీటితోఁ దడిపి శిరీషుని గాయము కడుగుటకై వచ్చెను.

కాని యతని గాయము గొప్పదికాదు. కాకపోయిన నతఁడు లేచి నిలువఁబడగానే నెత్తురుబొట్లు మొగముపైఁ బడుచుండెను.

"హేమలత! రా. ఇంటికి రా. ప్రొద్దుపోయినది. మన మింటికి వెళ్లవలెను" అని మెల్లగఁ జెప్పెను. వారిరువురు చెట్టపట్టాలు వైచికొని నరేంద్రునివంక జూడనైనఁ జూడక యింటివైపు జనిరి. నరేంద్రుఁడు మనోవేదన నొందుచుఁ గారుచీఁకటులు గ్రమ్మువఱకు నక్కడనే యేకాకియై నిలువఁబడెను. ఆ యంధకారమధ్యమున నిలిచియున్నప్పు డాతని కెన్నో చెడ్డతలంపులు పుట్టెను. గొప్ప సంస్థానమునకు వారసుఁడైన తాను పిచ్చివానివలె మెలఁగుటయుఁ దన ప్రేమకుఁ గాణాచియైన యా బాలికకుఁ దనమీఁది గౌరవము బోవుటయు నతని మనస్సును గట్టిగా వేధించెను. ఒకని పోష్యవర్గములోఁ జేరిన శిరీషుఁడు తన్నుఁ బరాభవించి క్షమించి విడుచుటయే గాక యాబాలిక ప్రేమకు నాస్పదుఁడగుటయుఁ గూడ నతనికి విషాదహేతువులయ్యెను. ఇది యతని భవిష్యజ్జీవితమును సూచించునట్టి కార్యమేమో గదా!

ఈ కథాకాలమునకు మున్ను కొన్ని యేండ్లక్రిందట వీరనగర ముత్సాహకరములైన యనేక కార్యములకు నిలయమై యుండెను. ఆఫ్ఘనుజాతివారైన ప్రభువులు బంగాళాదేశమును నాలుగు శతాబ్దములవఱకు నెమ్మదిగా నేలిరి. కాని యుత్తరహిందూస్థానమున నక్బరు చక్రవర్తి మొగలాయీరాజ్యమును వ్యాపింపజేసి దృఢపఱచినందున బంగాళములో నాఫ్ఘనురాజుల పాలన మంతరించెను. అక్బరు పాటలీపుత్రమును స్వయముగా 1564 సం॥ రములో బట్టుకొనెను తరువాతి సంవత్సరములలో శూరులై జయశీలురైన మొగలాయీలకును బరాజితులయ్యు దృఢసంకల్పులయిన యాఫ్ఘనులకును జరిగిన పోరాటములకు బంగాళాదేశము రంగస్థలమయ్యెను.

ఆ దినములలో హిందూ జమీందారులు తమ సంస్థానములను గ్రామములను దురకప్రభువులకు లోబడి యేలుకొనుచుండిరి. హిందూదేశములో హిందూజాతి గ్రామములలోనే వసించెను. జమీందారులు మహమ్మదీయప్రభువుల కేదో కొంత కప్పముగట్టి తమ సంస్థానములను సర్వస్వతంత్రులై పాలించుచుండిరి. జనులు తెచ్చెడి యభియోగములను విచారణచేసి దోషులను దండించి యా జమీందారులు న్యాయపాలనము సేయుచుండిరి. వారు విద్యాపోషకులై కవిపండితుల నాదరించుచుండిరి. చేతిపనులను దక్కిన పరిశ్రమలను వారు ప్రోత్సాహపఱచిరి. ఏనుగులను, సైనికులను దమయొద్ద నిలిపిరి. మహమ్మదీయ ప్రభువులకుఁ గావలసినప్పు డిచ్చుటకు నావలను గూడఁ గట్టించి యుంచిరి.

మన కథకు రంగమైన వీరనగర మొక పురాతన రాజకుటుంబమునకు నివాసస్థానము. అక్బరుచక్రవర్తి పాటలీపుత్రము బట్టుకొన్నప్పుడు

మొగలాయి సైనికులు బంగాళా దేశమంతను నాక్రమించిరి. ఆ సమయమున దేశములోని జమీందారు లందఱు మొగలాయీల పక్షమునఁ జేరఁగా వీరనగరపు జమీందారు మాత్రము కిట్టకడపటి యాఫ్ఘనులకు ప్రభువగు దాయూదుఖానుని విడువక యాతని పక్షమున నుండెను. ఆ జమీందారుఁడు తన పట్టణమును శత్రువుల బారినుండి రక్షించుకొనలేక యూరు విడచి యడవులకుఁ బాఱిపోయెను. చక్రవర్తి సేనాపతులగు మునాయిమును, తోడరుమాల్ అనువారు వీరనగరము జొచ్చి జనశూన్యములైన భవనములలో స్వేచ్ఛగాఁ దమ గుఱ్ఱముల నేనుంగులఁ గట్టుకొని వానిని లాయములఁ జేసిరి. దాయూదుఖాను గూడ మొగలాయీల దాడి కాగలేక బంగాళాదేశము నక్బరు కర్పించి తానుత్కల దేశమునకుఁ బోయెను. అటుపిమ్మట నే వీరనగర ప్రభువు తన పట్టణమునకు మరల వచ్చి చక్రవర్తి ప్రతినిధియైన రాజా తోడరుమాలునకు విధేయుఁడై కప్పము జెల్లించి నూతన ప్రభుత్వమునకు లోఁబడి యుండెను.

కాని యచిరకాలములోనె దాయూదుఖాను మాటతప్పి మరల బంగాళమును జయించి సైన్యములం దీసికొని తనతోఁ జేరుమని వీరనగర ప్రభువునకు వర్తమాన మంపెను. వృద్ధుడైన యా జమీందారుఁడు ఖానున కిట్లు సందేశ మంపెను. "దాయూదుఖానుఁడు తన రాజ్యమును సంరక్షించుకొనలేక పోయినందునఁ దమకుఁ గల హక్కుల నన్నిఁటిని బోఁగొట్టుకొనెను. బంగాళాదేశమును మహాచక్రవర్తియైన యక్బరునకు విడిచిపెట్టితినని మాట యిచ్చెను. తలమీఁదఁ గిరీటము దాల్చిన భూపాలుఁడు తనమాట దప్పుట తగనిపని. చేసిన బాస తప్పుట మా వంశాచారముగాదు. ఆగ్రానగరపు చక్రవర్తియైన యక్బరునకే నేను విధేయుఁడనై యుండెదను."

తిరస్కారపురస్సరమైన యీ ప్రత్యుత్తరము దాయూదుఖానునకు

మహాగ్రహము గలిగింప, నతఁడు వెంటనే పట్టణము నాశనముజేసి ముసలిజమీందారుని సంకెళ్లువేసి తీసికొనిరావలసినదని వీరనగరము నకు సైన్యము నంపెను. కాని శూరుఁడైన యా ముసలిజమీందారుఁడు మిక్కిలి జాగరూకుఁడై యుండెను. పట్టణముచుట్టు నిటుకగోడ లుండెను. వానిమీఁద బురుజులు సదుపుమొనగల గవికలు జాల గలవు. ఆయుధపాణులైన యోధులు రేయింబవళ్ళు కోటగోడలపైఁ దిరుగుచు శత్రువులకు వీలుగానున్న పట్టుల నెల్ల జాగ్రత్తగాఁ గాచు చుండిరి. విలువిద్యయందుఁ గడతేరిన విలుకాండ్రు పలువురు శత్రువులకుఁ గనబడకుండ దాఁగియుండి యాకస్మికముగా వారు పైఁబడకుండఁ జూచుచుండిరి. తలయంతయు ముగ్గుబుట్టవలె నెఱసిన యా జమీందారుఁడు త్రుప్పుపట్టిన యొఱలో నుండి తన కత్తిదీసి నిలువంబడి, చిట్ట చివరవఱకుఁ బట్టణమును గాచి యవసరమైనయెడలఁ దన ప్రాణములను నర్పించి తన పితృపితామహార్జితమైన స్థలమున జావ నిశ్చయించుకొనెను.

క్రమశిక్షనొందిన యాఫ్ఘను సైన్యమును బాఱఁద్రోలుట కీమోటు సాధనములు పనికిరావు. కాని, దాయూదుఖానున కింతకన్న నధికులైన ప్రబలశత్రువులు గలరు. రాజాతోడరుమాలు మరల బంగాళమునకు వచ్చి యచ్చటి మొగలాయీ సుబేదారుతోఁ గలసి 'ఆక్ మహాల్' గ్రామమునొద్ద దాయూదుఖాను సైన్యమును జుట్టవేసెను. అప్పుడు జరిగిన యుద్ధముతో నాఫ్ఘను ప్రభువుల యదృష్ట మవసానించెను. దాయూదుఖానుఁడు యుద్ధములోఁ బగతుఱచేఁ జిక్కి 1576 సంllరములోఁ బ్రాణములు గోలుపోయెను. తోడర్‌మాల్ వీరనగరమునకుఁ బోయి చక్రవర్తివద్దనుంచి తాను దెచ్చిన క్రొత్తసన్నదును వీరనగర జమీందారున కిచ్చి, చేరువనేయున్న దేవీపురసంస్థానమును గూడఁ జూచుచుండుమని యాతనికప్పగించెను. ఆసంస్థానాధిపతి దాయూదు

ఖానుచేఁ జేయుటచే పదభ్రష్టుఁ డయ్యెను. కృతఘ్నచిత్తుఁడై యా ముసలి జమీందారుని సత్యనిత్యతకును, రాజభక్తికి సరి తగిన బహుమానము గదా! అందుచే నావృద్ధప్రభువు తోడరుమాలుయొక్క గద్దెకడకుఁ దనకుమారుని, బాలుఁడైన తన మనుమని దీసికొనిపోయి మ్రొక్కించి యక్బరుచక్రవర్తికిఁ దానును దన సంతతివారును విధేయులై భక్తులై యుండునట్లు ప్రమాణముజేసెను. ఆదినమున వీరనగరములో గొప్ప యుత్సవము జరిగెను. పురజను లక్బరుచక్రవర్తికి జయము జయమని కేకలువైచి యూరేగి రాత్రి పట్టణమును దీపములతో నలంకరించిరి. ఊరేగింపులో సింగారించిన యేనుఁగులపై వేయఁబడిన పసిఁడిహౌదాలలోఁ గూర్చుండిన తోడరుమాలుమీఁదను, వాని మిత్రులమీఁదను మేలిముసుంగులు దాల్చిన పౌరకాంతలు వీధిపొడుగున నిలిచి లాజలు పుష్పములు జల్లిరి

కొన్నియేండ్లు తరువాత ముసలిజమీందారుఁడు వయఃపరిణామము చేతఁ గాలధర్మము నొందెను. పితృవియోగము సహింపలేకనో యను నట్లు కుమారుఁడు బాడ నచిరకాలములోనే గతించెను. అప్పటికి రెండు సంవత్సరముల పసిబిడ్డయైన మనుమఁడు తన పితామహుని గొప్ప సంస్థానమునకు వారసుఁ డయ్యెను. ఆపసిబిడ్డయే నరేంద్రుఁడు.

పితృపితామహుల మరణముచేతఁ బసిబాలుఁడైన నరేంద్రుఁడు తగిన సంరక్షకులు లేనివాఁ డయ్యెను. పదభ్రష్టుఁడైన దేవీపురపు జమీందారుఁడు సామాన్యుఁడు గాఁడు. అందుచే నీబాలునకుఁ గష్టము లెక్కువ యయ్యెను. వీరనగర దేవీపుర సంస్థానములు రెండును శతాబ్దములనుండి బరస్పర మత్సరముగల సంస్థానము లగుటచే వాని ప్రభువులును మాత్సర్యము గలిగి, తరతరములనుండి మైత్రిలేక వైరులై యుండిరి అప్పుడప్పు డేవో కారణములచేత వివాహసంబంధములచేతఁ గలియుచు వచ్చిరి. క్రొత్తపెండ్లికూఁతు రొక రాజకుటుంబమునుండి

మఱియొక రాజకుటుంబమునకుఁ బోయిన తోడనే యామె మగని సాంప్రదాయములను, రాగద్వేషములను వహింపవలసిన దయ్యెను. ఆమె కన్న కొడుకులును దమ తల్లివంక చుట్టములు తమకు శత్రువులనియు నెప్పుడో వారితోఁ బోరాటము సలుపవలసి యుండుననియు నుగ్గుపాలతోఁ బెట్టిన విద్యగా నేర్చుకొనుచుండిరి.

ఉభయరాజకుటుంబములకు సైనికు లుండిరి. వారు కలిసికొన్నప్పు డెల్లఁ బోరాటములు దప్పకుండెను. ఆ వివాదకారణములు గొప్పవి గావు. సరిహద్దు గ్రామములలోని సంతతావులంగూర్చియో, చెఱువులోని చేఁపలు గూర్చియో కలహములు పుట్టుచుండెడివి. చిరకాల ప్రవర్ధమై పలుపోరాటములకు హేతువైన యీ వైర ముండినప్పటికి నా సంస్థానప్రభువులు చక్రవర్తుల దర్బారులందును, సాంఘికోత్సవములందును, మతసంబంధములైన సమ్మేళనములందును నప్పుడప్పుడు గలిసికొనుచుందురు. ఆ సమయముల వారొండొరులయెడలఁ జూపుకొను గౌరవమునకు మితియు మేరయులేదు. ఒకరిని మించి యొక రన్యోన్య గౌరవము జేసికొనుచుండిరి.

దేవీపుర ప్రభువైన నవకుమారుఁడు, వీరనగర ప్రభువులయెడఁ దన వంశక్రమాగతమైన ద్వేషము సంతతము వహించెను. అతఁడు లోతు గుండెగలవాఁడు. కుటిలోపాయము లెప్పుడు బన్నుచుండును. అందుచే నతఁడు వీరనగర ప్రభువు సంపాదించిన పేరు ప్రతిష్ఠలకు మిక్కిలి యసూయపడుచుండును. జనులు కుటిలవర్తనుఁడైన నవకుమారుని మాయోపాయములను, మాయామర్మములులేక నిష్కళంకమనస్కుఁడై మహాశూరుఁడైన నరేంద్రుని తాతయొక్క గుణములను బోల్చి చెప్పుకొనుచుందురు. నవకుమారుఁ డా ముసలివీరుని సమక్షమున నున్నప్పుడు వానిముందర తా నెంతో యల్పుఁడైనట్లు భావించుకొని సిగ్గుపడుచుండును.

దాయూదుఖానుఁడు బంగాళము మరల నాక్రమింపఁదలఁచి జమీం దారులందఱుఁ దనపక్షము జేరవలసినదని వర్తమాన మంపినప్పుడును, వీరనగరప్రభువు వారిసందేశము నిరాకరించినప్పుడును నవకుమారుఁడు తనకు మంచిసమయము దొరికినదని సంతసించి యత్యౌత్సుక్యముతో దాయూదుఖానునితోఁ జేరి వీరనగరమును బట్టుకొని నేలమట్టము చేయవలసినదని తన సైనికుల నంపెను. రాజా తోడరుమాలునకు ఆక్మహాలువద్ద జయము చేకూరుటచే నవకుమారుని పన్నుగడలన్నియుఁ బన్నము నొందెను. అందుచే నతని సర్వస్వము బోయెను. అతని సంస్థానము గూడఁ గొంతకాలమువఱకు వీరనగరమునకుఁ జేర్పఁబడెను.

కాని నవకుమారుఁడు పరాజయమన నేమో యెఱుఁగఁడు. ఇల్లు, సంస్థానము విడచి మరల సమయము వచ్చినప్పుడు తగినపనిచేసి సంస్థానము స్వాధీనపఱచుకొనవలెనని దృఢనిశ్చయముతో సత్కాలము నిరీక్షించుచు దేశాంతరగతుఁడయ్యెను. అతనిమంత్రి గోకులదాసుఁడును యజమానునితోఁ గూడ దేశాంతరమున కరిగెను.

ఆఫ్ఘనులకు, మొగలాయీలకు యుద్ధములు ముగియువఱకు దాయూదుఖానుతోఁ జేరవద్దని గోకులదాసుఁడు తనయజమానునకుఁ బలువిధముల హితోపదేశము జేసెను. ఉత్సాహవంతుఁడైన నవకుమారుఁడు వాని యుపదేశము నప్పుడు నిరాకరించినను జిక్కులు సంభవించినపిదప నాయుపదేశముయొక్క విలువను మెచ్చుకొనక పోలేదు. మంత్రిప్రభువు లిద్దఱు నెచ్చటనో డాగియుండి యదను నిరీక్షించుచుండిరి.

ఎట్టకేల కదను చేకూరెను. రాజా తోడరుమాలు బంగాళము విడిచిపోయెను. నరేంద్రుని పితృపితామహులు మృతినొందిరి. తాలిమి లేని నవకుమారుఁడు తన సైనికులను బ్రోగుచేసికొని దేవీపురమును బలిమిని ముందుఁ బట్టుకొని కట్నములచేతను, గానుకలచేతను, దరువాతఁ

జక్రవర్తియొక్క యనుగ్రహాంగీకారములను బడయవచ్చునని నిశ్చయించెను. కాని పౌర్వాపర్యములఁ జక్కఁగా గుర్తెరింగిన గోకులదాసుఁడు తన యజమానునియొక్క వేగిరపాటును నివారించి యిట్లనియె. "రాజా తోడరుమాలు మరల బంగాళమునకు వచ్చుచున్నాఁడు. ఆయన వీరనగరరాజకుటుంబమును మఱచిపోఁడు. ఆ వంశస్థుఁడైన కుమారునకు నపకారము సేయువాని నతఁడు శిక్షింపకపోఁడు. కావున మన ముపాయాంతరములచేతఁ గార్యసాధనము జేసికొనవలయును. ఓరిమిగలవానిదే భాగ్యము."

వారు చిరకాలము నిరీక్షింపవలసి యుండలేకపోయెను. తోడరుమాలుడు మూడవసారి బంగాళమునకు వచ్చెను. ఈసారి యాఫ్ఘనుల మీఁదికి రాలేదు. ఏలయన వారణచివేయఁబడిరి. ఈసారి చక్రవర్తి మీఁదఁ దిరుగుబాటుజేసిన మొగలాయీ ప్రభువుల నణచుటకు వచ్చెను. వారు బంగాళము మొదట మొగలాయీల యాధీనమైనప్పుడు మంచిమంచి సంస్థానముల నాక్రమించుకొని స్థానబలిమి గలిగినపిమ్మటఁ జక్రవర్తికి లోఁబడక తిరుగుబాటు చేసిరి. కాని యక్బరుచక్రవర్తి యిట్టివానికి జంకువాఁడు కాఁడు. ఏది నిజబలప్రతాపములకంటె నధికమై స్థిరసామ్రాజ్యసంస్థానమునకుఁ దనకుఁ దోడుపడియెనో యట్టి బుద్ధివిశేషముచేత నక్బరు వీరు హిందువులు, వీరు మహమ్మదీయులను భేదములేక నెల్లర నొక్కమచ్చునం జూచెను. తోడరుమాలు రెండుసారులు బంగాళమునకు వచ్చి మునుపటి ప్రభువులగు నాఫ్ఘనులను జయించెను. ఈసారి యతఁడు తిరుగుబాటుజేసిన మొగలాయి సామంతుల నణఁచుటకుఁ జక్రవర్తిచేత 1580 సం॥న గొప్పసైన్యముతో బంపఁబడెను.

ఈ పర్యాయమతఁడు సేనాపతిగ రాక బంగాళా దేశమును బరిపాలించుటకుఁ జక్రవర్తి ప్రతినిధియై వచ్చెను. అతఁడు మాంఘీరుపట్టణము

వఱకు వెళ్లెను. తిరుగుబాటుచేసిన మొగలాయి ప్రభువు నూఱుదివేల సైనికులతో భాగల్‌పూరువద్ద విడిసిరి. ఈ రెండుస్థలములును దేవీపురమునకు సమీపమున నుండెను. పితృపితామహార్జితమైన తనసంస్థానమునుండి తన్ను దొలఁగించిన తోడరుమాలుతోఁ గలియక పితూరిచేసిన మొగలాయీలతోఁ గలిసి కత్తికట్టవలెనని నవకుమారుఁ డాలోచనలు చేయుచుండెను.

అప్పుడు గోకులదాసుఁ డిట్లనియె—"నద్దువద్దు. ప్రతాపమునందుఁ గాని, రాజనీతియందుఁగాని తోడరుమాలునకు సమానులు మనదేశమున లేరు. మరల నతని నెదుర్కొనుట నీ నాశనమును పూర్తిచేసికొనుటయే? ఈపితూరీ నడచిననెనుక మనము తోడరుమాలును సందర్శించి క్షమింపుమని వేడుకొందము."

"నాలుగేండ్లక్రిందటనే దాయూదుఖానును జేరినవాని నారాజు క్షమించునని నీ వనుకొందువా!"

"ఆరాజు మనస్సులో నక్కసుపెట్టుకొనఁడు. మహోన్నతచిత్తుఁడు. మునుపటి యాఫ్ఘను ప్రభువులకు నమ్మిన చెలికాఁడవైన నీవు, నేడు మొగలాయిచక్రవర్తికి లోఁబడి రాజభక్తి తత్పరుఁడవైతివేని నిన్నుఁ దప్పక క్షమించును."

"నాసంస్థానమునుండి నన్నుఁ దొలఁగించిన యక్బరు గులామునకు నేను పాదాక్రాంతుఁడ నగుదునని గోకులదాసుఁడ! నీ వనుకొనుచున్నావా?"

"నవకుమారా! నీతండ్రి తాతలు బంగాళమునకు దొరలైన యాఫ్ఘను ప్రభువులను వంశపారంపర్యముగ సేవించిరి. బంగాళాదేశమునకు మొగలాయీలు ప్రభువులగునట్లు దైవము నిర్ణయించినాఁడు. కనుక నీవు నీకులసాంప్రదాయమును ననుసరించి క్రొత్తయేలికలను గొలుచుటుచితము."

"నేను నీ ప్రశాంతచిత్తమును మెచ్చుకొనియెదను. నడురు బెదురు లేని హితోపదేశ్టవు. కాని నా యుత్సాహము సన్న వేఱుదారి ద్రొక్కించుచున్నది. మొగలాయి పితూరిదారులలోఁ జేరి నేను తోడరుమాలుమీఁది కసిదీర్చుకొనియెదను."

"నవకుమార! నీ కేదిమేలని తోచునో యట్లు చేయుము. నేను కృతజ్ఞతగల సేవకుఁడను. మా తాతముత్తాతలు పందలకొలఁది యేండ్లు కొలిచినట్లె నేనును కుటుంబమును భక్తితోఁ గొలిచెదను."

ఈ సంభాషణ ముగిసిన తరువాత నవకుమారుఁ డేకాంతముగ నీ విషయమైన యాలోచనలుచేయఁ దన నుతి చెప్పినదే సరియని నిశ్చయించి తన సాధన సామగులతో రాజాతోడరుమాలునకు సాయము జేయ సంకల్పించెను.

దేనిబలమునఁ దాను ససమాన యోధాగ్రగణ్యుఁడు రాజన్యంగ వేత్తయు నయ్యెనో, యాబుద్ధి కుశలతచేతి నారాజు యుద్ధము చేయకుండగనే పితూరి నడఁచెను. ఎల్లను: పితూరిదారులకు సాయముజేయు హిందూ జమీందారుల నొక్కొక్కరిని దనపక్షమునకుఁ ద్రిప్పుకొనెను. భాగల్పురమందు విడిసిన శత్రుసైన్యమునకు నొక్క వస్తువైన నందకుండఁజేసి దారుఁరికట్టెను. ఈ జమీందారులలో నెల్ల నవకుమారుఁడు మిక్కిలి మెక్కున చాకచక్యముతోను, శ్రద్ధతోను, బనిచేసి యెల్లరను మించి కృతకృత్యుఁడయ్యెను. అతఁడొక సంస్థానమునుండి మఱియొక సంస్థానమునకు పసవినబోయి వారికి నచ్చఁజెప్పి వారందరిని జక్రవర్తి పక్షమునకుఁ ద్రిప్పి, యర్ధరాత్రమున రహస్యముగా మాంఘీరునకుఁ బోయి శత్రువులజాడలు సంచారములు తోడరుమాలునకు విన్నవించెను. అతని ప్రయత్నములు వెంటనే సఫలములయ్యెను. హిందూజమీందారు లందఱుఁ బితూరీదారులతోఁ జేరక, వారికేవస్తువు బంపక దూరముగ నిలిచిరి. అన్నపానములు లేక పితూరిదారులు తమ యుద్యమము

మూఁకొని చెదరి నానాభాగములకుఁ బోయిరి.

ఎవ్వరెవ్వరు కృతజ్ఞులై స్వామ్రాజ్యమునకుఁ దోడుపడిరో యట్టివారి కెల్ల బహుమతు లియ్యవలసిన సమయమువచ్చెను అత్తఱి నట్టివారిలో నవకుమారుఁ డగ్రగణ్యుఁడుగా భావింపఁబడెను.

"నవకుమార! నీ బహుమానమును నీవే చెప్పుము? నీవు బహుమతి కర్హుఁడవు తన్నెవ్వరు భక్తితో సేవించిరో వారి సేనలను మహాచక్రవర్తి మఱువఁడు."

"మహారాజ! మునుపు నేఁ జేసిన నేరములను క్షమింపుము. ఇదే నా గొప్పవరము. మా తండ్రి తాతలు తరతరములుగా సేవించిన యాప్ఘను ప్రభువులను నేను సేవించినందుకు క్షమింపుము."

"నవకుమార! నీమాట నా కర్థము కాలేదు. బంగాళా దేశము నక్బరుచక్రవర్తికి మీ ప్రభువు లిచ్చువఱకు నీవు వాని గొలుచుట మెచ్చఁదగిన పనియే గాని, అందులో క్షమింపఁదగిన దేమియు లేదు. తమ పూర్వప్రభువునకుఁ గృతజ్ఞుఁడై యున్నందు కే జమీందారును మా యక్బరు చక్రవర్తి శిక్షించినట్లు నేను వినలేదు."

నవకుమారుఁ డేమి చెప్పవలెనో తెలియకుండెను. బహుమతు లిచ్చునట్టి యమూల్యకాలము దాటిపోవుచుండెను. బహుమానార్హులైన కొందఱు జమీందారు లావలఁ గనిపెట్టుకొని యుండిరి. గోకులదాసుఁడు శోడరుమాలుయొక్క స్వభావ సౌశీల్యములను సరిగా గ్రహించినందున వానియెదుట నెట్లు మనవి సేయవలెనో యతనికిఁ దెలిసెను. అందుచే నతఁడు వినయముగను హృదయపూర్వకముగను న్యాయముగను వారితోఁ బ్రసంగించెను.

"నా యజమానుఁ డగు నవకుమారుని నేర మంతేకాదు. మఱి కొంచె మెక్కువగా నున్నది. దాయూదుఖానుఁడు తనమాట దప్పి, మరల బంగాళా దేశము నాక్రమించుటకుఁ జక్రవర్తి కెదురై నిలిచి

నప్పుడు నా ప్రభువు చక్రవర్తికి వ్యతిరేకముగా దాయూదుఖాను పక్షముం జేరి ఆక్నాహాలువద్ద మీతోం గయ్యముజేసెను. ఇది మా ప్రభువుగారి యాజ్ఞమీదనే నేను మీతో మనవిచేయుచున్నాను."

ఈమాట వినఁగానే యారాజు మొగమున గోపమేఘములు పొడమెను. "అది రాజద్రోహమే. ఆద్రోహమునకై దాయూదుఖానుఁడు తన శిరస్సును బలియిచ్చెఁగదా" అని యతఁడు సన్నకంఠముతోఁ బలికెను.

"మహారాజ! అతఁ డట్లు చేసెను. అది దేవరవారికి విన్నపింపక కప్పిపుచ్చుట మా కిష్టములేదు. కాని యొక్క మనవి. మూడువందల సంవత్సరములపాటు వంశపరంపరగా నే ప్రభువులను వీరి పితృపితామహులు గొలిచిరో యా ప్రభువంశమునట్ల గొంత కృతజ్ఞత జూపినందుకు దయామయుఁడైన చక్రవర్తి కనికరించి మా యేలికను క్షమింపవచ్చును. కావున నో రాజా, దయగలిగి దేవీపుర రాజకుటుంబము మొగలాయీ చక్రవర్తులయెడ భక్తి విశ్వాసములు గలిగి విధేయతతో మెలఁగున ట్లనుగ్రహింపుము.

రాజా తోడరుమాలుఁడు కొంతసేపు మాటాడక యాలోచన సేయఁ దొడఁగెను. తనమాట లా రాజు మనస్సున నాటి నని తెలిసికొని మరల నవకుమారుఁ డిట్లనియె—

"వీరనగర దేవీపురములు పలుతరములనుండి యాప్తను ప్రభువులను సేవించెను. అధికారమునందును, రాజభక్తియందును వారొకరినొకరు మించి పన్నె గాంచిరి. ఏద యూశాలి నేఁడాగ్రానగరమునఁ జక్రవర్తియై యున్నవాఁడో, యెవ్వని సామ్రాజ్యమునకు సముద్రమే హద్దుగా నున్నదో, యట్టి ఢిల్లీశ్వరుని కొలువునకు మా రెండు సంస్థానములు నొండొంటిని మించి పూర్ణభక్తితోఁ జేయునట్లు గరుణింపుము."

అప్పుడు తోడరుమాలు కన్నులెత్తి చూచి మాటాడెను.

"వీరనగరమా? ఔను, నేనాపట్టణ మెఱుఁగుదును. మమ్మనేకులు విడనాడిన దినములలో మమ్ము నింటిపెట్టికొని యుండిన పూజ్యుఁడైన యా ముసలిజమీందారుని నే నెరుఁగుదును. నే నాతని యతిథినై బహు సత్కారములు నొందితిని. అతని సేవకును శౌర్యమునకును జక్రవర్తి మిక్కిలి సంతసించి మెచ్చెనని యాతనికి నే నిప్పుడు వర్తమాన మంపఁ దలఁచుచున్నాను."

"మహారాజా! భూలోక పారితోషికముల కందరానిచోట నతఁ డిప్పుడున్నాఁడు. దేవర నారాయణ గృహమునుండి వెడలిన కొన్ని దినములకే యతఁడు స్వర్గస్థుఁడైనాఁడు. అతఁడనేక గౌరవములకుఁ బాత్రుఁడై చిరజీవియై మృతినొందెను. అతని చిన్నమనుమఁడు వీర నగరమునకును దాత్కాలికముగా దేవీపురమునకును నధిపతియై యున్నాఁడు."

ఘోడమహారాజు మాటాడక కొంతసేపాలోచించెను. అప్పుడెవ్వరును నోరెత్తి మాటాడఁజాలరైరి. తన భాగ్యము ఆ రాజు చేయఁబోవు నిర్ణయమునకు నధీనమై యున్నదని నవకుమారుఁడు తెలిసికొనెను కాని, నోరెత్తి మాటాడ వెఱచెను.

ఎట్టకేల కారాజు తన నిర్ణయమును దెలిపెను.

"నవకుమారా! నీ మంత్రి నీ పక్షమున లెస్సగా వాదించెను. నీపై నడుమచేసిన సేవలు వేయినోళ్లతో నీ పక్షమున వాదించుచున్నవి. ఆ సేవలు పారితోషికమందకపోవు. నాలుగేండ్లక్రిందట నీవు చేసిన నేరములను గుఱించిన వివరములను జక్రవర్తి విచారింపఁడు. ఆ చక్రవర్తి నీతొల్లింటి తప్పులన్నియు క్షమించి యికముందు నీవు రాజభక్తుఁడవై యుందువని మనసార విశ్వసించును. వీరనగరపు జమీందారునకుఁ దాత్కాలికముగా నీయఁబడిన దానము (అనగా దేవీపురపాలనాధికారము) నింతత్వరలో లాగికొనుట ఢిల్లీశ్వరునికీర్తికి నౌదార్యమునకుఁ

దగదు. నీసంస్థానము మరల నీకిచ్చుటకు మఱికొన్ని సంవత్సరములు పట్టును. ఆ కాలములో సామ్రాజ్యమునకు నీవు బరమహితుఁడవని నీ ప్రవర్తనమువలన రుజువుచేయుము. నిన్ను వీరనగర దేవీపురసంస్థానములకు మంత్రిగాను, బాలుఁడైన వీరనగరసంస్థానాధిపతికి సంరక్షకుఁడుగాను నేను నియోగించెద. ఆ బాలకునకుఁ దగినసంరక్షకుఁడు కావలయును. అతఁడు యుక్తవయస్కుఁడైనపిదప దేవీపురమును వీరనగరమునుండి వేఱుచేసి, నీకిచ్చెదము. ఈలోపుగా నీవు మంచివర్తనము గలిగి యీ కార్యము నిర్వహించిన పక్షముననే యట్లు జరుగునుసుమీ. నీ కుటుంబమువంటి ప్రాచీనవంశము నిర్మూలించుటకుఁ జక్రవర్తి కిష్టముండదు. నీ పనిలో నీవు ఋజువర్తనము గలిగియుండి, పూర్వుల సంస్థానమును మరలసంపాదించుకొనుము. ద్రోహము మాటమనస్సులో గట్టిగా జ్ఞాపకముంచుకో. తోడరుమాలు తనమిత్రుల సేవలగురించి పెద్దజ్ఞాపకశక్తిని, తన శత్రువుల నాశనమునకుఁ బెద్దబాహువును గలవాఁడుసుమీ."

గంభీరములైన యీ పలుకులు సభలోఁ బ్రతిధ్వనించి మనస్సుల ముద్రితములయ్యెను. నవకుమారుఁడు నిశ్చేష్టుఁడయ్యెను. తనకుటుంబమునకు వంశపరంపరగా శత్రువులయిన వారిసంస్థానములోఁ దాను దివానుగా నుండుట తలకొట్టివేసినట్లయని యతఁడు భావించెను. ఆ మాట యతనికి విషప్రాయముగా నుండెను. ఆ రాజు శాసనము ప్రచురింపఁబడిన వెంటనే యతఁడు మాటాడఁదలఁచి పెదవులు కొంచెము కదపెను. కాని, హితాభిలాషియైన గోకులదాసుఁడు యజమానునత్తఱిఁగాపాడెను. తొల్లిటిపితూరీలోఁ బాలుగొన్నందుకు దండన లేకుండఁ దనయజమానుని తోడరుమాలు క్షమించెనుగదా! దివాను పదవివల్ల వీరనగర దేవీపురసంస్థానములు చిరకాలమతని స్వాధీనములో నుండునుగదా. దేవీపురము కొంతకాలమయిన తరువాత మరల నిచ్చి

వేయఁబడునను వార్దానమువలనఁ దనయజమానునకు సంస్థానప్రాప్తి స్థిరమైనదిగదా, అను నాలోచనలు గోకులదాసు మనమున వాయువేగ మునఁ బ్రసరింప నతఁడు రాజునకు వంగి నమస్కరించి యిట్లనియె.

"మహారాజా! మీ యనుగ్రహమువల్ల నా యజమాను డానంద పరవశుఁడై మాటలాడలేకయున్నాఁడు. ఈ మహాయనుగ్రహము భూలోకదేవేంద్రుఁడైన ఢిల్లీశ్వరునికే తగును. అదిమీనోటవచ్చుటచేత మరింతశోభస్కరమైనది. నా యజమానుఁడీ దానమును గృతజ్ఞతతోఁ బరిగ్రహించుచున్నాడు. అతఁడు కంఠములోఁ బ్రాణమున్నంత కాలము కృతజ్ఞుఁడై సామ్రాజ్యమును సేవించును. మహారాజా! చిరంజీవివిగమ్ము. వీరనగరరాజకుటుంబమును, దేవీపురరాజకుటుంబమును పోటీలమీఁద నొకరినొకరు మించునట్లు చక్రవర్తి సేనచేయఁగలరు. అది మీరే చూచెదరుగాక."

అనంతరము నవకుమారుఁడు తనభార్యను, గూఁతురు హేమలతను వెంటబెట్టుకొని వీరనగరమునకుఁ బోయెను. ఆబిడ్డ మిక్కిలి యందగత్తె. నరేంద్రుఁడును, హేమలతయుఁ బరస్పరప్రేమగలిగి మిక్కిలి జాగరూకతతోఁ గనిపెట్టి నవకుమారుఁడును, నతనిభార్యయుఁ గాచుటచే నొక్కయింటనే పెరుఁగుచుండిరి. నవకుమారునితోఁ గూడ నతనికి క్షేమంకరుఁడును జెలికాఁడును నైన గోకులదాసుకూడ వచ్చి దేవీపుర సంస్థానమును మరల దనయజమానున కిప్పించుటకై కావలసినపన్నుగడలెల్లఁ బన్నుచుండెను.

అట్లు పదిసంవత్సరములు జరిగెను. అక్బరుయొక్క మఱియొక సేనాధిపతియగు మానసింగురాజు బంగాళమున కప్పుడు రాజప్రతినిధిగా నుండెను. ఆక్మహాల్ పట్టణమును మానసింగు తన నివాసస్థానముగ నేర్పఱచుకొని, మునుపటిపేరుమార్చి దానికి రాజమహాలనుక్రొత్త పేరు పెట్టెను. ప్రశాంతమైన వీరనగరము రాజమహాలునకుఁ గొన్ని

క్రోసులదూరములో నుండెను. అక్కడనే హేమలతా నరేంద్రులు సుఖముగఁ దిరుగుచుండిరి. కాని, యీ పదియేండ్లలో శిరీషుఁడను క్రొత్త వాఁ డచ్చటఁ బ్రవేశించెను.

## 3

పదిసంవత్సరములు నవకుమారుఁడు జాగ్రత్తగాఁ బరిపాలించుటచేత వీరనగర దేవీపురసంస్థానములు సరియైన స్థితిలోనికి వచ్చెను. ఆఫ్ఘను మొగలాయీల యుద్ధములలో జనశూన్యములైన గ్రామములు మరలఁ బ్రజలతో నిండి కలకలలాడుచుండెను. మున్ను భయముతో గ్రామములు వదలిపెట్టిపోయిన కాపులు, పాటకజనులు తమ ప్రాతగుడిసెలున్నచోట మరలఁ గ్రొత్తగుడిసెలు కట్టుకొనిరి. ముండ్లచెట్లు, పొదలు మున్నగునవి పెరుగుటచే నిరుపయుక్తములైన పొలములు మరల సాగుచేయఁబడెను. గ్రామములలోని పిల్లలు తమపొలములలో జరిగిన యుద్ధముల సంబంధములైన సీసపుగుండ్లు తునకలైన తుపాకిముక్కలు తెచ్చుకొని యాడుచుండిరి. ఆఫ్ఘనుసైన్యములయొక్కయు, మొగలాయిసైన్యములయొక్కయు రాకలనుపోకలనుగూర్చి, వానిం జూచిన పెద్దలు బిడ్డలకా కథలు చెప్పుచువచ్చిరి. దాయూదుఖానుపక్షమునవో, తోడరుమాలు రాజుపక్షమునవో యుద్ధములుచేసిన యోధులిప్పుడు సాయంకాలము మఱ్ఱిచెట్లక్రిందఁ గూర్చుండి తమవెనుకటి వీరములఁజెప్పి జనుల సంతోషపెట్టుచు చుండిరి. ఆ యుద్ధకథ లొకనోటినుండి మఱియొక నోటికిఁ బ్రసరించినకొలఁది నెన్నెన్నో యద్భుతములందుఁ జేర్పఁబడెను. తలలునెఱసిన పెద్దలాకథలు జెప్పుచుండ వినుచున్న యువకులు వారు గొప్పవీరయుగములోఁ జేరినవారనియు, వారియదృష్టము లానాటివారికి రావనియు దలంచుచుండిరి.

సంస్థానపరిపాలనములో నవకుమారునియం దేవిధమైన దోషమును నెవ్వరుఁ గనిపెట్టఁజాలరైరి. వీరనగరమును జిరకాలమునుండి సేవించుచున్న ప్రాతసేవకులను మన్నించి యతఁడు బహుమానములు చేయుచుండును. నరేంద్రుని తాత పేరెత్తినప్పుడెల్ల నతఁడు వానినిగూర్చి మిక్కిలి గౌరవముతో మాటాడుచుండును. నరేంద్రునిపూర్వులు కట్టించిన దేవాలయములను ధర్మశాలలను, స్థాపించిన ధర్మసంస్థలను నతఁడు జాగ్రత్తతో నిలిపి నడుపుచుండెను. వ్యవహారమంతయు నతఁడు మెల్లగా జరిపెనేగాని జనులకు భయముగలుఁగునట్లు తనయధికారమును దుర్వినియోగము చేయలేదు. బంగాళమునకు నూతనపరిపాలకుఁడైన మానసింగు వీరనగరమునకుఁ బోయిచూచి తోడరుమలు రాజు చేసిన యేర్పాటు సంతృప్తికరముగా నున్నదని తాను సంతసించుటయేగాక, నవకుమారుని గౌరవించి కొన్ని బిరుదులిచ్చి, వీరనగర రాజకుమారుఁడు యుక్తవయస్కుఁడైన పిదప దేవీపురమును నవకుమారుని కిచ్చునట్లు మున్ను చేయఁబడిన వాగ్దానము తప్పక జరుగునని నొక్కిచెప్పెను.

నరేంద్రునితాతనాటి సేవకులప్పటికిఁ జాలవృద్ధులై కొందఱు బ్రతికి యుండిరి. వారి కనుమానము పొడమెను. దివాను చిఱునవ్వులు నవ్వుచు, తియ్యతియ్యగ మాటలాడుచు నేదో గంభీరమైన యాలోచన మనస్సులోఁ బెట్టుకొని చేయుచున్నాఁడని వారు తలంచిరి. రెండు సంస్థానములలో నున్న పెత్తనదారులను మెల్లగాను రహస్యముగాను నవకుమారుఁడు తనపక్షమునకుఁ ద్రిప్పుకొన్నట్లు వారు భావించిరి. నవకుమారుని మనుష్యులు రెండుసంస్థానముల గ్రామములలోను, సంతలలోను నేవో ప్రయత్నములు చేయుచున్నట్లు వారికిఁ దోచెను. మఱియు దేవీపురపు కోటగోడలు, బురుజులు మరమ్మతు చేయఁబడుటయు, నక్కడ సైనికులసంఖ్య వృద్ధిచేయఁబడుటయుఁగూడ వారు

కనిపెట్టిరి. దీని యర్థమేమో వారూహింపచిరి. కాని నోరెత్తి పలుకఁ జాలరైరి. ఇప్పటికిఁ బదునాఱేండ్లప్రాయము గలిగి శౌర్యోత్సాహము లతో మెలఁగుచున్న తమ రాజపౌత్రుని నరేంద్రుని నెప్పుడైన, గలిసి కొన్నయెడల, వారాబాలకుని జాటునకుఁ దీసికొనిపోయి, వారాతని చెవిలో నేదో గుసగుసలాడు చుందురు.

వారప్పుడప్పుడిట్లనుచుందురు. "తోడటుమాలురాజు గొప్ప సేనా పతి. మానసింగురాజు రాజ్యవ్యవహారవేత్త. అయినను వారిద్దఱుఁగూడ నవకుమారుని కుటిలచిత్తమును దెలిసికొనలేకపోయిరి. మీతాతగారి సంస్థానము వానిచేతిలోనున్నది అతఁడు చులకనగా దానిని వదలి పెట్టఁడు. నాయన! జాగ్రత్తగానుండుము. నీవు కుఱ్ఱవాఁడవు."

పట్టణములో నిక్కలి జనసమ్మర్దమైనచోట నట్టినడిబజారులో రాజ గృహముండెను. జనులు దానిని రాజబారియందురు. అందులోఁగొన్ని భాగములు రెండుమూడువందల యేండ్లక్రిందటఁ గట్టబడినవి కొన్ని మరమ్మతులు కావలసియున్నవి. కాలక్రమమున మఱికొన్నిగృహములు గూడ కట్టఁబడినవి. ఇప్పటి దర్బారుచావడి నరేంద్రుని తాత కట్టించెను. అది వీధికిని బజారునకును నభిముఖమైయున్నది. ఈ చావడియందె నరేంద్రునితాత తోడరుమాలురాజును, నవకుమారుఁడు మానసింగును సన్మానించునది.

లోపల విశాలమైన మండువా కలదు. దానిచుట్టు ననేకభవన ములు నిర్మింపఁబడినవి. విస్తీర్ణమైన యాసంస్థానముయొక్క ప్రతిభాగ మునుండియు జనులు గుంపులుగుంపులుగా వచ్చి యిచటఁ జేరుచుం దురు. జమీందారుని గృహమెల్ల వారికి సులభప్రవేశము గలిగియుం డెడిది. జమీందారుఁడుకూడ పూర్వకాలమున తన జమీలోని ప్రజల లోఁగలసిమెలసియుండ నిష్టము గలిగియుండెడివాఁడు. సంస్థానపుగార్య స్థానములన్నియు మండువాచుట్టు మేడక్రిందనుండెను. మునసబుకర

తాలూకా లోపలను గ్రామములలోఁ బ్రోగుచేసిన శిస్తులు తెచ్చి దివాణమున కిక్కడ జమకట్టుదురు. కుగ్రామములయందలి పెత్తనదారు లనావృష్టిచేత బన్నుతగ్గింపవలెననియు జెఱువు త్రవ్వించుకొనుటకు ధనసాహాయ్యము కావలెననియు, పశువులను, నాగలిఁగొనుటకో, యిల్లు కట్టుకొనుటకో సొమ్ము కావలెననియో యిచ్చటనే దరఖాస్తు పెట్టుకొనుచుందురు. జమీందారునివలన నియోగింపబడిన యుద్యోగస్థులు తగవులు పరిష్కరించి, యభియోగములు విచారణచేసి, నేరస్థుల నిచ్చటనే దండించుచుందురు. ఒకప్పుడు జమీందారుఁడే స్వయముగా న్యాయాధిపతియై తగవులను విచారించుచుండును. అప్పుడు తమ్ము సర్వవిధముల గాపాడుచుండిన ప్రభువునొక్కసారి దర్శనముచేసి పోవలయునని వేలకొలది జనులు మండువాలోఁ జేరుదురు.

మండువాచుట్టునున్న పైభాగము జమీందారులకు నివాసయోగ్యమైయుండెను. ఆ భాగములు స్త్రీలువసియించు నంతఃపురములు. అందు రాజనివాసయోగ్యమైన గదిలో నరేంద్రుఁడుండును. అంతకన్న తక్కువ వైభవముగల గదులలో హేమలతయు, నామెతల్లియు నుందురు. జమీందారుని కుటుంబముతో సంబంధబాంధవ్యములుగల దగ్గఱచుట్టములు, దూరపుచుట్టములు, తమతమకుటుంబములతోవచ్చి మనదేశాచారప్రకార మక్కడ వసియించుచుందురు ఈ మొదటిమండువాకు వెనుక రెండవమండువా కలదు. ఇచ్చట ధాన్యము బియ్యము నిలువజేయు కొట్టుండెను. పాలు పెరుగు చేపలు, కూరలు మొదలగు ప్రతిదినభోజనపదార్థము లిక్కడకే వచ్చును. ఇక్కడనే వంటశాలలున్నవి. ఉదయము మొదలర్ధరాత్రమువఱకు వంటప్రోయి యారక మండుచునే యుండును. పనికత్తెలు దినమంతయు నిచ్చట గృహకృత్యములు జేయుచుందురు. చిన్నబిడ్డలిచ్చట నల్లరిచేయుచు గంతులు వేయుచు నాడుకొనుచుందురు. ఈ రెండవమండువాలో నొకమూల

జమీందారుని గృహదేవాలయముండెను. పురోహితుఁడక్కడ గంటలువాయించుచు శంఖములు ప్రయోగించుచుఁ బ్రతిదినము ప్రాతస్సమయమునను సాయంకాలమును బూజలు చేయుచుండును.

ఈయింటిని జేరిన పూవుఁదోటలు మిక్కిలి దూరముగా నుండెను. విశాలమైన యొక కోటయచ్చట గలదు. దానిచుట్టును పండ్లచెట్లుండెను. దానికి నలుప్రక్కల గోడలుండెను. ఆగోడలలో గొన్ని చిన్న ద్వారములుండెను. వాటినుండి పట్టణములోనికిఁ బోవచ్చును. జమీందారుని యంతఃపురస్త్రీలు పైకివెళ్ళవలసివచ్చినప్పుడు సింహద్వారమునుపయోగింపక వెనుకప్రక్కనున్న మార్గమునే యుపయోగింతురు.

నవకుమారుని భార్య పూర్వకాలపు జమీందారుల స్త్రీలవంటిది. గొప్పయింటికి యజమానురాలు గనుక నామె తనస్థితికిఁ దగినఠీవియు గాంభీర్యము గలిగి దేవతాపూజలయం దేమరుపాటులేక పనులన్న విసుగులేకయుండెను. ఆమె ప్రతిదినము సూర్యోదయము కాకమునుపే గంగలో స్నానముజేసి యంతఃపురోద్యానవనమందు నరేంద్రుని తాత మున్ను గట్టించిన కోవెలలో భక్తితోఁ బూజలు సేయును. పిమ్మట నంతయుఁ దాని గృహకృత్యములలో నెడతెఱపిలేక మునిఁగియుండును. ఆమెకు గర్వములేదు. ఇంటిలోనున్న మగవారు, చిన్నపిల్లలు భుజించినపిదపగాని, తాను భుజింపదు. పిమ్మటఁ గొంచెము విశ్రమించును. మరల సాయంకాలమున గృహకృత్యములు వంటలు జాగ్రత్తగఁ జేయించి యందఱభోజనము లైనవెనుక తాను వంటసాలకుఁ బోయి యాహారించి పండుకొనును. ఆ యంతఃపురమున నున్న యాశ్రయులకు బంధువులకు నామెమాట శాసనమె. ఆమెభర్తయు సంస్థానవ్యవహారములసైత మప్పుడప్పు డామెసలహాల నడుగుచుండును. ఈయిల్లాలు తనకు మంచిదని తోఁచినపని చేయఁదలఁచెనా రెండుగొప్పసంస్థానముల ననర్గళముగాఁ బరిపాలించుచు మహారాజువలెనున్న యామె భర్తయు

నామె కెదురాడలేడని లోపలనున్న స్త్రీలు పలుమాఱు గుసగుసలాడు కొని చెప్పుకొనుచుందురు.

నవకుమారుని భార్య నరేంద్రుని తనబిడ్డగా భావించి పెంచుచుండెను. ఇందుకు రెండుకారణము లుండవచ్చును. ఆమె వీరనగర రాజ కుటుంబమునకుఁ జేరిన పడఁతియగుట యొకటి. గొప్పవంశమున బుట్టి చిన్ననాఁడు తలిదండ్రులను గోల్పోయి తమవలనఁబడిన యనాథబాలకుని బెంచుట యుక్తమని యెంచుట రెండవది. ఆమె హేమలతను నరేంద్రుని సమానముగఁ బెంచును. వారిరువురును, బూవుదోఁటలోను, సరోవరతీరమునను నాడుకొనుచుండుట జూచి యామె మిక్కిలి సంతోషించుచుండును. ఆ బాలబాలికల భావి జీవితమునుగూర్చి యా మాతృహృదయమున నప్పుడప్పు డేవో కొన్నితలంపులు జనించుట స్త్రీ స్వభావమేగదా.

ఏమన హేమలతకు వివాహయోగ్యమైన వయస్సు వచ్చినది. నరేంద్రుఁడు పదునాఱేండ్లప్రాయము గలవాఁడు. ఒకనాఁడామె ప్రాతః స్నానముజేసి వచ్చుచుండ వారిరువురు తోఁటలో నాడుకొనుచుండుట జూచెను. అప్పుడు నరేంద్రుఁడు కొలనులో నుండి నీళ్లు దెచ్చుచుండెను. హేమలత తాను స్వయముగా నాటిన మల్లెమొక్కలకు నీళ్లుపోయుచుండెను. హేమలతతల్లి యొక్క నిమిషమచ్చట నాగి వారివంక జూచెను. ఆ నాఁడే యామె మనస్సులో నొక్కనిశ్చయము చేసికొనెను. దేవళమున నామె దేవతానమస్కారము జేయునప్పుడు తన కోరికగూడ నామె యిష్టదేవతకు విన్నవించెను.

నవకుమారుఁడు మధ్యాహ్నభోజనముచేసి విశ్రాంతి గైకొనుచున్న సమయమున, నాతనిభార్య మంచముప్రక్కకుఁబోయి, తన మొగము యన మొగము కడకు జేరునట్లు వంగిమాటాడఁ దొడగెను.

"నీ మొగము బెంగవల్ల మనోవ్యథవల్ల, పాలిపోయినట్లున్నది

నీ కన్నులలో వెనుకటి నిగనిగ లేదు. నీ కార్యభారము నీయారోగ్యమునకు భంగము కలిగించుచున్నదని నేను తలంచుచున్నాను."

"మగవాని కనేకకృత్యములు, బెంగలునుండును. అవియన్నియు నాఁడుదాని కేమి తెలియును?"

"అయినను దానుగూడ సంసారములోని యాకష్టముల నివారించుటకు నాఁడుదికూడ దానిం దెలియఁగోరుట సహజమేగదా. క్రొన్ని వారములనుండి మీ మనస్సునకేదో కార్యభారము పెద్దరాయివలె నున్నట్లు నాకుఁ దోచుచున్నది. అప్పుడప్పుడు మీమనోవ్యథలలో నేను గూడ పాల్గొనుట కర్హురాలనని మీరును దలంచుచుండువారు గదా?"

"నిజము. ఆ యేటికోయేదు క్రొత్తబెడదలు వచ్చి నామీఁదఁ బడుచున్నవి. ఈ సంగతి నా కెవ్వండు నివారింపఁగలఁడు. సురేంద్రుఁడు తన సంస్థానమును తాను స్వీకరించుసమయము దగ్గఱకు వచ్చుచున్నది."

"అయ్యా! సజ్జనులందఱు మిమ్ము చాల మెచ్చెదరు. రాజమహలులో నున్న మానసింగు రాజుగూడ తల్లిదండ్రులు లేని యనాథబాలకుని బెంచి విద్యాబుద్ధులుచెప్పి యింతవానిని జేసి వాని సంస్థానము వానికప్పగించినందుకు మెచ్చి సంతోషింపక పోఁడు. దేశమందంతట నీ పేరు ప్రతిష్ఠలు వెలసెను."

"నా పూర్వులీ సంస్థానములో సమానులై యధికులై యడుగుబెట్టిడివారు. నేనో యిక్కడొక గులామునై పనిచేయుచున్నాను నా కేమి పేరేమి ప్రతిష్ఠయేమి? నీవుగూడ మునుపొకసారి దేవీపురపురాణివై యుంటివిగదా? జయరాంచాదుని భార్య మనస్సీయవస్థలో నెట్లుండునో నీకుఁ దెలియదా."

"అయ్యా, మీ కెంతకష్టముగానున్నదో నాకు నంతకష్టముగా నున్నది. భగవంతుని దయవల్ల మనము మరల మనసంస్థానమును, మనగౌరవమును త్వరలోనే బడయఁగలము."

"దేవుని దయయుండెనా మనము సుఖింపఁగలము నవకుమారున కిప్పటినేర్పు, శక్తియు నిల్చినపక్షమున దేవీపురము మునుపటికంటె నెక్కువవిఖ్యాతి బడయఁగలదు."

"అట్లయగుఁగాక, మన యాపదలనుండి మనల నుద్ధరించిన సర్వేశ్వరుండే మనకు మహాకీర్తి వచ్చుటకై మార్గమేర్పఱుచు చున్నాఁడు."

"కళ్యాణి! దాచక మనసులో నున్నది చెప్పు. ఈవిషయములో నీ కేవో కొన్ని యభిప్రాయములున్నవని నాయూహ. నాప్రయత్నములలో నీ బుద్ధిగూడ నా కెంతో సాయము జేసినది."

"అమ్మాయి హేమలత కిప్పుడెన్నవయేఁడు?"

"ఎందుకు? ఆమెకిది పండ్రెండవయేఁడు. మన మిక్కడికి వచ్చునప్పటికి రెండేండ్లది. పదియేండయినది మనమిక్కడికివచ్చి"

"అట్లయిన మనయమ్మాయి పెండ్లిమాటనుగుఱించి యాలోచనలు చేయఁగూడదా?"

"నీవు చెప్పినమాట మంచిదె. నే నిప్పటికా విషయమై యాలోచింపలేదు. మనస్థానము మనకిప్పుడు చేకూరెనా దేశములో నున్న గొప్పవాండ్రలో గొప్పవాఁడు, చక్కనిచుక్కయైన హేమలతను జేపట్టుటకు వచ్చును. కాని, మనము వీరనగరములో సేవకావృత్తిలో నున్నంతకాలము మనసంబంధమును గొప్పవారెవరు కోరరు."

"అయ్యా, ఆ మాట నే నెఱుఁగను. దేవీపురసంస్థానమునకు మన బిడ్డ వారసురాలు గనుక, ఎంతగొప్పవాఁడైన నామెను పాణిగ్రహణము జేసికొనును. దూరమునుండియు దగ్గఱనుండియు నాకు వర్తమానములు వచ్చుచునే యున్నవి పరమేశ్వరుఁడు మన కనుగ్రహించిన యీ యేకపుత్రికను దూరస్థు కెవరికో యిచ్చి పంపివేయుటకుఁ గల్గి ప్రాణమెట్లొప్పును? హేమలతను నేను విడిచిపెట్టి బ్రతుకలేను."

"చాలుఛాలు. కల్యాణీ! హేమలత నీ కెంతప్రియమో నాకంత

ప్రియమే. ఆమె నాకు వారసురాలుగదా. దేశములోనున్న గొప్ప వంశస్థుఁడామెను జేపట్టి దేవీపురములో నివసించి మన యనంతరమున సంస్థానముఁ బాలింపగలడు.

"ఈమధ్య నరేంద్రుని మీరు చూచినారా?

"ఔను, నేనుతరుచు చూచుచున్నాను ఎందుకడుగుచున్నావు?"

"అతను చక్కనివాఁడు కాడూ? అంతచక్కని మొగము నేనెప్పుడుఁజూడలేదు."

"ఏయ్ ఏయ్ మొగము చక్కనిదే. తాను చాలాగొప్పవాఁడని యతని యభిప్రాయము. అతడెప్పుడు విచారముగా నుండును. శత్రులు పన్నుమనుష్యులతని తలలో నెన్నో దురాలోచనలు ప్రవేశపెట్టిరి. అవి యతని తలనిండ నున్నవి"

"అతని వంశమునకు, నతనిస్థితికిఁ గొంతగర్వముండక తప్పదు. అతను గర్వపడుటకుఁ గారణములేదా? అతని తాతగారిపదవి నతఁడు పొందినప్పు డతనికిఁ గొంతగర్వము తగదా?"

హా! హా! హా! ఆ పిల్లవాఁడు చెడిపోయినాఁడు. తాతగారి గౌరవమెప్పటి కతనికిరాదు. అతని తాతగారు నా కుపకారము చేయుక పోయినప్పటికి, నతఁడు చాలాగొప్పవాఁడని నేను జెప్పగలను."

"అయ్యో! నన్ను నమ్మండి. వివాహవిషయములలో నాడుదియే సరిగా విచారణచేయఁ గలిగినది. వీరనగరరాజు లెంతగౌరవముగా నుండిరో నరేంద్రుఁడుగూడ నంతగౌరవముగాఁ దలయెత్తుకొని తిరుగ గలఁడు."

"అతనిలో ముందుముందు గొప్పతనపుచిహ్నలు నా కంతగాఁ గన పడవు." అని నవకుమారుఁడు నవ్వుచుఁబలికెను.

"అందము చందము చూచుటకాదు. వానికన్నులే కన్నులు. నే నిన్ని సంవత్సరములనుండి యాతనిని ప్రతిదిన ముదయము సాయంకా

లము చూచుచున్నాను. ముగముఁబట్టి మనుష్యుని తలలో నున్న రహస్యాభిప్రాయము లాడుదానికిఁ దెలియకపోవు."

"అతనితలలో గర్వము గొంటెతలపులు తప్ప మరేమియు నాకగ పడవు."

"ఆ గఱువపోతు పిల్లవాఁడు మన హేమలత యందర మేకపిల్లవలె మెత్తనై యుండుట మీరు చూచుటలేదా? దానిపని తనపని లాగుచేయును. అది నవ్వితే చాలునని కనిపెట్టుకొని యుండును. అది కంట తడిపెట్టునేమో యని భయపడి దానిపనులన్నియు శ్రద్ధతోఁ జేయును."

"ఎందుకీ యనవసరపుగొడవ? యర్థములేని మాటలివి. అతఁడు మనపిల్లకొంగుపట్టుకొని వెంటాడి తిరుగుచుండుట. అంతచనువు నా కిష్టములేదు. నీ వతనిమీఁద నొక కన్నుంచి జాగ్రత్తగా కనిపెట్టుచుండుము."

"అయ్యా, చిన్నతనముగదా చిన్నవాండ్రకుండవలసిన యాలోచనలే యతని మనస్సులోఁగూడ నున్నవి. హేమలతను పెండ్లాడుట నతఁడు ప్రపంచము తలక్రిందైన మానఁడు. నాంచకలయి; వీరనగర దేవీపురసంస్థానములు నేకముగఁ జేయును. మీ పూర్వులకు వచ్చిన కీర్తికంటె మీకెక్కువ కీర్తి వచ్చును."

"నీ యభిప్రాయము మదేనా? నీవు నాభార్యవయ్యుండి; యీ రెండు కుటుంబములకున్న పూర్వవైరము మఱవఁదగునా? నేను కొంతకాలము వీరనగరములో బనిచేయుచుండుట బట్టి వెనుకటి సంగతులన్నియు మఱచిపోయినా ననుకొంటివా? మూడువందలయేండ్లనుండి మే మొకరితో నొకరు విరోధములు గలిగియుండఁగా, నీ కుఱ్ఱవానికి నాబిడ్డను నే నిచ్చెదనని నీ వెట్లు తలంచితివి?"

"అయ్యా, మీ మాటలు నాకర్థము కావు" అని తిరస్కారమును

సహింపక, కోపస్వరముతో బలికి వెండియు నిట్లనెను. "మూడువందల యేండ్లనుండి రెండు సంస్థానములు వేరువేరై యున్నవి. ఈ వివాహమువల్ల నా రెండును కలిసిపోవునని నామనస్సులో కోరికయున్నది. ఆ రెండు సంస్థానములకు గాను హేమలత రాణియైయుండుట మన కనులకు పండువుగాదా! ఆ పిదప గొడవలు లేవుగదా. ఎవఁడు హేమలతను బెండ్లియాడునో వాఁడే దేవీపురసంస్థానమునకు మీ వారసుఁడై యుండును. నరేంద్రుఁడే యామెను వివాహమాడవలెను"

తన మాటను భార్యచేసిన నిర్ణయమునకు జమీందారు ప్రత్యుత్తరమీయలేకపోయెను. పిమ్మట నామె కొంచెము మెల్లగ నిట్లనియె.

"నరేంద్రుని గురించి నాయభిప్రాయము చెప్పినాను. వివాహమునకు ముందు పాటుగా నేర్పరచుకొన్న పక్షమున నతఁడు వచ్చి దేవీపురములో గాపురముండును. వీరనగర రాజకుమారుఁడు దేవీపురము వచ్చి కాపుర మున్న పక్షమున, దేవీపుర యశస్సు మిక్కిలి యెక్కువ కాదా? దేవీపుర గౌరవము గాపాడుటకు మీకెంత పట్టుదలయున్నదో, నాకు నంతే యున్నది. నేను దేవీపురకుటుంబ స్త్రీ ననియే మాటాడుచున్నాను."

నవకుమారుఁడు తన భార్యాభిప్రాయము సహేతుకముగా నున్నదని తెలిసికొని బదులుచెప్ప కూరకుండెను. వీరనగర దేవీపురసంస్థానములకు జిరకాలమునుండి జరుగుచుండిన వైరాగ్ని నొక్కమారు శాశ్వతముగా జల్లారిపోవును. విస్తీర్ణమైన వీరనగరసంస్థానము కలిసిన యెడల దేవీపురసంస్థానము కలిమియు బలిమియు, వైశాల్యమునను జాల గొప్పదగును. అని నవకుమారుఁడు తలంచి "దానిని గురించి యాలోచింతము లే" యని బదులు చెప్పెను.

తన వాదము పనిచేసినదని యామె గ్రహించెను.

భార్యాభర్తలు తమ సంభాషణము ముగింపక మునుపే హేమలతయు,

నరేంద్రుడును గదిలోనికి వచ్చెను. నరేంద్రుడు మల్లెపూలబుట్ట దెచ్చి నవకుమారుని చేతులలో నిర్లక్ష్యముగా కొన్ని పూలు పెట్టి, పిమ్మట హేమలతతల్లికడకుఁ బోయి బుట్ట నామె ముందరబెట్టి, నెన్నడును పాదములకు సోకునట్లు నిజమైన భక్తితో నమస్కరించెను.

"నాయనా! చిరంజీవివి గమ్ము. నీవును హేమలతయు చిరకాలము సుఖింతురుగాక!" అని యాతని తలపైఁ జేయివైచి దీవించి మనసులోని తక్కిన యాలోచనలు వెలిపుచ్చక యేదో గొప్ప యదృష్టము చేకూరినట్లా దినమున సంతోషముగా నుండెను.

గొప్పపన్నగడలు పన్ని యంతరాయములు గలిగించునట్టి ఘనుఁ డొకఁడున్నాఁడన్న మాట యామె మరచిపోయెను ఆతఁడే గోకుల దాసుఁడు.

## ౪

గోకులదాసుయొక్క గృహము జమీందారీభవనమునకుఁ జాలదూరముగఁ బట్టణములో నొక మూరుమూల నుండెను. అతడు పెందలకడ భోజనముచేసి గృహమునుండి బయలుదేరి జమీందారీభవనమున కరిగి సంస్థానవ్యవహారముల జూచుచు దినమంతయు నక్కడ గడపును. తరుచుగా నాయన సాయంకాలము వఱకుఁ బనిచేసి, బజారులో దీపములు పెట్టిన తరువాత గూడ దినమంతయు శ్రమపడుటచే నీరసముగానుండి హొక్కెటో కాలినడక నింటికిఁ బోవుచుండును. అతఁడు మిక్కిలి వినయముగా నున్నట్లు నటించుచుండును. ఇంటినుండి కచేరికి కచేరినుండి యింటికిఁ బోవునప్పు డాయన కంగరక్షకులుగాఁ గొందఱుందురుగాని, వారట్లు చేయుట రహస్యము. వీరనగర దేవీపుర సంస్థానములు రెండింటికి నిజముగాఁ బ్రభువై వేగులవాండ్రచేఁ బ్రతిరహస్యసమాచారమును దెప్పించుకొనుచుఁ, తాబేదారుల కందఱకుఁ దన

శాసనములఁ బంపుచు నిరంకుశాధికారముగల గోకులదాసుఁడు కొరడియే గాని చుట్టు గోడలేక గడ్డిచేసిన మట్టిగోడలయింట వాసము చేయుచుండెను.

ఆ యావరణములో నిటుకలతోఁ గట్టిన యొక గది యుండెను. గోకులదాసుఁ డాగదిలోఁ దన దర్శనమునకు వచ్చినవారితోఁ గలిసి మాటాడుచు, రాజ్యవ్యవహారముల విషయమై ప్రసంగించుచు వారితో సంభాషించుచుండును. ముందటి వాకిలి వెనుక నాసభవన ముండెను. అందులో నొకగడ్డియిల్లు పడకగది, గుడిసెలవంటి రెండుమూడిండ్లు, వంట కొకగదియు చావిచుట్టుప్రక్కల నుండెను. ఈ యిండ్లవెనుక విశాలమైన దొడ్డియుండెను. అందులోఁ గొన్ని ఫలవృక్షములు లున్నను మొత్తముమీఁద నేలనంతయు ముండ్లచెట్లతోను, పొదలతోను నిండి యడవివలె నుండెను. విశాలములైన దొడ్లు మూఁడటి వాకిండ్లు నుండుటచేతనే యుష్ణదేశమైన హిందూస్థానమునఁ గానరసినంత గాలి యును, వెలుతురును వచ్చుచుండును.

గోకులదాసుని భార్య మృతినొందెను. అతనికొక్కఁడే కొడుకు. అతనివయస్సులో, నతనిస్థితిలోనున్న వారనేకులు మరల వివాహము చేసికొందురు. కాని, దేవీపూజసంస్థాపన మెప్పటికయిన నాక్రమింపవలె నని యతనికి దృఢసంకల్పముగలదు. అందుచే నతఁడు వివాహము చేసి కొనలేదు. అతనికిఁ దనకంటె మఱియొక కోరిక లేదు. పనిచుట్టములెవరో వచ్చి యతనియింట వంటజేసి సంరక్షణచేసి తాముగూడ సన్నవస్త్రములుగల్గి బ్రతుకుచుందురు. వీధిప్రక్కనున్న యిటుకగది యాతని ముఖ్యావాసస్థానము. అక్కడికిఁ బోవుట కెవ్వరును సాహసింపరు. కాకితములు చూచుకొనుచున్నప్పుడుగాని, వేగులవాండ్రతో రహస్యములు మాటలాడుచున్నప్పుడుగాని, జమూటువైపు దొంగిలిచూచుటకయిన వెలుతురు.

కొంతసేపూరకొన్నతరువాత నవకుమారుఁ డడిగెను.

" మా మనుష్యులందఱు వసంతోత్సవముఁ జూడఁబోయిరి. వీధి గుమ్మము తలుపుగొళ్ళెము వేయించితిని."

" గోకులదాసుఁడ ! క్రొత్త వార్త నీవు వినియుండవచ్చును."

" అవి మీకే బాగుగాఁ దెలిసియుండవచ్చును. అందుచేత మీనోటి నుండే వినఁగోరెదను."

" అఫ్ఘనులు దృఢచిత్తులై దక్షిణమునఁ బ్రబలులై యున్నారు. మానసింగురాజు వారినణఁచుటకు, జహనాబాదు వెళ్ళినాఁడు గాని, వారిబలమధికముగ నుండెను. మానసింగు కుమారుని వారాకస్మిక ముగఁ దాఁకి బంది‌గాఁ బట్టుకొనిరి."

" అది రెండేండ్లక్రిందట."

" ఇటీవల నా యాఫ్ఘనులు మానసింగు కుమారుని విడిచిపుచ్చి దానికి ఫలముగా నొరిస్సాదేశమును స్వాధీనము చేసికొని యనుభ వించుచున్నారు. పేరునకుమాత్రము వారక్బరుచక్రవర్తి యధికారము నొప్పుకొని, నిజముగ వారీ యొరిస్సాలో సర్వాధికారులై యున్నారు."

" స్వామీ ! ఈ సంధి చిరకాలముండదు."

" కాని, మానసింగింతకంటె నేమిచేయఁగలఁడో తెలియదు. అతఁ డొరిస్సాలో మొగము కనుపరుపలేఁడు."

" మానసింగు మంచిసాహసుఁడు. దేనికిని వెనుదీయఁడు."

" అతఁడీ నడుమ నీకిచ్చిన బిరుదులు నేను జూచినాను. అతఁడు నిన్నుఁ దనకక్షిలోఁ జేర్చికొనెను." అని నవ్వుచు నవకుమారుఁడనెను.

" నా తాత, తండ్రులవలెనే నేనును దేవీపురకుటుంబమునకుఁ గృత జ్ఞుఁడనై సేవజేయుటయే యన్నిటికంటె నా కెక్కువగౌరవము " అని మెల్లగా గోకులదాసుఁ డుత్తరము చెప్పెను.

" నీవు నాకు విశ్వసింపఁదగిన మిత్రుఁడవని యెఱుఁగుదును. అది నా

మనస్సులో నాటియున్నది. ఎన్నటికి గూలుపను. కాని మాంగసింగును గురించి నీ యభిప్రాయమేమో చెప్పుము. ”

“అక్బరుచక్రవర్తికొలువులోనున్న వారిలో నింతకంటె సమర్థుఁడైన సేనాపతిలేఁడు. అంతేకాదు. కత్తిపట్టుట యందెంతప్రజ్ఞకలదో, కలము పట్టుటయందును గార్యాలోచనమందును గతని కంతిశక్తియే గలదు.

“ అయితే నేమిజరుగును ? ”

“ఏమిజరుగునా ?, ఆఫ్ఘనుల చేతినుండి యత డొరిస్సాను విడిపింపఁ గలఁడు.”

“ ఒరిస్సా నాఫ్ఘనులకు వదలివేసి సంధిచేసికొన్నాఁడే ? ”

“ ఔను, ఈ లోపుగా యుద్ధప్రయత్నములు చేసికోవచ్చునని”

“ అతఁడు రాజపుత్రుఁడు గదా ! మాటతప్పునా ? ”

“ మాట తప్పనక్కఱలేదు. ఆఫ్ఘనుల బుద్ధిహీనతవల్లనే యుద్ధమున కాశము చేకూరును.”

“ ఈ సంగతి నీ కేలాగు తెలిసినది ? ”

“ మాంగసింగురాజు సన్నిధిలో మన మనుష్యుఁడు రహస్యముగ నున్నాఁడుగదా. అతనిజాబువల్లఁ దెలిసినది. అది మీకుఁ జెప్పవలెనని సమయము కొఱకు నిరీక్షించుచుంటిని.”

గోకులదాసుఁడు లేచి యాగదిలోనున్న యొకరహస్యపు తలుపు దెఱచెను. అది వెల్లవేయఁబడి గోడవలెనే యుండెను. తలుపుదీయ గానే యొక యినుపపెట్టె కనబడెను. అది యిటుక గోడలో సమర్పఁ బడియుండెను. అతఁడా యినుపపెట్టె దెఱచి, యొక కాగితపుసంచి తెచ్చి నవకుమారుని యెదుటఁబెట్టెను.

నవకుమారుఁడా కాగితములం దీసికొని యూపుదపుదీపపు వెలుఁగున శ్రద్ధగాను, నెమ్మదిగాను జదువుకొని యక్కడఁబెట్టెను.

“ఇది చాలకష్టమైన వ్యవహారమే. ఆఫ్ఘనులు జగన్నాథస్వామి

యూలయను దోచుకొన్నారట ?" అని నరకుమారుడు పలికెను.

"మానసింగు హిందువుడు, రాజపుత్రుడు."

"హిందూమత ద్రోహము నతనిసెంత మాత్రమును క్షమించడు."

"ఆయన తన సైన్యముతో నిశ్శబ్దముగాను, వేగముగాను బైలుదేరి యొరిస్సాకుం బోవుచున్నాడు."

"ఆ రాజు గెల్చినను నోడిపోయినను నెత్తురునదులు పాఱునట్టి యుద్ధము జరుగును."

"ఘోరయుద్ధము జరుగుట మాత్రము నిజమే మానసింగు సాధారణముగ నోడిపోవువాడు గాడు"

"అట్లయిన నారాజొరిస్సా నిపుడె జయించి యక్బరు యొక్క సామ్రాజ్యమునకుం జేర్చునని నీ యభిప్రాయమా ?"

"మీరు చక్కగా నూహించినారు. అందుచే మానసింగు కొంతకాల మొరిస్సాలో నుండవలసివచ్చును."

"ఎందుకు ? అది మన వ్యూహములను పలక్రిందు జేయునే"

"అట్లు గాదు. అది మన పన్నుగడలకు సాయముచేసి జయమును ద్వరలో సమకూర్చును."

"నీ గూఢసంభాషణలు నాకుం దెలియవు. నీ గాంభీర్యము విడిచి సంగతేమో స్పష్టముగాం జెప్పు. దేవీఘరసంస్థానము త్వరగా నాకు వశము చేయుమని మానసింగునకు నీవొక యర్జీ సిద్ధముచేయుచున్నావు గదా ? ఆ రాజపుత్రుడు దూరదేశమున యుద్ధములోం జిక్కుకొన్న సమయములో నీలాటి చిన్న వ్యవహారముల గమనించునా ?"

"ఆ రాజు చాలదూరమున నున్నప్పుడు కానంగో అతని సంస్థాన వ్యవహారములు చూచి యుత్తరువులు పంపుచుండును."

"కానంగో మన కనుకూలముగాం జేయునని నీ వనుకొందువా ?"

"అయ్యా, దేవరవారి ఖజానాలో నుండి మూాయన ముదుపాయన కిదివఱకే ముట్టినది."

గోకులదాసుని గూఢచర్యాలలో నొకటియైన యీ విషయము వినఁగానే నవకుమారుఁడు విస్మితుఁడయ్యెను. కాని, దాసుని మొగము వలన నేమియు మార్పు కలుగలేదు.

"ఓయీ! మాయలమారి! మన ముఘుపెంతమట్టిన రాజాతోడర్ మాలుచేత నేర్పరుపబడి మానసింగుచేత సమ్మతింపబడిన వ్యవస్థను కానంగో మార్పఁగలఁడా?"

"ఇప్పటి యవస్థను మార్చుటకుఁ గావలసినంత యవకాశము కానంగోకు దొరకును. వీరనగరములోను, దేవీపురములోను నింక మీఁద నెన్నో పెద్ద యల్లరులు జరుగును. రెండు సంస్థానములనుం డియుఁ జక్రవర్తికిఁ జెల్లవలసిన పేష్‌కష్ చెల్లక బకాయిపడును. పేష్‌కషు సరిగాఁ జెల్లుట కేదో క్రొత్తయేర్పాటు చేయవలసి యుండును."

"పేష్కషు సరిగాఁ జెల్లుబడి యగుటకు నా దేవీపురసంస్థానము నాకిచ్చి వీరనగరసంస్థాన మాబాలునకు, వాని మిత్రులకు విడిచిపెట్ట వలసి యుండునా?"

"దేవరవారికి దేవీపురసంస్థానము వెంటనే యిచ్చివేయవలసి యుం డునుగాని, వీరనగరమును మాత్రము వదలవలసి యుండదు."

"నీవు పొడుపులు కథలు పొడిచినట్లు మాటాడుదువు. స్పష్టముగా జెప్పు. వీరనగర మే మగును?"

"నరేంద్రుఁడు యుక్తవయస్కుఁ డగువఱకు వీరనగరముఁ బరిపా లించుటకుఁ జక్రవర్తి యెవరినో యేర్పఱచును. అప్పు డయినను బకాయిపడిన పేష్కషు చెల్లించువఱకు నతనికి సంస్థానము రాదు."

"అదెంతసేపు. వీరనగరములోఁ జాల ధనమున్నది గదా?"

"అదెప్పుడు జరుగదు."

"ఎందుచేత ?"

"ఎందుకనఁగా నా చక్రవర్తిగారు పరిపాలనకై పంపిన వస్తువ్యాని యొద్ద గోకులదాసునకుఁ గొంత పలుకుబడి యుండును."

"వీరనగరపు పేష్కష్షు బకాయిలోఁ బడ సేయుటకా నీపలుకుబడి?"

"ఆ. వీరనగరపు పేష్కష్షు బకాయిపెట్టుటకే."

"తరువాత కథ యేమి ?"

"వీరనగరము చక్రవర్తి పేష్కష్షు చెల్లింపలేక మిక్కిలి బకాయిలోఁ బడినప్పుడు, ముందుముందెప్పుడో పేష్కష్షు నిమిత్తము దాని నమ్మవలసి వచ్చును. దేవీపురప్రభువు దానిని కొనఁగల్గిన స్థితిలో నుండవచ్చును. ఈఁగాటి సంగతులెన్నో యిదివఱకు జగినవి"

"గోకులదాసుఁడ ! ఈగూఢాలోచనలు వెలిబుచ్చుటవల్ల నాగుండె ఝల్లుమనుచున్నది. ఒక్కక్షణ మాఁగు. నా పరిపాలనకాలములో నల్లరులు పుట్టినా నన్ను దీసివైచి కానంగో రెండుసంస్థానములు పరిపాలించుటకు మరియొక యములుదారు నేర్పఱుప వచ్చును."

"కానంగో యిదివఱకే యీ విషయమై నిశ్చయించుకొన్నాఁడు. ఒక పనిమీఁద క్రిందటివారము నేను వెళ్ళి చూచి వానితో మాటాఁడి నాను."

తన సేవకుని ప్రశాంతమైన సాహసముచేత నవకుమారుఁడు నిశ్చేష్టుఁడయి యిట్లనియె.

"నాకార్యములలో నేను సాహసము ధైర్యము జూపితిని. నేను సహజముగా పిఱికివాఁడను గాను. కాని నీపన్నుగడలు వినఁగానే నాకు వణకు పుట్టుచున్నది !"

"నాపన్నుగడ నా యజమానుని దేవీపురసంస్థాన సింహాసనము మీఁద గూర్చుండఁ బెట్టుటకే. వీరనగరము కాలక్రమమున దేవీపురమునకుఁ గలుపుటయే నా సంకల్పము."

"కాని, నాభార్య రెండుసంస్థానములు కలుపుట కింతకంటె నిరపాయమైన యుపాయ మొక్కటి చెప్పినది. ఈ యూహయుదాని యాలోచనమె అయినను క్షేమకరముగా నుండఁదప్పును"

"ఆమె చెప్పిన యుపాయము ఆ దేవియొక్క సదయహృదయమునకుఁ దగినదే. కాని, పురుషుని సంకల్పమునకు సరిపోదు" అని గోకులదాసుఁడు బదులు చెప్పెను.

ఆమాట వినఁగానె నవకుమారుని మొగమునఁ గొంచెము క్రోధము పొడసూపెను. కుటుంబరహస్యములు గూడ గోకులదాసునియొద్ద నెన్నఁడు దాచఁదగినవి కావు. కాకపోయినను దాసుఁడు యజమానుని ముఖవైఖరి గనిపెట్టి మెల్లగా నిట్లనియె—

"అన్న దేవరవారు నమ్మినట్లె యమ్మగారు గూడ నమ్మియున్నారు. నలువది యేండ్లనుండి నేను మీసేవ జేయుచుండుటయు, మీ కుటుంబముపట్ల భక్తి విశ్వాసములు గలిగి యుండుటయు నామెయు నెఱుఁగును."

"వీరనగర దేవీపురకుటుంబములు నాభార్య కలుపఁదలఁచుకొన్న విషయములో నీ యభిప్రాయమేమి?"

"అమ్మగారి సదయహృదయమునకీ యాలోచన తగియే యున్నది. అమ్మగారికన్నఁ బాతివ్రత్యముగల స్త్రీ లోకములో లేదు. ఆమె సీతాదేవి యవతారము. సీతవలెనే యామెయు భర్తతోఁ గూడ నరణ్యమునకుఁ బోవ సమ్మతించి, రాజ్యమునైన గడ్డిపఱకగా వదలివేయును."

ఆకడపటి వాక్యములో గర్భితమైన భావము నవకుమారుని హృదయమున ములికివలె నాటెను.

"నా కుమార్తెను నరేంద్రుని కిచ్చి వివాహము చేయుట రాజ్యమతనిచేతిలోఁ బెట్టి నేను సన్న్యాసినై పోవుటయే యని నీ యభిప్రాయమా?"

"ఆవిషయమై యాలోచించుటకు దేవరవారే తగుదురు. నేను మీచేతిలో బొమ్మవంటివాఁడను. మీ కుటుంబము భాగ్యభోగ్యములకుఁ మీరే కర్తలుగదా?"

"గోవిందదాసుడా! నా భార్య పన్నిన యుపాయ మాఁడుదాని యుపాయమే. అయిన నది మన మాలోచింపఁ దగినదే."

"ఆఁడువాండ్రు కొన్ని విషయములను జక్కఁగా గనిపెట్టఁగలరు. కాని, యన్నిటిలోఁ గాదు. అమ్మగారు సదాశంకచిత్తురాలు గనుక వారి కితరుల దోషములు పొడకట్టును. మనుష్యుని హృదయములో ననేక భావములు, కోరికలు నుండును. సుందరాంగుల సంభాషణములు మొదలైనవి వానిని మార్పలేవు. నరేంద్రుఁడు దాశిరెడ్డి కొడుకే. అతని తాత రక్త మతనిలోఁ బ్రవహించుచున్నది."

"నరేంద్రునకు హేమలతమీఁద చాల ప్రేమ. అతఁడు సంతోషముగ మనతో దేవీపురమునకు వచ్చునని నా భార్య చెప్పుచున్నది. నా కూఁతును చేపట్టినా, యతఁడు దేవీపుర సంస్థానమునకు హక్కుదారుఁ డగును."

"నరేంద్రునివంటి వీరనగర రాజకుమారు లెందఱో దేవీపుర రాజకన్యల నింతకుముందు వివాహమై యుండిరిగాని, వారి కిలాఫతనము వారు విడువలేదు. అట్లే దేవీపుర రాజకుమారులను వీరనగర సంస్థాన బాలికలను బెండ్లియాడిరి గాని, వారి కులసాంప్రదాయముల నెన్నడు మఱచియుండలేదు."

"ఔను. కాని, యిప్పటివలె నీ సంస్థానముల వారసురాలు, వారసుఁడు మును పెన్నఁడు దంపతులు కాలేదు. ఈసారి వీరిద్దఱు దంపతులైన యెడల విరోధములు గల కుటుంబములు కలిసిపోవునని నా భార్య యభిప్రాయము."

"ఆ మహాత్మురాలి పవిత్రాశయములు భగవంతుఁడు సిద్ధింపఁజేయుఁ

గాక ? కాని మూఁడువందలయేండ్లనుండి యున్న మాత్సర్యము లొక్క-నాఁడు నశింపవు. తరతరములనుండి సంక్రమించి పెంపొందుచున్న రాజ కుటుంబముల పరస్పరద్వేషాగ్ని లొక్క-రాత్రి యుత్సవముతో నారి పోవు."

"ఎందు కాఱిపోవు ? ఇటువంటి కార్యము లిదివఱ కెన్నో జరిగినవి."

"పౌరుషముగల హృదయముతో మీ రీ విషయ మాలోచింప వలయును. మీరు గొప్పవంశమునఁ బుట్టినవారు. నావంటి యధముని కన్న నీవిషయమున మీరు బాగుగా నాలోచింపఁగలరు. నీభార్య వీరనగరపువంశములోనిది. ఆమె మిక్కిలి యుత్తమగుణసంపన్నురాలె. అయినను నామెకోసము మీరు మీ తాత తండ్రులను మఱచి, వంశ మర్యాదలను మఱచి మూఁడువందల యేడ్లనుండి మీపూర్వు లెవ్వరితో యుద్ధముచేసిరో, యాపైరుల పొందుఁ గోరెదరా ?"

"వంశమర్యాద నెన్నఁడు విడువను. నూరుమంది జోదులు నాకడ నున్నంతకాలము, నా దేహములో రక్తపుచుక్క లున్నంతకాలము, నా వంశగౌరవము నేను గాపాడుకొందును."

"స్వామీ ! నరేంద్రుఁడు పెద్దవాఁడైన తరువాత పౌరుషవంతుఁడు కాఁడా ? అతఁ డిప్పుడు బుద్ధిలేని పిల్లవాఁడై, కుక్క తన యజమాను రాలి వెంట వెంటఁ దిరుగునట్లు నీ కుమార్తె కొంగు బట్టుకొని తిరుగు చున్నాఁడు. ఇప్పుడు సైతము వాని తాతగారి చర్య లతఁడు విన్నప్పు డతని మొగముమీఁద నెత్తురుజేరులు కనబడును ఉత్సాహముచే నతని శరీరము పొంగును. అయ్యా ! నామాట నమ్మండి. తోడరుమాలు చేతినుండి వీరఖడ్గమును బుచ్చుకొన్న యాబాలుఁడు తన వంశగౌరవ మెన్నఁడు మఱువఁడు. మీ భార్య వీరనగరవంశమునుండి పుట్టినది. ఈ సంబంధము కుదిర్చి యామె, మీ పితృపితామహుల సంస్థానము

వీరనగరమువారి యధీనము జేయును. దేవీపురము శాశ్వతముగ నాశన మైపోవును. దాని పేరయిన లోకములో నుండదు."

కొంత సేపు వారిరువురు మాటాడక యూరకుండిరి. నవకుమారుఁడు తనలోఁ దా నాలోచనల చేసికొనుచుఁ గొంత సేపటికిఁ గన్నులెత్తి యూయాసపడుచున్న వానివలె మాటలాడఁ దొడఁగెను.

"గోకులదాసుఁడ! నీది సరియైన మాట. ముమ్మాటికి సరియైన మాట. నీ యాలోచన చెడ్డదియైనను నీ సూక్ష్మదృష్టి సరియైనదే. ఈ రెండు కుటుంబముల నడుమ మునుపు రక్త మపారముగఁ బ్రవహించి నది. ఆ నెత్తురుటేటిని దాఁట శక్యముగాదు. నా భార్య గొప్ప భావ ములు గలదె. అయినను వీరనగరవంశపు బాలిక యగుటచే నామె యాలోచనలపట్ల నా కెప్పుడును సంశయములు గలవు."

సింహమును మచ్చిక చేసినవాఁడు తన నేర్పిన యాట లన్నియు నది యాడునట్లు జేసిన విధముగఁ దన పలుకు లన్నియు నవకుమారుని తల కెక్కి నచ్చెనని గోకులదాసుఁడు గ్రహించెను. తన మాట నెగ్గి నందుకు మొగమున లేశమైన గర్వము పొడకట్టనీక, యతఁడు మఱి మఱి వినయముతో మాటాడఁ జొచ్చెను.

ఈ విషయములో దూరదృష్టి నా కంతగా లేదు. ఏమైన నున్న యెడల నది దేవరవారి యొద్దనే నేర్చుకొంటిని. నా భావములు మీ భావముల ప్రతిధ్వనులే. దేవీపురసంస్థానము దేవీపుర రాజకుమా రునికే చెందవలెనే గాని, వీరనగరరాజకుమారునికిఁ జెందఁగూడదు. పుత్త్రసంతతి లేనప్పుడు వేఱొక బాలకునిఁ దెచ్చి పెంచుకొనుట గొప్ప సంస్థానముల సాంప్రదాయము. అతఁడు కుమారుఁడువలెనే వేద శాస్త్రానుసారముగా నుత్తరక్రియలు చేసి ధర్మశాస్త్రానుసారముగా సంస్థానమునకు హక్కుదారుఁ డగును. ఎక్కడనైనను మంచిపిల్లవానిని జూచి పెంచుకొనుఁడు. మీ యనంతరమున నతఁడు సంస్థానాధిపతి

యగును. కాని, యమ్మగారు పెంచుకొనుట కిష్టములేక హేమలతయే సంస్థానమునకు హక్కుదారు కావలెనని గట్టిపట్టు బట్టినయెడల దేవీపుర రాజబంధువులలో గొప్పసాంప్రదాయముగల యొక పిల్లవానిని దెచ్చి పెండ్లిచేయుఁడు. అతఁడు దేవీపుర గౌరవమును గాపాడి దాని గౌరవము నిలుపఁగలఁడు."

"గోకులదాసు! చెప్పు చెప్పు నీమాటలలో సారమున్నది. నీవద్ద నుండి యింకను వినవలెనను కుతూహల మున్నది. అట్టి పిల్లవాని కొఱకు మనము చాలదూరము వెళ్లి వెదుకవలయును."

"దూరమక్కరలేదు. వెదకినపక్షము నట్టి బాలుఁడు మీ యింటనె దొరకును. శిరీషుఁడు తల్లిదండ్రులు లేని పిల్లవాఁడు. అతఁడు తన పితృసోదరియైన శైవలినితో వచ్చి మీయింటఁ దల దాఁచుకొని మీసంరక్షణలో నున్నాఁడు. వాండ్రు మీ వంశములో నొక శాఖలోనుండి జన్మించినవారు. ప్రస్తుతములో పేదలై మీయుండ నుండినను, మంచి కుటుంబములోనివారు. ఆటపాటలలో నేనతనిని బలుమాఱు చూచినాను. నా పలుకులు గమనింపుఁడు. అతఁడు ప్రశాంతచిత్తుఁడు. మీవంశస్థుల కీర్తియు, తేజస్సును, నాతని గంభీర హృదయమునందు దాఁగియుండి కన్నులలోఁ బ్రజ్వలించుచున్నవి. హేమలత చిన్ననాటనుండియు నరేంద్రునితో నాడుకొనుచున్నను మనస్సులో శూరుఁడైన శిరీషునిమీఁదనే మక్కువ నిలిపియున్నది."

"నేనుగూడ శిరీషుని గుణములు కనిపెట్టుచున్నాను. అతని దృఢకాయము, శాంతము, పట్టుదల, దృఢమైన మనోనిశ్చయము మొదలయిన గుణములు నాకు నచ్చినవి. మొన్న సాయంకాల మతఁడు, నరేంద్రుఁడుఁ గలహమాడిరి. శిరీషుఁడు నరేంద్రు నెత్తి యిసుకతిన్నెమీఁద గూలవైచెను. ఈమాట హేమలతవల్లవింటిని."

"అతఁడే నీకుమార్తెను జేపట్టి దేవీప్రభువైనప్పుడు మొన్న కొట్టి

నక్లైన రేంద్రుని గొట్టి యడఁచును. కావున నరేంద్రు శాక్త, మనకు చేసిన యపకృతులన్నిటికి నీయుపకారము ప్రతిక్రియలుచేసి గకిరిస్త్రీ కొనును.”

“గోకులదాసు! ఆలోచించుకొనుటకు నాకవకాశమియ్యి. నీ వా లోచనలతో నన్ను ముంచెత్తితివి. నీవన్నగడ లన్నిటిని నాగించు చుండుము. నాతలంపులేవో నాకున్నవి. దేవీపురమెన్నటికిని వీరనగర రాజకుమారునకుఁ జెందదు.”

అని నవకుమారుఁడు వెళ్లెను.

దీపము మందకాంతితో వెలుఁగఁజొచ్చెను. నళకని దెల్లవారెను. తలుపుసందులలోనుండి వెలుగు లోపలికి వచ్చుచున్నను వృద్ధుడైన గోకులదాసుఁ డాలోచనలలో మునిఁగియేయుండి తనలో నిట్లను కొనెను.

“పునాది గట్టిగావైచితిని? నా ప్రజ్ఞావిశేషము నాలో నిలిచిన పక్షమున దీనిపై సుహాభవనము గట్టెదను. నవకుమారునిభార్య నాకడ్డము. ఆమె సాధారణమైన శత్రువుకాదు. ఆమె గుణసంపద ప్రశంసనీయము. కాని, యామె యెల్లవారిని రాణివలె శాసించునట్టి స్వభావముగలది. ఆమె భర్త యుద్రేకపూరితుఁడు. భార్యమాట కెదురాడలేడు. అందుచే నతని నామె లోఁబఱచుకొనును. ఎట్లయిన నామె యాఁడుదిగదా? స్త్రీస్వభావముచేత, పిల్లల ముద్దుముచ్చటలే ముఖ్యముగ నాలోచించును గాని, రాజకుటుంబములు మానమర్యాదలను గుఱించి తలంపఁజాలదు. నవకుమారుఁడు తన కుటుంబమునకు దనకు గౌరవమపేక్షించునేని, నది సాధించుటకుఁ దగిన పౌరుషము గలవాఁడు. కాకపోయినను నేనీరాత్రి యతనికి మంచి మాత్ర నైచితిని. దీనిబలముచే నతఁడు భార్యనుఁ బ్రతిఘటింపఁగలఁడు. వీరనగర భవనములోఁ గొన్ని గందరగోళములు పుట్టును. వాటిజోలి నా

కక్కఱలేదు. భార్య కంటఁదడి పెట్టుకొనునేని, నవకుమారుఁడు జడియునేమో? కాని మరల నాకడకు వచ్చును. నవకుమారుడా! నీకుటుంబముమాట నీవు మఱచినను మఱువని వా డొక్కఁడున్నాఁడు. గోకులదాసుఁడు తన కృత్య మెఱుఁగును. తప్పులదారి నెన్నఁడు నడువఁడు."

X

ఉత్తరహిందూస్థానమునందు హిందూజనుల కందఱకు మహానందకర మైన పండుగ హోలిపండుగు. ఇది వసంతకాలమునాడు జరుగును. చలికాలము వెళ్ళిపోయినది. గోధుమ, యవధాన్యము మొదలగునవి కోయఁబడినవి. కందులు మొదలగు పప్పుజాతులు నూవులు పండినవి. పంటకాఁపులు దివాణములకుఁ బన్నులు జెల్లించి, ధాన్యములు పురుల లోను, గాదులలోను నిలువచేసికొనిరి. వారి యిల్లాండ్రు క్రొత్తకోఁకలు ధరించి, కొన్ని నగలను జేయించుకొనిరి. పల్లెటూరి పడఁతులు బట్టలు తెచ్చి యూరూర నమ్ముకొను వర్తకుల మూటలు విప్పుచుండ నెంతో యాసక్తితోఁ జూచుచుండిరి. ఆ పడఁతులు సొమ్ము లేనప్పుడు గంపెడు గోధుమలో ధాన్యమో యిచ్చి, గాజులో క్రొత్తమాదిరి చీరలో క్రయమునకుఁ దీసికొనుచుందురు. ఈ ఋతువునందే మామిడిచెట్లు మొల్లనిచివుళ్లతోఁ బచ్చని యాకులతోఁ గనుపండువై యుండును. మామిడిపూవు సువాసన దేశ మంతటఁ బరిమళించుచుండును. గండు కోయిల చెట్లకొమ్మలపై నిలిచి 'కో'యని మధురస్వరముతో గూయుచు నిది వసంతకాలము, సంతోషసమయమని చాటుచుండును.

హోలిపండుగ ప్రణయసూచకమైన పండుగ, ఇది కామదేవు నుద్దేశించి పూర్వకాలమునఁ జేయఁబడుచుండెను. కాని రమారమి

వేయియేండ్లనుండి కాముదేవుని స్థానమును శ్రీకృష్ణుఁ డాక్రమించెను. నాఁటినుండి యీ యుత్సవగాథ లన్నియు శ్రీకృష్ణునివే. ఉత్తర హిందూస్థానమునఁ బ్రతిపల్లెయందలి పడఁతులు కృష్ణుని ప్రణయమును గురించి పాటలు పాడుదురు. పురుషులు తమ పనులుమాని యాదినము లలో బహుసంతోషముగాఁ దిరుగుచుందురు. ఉత్సవము కట్టకడపటి దినమున మిక్కిలి యెక్కువగా జరుగును. ఆనాఁటిరాత్రి యంతయు జనులానంద సముద్రమగ్నులై యుందురు. ఆ మఱునాఁ డుదయమునఁ గాల్యకృత్యములం దీర్చికొని యెవరిపనులమీఁద వారు వెళ్లుదురు.

ఈ పండుగలో జను లనేకవిధములైన యుత్సవములు కర్మలు జేయుచుందురు గాని, అన్నిటిలో ముఖ్యమై నేఁటికిని జరుగుచున్న దొక్కటి గలదు. వీధులలోను, బజారులలోను గృహములలోను బుక్కా బగ్గుండ చల్లుకొనుట యాచారమై యున్నది ఇది తప్పించు కొనువా రెవ్వరునులేరు. అందరిమీఁద జనులు బుక్కా చల్లుదురు. మంచి మంచి తలగుడ్డలు పెట్టుకొనివెళ్లు నుద్యోగస్థుల పాగాలు బుక్కాతో నిండియుండును. అంగరకాలు వసంతముతో నిండియుం డును. పురోహితుల దుస్తులు సైతము బుక్కా బగ్గుండల రంగు గలిగి యుండును. బజారులలోని సామాన్యస్త్రీలు సైత మీపని చేయు చుందురు.

మర్యాదగల సంసారస్త్రీలు బుక్కా బగ్గుండల పీడ తప్పించుకొనుట కును, మోటపాటలు వినఁబడకుండుటకును నా దినములలో నిల్లువిడచి వయిటకిరారు. ఈ యుత్సవములో గొప్పవారు, కొలదివారను భేదము లేకుండ జనులందఱుఁ గలసి మిక్కిలి యుల్లాసముగా నుందురు. వేదాంత శాస్త్రవేత్త లీ వెడవెడ పండుగలు జూచి నవ్వుచుందురు.

ఆ దినము హోలిపండుగలోఁ గట్ట కడపటిదినము. నవకుమారుఁడు ఆలోచనలన్నిటిని నణచిపెట్టి నవవికాసము గ్రక్కుచున్న మొగ

ముతో ౙెలువెడలెను. వృద్ధుఁడైన గోకులదాసుఁడును వానివెంటవెళ్ళి యా సంతోష మనుభవించెను.

సంస్థానములోని నానాభాగములనుండి యుత్సవ సందర్శనార్థము వేలకొలఁది జనులు వీరనగరమునకు గుంపులు గుంపులుగా వచ్చిరి. నవకుమారుఁడును, గోకులదాసుఁడును జనసమ్మర్దముగల బజారుల నుండియు, వీధులనుండియుఁ బోవుచున్నప్పుడు, జనులు నవకుమారుని పేరు చెప్పి చప్పట్లు గొట్టి జయజయధ్వనులు చేసిరి. స్త్రీలు కృష్ణుని గూర్చి రెండర్థములుగల పాటలుపాడిరి. పిల్లలు బుక్కా బగ్గుండలు వానిపై విరివిగాఁ జల్లిరి. అతని శరీరమంతయు నెఱ్ఱబడెను.

అతఁడు బజారు దాఁటి సంసారులు కాపురముండని యొక సందు లోనికిఁ బోవునప్పటి కెన్నో చిత్రములైన పాటలు వానికి స్వాగత మొసఁగెను. అక్కడఁ గొందఱు స్త్రీలు నడివయస్సు గల్గియుండిరి. కొందఱు నిండుప్రాయమున నుండిరి. అందఱు హాళాయిలు గులుకఁ బసందయిన చీరెలుగట్టి సందులో గుంపులు గుంపులుగా గూడి యెవరు వచ్చినను వారి నెదుర్కొన సిద్ధముగనుండిరి. వారి వాలకములు దిన మంతయుఁ బడిన శ్రమల వెల్లడించుచుండెను. కొప్పులు విడిపోయెను. చీరలు బగ్గుండతో నిండియుండెను. పాదములు వసంతముతోఁ దడి సెను. మొగములుగూడ వసంతముతోఁ దడిసెను.

నవకుమారుఁడు విసవిస నడిచిపోయెను. ఆ స్త్రీలతనిని విడిచిరి గాని గోకులదాసుని మాత్రము విడువలేదు. అతఁడు కనఁబడినతోడనే శరీరమును వసంతముతో ముంచియెత్తిరి. అతఁడు వెనుకకు మరలఁజూచెను గాని, కాలుజాఱిపడెను. అదిచూచి యాపశుతులందఱు గిలకిల నవ్విరి.

పడిపోయిన యావృద్ధునిపై మరల వసంతవర్షము గురిసెను. ఆ యువతులు సంతోషముతో కేరింతలు గొట్టుచుండ నతఁడు కొంత సేపు నేలమీఁదఁ బ్రాఁకులాడుచుండెను. అంతలో సేవకులువచ్చి

వృద్ధమంత్రిని లేవఁదీసిరి. మరల నవ్వులతోను కేరింతలతోను నాకాశము నిండిపోయెను. అప్పుడు వారొకవింత పాటబాడిరి. దానియర్థము మన భాషలో నిట్లుండును.

ద్విపద. "ఓహా! గోకులనవమోహనాంగుండు
స్నేహంబుజూప వేంచేసెనాఁడమ్మ
యెంతొయందమగు వసంతదినంబున
స్వాంతంబులలరఁ బ్రభాతకాలమున
శ్వేతలావులపాలు పితుకుచుండంగఁ
బ్రతిమైజేరెను పెనుచెట్లతోఁపు,
మురిసిగోకుల నవమోహనాంగుండు
దరిలేని ప్రేమతో దరిశనంబిచ్చి.
అవనీతలమునందు నాకాశమందు
నవనవప్రణయంబు నాట్యంబుజేసె.
గోకులనాథుని కోరచూపులను
వింతకాపట్యంబు వెలయుచుండె
చాలతియ్యగనుండె సకియనీపాలు
పాలకన్నను మోముపదిరెట్లు తీపి
అనుచు గోకులనాథుఁడాడెనోయమ్మ
గొల్లముద్దియలతోఁ గొంటెమాటలను
నీనల్లకనులలో మిగులలోతుగను
మానుగాదాఁగెను మమతలు పెక్కు
మెత్తని నీకురుల్ మేఘంబులట్లు
యెత్తుగా నల్లనై యొప్పారుచుండె
నవనీతలమునందు నాకాశమందు
నవనవప్రణయంబు నాట్యంబుజేసె.

నయనంబులను జిఱునవ్వులొల్కాడ
జయనాదముల నాకు స్వాగతంబిందు. 2
గోకులమోహనాంగునిఁ జూచియంత
యాశన్నెలనిరీట్లు హాసంబుజేసి,
యావులపాల్దీసి యంగళ్ళలోన
హావభావములొప్ప నమ్మునమయ్యా
శీలంబుగల మంచిచేడెల మేము
ఏలాగు బ్రిమ్మరి నెదనమ్మఁగలము ?
గాలిలాగుననుందు కడుచంచలమయి
నీలేతకూరిమి నీలేతవలపు
అవనీతలమునందు నాకాశమందు
నవనవప్రణయంబు నటియించుచున్న
యింటికి జనుమయ్యా, ఇఁక నెందు కిచట
కంటిలో సొగసును గనలేమునీకు. 3

నేలఁబడుటచే సిగ్గువడిన గోకులదాసుని సొగసంపుటకో యున్నట్లు చివరపాట వారు సరిగాఁ బాడక గందరగోళముగా నఱచినట్లు బాడిరి. నవకుమారుఁడు గూడ వారితోఁబాటు నవ్వి యా వీరకాంతలకుఁ గొన్ని బహుమానము లిచ్చి పంపెను.

పిమ్మట నాసన్నసందువిడచి నవకుమారుఁడు పురజనులతో మర్యాదగల సంసారులు కాపురముజేయు మఱియొక వీధికిఁ బోయెను. మన దేశమందలి వాయవ్యదిశనుండి కొందఱు వర్తకులువచ్చి యా వీధిని గాపురముండి వ్యవహారము చేయుచుండిరి. దానికి కొట్టాబజారని పేరు. రాజస్థానమను నుండియు, నుత్తరదేశమునుండియు వచ్చినవర్తకులే నేఁటికిని దేశమందంతట బదుళ్ళిచ్చి వడ్డీ వ్యాపారము సేయువారిలోఁ జేరి క్కిన గన్నవారు. వారికోటీలకు దేశమందన్ని ముఖ్యపట్టణములయందు

శాఖలుండెను. వారిహుండీలు దేశమందంతట నిరాటంకముగా చలామణి గలిగియుండును. మహారాజులవంటి యీ వర్తకశిఖామణులైన రారాజులుసైతము కష్టకాలమందు, యీ వర్తకులవద్దనుండియును పెద్ద మొత్తములు బదులుపుచ్చుకొని యుపయోగించుకొనుచుందురు. ఈ యుత్తరహిందూస్థానపు వర్తకులలో గొందరు శ్రేష్ఠతమమైన వీరనగరమునందుఁ గూడ వ్యవహారము నిమిత్తము కాపురముండిరి. మొదట రాజాతోడరుమాలు, పిమ్మట రాజా మానసింగు వచ్చి నప్పుడు వారితోఁ గూడ మఱికొందఱు వచ్చిరి.

వారు నవకుమారుని గౌరవించి బంగారుతో నిండిన వెండిపళ్ళెర మతనికిఁ గానుకగా నిచ్చిరి. దేశాచారప్రకారము నవకుమారుఁడా పళ్ళెము స్పృశించి యందులో నొకబంగారపు నాణెమును జాఱవిడిచెను. ఈ వర్తకులకోటీలు నవకుమారుని సంస్థానముకంటెను నెలకొని గొప్పగలిగి సంత భాగ్యము గలవారైనను, గానుకలిచ్చినవారు తడి గౌరవము గనుక యా చిన్ననాణెము కోటీదారులు స్వీకరించిరి.

వీధులలో నాడుచున్న యావర్తకుల కొంటెబిడ్డలు మాత్రము గొప్ప వారిని గౌరవించువారుగారు. వారు కేసరిరంగు పిండి బుక్కాపిండి వార్చి బుగ్గండతో నిండిన జీలుగుబెండు బంతులఁదాల్చి నవకుమారునిమీఁదను వాని యనుచరుని మీఁదను యథేచ్ఛముగా జల్లి కేరింతలు గొట్టి నవ్వి పాఱిపోయిరి. నవకుమారుని తలపాగమీఁద నొకటి రెండు బంతులు పడెను. నవ్వుకొనుచు మొగము తుడుచుకొని యతఁడు వెడలిపోయెను.

కొంతదూరము పోవునప్పటి కీవర్తకుల యాఁడువాండ్రు గంగాస్నానములుచేసి వచ్చుచు నెదురుపడిరి. వారు మిక్కిలి గౌరవముగల స్త్రీలు. కాని, పండుగయగుటచే మరియాద కొంత నతిక్రమించిరి. నవకుమారుఁడు వారికంటఁ బడఁగానె శ్రీకృష్ణునిగూర్చి వారి యుత్తర దేశభాషతో నొక గేయమును బాడిరి.

ద్విపద. వెడలునే కానుండు విడనాడి మమ్ముఁ
గడుఁ జిన్నవోవు మాగ్రామగేహములు
గోపగోపికలెల్లఁ గ్రుమ్మరుచుందు
రేపాటిసంతోష మెడలోసలేక
మంద తేజంబయి మధురగన్పడెడు
నీ మఁడి కానుఁడే యేగిన యెడల 1
తరలునే కానుండు ద్వారకాపురికి
తరువాత మా గోపబాలురవిడిచి
యానందహేతువై యతిమనోజ్ఞమగు
కానుని యావేణుగానంబు వినమి.
కానుని పాటలు కర్ణముల్బ్రోరమి
మానఁ బచ్చిక మేయు మాయావులెల్ల 2
కాళిందియొడ్డున గనుపండువైన
యాకేతతోఁటల నన్నింటి విడిచి
తరలునే కానుండు ద్వారకాపురికి
విరహంబు సైఁపక విడుతు రూరువులు
బృందావనములోన వ్రేతలందఱును
అందమౌ పించియ వాదల మెఱయ
సుందరీహృదయముల్ చూరగొన్నట్టి
నందపుత్రుఁడు పోవునా మమ్ము విడిచి.
వరయశోదను బాసి వసుదేవు బాసి
నిరుపమశృంగారనిధియైన దాని
నరవిందమును బోలు నాస్యంబుదాని,
సిరియు మల్లెలతావి వెదఁజల్లుదాని
రామమంచనఖకల రహిఁ బోలుదాని

ప్రేయసి రాధను వేగంబె బాసి
పోవుచున్నందుకు మోహాబ్ధిమునిఁగి
వే విచారింపుఁడీ ప్రేతలందఱును. 4

కానుఁడనఁగా నుత్తరదేశభాషలో గృష్ణుఁడని యర్థము. నవకుమారుఁడు వీరనగరమును బాసి కొలఁదికాలములో దేవీపురమునకుఁ బోవుననువార్త కర్ణాకర్ణిగ దేశమున వినఁబడుటచే నావృత్తాంతము మనసులోఁ బెట్టుకొని యీ వణిజకాంతలు కృష్ణుఁడు మథురనుండి ద్వారకకుఁ బోయినకథ పాటగాఁ జేసి నవకుమారు నుద్దేశించి నర్మగర్భముగాఁ బాడఁజొచ్చిరి.

ఆవడఁతులందఱుఁ గంఠములెత్తి విచారకరముగాఁ బాడిన యాపాటలోని చివరపద్యమునందలి భావము నవకుమారుని మనస్సున గాఢముగ నాటెను. నాటుటయు నతఁడాఁగి శ్రద్ధతో వినెను. "అయ్యా, రండి రండి. వినవక్కఱలేదు. మఱిక్కడనుండి వెళ్లినతరువాత రేపు నరేంద్రుని గురించికూడ నీపాటనె పాడుదురు" అని నవకుమారుని చెవిలో గోకులదాసు రహస్యముగఁ జెప్పెను.

"గోకులదాసా! నీవు గుండెలుతీసిన బంటువు. మనమేలు గోరు వీరినిగుఱించి యిట్లు నిర్దయగాఁ బలుకవచ్చునా? నాహృదయము నీదానివలె రాయిగాదు. తాత్కాలికప్రేమ జూపినను నీ సుందరాంగుల ప్రణయగీతముల నే నంగీకరించెదను.

"వ్యవహారము పయికి గనబడువంత స్వచ్ఛముగా నుండదు. వీరనగరమును నరేంద్రుని తాత పాలించినప్పుడు గూడ నిటువంటి యుత్సవములు జరిగినవి. వాటిని జ్ఞాపక ముంచుకొన్నవా రనేకులు గలరు. వారిని మనము గలుసుకొనవచ్చును. పోదమురండు."

పూర్వకాలమున నూలునేతయుఁ బట్టునేతయు బంగాళాదేశములో ముఖ్య పరిశ్రమలు. ఈ హిందూదేశపు నేతబట్టల వర్తక

ముసి తమకొక్కొక్క [illegible] కుపోవలెనని పశ్చిమఖండ జాతుల వారు [illegible] చేసిరి. పోర్చుగీసువారు సుప్రసిద్ధుడైన అల్బాంజో అల్బుకర్కు [illegible] దూర్పు సముద్రములలో వాకరాష్ట్రమును స్థాపించి [illegible] మొదలుకొని తూర్పునఁ జీనాదేశమువఱకును [illegible] సముద్రతీరమునందలి రేవుపట్టణములు అన్నింటిని స్వాధీనము చేసిరి. వేలకొలది పోర్చుగీసులు బంగాళాదేశము కేగి వసతులు నేర్పఱచుకొని యాదేశ స్త్రీలను భార్యలుగా స్వీకరించిరి. వారి సంతతివా రిప్పు డనేకులున్నారు. హిందూదేశము లోని యూరేషియన్ సంఘములో వీరి సంఖ్యయే యధికముగా నున్నది. ఆసమయముననె డచ్చివారును హిందూదేశమునకు నావల నంపజొచ్చిరి. ఎలిజబెత్ రాణి కాలమున నాంగ్లేయులుకూడ లాభకరమైన యీ వ్యాపారమునందుఁ గొంత పాల్గొనఁ బయత్నించిరి. లక్షలకొలది బంగాళాదేశపు స్త్రీలుఁ బురుషులు నూలువడకుట బట్టలు నేయుట వృత్తులుగా నేర్పఱచుకొని జీవింపఁ దొడఁగిరి. బంగాళాదేశపు మగ్గములు కండెలు విరివిగా బట్టలు తయారుచేసి యుత్తర హిందూస్థానపు బజారులకును బశ్చిమఖండపు బజారులకును నెగుమతి చేయసాగెను.

బంగాళాదేశములో నెల్ల మాల్దాజిల్లా శ్రేష్ఠమైన నూలుసరకును బట్టుసరకును దయారుచేసెను. వీరనగర మా జిల్లాలోనిదే. పల్లెటూళ్ళలోని నేతగాండ్రు పట్టుపురుగులను బెంచి పట్టుదీసి బట్టలునేసి వీరనగరమున నొక సందులో గ్రిక్కిరిసి యున్న బట్టలవర్తకులకుఁ దెచ్చి యమ్ముచుందురు. దాని పేరు పట్టుబజారు. నవకుమారుఁడు సపరివారముగా నా సందున వెళ్ళెను. ఆసందులో నిరుప్రక్కల రెండు మూడంతస్థుల మేడ లుండెను. ఆ వర్తకులు వీరనగర పరిపాలకుని సగౌరవముగాఁ బలుకరించి యాయన తలపాగమీద బగ్గుండ చల్లి వెండిబుడ్డిలోఁ

బోసిన పన్నీరు జల్లి సుగంధద్రవ్యములతో గుమగుమలాడు తాంబూల మిచ్చిరి. నవకుమారుఁడు పన్నీరు చల్లించుకొని తాంబూలము స్వీకరించి, యొక బంగారునాణెము పళ్ళెములో వైచి వెళ్ళెను.

ఇత్తడిపనివర్తకులను, వడ్రంగులను, కమ్మరిపనివాండ్రను, కమసాలులను, సతోషముగాఁ జూచెను. వారందఱతనిని గౌరవముగ బలుకరించిరి. వీరనగరములో నివసించుచున్న మహమ్మదీయ వర్తకులుసైతము తమ మసీదుగుమ్మముకుముందఱనిలిచి నవకుమారుని బలుకరించి వెండిపళ్ళెములో నొకపట్టుగుడ్డబెట్టి యీసహోలీపండుగలోఁ గొంత జోక్యము గల్గించుకొనిరి. నవకుమారుఁడు వారి గౌరవము నంగీకరించి, వారి పెద్ద ముల్లా చేతిలో నొక బంగారునాణెము బెట్టెను. హిందువులు మహమ్మదీయులుఁ బ్రతిపట్టణమున వైరములేక హాయిగా నివసించుచుండిరి. అక్బరు హిందూమహమ్మదీయులను గలుపఁదలఁచెను. మానసింగు రాజు మహమ్మదీయుల మసీదు నిమిత్తము వీరనగరములో కొంత స్థల మిచ్చెను.

నవకుమారుఁడు సపరివారముగా నింటివైపు మరలునప్పటికి మిట్ట మధ్యాహ్న మయ్యెను. జమీందారీ గృహముయొక్క సింహద్వారము సమీపమున నొక చెట్టుక్రింద, నిద్దరు బాలురు శరీరములు బగ్గుండతో నిండి యెఱ్ఱబాఱియుండ నొక్కటే రాగముతో నేవో పాటలు పాడుచు నాట్యము సేయుచుండిరి. వారి కంఠమాధుర్యము, వారి గాన వైఖరియు నవకుమారునికి నచ్చుటచే నుదయమునుండి పట్టణమంతయు దిరుగుటవలన నాయాసపడి యుండినను వారి పాట వినఁదలఁచి యచ్చట గొంతసే పాగెను.

ద్విపద. పాలించుచున్నాఁడు పాపికంసుండు
నేల క్రౌర్యంబున నిండు తేజమున
నినుపదుడ్డునుబోలు నితని శాసనము

ఘనులు సైతము మ్రొక్కి గ్రహియించుచుండ్రు
అతని క్రూరపుదృష్టి కాఁగఁగలేక
ప్రతిమనుష్యుఁడు జంకి పాఱిపోయెడును. 1

చిరకాల ముండదు చెనటిపాలనము
త్వరితంబ వచ్చెడువాని నాశనము
పాపఁ డొక్కఁడు మున్నె ప్రభవించినాఁడు
ఏపునఁ గసిదీర్చు నితనిపై వాఁడు
అతని కోపముముందు నాఁగలేఁ డితఁడు
పతనంబు నీతండు బడయు వేగంబ. 2

ఆమాట విన్నవాఁ డా క్రూరు డంత
నేమియు శాంతిలే కేడ్చుచున్నాఁడు
పాలుద్రావెడునట్టి పసిబిడ్డలైన
బాలికల నాతఁడు పట్టి చంపించు
తల్లిరొమ్మునుండి దయలేక తీసి
పిల్లల వధియించు భీరుఁ డాతండు
వారి యాక్రందనధ్వనులతో నిండు
ధారుణీగగనముల్ దారుణంబుగను. 3

అప్పుడే పుట్టిన యసురారి రాత్రి
తప్పించుకొనిపోవు దైత్యునిబారి
ఫణిరాజు పడగలు బాలుని గప్ప
తృణమైన నంటదా దేవదేవేశు
యమున మార్గము నిచ్చు నతనిఁ గొంపోవ
క్రమముగాఁ జీఁకటుల్ గాచును వాని
పొలమందు స్థలమందు పోరులేకుండ
వెలయుచు బాలుండు వృద్ధినిగాంచు. 4

పాలించుచున్నాఁడు పాపికంసుండు
నేలక్రౌర్యంబున నిండు తేజమున
నిసపదుద్దునుబోలు నితనిశాసనము
ఘనులు సైతము మ్రొక్కి గ్రహియించుచుంద్రు
పుట్టినాఁడు మురారి భూమిపై నేఁడు
గట్టిదాతనిచేయి కడుతీక్ష్ణణంబు
వచ్చి కంసునిబట్టి వధియింపఁగలఁడు
హెచ్చుగా నీభూమి నేలగలండు.

రెండుజాములగంట కోటలో మ్రోఁగెను. దూరగ్రామములనుండి జనులు గుంపులుగుంపులుగాఁ బట్టణమునకు వచ్చుచుండిరి. అప్పుడు నవకుమారుఁ డేదో యాలోచించుచు నిలువఁబడి యొట్టకేలకు గోకుల దాసుని జూచి యి ట్లనియె—

"ఓయీ! యీ పాట కర్థ మేమి?

"వీరనగర పూర్వసేవకులు వారి పూర్వప్రభువులకు విధేయులై కృతజ్ఞులై యున్నారన్నమాట. ఇందుకు మీరు చిత్తక్షోభ పడనక్కఱ లేదు. ఈ పదియేండ్లలోను వీరు మనమీఁదఁ గుట్రలుపన్నని గడియ లేదు. నేను మేలుకొనియే యున్నాను. దేవరవారు సురక్షితులు."

"ఈ పిల్లలను గురించి యింకను నేను దెలిసికోవలెనని యున్నది. రాజమందిరము నెదుటనే నన్ను ధిక్కరింపుమని వీరినెవరు పంపిరో యరయవలయు. నా మనస్సు చిక్కులి కలతపడియున్నది."

అన్ని ప్రక్కలనుండి పట్టణమునకు వచ్చిన మనుష్యుల గుంపులలోఁ బడి యాపిల్లలు కనఁబడకుండ నెటకోపోయిరి. వారిజాడలు తెలిసి కొనలేము. నవకుమారుఁడు విచారగ్రస్థుఁడై దీర్ఘాలోచనపరుఁడై భవనములోనఁ జరిగెను. విచారముచేత నా సాయంకాలమున జరిగెడు నుత్సవము జూడఁజాలకపోయెను.

౬

వేసవివచ్చి వెళ్ళిపోయెను. శ్రావణభాద్రపద మాసములందు విశేషవర్షములు గురిసి నదులను తటాకములను నింపి వరిపొలములకు జీవనము లొసంగిపెంచెను. హేమలత కిప్పుడు పదమూడవయేడు. అది యౌవనమునకుఁ బ్రారంభవయస్సు, హిందూదేశములోఁ దల్లిదండ్రులు బాలికలను యుక్తవయస్సు వచ్చువఱకు నవివాహితలుగా నుంచరు. కాని నవకుమారుఁడు తన దేవీపురసంస్థానము తనకు ప్రాపించువఱకుఁ గుమారితకు వివాహమహోత్సవము జేయఁగూడదని నిశ్చయించుకొనెను. అతఁడొక కార్యనిశ్చయము జేసికొన్నపిదప నది మార్పుమని నలహాయిచ్చుట కెవ్వరికి శక్యముగాదు.

వివాహము గాకపోయినను హేమలత మునుపటివలె నుల్లాసముగా నినుకతిన్నెలమీఁద నాడుకొనుటకు వీలులేకపోయెను. ఆచారప్రకారము హేమలత యిల్లు గదలిపోక లోపలనే యుండవలసివచ్చెను. మునుపటికన్న శాంతము సౌందర్యము హెచ్చెను. వానితో సిగ్గు కూడ హెచ్చెను. దేవాలయములోఁ బూజసేయుటకుఁగాని, నదిలో స్నానము చేయుటకుఁగాని వెళ్ళవలసి వచ్చినప్పుడు మునుపటివలె నొంటిగాఁబోక తల్లితోఁగలిసి వెళ్ళుచుండెను.

జమీందారీ భవనములోనికి నేకారణముననైన వెళ్ళినప్పుడు దప్ప మఱియెప్పుడు శిరీషుఁడు హేమలతను గలిసికొనఁ జాలఁడయ్యెను. అట్టిసమయము లందతఁడు హేమలతను సమీపించి ప్రేమతో నామె ప్రక్కను గూర్చుండి చేయిబట్టుకొని, దేహారోగ్యమడిగి యెట్లు ప్రొద్దు పుచ్చుచున్నావని ప్రశ్నించి మునుపటి సంతోషకరమైన దినములను గురించి ప్రసంగించి పోవుచుండును. హేమలతయు దృఢశరీరుఁడును శాంతమూర్తియునగు నతనిగూర్చి విని యతని శాంతమును సద్గుణ

ములను బౌరుషాదులను మెచ్చుచుండును శిక్షించుచు చేసుకొనకపోయి నను నతని సత్కులప్రసూతత నామె యెఱుఁగదు సత్కులజాతమునకు యుక్తప్రవర్తనమునకుఁ గనిష్ఠితి నతఁడు పాటించుటకుఁ గోరుచుండును.

నరేంద్రుఁడు హేమలతను దఱుచుగాఁ జూడఁబోవును. అప్పుడామె కెంతో మనోవైకల్యము గలుగుచుండును. అతని మృదుసంభాషణప్రలాపములు విన్నప్పుడామె మొగమెఱ్ఱబాఱుచుండును. ఎన్నోసారు లిసుకతిన్నెలమీఁద నతనిలో నాడుకొన్న యా బాలిక యిప్పుడతనిఁ జూడఁగానే లజ్జావతియై మేలిముసుఁగుతో నగము మొగము గప్పుకొనును. అయినను వానినోటినుండి వెడలు సంభాషణలామె కర్థముగాకపోయినను నతని పన్నుగడలు, వింతమాటలు నామె చెవియొగ్గి వినుచుండును. అతని సుఖవికాసమును నతని నేత్రభాగధేయమును జూడఁజూడ నామెకుఁ దెలియకుండఁగనే యతనిపై నివారింపరాని యొకానొక ప్రేమ పొడమెను.

హేమలతతల్లి స్త్రీసహజమైన తెలివితో నతని ముఖలక్షణములను నతనిహృదయములోఁ బెరుగుచున్న ప్రేమను జాగరూకతతోఁ గనిపెట్టుచుండెను. ఆమె, భర్తతో హేమలతానరేంద్రుల వివాహమునుగూర్చి మాటలాడినపిదప, మరల తద్విషయమై యే ప్రయత్నమును జేయలేదు. నవకుమారుఁడు స్పష్టముగా నామె యాలోచనను నిరాకరింపఁ దలఁచుకొనక తద్విషయమైన సంభాషణమే రాకుండ జాగ్రతపడుచుండెను. దేవీపురము తనయధీనమగు వఱకు నామాట నతఁడెత్తఁదలఁచుకొననే లేదు. తనకు మిక్కిలి ప్రియమైన యా యుభయుల సమాగమము మగని కిష్టములేదని కొన్నికొన్ని సూచనలవల్ల నామె యించుక గ్రహించెను. స్త్రీసహజమైన సూక్ష్మదృష్టితో నామె, మగనికి వేఱుతలంపు గలదనియు, నతఁడది చెప్పసాహసింప కున్నాఁడనియు నామె కనిపెట్టెను.

ఆఁడుదాని కనుమానము కలిగెనా యీ విషయమునఁగలి గూఢార్థ్యము నెక్కుడీయుటకు నామె విశ్రాంతినొందదు. మందమైన పురుష దృష్టికిఁ గనఁబడని జాడలామెకుఁ జూపట్టెను. మగనికి వినఁబడని వార్తలామెకు వినఁబడఁజొచ్చెను. అతని విప్పలేని సమస్యల నామె యవలీలగా గ్రహించుచుండును. కాలక్రమమున మెల్లగా నామె పరిచారికలద్వారమునఁ జేసిన విచారణములవల్లను, నప్పుడప్పుడు పెంకెతనమునకు మోటతనమునకుఁ దావలమైన పెనిమిటి యొప్పుదలలు వలనను, నిజము బైలుపడెను అప్పుడామెకు మహాగ్రహము గలిగెను. కాని, దాని నప్పుడామె యడఁచుకొని పలుకకుండెను. పురాతనసంస్థానమునకు వారసురాలయిన తనకుమార్తెను నిలువ నీడలేని యొకానొక యాశ్రితునకిచ్చి పెండ్లిచేయుట సత్కులప్రసూనతా గర్వముగల యామె మనస్సునకు నచ్చలేదు. అంతలో మాకాలమారియైన గోకులదాసుఁడు తనబిడ్డపెండ్లి విషయమై తనను దనభర్తను నాజ్ఞాపించుట మిక్కిలి యసహ్యముగా నుండెను. ఆమె మొదటినుండియు గోకులదాసు నెఱుఁగును. అందుచే రెండుసంస్థానముల పరిపాలనము నక్రమముగా నాక్రమించుకొని ప్రభువుల గృహకృత్యములలోఁగూడ ననవసరముగా జోక్యము గలుగఁజేసికొనుచున్న యీ వృద్ధజంబుకము యొక్క పన్నుగడలను బ్రతిఘటించుటకై యామె తన మనశ్శక్తినంతయు నప్పుడుపయోగింప నిశ్చయించుకొనెను.

ఈ కుటుంబకలహము నవకుమారునకు దుస్సహమగుటచే నిల్లాలితో నీ విషయమై యతఁడు ముచ్చటింపఁ దలఁచెను గాని యామె తద్విషయమై ప్రసంగింప నిచ్చలేక మాఁగవిమాటల నుత్తరము జెప్పుచుండెను. తనరహస్యమామె దగ్గఱ దాఁగదని యాతఁడెఱుఁగును. కుటుంబములో నప్పుడప్పుడు కొన్నిముచ్చటలు జరిగెను. అందులో నవకుమారుఁడే యోడిపోయెను. మంచివంశమునఁబుట్టి చక్కనిచుక్క

రైన హేమలతను, నగరములో నుండి తీసికొనివచ్చిన యొకనిరుపేద కిచ్చి పెండ్లి చేయుటకు నెల్లుండి ముహూర్తమును పెట్టెను నామె ముల్లుకుల వంటి పలుకులతో జెప్పెను. అప్పలుకు లామెహృదయమును గోసి వేసెను. పెంకెతనము గలవతియని తెలవాఁడయ్యె నతఁడు తనయిల్లాలి మాటపై సరియైనసమయము సేచూచిన గోపాలదాసుఁడు తనకుటుంబము మయగంగలో ముంచుచున్నాఁడని యాపట్టున తలంచెను. కాని యతఁ డట్లొప్పుకొనఁడు కాని నిశ్చయముగా నతఁడు రాత్రులం బండుకొన్న పుడు తన భార్యతో నాలోచనము విని కౌమార్త్ర వివాహము వలన నీరసగర్వదేవప్పరి సంస్థానములకు గలిపివేసిన యెడల బహు ప్రమాణములతో బహుశ్రమలతో ననేకాశాభంగములతో నిండిన తన జీవయాత్ర తుట్టతుదనైన సుఖముగా ముగింపవచ్చునని యతనికిఁ దోఁచుచుండును.

కుటుంబకలహములో శంకించినవాఁడు పరాజితుఁడగును. నవ కుమారుఁడు వెనుకకు ముందుకు నూఁగులాడఁజొచ్చెను. సూక్ష్మదృష్టి గల యతనిభార్య యతని మనోవేదనను గనిపెట్టినట్లు నటించుచుండెను. తాను జయముపొందినను నామె మొగమున నొక్క చిఱునవ్వయినను గనఁబడనీక భావము గప్పిపుచ్చి తనయిచ్ఛానుసారముగానే వర్తింపఁ దలఁచెను. అవసరమైనయెడల కాలిక్రింద పురుగును త్రొక్కినట్లు గోకుల దాసును త్రొక్కి మావలకు వెడల సమర్థురాలనని గూడ నామె నిశ్చయించుకొనెను. ఒకనాఁటి సాయంకాలము భార్యాభర్తలకుఁ దీవ్రమైన వాదము జరిగినపిదప "అయ్యా, సంస్థానవ్యవహారములు మీరు చూచుకొనుఁడు. అది పురుషలక్షణము, సంసారము దిద్దుకొనుట స్త్రీలక్షణము కావున నది నాకువదలిపెట్టుఁడు." అని యామె నొక్కివలికెను.

నవకుమారుఁడు మొగము ముడుచుకొని వెడలిపోయెను. గెలుపు

తనదేయుని భార్య సంతసించెను.

కాని గోకులదాసుని మాయలమూరితన మామె కన్నులకుఁ గట్టి నట్లు కనఁబడుచుండెను. శిరీషుని దేవీపురమునుండి తెచ్చి నరేంద్రుని ప్రక్కను నిలిపినవాఁ డతఁడె శైవలిని హేమలతకు నిరంతరముఁ జెలికత్తెగాఁ జేసినవాఁ డతఁడె. శైవలిని బాలవితంతువై తన సౌఖ్యముల నెల్ల విడనాడి తన చుట్టు నున్నవారి కుపచారము చేయుటలోనే తన జీవిత మంతయుఁ గడపఁ దలఁచుకొని యెంతో యోపికయు నిర్మలచిత్తమును గలిగియుండెను. మన దేశములోని వితంతువుల పావన చరిత్రము లన్నియు నిట్టివేకదా. ఆమె యోగినివలె విశుద్ధచరిత్రయై బోధకురాలివలె జ్ఞానవతియై సోదరినలెఁ బ్రేమాస్పదురాలై యుండెను. ఈమెనే యాయుధముగాఁ జేసికొని గోకులదాసుఁడు వ్యూహము బన్నుచుండెను.

గోకులదాసుఁడు తనవ్యూహమును శైవలినికేగాని, శిరీషునకుఁ గాని చెప్పఁ దలపకపోయినను నప్పుడప్పుడు కొన్ని సూచనలు చేయుచుండును. అవి వారి యిద్దరి మనస్సులలో నాశలఁ బెంపఁ జొచ్చెను. నవకుమారుని పూర్వులు బలవంతముగాఁ ద్రోసివేయుటచేతనే రాజ్యము లేకపోయెనుగాని, లేనియెడల శిరీషుని పితృపితామహులే రాజ్యాధికారులై యుండి యుందురని యా పూర్వులచరిత్రము లతఁ డప్పుడప్పుఁ డా బాలునితోఁ జెప్పుచుండును. మఱియు వివాహసంబంధములచేఁ బూర్వము గోలుపోయిన సంస్థానములకు నదృష్టవంతులైన యనేక రాజకుమారులు మరల నధిపతులైన కథలను నతనికిఁ జెప్పుచుండును. గోకులదాసుఁడు తన యజమానుఁడైన నవకుమారుని గుఱించి చెడ్డ మాట యొకటియుఁ జెప్పక "యతనికిఁ బుత్రసంతతి లేదు. వాని కష్టములు దేహారోగ్యము చెడఁగొట్టి మనోవైకల్యము గలుగఁజేసినవి. యెవరో తగిన కుమారవీరుఁడు వచ్చి యదృష్టవశమున దేవీపురరాజ్య

మనుభవింపఁగలఁడు సుమీ” యని మాత్రము చెప్పుచుండును. దేవీ పుర రాజబంధువుఁ డెవఁడో యొకఁడు దాని గౌరవముఁ గాపాడఁగల వాఁడు—తద్వంశమం దభిమానము గలవాఁడు—దాసిని దన యధీ నముఁ జేసికొని దాని కీవి నిలిపి పరిపాలించునట్లు భగంతుఁ డనుగ్ర హించుఁగాక యని యెడనెడ దీవించుచుండును. ఆ మాటలు శిరీషుని మనంబున ముద్రితము లయ్యెను. అగుటయు నతఁ డాస్థానమునకు నర్హతయు సామర్థ్యముగలవాఁడై నట్లు తన్ను భావించుకొని, దైవము తన కది విధించినట్లు విశ్వసించెను. అతని మనస్సులో నొక నూతన భావ ముదయ మయ్యెను. రాజభవనములో హేమలతను జూడఁబోయి నపు డెల్ల నతని మొగమున నొక వింతవికాసము వింతచెలువము స్ఫురింపఁ జొచ్చెను.

గోకులదాసుని భావగర్భితవచనములు శైవలినిమీఁదఁగూడ పని చేసెను. అక్కచెల్లెండ్రు తరుచుగా నన్నదమ్ములకుఁ దోడుపడుట సహ జముగదా! స్త్రీలు ప్రాయికముగా గృహములకు భాగ్యములు సమ కూర్చుచుందురు. ఆ ప్రాంతముల శిరీషునికంటె నుత్తమబాలుఁడు లేఁడు. పౌరుషశాలియు, దృఢసంకల్పుఁడు నైన యతని ముందఱ వేగిర పాటును జంచలస్వభావమును గల నరేంద్రుఁడు కొరమాలినవాఁడై యుండును. తోఁబుట్టువు చేయవలసిన పని యంతయు శైవలిని చేసి సోదరు నుద్ధరింప సమకట్టెను. దేవీపురసంస్థానము పరులపాలుగాకుండ నామెయే రక్షింపఁదగిన దయ్యెను. ఇట్లు స్త్రీలు సంస్థానముల నుద్ధరిం చిన కథ లనేకములు మన దేశమునఁ గలవు.

శైవలిని కీ సూచనలు చాలును. ఆమెకు శిరీషునిమీఁద మిక్కిలి ప్రేమ. భావికాలమున గొప్పదశ ప్రాపింపఁజేయు తలపుతో నామె హేమలతను శిరీషునకుఁ బెండ్లి చేయవలెనని సంకల్పించెను. ఆమె హేమలతతో సాయంకాలములందుఁ జాలసేపు చెలువుగట్టుననో

దేవాలయమువద్దఁ గూర్చుండి మాటలాడుచుండును. ఆ సమయమున నామె తన పూర్వుల శౌర్య సాహసకృత్యములను, దేవీపురముయొక్క వైభవమును, సవతి తమ్ముని విశ్వాసఘాతుక ప్రవర్తనయును గురించి యంతయు లేకుండఁ బ్రసంగించుచుండును. ఆ కథలను హేమలత మిక్కిలి తమకముతో వినుచుండును. అత్తఱి శైలేషుని గంభీరవిగ్రహ మామె మనోనేత్రము నెదుట స్ఫురద్రూపముతో గనుపడుచుండును. ప్రతిదినము రాజభవనములో నేమి జరుగుచున్నదో యదియెల్ల గోకులదాసుఁడు తప్పక తెలిసికొనుచుండును. తెలిసికొని కార్యసిద్ధి తన చేతిలోనె యున్నదని మురియుచుండును.

అది చతురంగపు టాటవలె నుండెను. రాజు బలహీనుఁడు. తక్కిన బల మతనిని రక్షింపవలెను. రాణి బలముగలదైయై రంగమున బ్రకాశించుచుండెను. కాని, ఎట్లుకూడ చేయవలసిన పని యుండెను.

ఒకనాఁటి సాయంకాలమున హేమలత శైవలినిగూడి తోటలోని సరస్సుగట్టునఁ గూర్చుండ నరేంద్రుఁ డొప్పటివలె హఠాత్తుగా నక్కడికిఁ బోయెను. శైవలిని లేచి యితనిఁ బలుకరించెను. హేమలత సిగ్గునఁ దల వంచుకొనెను.

కొంతసేపు ఒకరితో నొకరు చాల మాటలాడక యుండిరి. శైవలిని సహజ మృదుస్వరముతో "కుశలమా? నరేంద్రుఁడు! కొలఁది కాలములోనే నీసంస్థానము నీ కప్పగింతురని విని చాల సంతోసించుచున్నాను. నీవు జనులకు దేవుఁడువలె నున్నావు. పూర్వము మాతాతగారు చేసినట్లు నీవును జనరంజకుఁడవై పరిపాలింపుము." అని పలికెను.

"అక్కా, శైవలిని! అవసరికాదు. సోమరిపోతులు వట్టివాడుకలు వేయుదురు. సంస్థానమెప్పుడు నాకప్పగింతురో నే నెఱుఁగను. సంస్థాన మింతలో నప్పగించుట నాకిష్టము లేదు. ఏమన మీరు దేవీపురము వెళ్లిపోదురు. అందువల్ల మీ యదృష్టముగూడ—"

నరేంద్రుఁడు మాటపూర్తిచేయక పోయెను. కాని శైవలిని యాతని యభిప్రాయము దెలిసికొని యిట్లనెను—"శైవలినీతటము నీకు నగరమునకు దూరముగా లేదు. తమ్ముఁడు! అందుచే నెప్పుడు తలఁచినను గలిసికొనవచ్చును కాని శైవలినీతటమునుండి ... వెళ్లవలసియుండె గదా. ఇప్పుడు కలిసికొనుటగాని, మనము మనయాత్మలు ... యోజనములు వేఱుగనే యున్నావుగదా!"

"అక్కా, శైవలిని! మనము నరల వేఱుగా నుండవలెనా? అది యవసరమా?"

"తమ్ముఁడు? నే నాఁడుదానను గదా. మనవారు లాలోచించవలసిన సంగతులు నాకెట్లు తెలియును? కాని దేవిపుర ... నా ప్రచరిత్రము, గొప్ప సాంప్రదాయములు గలవారియు, నారాజవంశమునఁ బుట్టినమగ పిల్లలు నాఁడు బిడ్డలుగూడ, వారిసాంప్రదాయముల ననుసరించి నీ ... కుటుంబగౌరవము నిలుపుకొనవలెనని పెద్దలు చెప్పగా వినుచుందును. చేఁపలు గాలిలోఁ బ్రతుకలేవు, పక్షులు నీటిలో జీవింపలేవు."

అట్లు పలుకుచు లోపలినుండి యెవరో పిలుచుటచే నేదోపనిచేయుటకై శైవలిని హేమలతా నరేంద్రులను విడిచివెళ్లెను. శైవలినిసంభాషణములలోఁ గట్టకడపటి మాటలయర్థము నూహించి నరేంద్రుఁడు కొంచెమాలోచించుచుఁ బలుకకుండెను.

ఆకాశమునఁ జంద్రమామ వెలుఁగుచుండెను. అతని ప్రతిబింబము నీటిలోఁ దళతళలాడుచుఁ గదులుచుండె. మలయమారుతము చెట్ల మీఁదుగా వీచెను. వృక్షములనుండి పొగడపుష్పములు రాలెను. ఈస్థలమునందే నరేంద్రుని నోటనుండి చిన్నప్పుడు హేమలత విన్న వీర రసప్రధానములైన కథలప్పుడామెకు జ్ఞప్తికివచ్చెను. వచ్చుటయు నామె నరేంద్రుని మొగముకేసి నిమ్మళముగా ... తోఁ దేరిపాఱఁ జూచెను. నరేంద్రుని సుందరవదనము వెన్నెలసోకుటచే వింత చెలువము

దాల్చెను. అతఁడాకాశమువంక జూచుచుండఁ జిత్రమైన కథయొకటి యతనిమనంబున స్ఫురించెను.

"హేమలతా! నీవు చిన్నపిల్లవైనప్పుడు నేనిక్కడఁ గూర్చుండి సాయంకాలములందు ప్రొద్దుపోవువఱకు నీకెన్నోకథలు చెప్పుచుం డెడివాఁడను. అవి జ్ఞాపకమున్నదా?"

"అదే నేను దలఁచుకొనుచున్నాను." అని కొంచెముసిగ్గుతో హేమలత యుత్తరము చెప్పెను.

"నీవిప్పుడు చిన్నపిల్లవుకావు. అందుచే నీవిప్పుడు నాకథలు వినఁ దలఁచుకొనలేదా?"

"నరేంద్ర! నీకథలు విననలెననేయున్నది." అని హేమలత బదులుపల్కెను.

'అట్లయినవిను! ఆ ధ్రువనక్షత్రమును జూచుచున్నావా?'

"చూచుచున్నాను. అదిగో నా చెట్టునకుఁ గొంచెము పైగా నున్నది."

"అది ధ్రువనక్షత్రమందురు. ధ్రువమనగా నిత్యమై సత్యమైనది."

"అదేందుచేత నిత్యమై సత్యమైనది?"

"హేమలతా! ఆనక్షత్రముతో మనపూర్వులొక కథ ముడిపెట్టి నారు."

"ఆ కథ నాకుఁజెప్పు" మని బాలికాసహజమైన కుతూహలముతో హేమలత యడిగెను.

"ఒకరాజున కిద్దరు భార్యలుండిరి. ఇద్దరికిఁ జెరియొకకొడుకు బుట్టెను. చిన్నభార్యమీఁదను నామెకొడుకుమీఁదను రాజునకిష్టము. పెద్దభార్యను, కొడుకును రాజు నిరాదరించెను. అందుచే నామె యేదో మూల బిడ్డనుబెట్టుకొని కూర్చుండి దుఃఖపడుచుండును. తల్లి యెందు కేడ్చుచున్నదో కొడుకెఱుఁగడు.

“అతఁడు కొంచెము మెలఁకువ తెలిసినవాఁడైన రాజునకుఁ దనమీఁద నిష్టము లేదనియుఁ, సవతిసోదరులు రాజ్యభాగస్థులైరనియు నామెకొడుకుతోఁ జెప్పెను. ఆమాటలు విని కోపించుకొని యేడ్చుచు తన తల్లికడకుఁ బోయి “అమ్మా! ఈ రాజులందఱికంటె నేనెక్కువ తేజశ్శాలినయ్యెదను, నాకు రాజ్యమువద్దు. మహాయోగినయ్యెద” నని చెప్పెను.

“ఆబాలకుని పేరు ధ్రువుఁడు. అతఁడే నిత్యుఁడు సత్యవ్రతుఁడు. అతఁడు పిమ్మట నరణ్యమునకరిగి రాజులకు రాజైన దేవదేవునిగూర్చి మహాతపస్సుచేసి లోకమందెల్లగౌరవనీయుఁడై మహానుభావుఁడయ్యెను. మహారాజులు వాని యడుగులకు మ్రొక్కి పూజించిరి. అతఁడు మృతినొంది నక్షత్రమయ్యెను అతఁడాకాశమునందు నిత్యుఁడు సత్యవంతుఁడై ప్రకాశించుచుండును.”

అది విని “నరేంద్రా! ఇది మనోహరమైన కథ. నేను దేవీపురము వెళ్లినతరువాత నైన మీనక్షత్రమునుజూచినప్పుడెల్ల నీకథను స్మరింతును.”

“హేమంత! ఇది మనోహరమైన కథ. ఇందులో జిక్కని నీతి గలదు. నిత్యమై సత్యమైన యానక్షత్రమును నీవు ప్రతి రాత్రియుఁ గనిపెట్టి చూచుచుండుము. నీవు దేవీపురము వెళ్లనక్కఱలేదు.”

౭

వానలు వెనుకబట్టినవి. శరత్కాలము ప్రాపించినది. ఆకాశము నీలమై నిర్మలమై యుండెను. వానలు విరివిగాఁ గురిసి మాలిన్యము గడిగివేసి జీవనములిచ్చుటచేఁ బల్లెటూళ్లు పచ్చని చీరలు ధరించినట్లుండెను. వానకాలమున గట్లుదాసిన యేరు వేఁపుతగ్గి యెప్పటివలె నుండెను. పట్టణముల చుట్టును బల్లెల చుట్టును బొలములు పండనారంభించెను.

హిందూదేశమంతటను సింహవాహనయైన దుర్గాదేవి పూజలు శరత్కాలమున జరుగును. అవి శరదుత్సవములు. ఈ యుత్సవమునకు జ్యోతిషశాస్త్రసంబంధము కొంతగలదు. ఈ ఋతువున సూర్యుఁడు సింహరాశినుండి కన్యారాశికిఁ బోవును. కాని యీ జ్యోతిషశాస్త్ర సంబంధము జను లెఱుఁగరు ఎఱుఁగకయే తమకుఁ బంటలు పుష్కల ముగా నిచ్చునని భక్తితో దుర్గను బూజింతురు. రాజపుత్రులు, మహా రాష్ట్రులు మొదలగు యుద్ధప్రియజాతులు శరదుత్సవములో ఖడ్గ మును బూజింతురు. శీతకాలమున దండయాత్రలు చేయఁదలఁచినవారీ యుత్సవములలోఁ దమ సైన్యములను జక్కఁజేసి కొందురు. ఉత్తర హిందూస్థానమందంతట నీ యుత్సవములు గొప్ప పండుగులై వేడుక లకు విడుదులై నృత్యగానములతో వినోదములతో నిండియుండును.

ఈ యుత్సవములలోఁ గట్టకడపటిదినము వచ్చెను. వీరనగరమున దేదీప్యమాన ప్రభలతో సూర్యుఁడు ప్రకాశించెను. ఉత్సవసమయ మునఁ దనభక్తి ప్రపత్తులు దెలియఁజేయుటకై గోకులదాసుఁ డాదిన మున మొట్టమొదట రాజభవనమును జేరెను.

అప్పుడు నవకుమారుఁ డతని కిట్లనియె—

'గోకులదాసుఁడ! నీవు భక్తివిశ్వాసములు కలిగి చిరకాలము శ్రమపడితివి. కాని, నీ సంకల్పము నీ చేతఁ జిక్కలేదు.'

'నా తాత తండ్రులు చేసినట్లె నేనును కొలువుచేసినాను. నా సంకల్పము నాచేతఁ జిక్కినది.'

"ఆరుమాసములనుండి నీవిట్లె యనుచుంటివి. మానసింగు శత్రువులైన యాఫ్ఘనులతోఁ బోరాడుచు నోరిస్సాలో నున్నాఁడు. అతని కానంగో మనపని కట్టిపెట్టి నిద్రపోవుచున్నాఁడు."

"అయ్యా! ఒరిస్సా జయించినాఁడు మానసింగు. ఆ దేశము నక్బరు సామ్రాజ్యములోఁ గలిపినాఁడు. ఇఁక రాజమహలునకు వచ్చును.

రాఁగానే యతని కానంగో వేసిన యుత్తరువులను స్థిరపఱచును."

"వేసిన యుత్తర్వులా?"

"ఆఁ వేసిన యుత్తరువులే. వేఁనాఁడుగాని వెల్లడిచేయ లేదు. ఈ యుత్సవము ముగిసినతోడనే దేశవాసు లీపుణ్యములో సుఖముగా నుందురు."

"నీవు విశ్వాసముగల సేవకుఁడవు. కార్యము లెస్సగాఁ జేసితివి. మానసింగు నా యుత్తరువులను స్థిరపఱచునుగా? మానసింగునకు వీరనగరకుటుంబము మీఁఁద నెక్కుడు పక్షపాతముగలదు. నరేంద్రుని తాతగారిచర్యలు నాని కతిసహాయకారులుగా నుండును. అందుచే నా మనస్సు శంకించుచున్నది."

"మానసింగు వీరనగర రాజకుమారుని గుఱించి యాలోచించుటకు వీలులేనంతగాఁ బనితొందర యాతని చేతిలో నున్నది. అతఁడు రాజమహాలు పట్టణమును బంగాళాదేశమునకు నూతన రాజధానిగా నేర్పఱచినాఁడు. కోటలు బురుజులు గట్టి దానిని బలపఱచుచు చున్నాఁడు. రాజపుత్రస్థానములోఁ దనరాజధానియైన యంబరుపట్టణమును దృఢపరచినట్లె దీనిని గూడ సురక్షితము చేయ దలఁచు కొన్నాఁడు."

"గోకులదాసుఁడ! అతఁడెంత మహాయోధుఁడో యంతటి బుద్ధిశాలి. అతఁడీప్రాంతమును విడిచి వెళ్లులోపుగా నక్బరుచక్రవర్తి సామ్రాజ్యమును విస్తరించి స్థిరపఱుచును. ఆఫ్ఘను పరిపాలకుల దినములస్తమించినవి."

"మానసింగు పని పూర్తియైనప్పుడు సగము సగముజేసి విడువఁడు. వాడుక యెంతవరకు నిజమో తెలియదుగాని, బంగాళములోఁ దన యధికారమును స్థిరపఱుచుకొనుటకు నిక్కడి కన్య నొక దానిని గూడ జూచుచున్నాఁడట!"

"తన కుమారుడైన జగత్సింగు వీరునకా!"

" కాదు. తనకే. "

ఓహో ! గడ్డము మొలసిన రాజపుత్రుడు తళుకుకన్నులు గల చిన్ని బెంగాలీకన్య మందహాసముల నపేక్షించుచున్నాడా ? "

" అయ్యో ! యిట్టి కార్యములు లనేకములు పూర్వము జరుగలేదా ? పొడుగు గడ్డములుగల మహావీరులయినను స్త్రీల వలలలోఁ బడక పోరు. ఎవరిపేరులు విన్నంతమాత్రమున జనులు గడగడ వడఁకుదురో యట్టి మహావీరులు నైశ మంతఃపురములలో వాల్గంటులచేతి కీలుబొమ్మలై మెత్తని పట్టుసంకెళ్ళతో బంధింపఁబడిరి. "

ఆమాట గోకులదాసుఁడు నవకుమారు నుద్దేశించి పలుకనిపోయి నను నది తనకుఁ దగిలినట్లె నవకుమారుఁడు భావించెను.

" గోకులదాసూ ! నీవు మూర్ఖుఁడవు. వృద్ధుఁడవు. మానసింగు రాజెవతెను బెండ్లియాడును ?"

" మానసింగు కచ్చిబిహారు మహారాజు తోఁబుట్టువును దన రాణివాసములోనికిఁ దీసికొనిపోయి, యుత్తరబంగాళమునఁ దన యధికారము వృద్ధిజేసికొనుటకు, నక్బరుచక్రవర్తియొక్క సామ్రాజ్యమును దృఢపరచుటకు యత్నించుచున్నాఁడు. క్రొత్త శత్రువులు సముద్రము మీఁదినుండి వచ్చి బంగాళముపై దండెత్తుచున్నారు. అందుచేత నా రాజున కన్నిప్రక్కలనుండి సాయము కావలసి యున్నది. "

" ఔనౌను గోకులదాసు ! సముద్రముమీఁదనుండి క్రొత్తగా నోడ దొంగలు గుంపులు గుంపులుగా వచ్చి మన రేవుపట్టణములను దోఁచుకొనుచున్నారని కింవదంతులు వినవచ్చుచున్నవి. వారినుగూర్చి నీకేమైన నిశ్చయమైన వార్త తెలిసినదా ? "

" వాండ్రు సముద్ర ద్రిమ్మరులు. మిక్కిలి క్రూరులు. ఎంతో దూర దేశమునుండి వచ్చినారు. తమ దేశము 'పోర్చుగల్' అని వారు చెప్పుదురు. ఈజాతివారికి నాయకుఁడైన సబాస్టియన్ గొంజలిస్ అనువాఁడు

గంగానదీముఖద్వారమున నున్న ద్వీపము నొక దానిని జయించినాం డని విన్నాను. వారిజాతిలో మఱికొందఱు హుగ్లీ రేవుపట్టణమును బట్టుకొని బలపఱిచి యీ దేశస్థులను దమ మతములోం జేరు మని నిర్బంధించుచున్నారఁట."

"గోకుల! ఇది చాల కఠినమైన వార్తయె. మానసింగు రాజునకు అఫ్ఘనులొక్కరే గాదు శత్రువులు. వీరు గూడను."

"నేలమీఁద నాఫ్ఘనులు మాత్రమే శత్రువులు. ఈ సముద్రశత్రువులు సముద్ర మెంత విరివిగా నున్నదో యంత విరివిగా నున్నారు. పోర్చుగీసులు ప్రతి రేవు పట్టణమున గుంపులు గుంపులుగా జేరి మన హిందూపడుచులను దొంగతనముగాం దీసికొనిపోయి వివాహమాడి మనవాండ్రను వారి మతములోం గలుపుకొనుచున్నారు. కాని యింకను దూరదేశములనుండి యితర జాతులవారుగూడ వచ్చుచున్నట్లు విన్నాను. ఆ దేశముల పేర్లు హాలండఁట, ఇంగ్లాండఁట. వారునువచ్చి సముద్రముమీఁది యధికారమునకై పోర్చుగీసువారితోం బోరాడుచున్నారఁట."

"గోకులా! ప్రపంచము మన మనుకొన్న దానికంటెం బెద్దదేగదా. ఈ జాతులవారందఱు మన దేశముమీఁద వచ్చి పడనేల ?"

"ప్రతి సంవత్సరము శీతకాలమున నిస్సారమై మంచుతోం గప్పబడి యుత్తరదేశమునుండి పక్షు లాహారము నిమిత్తము గుంపులు గుంపులుగా మన దేశమునకు వచ్చుచుండును. అలాగే కూఁడుగుడ్డలు దొరకని పశ్చిమఖండములనుండి యితరజాతులవారు మందలు మందలుగా ధనము నిమిత్తము వాణిజ్యము నిమిత్తము ప్రశస్తమైన చేతిపనుల నిమిత్తము మన దేశము వత్తురు."

"కాని, గోకులా! ధనముకంటె వాణిజ్యముకంటె వారు మఱియొక కోరిక మనస్సులోం బెట్టుకొని వత్తురు. అది యేదనఁగా దేశము

సంపాదింపవలెనని."

"అక్బరుచక్రవర్తి వల్ల సంపాదింపఁబడి, మానసింగు మొదలగు మహాశూరులవల్ల సురక్షితమై ప్రపంచమునందెల్ల మిక్కిలి గొప్పది యైన యీ సామ్రాజ్యమున, నీ దేశద్రిమ్మరులు దేశము సంపాదించి రాజ్యములు స్థాపించుట కెంతమాత్రము నవకాశములేదు.

"గోకుల! రాజవంశములు బైలుదేఱవచ్చు; నడిపోవచ్చు. అక్బరుయొక్క పుత్ర పౌత్రులకు నియంత తెలివిగలవారు గాకపోవచ్చును. ఆఫ్ఘనుల వద్దనుండి మొగలాయీలు రాజ్యము జయించి తీసికొనినట్లె యీ సముద్రజాతులు గూడ మొగలాయీలనుండి దేశములు దీసికొన వచ్చును."

"అయ్యా! యిప్పుడున్న వ్యవహారములే నాకుఁజాలును. సముద్ర జాతులువచ్చి మన దేశము పాలించువఱకు నేనుండను. ఆ కాలములు పండి కోతకువచ్చులోపుగా దేవర వారు దేవీపురిసంస్థానమును బాలించు చుందురు."

ఆనాడు శుద్ధదశమి. శరదుత్సవమున నదే కడపటిదినము. భక్తులు ప్రతిదేవాలయమునఁ బూజలుచేసిరి. భాగ్యవంతుల యిండ్లలోఁగూడ పూజలు జరిగెను. మంచి మంచి దుస్తులు ధరించుకొని మనుష్యులు పెక్కండ్రు పల్లెలనుండి యుత్సవముజూడఁ బట్టణమునకుఁ బోయిరి. వేల కొలఁది స్త్రీలు ప్రాతఃకాలమున గంగానదిలో స్నానము జేసిరి. వందల కొలఁది పిల్లలు మంగళవాద్యములతో నూరేగిరి. ఊరంతయు మిక్కిలి సంతోషపరవశమై యుండెను.

ఉత్సవము జూచుటకై వచ్చిన వేన వేలు జనులకు నవకుమారుఁడా నాఁటి మధ్యాహ్నమున గొప్ప విందుజేసెను. వానలు వెనుకబట్టిన తోడనే బంగాళమందలి నదులలో నీరు నిండుగా నుండుటచే రైతులు పెక్కండ్రు నావషికారు చేసిరి. సన్నముగాఁ బొడుగుగా నుండునట్టి

నావలు మంచిదశ కలుగునట్లు నిర్మింపఁబడును. పరియాణుగుడు మనుష్యులు తెడ్లువేసి వాటిని నడుపుదురు. నదియందు వీలులేనంత వేగముతో నవి నీటిపై నడుచును. పొగయోడలు రాకమును పూర్వానవలే సాటిలేని వేగముతోఁ బ్రయాణము చేయుచుండెను. ఈనావపరీక్షలలో పల్లెలు పల్లెలతోను, పట్టణములు పట్టణములతోను బోటీచేయును. ఆ పోటీలలో నావకళాసుల యుత్సాహమును, నావపందెములను జూచుటకు వచ్చెడు వేలకొలంది జనుల యుత్సాహమును వర్ణింప నలవిగాదు.

దుర్గాపూజా మహోత్సవముల కడపటిదినమున నిట్టినావ పోటీలు వీరనగరమున జరుగుట చిరకాలమునుండి యాచారము. నవకుమారుఁడు తాను వీరనగరమున నుండుట కదే కడసారి యగుటచే నా సంవత్సరమున నుత్సవములు నావ పోటీలు మున్నెన్నఁడు లేనంత వైభవముతో జరిపించెను.

మధ్యాహ్నము పెంపలకడ గంగానది తూర్పుగట్టు రమారమి యిరువదివేల జనులతో నిండియుండెను. వీరనగర మా ప్రక్కనే యున్నది. ప్రేక్షకులలో గొప్పవారి నిమిత్తము పందిళ్లు వేయఁబడెను. వీరనగర రాజకుటుంబ స్త్రీల నిమిత్తము నాలుప్రక్కలఁ దెరలతో నమర్పఁబడిన పందిరి వేయఁబడెను.

వీరనగర దేవీపుర సంస్థానములలోని పదియారు గ్రామములనుండి పడవ నడుపుటలోఁ బేరెన్నికగన్న నట్టికళాసులు గల పదియారు పడవ లేటిరేవులో నిలిచెను. పడవలాకారమునను, పొడవు వెడల్పులను నసమానములై యుండెను. ఒక్కొక్కదాని కిరువదిమంది కళాసు లుండిరి. వారుగాక వేరొక చుక్కానిపట్టువా రుండెను. ఈపోటీలను విచారించి న్యాయము చెప్పుటకు నవకుమారుఁడు నేర్పఱుపఁబడెను. వీరనగరరాజకుటుంబములోఁ జేరి మరియాదగల యిద్దరు పెద్ద మనుష్యులను నవకుమారుఁడు తన సహాయార్థమై నిలుపుకొనెను.

నవకుమారుఁడు గృహము వెడలకమునుపే భార్యను గలిసికొని ప్రత్యేకము స్త్రీలనిమిత్తమై యొకపందిరి వేయఁబడినదనియు, నక్కడ మంచి యేర్పాటులు చేయఁబడినవనియుఁ జెప్ప నామె యిట్లనియె—

"మా మాట జ్ఞాపకముంచుకొని దయతో నీ యేర్పాటు చేసినందుకు మీకు వందనములు. ఆ తోటీలు మేము సంతోషముగాఁ జూచెదము. హేమలతకు నవి యెంతో ప్రియమైనవి. చిన్నప్పుడామె నావమీఁకాగు వెళ్లుచుండెడిది. అప్పుడు నరేంద్రుఁడు తెడ్డు వేయుచుండెను."

"నీవు చాలా తెలివిగలదానవు. నీవు చేయఁదలఁచుకొన్న పని మాన్పఁగలవారెవ్వరులేరు. మన ప్రయత్నములు ఫలించినవి. ఈపండుగలు తరువాత మనము దేవీపురము వెళ్లుదుము. వీరనగర సంస్థానము బాలించుటకుఁ జక్రవర్తి యొక్క యుమలుదొరను పంపును."

"అట్లయిన నరేంద్రుఁడు యుక్తవయస్కుఁడగు వఱకు మనవద్దనే యుండును గదా?"

"నవకుమారుఁడు తనకుఁదానె యజమానుఁడు. అతఁడు దేవీపురము రాదలఁచుకొన్న పక్షమున మనము రానీకపోము. గొప్పకుటుంబములోఁ బుట్టినపిల్లవాఁడు మనయింటి కతిథియై రాఁదలఁచుకొనెనేని మనము తలుపులుమూసివేయ కతనికి స్వాగతమిచ్చెదము."

అనవుడు నామె "అదేచాలు! తక్కినపని నాఁడుదాని తెలివితేటలే చక్కఁబెట్టు" నని లోలోపల ననుకొనెను.

నవకుమారుఁడు తనలో నిట్లనుకొనెను—

"ఈమె మిక్కిలి తెలివిగలది. ఈమెను ప్రతిఘటించుట యసాధ్యము. ఆమె సలహా మిక్కిలి మంచిది కాదనఁజాలను. గోకులదాసుఁడు పెద్దవాఁడు నమ్మదగిన సేవకుఁడు. మాయాలువన్నటులో నసమానుఁడు. గుడ్లగూఁబకు పట్టపగటి సంగతి దెలియనట్లే, సంసారము లోనుండు నధికబాధకము లతనికిఁ దెలియవు. మానసింగు కచ్చిబిహారు

రాజుల యాఁడుపడుచును జేఁపట్టునని నాతోఁ జెప్పెను. మానసింగు తెలివిగలవాఁడు. తాను చేయఁదలఁచుకొన్న పనిలో సాధకబాధకములతనికిఁ దెలియును. బంగాళాదేశమంతయు నతని యేకఛత్రముక్రిందఁ దీసికొనివచ్చి సామ్రాజ్యములోఁ గలుపఁదలఁచుకొన్నాఁడు. మా రెండు సంస్థానముల గూడ సంబంధ బాంధవ్యములచేఁ గలసిన బాగుండును."

సూర్యాస్తమయమునకొక గంటముందుగాఁ బ్రయత్నములన్నియుఁ బూర్తియయ్యెను. స్త్రీలు చక్కఁగా నలంకరింపఁబడిన నావికామందిరిలోఁ గూర్చుండిరి. గొప్పవారును ధనవంతులును నర్తకులు పట్టుబట్టలు జరీపట్టలు గట్టుకొని నవకుమారుని చుట్టు నిలిచిరి. ఇరువదివేల మందిమనుష్యులు నదియొడ్డునఁ జేరి పడవపందెములను మిక్కిలి శ్రద్ధతో రెప్పవాల్పక జూచుచుండిరి. పడవకళాసులు దేశములో నెల్లనారితేరిన వారు. వారి విశాలవక్షస్థలములు, భుజములు వారిబలమును, నోపికను సూచించుచుండెను. వారి బాహుదండములు గట్టి యినుపగడెలవలె నుండెను.

వీరనగరసంస్థానపు నావలలో మంచి పడవ నొకదాని నేరుకొమ్మని నవకుమారుఁడు నరేంద్రునితోఁ జెప్పెను. దేవీపురసంస్థానపు నావలలో మంచిదాని నేరుకొమ్మని శిరీషునితోఁ జెప్పెను. ఆ రెండుపడవలపోటీయుఁ జెట్టచివర విచారణచేసి గెలుపెవరిదో నిర్ణయించుపని నవకుమారుఁడు తనమీఁదఁబెట్టుకొనెను. ఈయేర్పాటు నందరు భళీ యని మెచ్చిరి. శిరీషుఁడు తనకు సహజమైన శాంతగంభీరభావములతోఁ దనకార్యమును జేయుచుండెను. నరేంద్రుఁ డుత్సాహపూరితుఁడై సంభాషింపఁ దొడఁగెను.

దేవీపురనావలు ముందు పరుగెత్తెను. పడవలు పోటీనిమిత్తము పోవలసిన దొకమైలుదూరము. పడవ లెక్కడాఁగిపోవలెనో యక్కడ

నొక స్తంభము పాతఁబడెను. పడవ లెగువనుండి దిగువకు నడుమ వలసియుండెను. ఆస్తంభము నవకుమారుని పందిరి కెదురుగా నాటఁబడెను. నరేంద్ర శిరీషులతని ప్రక్కనే గూర్చుండిరి. పందెములు మొదలు పెట్టగానే నరేంద్రుడెంతో యుద్రేకముతో గంతులు కేకలు వేయ నమకట్టి శిరీషుఁడు వానినెంతో ప్రయత్నముతో నివారించెను.

దేవీపురనావలు విజృంభించి బైలుదేఱి గట్టునున్న వారికి మైలు దూరమునందుండుటచే మొదట కనఁబడక క్రమక్రమముగా నల్లని మచ్చలవలె కనఁబడుచు, దగ్గరకు వచ్చినకొలఁది స్పష్టముగా కనఁబడెను. తెడ్లచప్పుడు, కళాసులపాటలు క్రమక్రమముగా వినఁబడెను. జండాలు కనఁబడగానే గట్టుననున్న జనులు నంతోషాతిశయమునఁ జప్పటులుకొట్టి కేకలువైచిరి. మొట్టమొదటిపడవ మెఱుపుమెఱసిన తెఱంగున ఱివ్వున గమ్యస్థానముఁ జేరెను. అదిచూచి నవకుమారుఁడు తన యాసనమునుండి లేచి చిరకాలము దేవీపురసంస్థానమును భక్తివిశ్వాసములతోఁ గొలిచిన యొకసేవకుఁడు చుక్కానుపట్టుచుండుటచేఁ జూచి సంతసించి గెలుపొందిన పడవవాండ్రను బహూకరించెను. నవకుమారుని పందిరిలో నున్నవారందఱు సంతసించిరి. అంతఃపుర స్త్రీలు గూర్చున్న పందిరిలోఁ గూడ సంతోషము మిక్కుటమగుటచే దాని చిహ్నలు కనఁబడెను. అప్పుడు నవకుమారుఁడు చుక్కానుపట్టువానిం జూచి యిట్లనియె—

"నీవు నావ మిక్కిలి బాగుగా నడిపితివి. నేను నిన్ను పూర్వము దేవీపురములోఁ జూచినప్పుడు నీ భుజము లెంతబలిష్ఠములుగా నుండెనో యిప్పుడు నంతబలిష్ఠములుగానే యున్నవి. బలమేమియుఁ తగ్గలేదు."

అనవుడు నతఁడు మిక్కిలి వినయముతో నిట్లనియె—"నా ప్రభువుగారి దర్శనమే మాకుజయము."

"నీవే గెల్చితివి. నేను సరిగా తీర్పుచెప్పిన పక్షమున బహుమానము వీరనగరమునకు వెళ్లదని చెప్పవలయును. నీవు శిరీషునివద్దకు బొమ్ము. ముందుగా గమ్యస్థానము చేరిన పడవపేరతఁడు చెప్పును."

శిరీషుడు గెల్చిన పడవపేరు కనుఁగొనుటకు వెళ్లెను. కాని, నరేంద్రుని కన్బొమలు విషాదమును సూచించెను "నవకుమారుఁడు మధ్యవర్తియు, విచారణకర్తయుఁ గదా? అట్లుండి దేవీపురనావలపై నభిమానముఁ జూపవచ్చునా? బహుమానము వారికే చెందునని ముందుగా మాటనీయవచ్చునా?" యని యతఁడు మనసులో విచారించుచుండెను. అంతలో వీరనగరనావలు బైలుదేఱినవని జనులలో నుండి కేకలు వినఁబడెను వెంటనే నరేంద్రుఁ డుత్సాహముతో నేటి గట్టునకుఁ బోయెను.

క్రమక్రమముగా కళాసుల తెడ్లచప్పుడులు, పాటలు, బిగ్గరబిగ్గరగా వినఁబడఁజొచ్చెను. ఆ విశాలనదిమీఁద బ్రాఁకుచున్న నావలు తమ తమ నయనగోచరములయ్యెను. నావలు గమ్యస్థానము సమీపించు నప్పటికి, మొదటినావల నడకకు నీ నావలనడకకుఁ గొంతభేదమున్నట్లు జనులు కనిపెట్టిరి. దేవీపురపు పడవలు మూఁడు నించుమించుగా సమ వేగముతోనే బరుగెత్తెను. వాటిలో నొకొక్కదాని కెడమంతగా లేదు. వీరనగరపు నావలలో నొకటి మిక్కిలి ముందుకుబోయెను. తక్కినవి చాల వెనుకఁబడి యుండెను. నరేంద్రుఁడు తనకు మిక్కిలి ప్రియమైన నావ నానవాలుపట్టి సంతోషపరవశుఁడయ్యెను. వీరనగరపు జనులంత వఱకు నిశ్శబ్దముగా నుండి పందెములం గనిపెట్టుచు, నప్పుడు సంతోషమునఁ జప్పట్లుగొట్టి కేకలువైచిరి. దేవీపురపు జనులుకూడ దానికిఁ బ్రత్యుత్తరముగా మరలఁ జప్పట్లుగొట్టిరి. అప్పుడుభయులకుఁ గలహము సంభవించునట్లు కనఁబడెను. అప్పుడు వృద్ధుఁడైన గోకుల దాసుడులేచి వలదువలదని చేతితో సంజ్ఞచేసెను. అప్పుడుత్సాహము

తగ్గెను. ఆ మధ్యాహ్నమునఁ దేశసఖ్య వచ్చిన పడవలలో వీరనగరపు మొదటినావకు సాటియైన నావ మఱియొకటి లేదని యచ్చట జేరిన వారిలోఁ జాలమందికిఁ దోఁచెను. నరేంద్రుని కన్నులు తననావకుఁ గల్గినవిజయమును సూచించి యానందబాష్పములు విడిచెను

అరగంటకు ముందెంతో సంతోషమున వికసించిన నవకుమారుని మొగమప్పుడు చిన్నవోయెను. కాని, గోకులదాసుడు తనసహజగాంభీర్యముతో నిట్లనియె.

“వీరనగర రాజకుమారుని తన నావలలో శ్రేష్ఠమైనదాని నేనో దానిం బేర్కొనవలయును. కాని, యీపందెముల నిబంధనలప్రకారము వీరనగరపు నావలు, వీరనగరపు కళాసులచేతనే నడుపఁబడవలయును.” అనవుడు నా పందిరిలోని వారందఱు క్షణకాలము మాటలాడక యూరకుండిరి. గోకులదాసుని పలుకులలోని యర్థము పెక్కండ్రకుఁ దెలియలేదు. ఉద్రేకముతో మేనుకంపింప నరేంద్రుడు “గోకులదాసుడ! ఈ క్రొత్తనిబంధన కర్థమేమి?” యని యడిగెను. అనవుడు గోకులదాసుడు నెమ్మదిగ నిట్లనియె—

“నాముసలికన్నులు సరిగాఁ జూచినపక్షమున వీరనగరపు మొదటి నావ పూర్తిగా వీరనగరపు కళాసులచే నడిపింపఁబడలేదు”

“వట్టిమాట” అని నరేంద్రుడు గట్టిగాఁ గేకవైచి, వెంటనే తన యుద్రేకము నణంచుకొని గోకులదాసు ప్రక్కనున్న శిరీషుం జూచి, “శిరీషుఁడా! నిపుడుచుకనులతో నీవుచూడుము! మా మొదటిపడవమీఁది కళాసులు వీరనగరపు మనుష్యులేయని నేను చిన్నప్పటినుండి యెఱుఁగుదును. నిజము చెప్పు. వారు వీరనగరపువారగుదురా కారా?”

శిరీషుఁడు శాంతముతో నిట్లనియె—“నీవు చెప్పినది నిజమే. ఆ మొదటినావలోని కళాసులందఱు వీరనగరపువాండ్రే. చుక్కాని పట్టువాఁడు మాత్రము యిక్కడివాఁడగునో కాదో సందేహము.”

మరల నొకక్షణకాల మంతయూరకుండిరి. విచారణము చేయఁగమీరాఁదట చుక్కాసివాని తండ్రి రాజమహాల్ గ్రామనివాసియనియు, నీచుక్కానివాఁ డక్కడనే పుట్టెననియుఁ జాలకాలమునుండి వీరనగరముతో నావలమీఁద పనిచేయుచున్నాఁడనియు నరేంద్రునకు వానిమీఁద మిక్కిలి యిష్టమనియుఁ దెలియవచ్చెను.

అప్పుడు నరేంద్రుఁడు నవకుమారునిజూచి యతనిపదవికీ, వయస్సునకుఁ దగినగౌరవము జూపక నిర్లక్ష్యముగా "మీరు మధ్యవర్తులుగదా? వాఁడు వీరనగరపువాఁ డగునో కాదో నిర్ణయింపుఁడు" అని గట్టిగాఁ బలికెను.

నవకుమారుఁడు కోపము నణఁచుకొని "కాఁడు. అతఁడు రాజమహాలు మనుష్యుఁడు. అతఁడు నడిపినపడవ మనపందెములకుఁ బనికిరాదు."

నరేంద్రుని మొగము కోపావేశమున నెఱ్ఱనఁబడెను. పెదవులు వడఁకెను. అతని యనుచరులు నవకుమారుని వైఖరిజూచి లోలోపల గొణుగుకొనిరి. గొడవజరుగునేమో యని మరల సందేహము గలిగెను. అప్పుడు శిరీషుఁడు తనమిత్రునికడకు విసవిస నడిచిపోయి యాతనిచెవిలో నేదో రహస్యముగ నిట్లు జెప్పెను.—

"నరేంద్ర! ఇక్కడ గొడవసేయకు. నీ మిత్రులు నీయనుచరులు నిక్కడ మిక్కిలి తక్కువగా నున్నారు. తక్కినవాండ్రెక్కువయున్నారు. అందుచే నీవు గెలువవు. నా నిమిత్తమును, దూరమున నున్న పందిరిలో నుండి యంతయుఁ గనిపెట్టుచున్న హేమలత మొగముజూచియు నీవు కోపము నణఁచుకొని శాంతుఁడవు గమ్ము."

నరేంద్రుఁడు మొగము ముడుచుకొని పలుకక కొంతసేపూరకుండెను. అప్పుడతని కొక క్రొత్తయాలోచన తోఁచెను. తోఁచుటయు నతఁడు వీరనగరపు నావలోనికి దుమికి చుక్కానిపట్టుకొని యిట్లనియె.

“ నేను దేవీపురవాసినేగదా ? ఈ పడవచుక్కాని నేనుపట్టుకొంటిని. దేవీపురప్రభువుగారు వీరనగర దేవీపురముల తారతమ్యమిప్పుడు విచారింపవలయును.”

కావ్యసైఖరి యీవిధముగా మాటుటచే నెల్లవారు నాశ్చర్యపడిరి. వీరనగర రాజకుమారుఁడు చుక్కానిపట్టుట పనికిరాదని దేవీపుర జనులుఁ గట్టిగాఁజెప్పిరి. నవకుమారుఁడు నరేంద్రునిచర్య నాపేక్షించి యది పనికిరాదని చెప్పఁబోయెను. కాని, దూరదర్శియైన గోకులదాసుఁ డడ్డమువోయి యిట్లనియె—

“ జమీందారుఁడు చుక్కానిపట్టుట మనపందెములలోఁ బనికిరాదు కాని దేవరవారు మునుపటి నిబంధనలను మార్చి వీరనగరరాజకుమారుని కోరిక చెల్లింపఁదగును. రాజకుమారుడు మోటవాండ్రగు దేవీపుర కళాసులతో పోటీచేసి చుక్కానిబట్టుట మంచిదికాదు. అందుచేత దేవరవారే దేవీపురపు మొదటిపడవ చుక్కానిం బట్టుకొనుఁడు. రాజులకు రాజులు పోటీగా నుండుటమంచిది. మీభార్యయు మీకుమార్తెయు మధ్యవర్తినులుగా నుండి తీర్పుచేయుదురుగాక !”

అద్భుతమైన యీ సలహారాఁగానే క్షణకాలమందఱూర కుండిరి. నవకుమారునకు తనమంత్రి చెప్పినమాట లిష్టములేవు. అది కనిపెట్టి గోకులదాసుఁడు చెవిలో నిట్లనియె—“ అయ్యా ! నా మాటనమ్ముఁడు నేఁ జెప్పినట్లు జేయుఁడు. దేవీపురమునకు జయముసిద్ధముగా నున్నది.”

వీరనగరప్రజనులు తలలూఁచి లోలోపల గొణుగుకొనిరి. నరేంద్రుఁడు మట్టుకు సంతోషోత్సాహములతో నిండియుండెను తాను పడవ నడుపుట, హేమలత విచారించి తీర్పుచెప్పుట యతనికెంతో సంతోషకరముగా నుండెను. తనజీవితకాలములో నది మిక్కిలి సుఖప్రదమైన సమయముగా నతఁడెంచుకొనెను. తనకోపము శంతయుమరచి యతఁడు తనకిటువంటి యవకాశము గలిగించినందులకు గోకులదాసునకుఁ గృత

జ్ఞత దెలిపి వందనములు జేసి దేవీపురవు నావ నెక్కునప్పుడు నవకుమా రునకు సాయము జేసెను. అతనిహృదయ మానందముతో నుప్పొంగెను. అప్పుడు శిరీషుఁడు నరేంద్రుని చెవిలో మెల్లగా నిట్లుచెప్పెను—

"ఇక్కడ నది మిక్కిలిలోతు, నీటివడికూడ మిక్కిలి యెక్కువ. కాఁబట్టి వేగిరపాటు వలదు. రెండురాజకుటుంబముల యదృష్టములు రెండుపడవలమీఁద నున్నవి. జాగ్రత్త నరేంద్రా!"

నరేంద్రుఁడా హెచ్చరికను జెవిని బెట్టలేదు. ఏలయన నతని యాలోచనయు దృష్టియు వేఱొకచోట నుండెను. సాయంకాలమైనది. సూర్యుఁ డస్తమించెను. రెండుపడవలు ప్రవాహమున కెదురుగా మొదట బైలుదేరిన చోటికి నడుపఁబడఁజొచ్చెను. అప్పుడు శరత్కాలపు చంద్రుఁడు గంగానది జలములలో నృత్యము చేయుచున్నట్లు ప్రకాశించుచుండెను. రెండుపడవల జండాలు, తోరణము మొదలగు నలంకారములు వెన్నెలలోఁ దళతళ మెఱసెను. ప్రసిద్ధములయిన రాజకుటుంబములకు నపూర్వముగా జరుగుచుండిన యీనావ పందెములు సరిగా జూడవలెనని ప్రేక్షకులు మెడలెత్తి ఱెప్పవాల్పకజూచుచుండిరి.

పడవలు బైలుదేరినవని తెలియజేయుటకై యొక పెద్ద యవాయి ప్రేల్చిరి. వెంటనే తెడ్లచప్పుడు, కళాసులపాటలు శ్రవణగోచరములయ్యెను. రెండుపడవలు నొకదాని నతిక్రమించి యొకటి పోవ నవకట్టెను. తమతమ యజమానులు నావలమీఁద నుండుటచే నావికులు మహోత్సాహముతో నడుపుచుండిరి. జండాలు తటతట గొట్టుకొనఁజొచ్చెను, ఆపడవలు నడుచుచుండఁగా జనులు సంతోషముచేఁ జప్పట్లు చఱచి కేళింతలు గొట్టిరి.

నది పడమటివైపున వంపుదిగిరి యుండెను. వీరనగరపు నావ పడమటివైపున నుండుటచేనది కొంచెము ముందు వెళ్లుటకు వీలుగలిగెను

చంపెదము' అని వారతని ననుక్షణము బెదరించుచుండిరి.

అదిచూచి నవకుమారుండు మేఘగర్జనధ్వనితో 'దూరముగా నిలువుఁడు!' అని గట్టిగాఁ బలికెను. తోడనే యాయుధపాణులు పందిరి విడిచి దూరముగాఁ జనిరి. అప్పుడు కోపముతో భయంకరమైన నీటిలోఁ గొట్టుకొని కొట్టుకొని యప్పుడే లేచుటచే నీరసమునఁ గొంత సన్నమైన కంఠధ్వనితో నవకుమారుఁడు నరేంద్రుని కిట్లనియె.

"నరేంద్రా! నేను చిన్ననాఁటనుండియు నిన్ను బెంచి పెద్దవానిని జేసి నీ సంస్థానము నీ కప్పగింపఁ దలఁచినందుకు, మహోపకారుని, మిత్రుని, సంరక్షకుని నీవు నేఁడు చంపఁదలఁచితివి గదా."

విషాదముతోను సిగ్గుతోను నరేంద్రుఁ డిట్లనియె—"అయ్యా! నేను గొప్పనేరము చేసిన మహాపాతకుఁడను. నేను జీవింపఁదగను. నేనున్న చోటనే నన్ను జంపివేయుఁడు."

అందఱు నిశ్శబ్దముగా నుండిరి. అప్పుడు శిరీషుఁడు మాత్రము సాహసించి యిట్లనియె.

"అయ్యా! నే నొక్కమాట చెప్పెద. చిత్తగింపుఁడు. నరేంద్రుని నే నెఱిగినట్లు మ ఱెవ్వరు నెఱుఁగరు. అతను వేగిరపాటుగలవాఁడు. దూరాలోచన లేదు. ఏదేని యుత్సాహము వచ్చెనా యతనికిఁ బిచ్చి యెత్తును. కాని మీతలమీఁది వెంట్రుకకైనను హానిచేయవలయునను తలంపు వానికెన్నఁడును లేదు. నేఁటి సాయంకాలమున జరిగిన యీ దుష్క్రియకు వాని వేగిరపాటే కారణముగాని మీకు హాని చేయువలెనను సంకల్పముగాదు. ఈ విషయమై తమరు చక్కగా నాలోచించి యనుగ్రహింప వలయును."

అప్పుడంద ఱూరకుండిరి. అప్పుడు నవకుమారుఁ డీవిధముగాఁ గొన్ని మాటలాడెను—"నరేంద్రుఁడు వేగిరపడెనో హత్య చేయఁదలఁచెనో యతని యుద్దేశమేమో యీ విషయములన్నియు బంగాళాదేశ

పరిపాలకుఁడైన మానసింగురాజు కొన్ని దినములలో విచారింపఁ గలఁడు. అంతవఱకు నీవతని దగిన కట్టుదిట్టములలో నుంచవలసిన విధి నాకున్నది శిరీషుఁడ! రమ్ము. ముసలివాఁడు తడిగుడ్డలతోఁ జాల సేపుండఁగూడదు. అతనిని జాగ్రత్తగాఁ జూచుచుండుము. అతనికి నీవు సంరక్షణము జేయవలసి యుండును. నరేంద్రుఁడు నేఁడు నన్ను జంపఁదలఁచినాఁడు నీవు నన్ను రక్షించితివి."

## ౮

ఒకమాసము జరిగెను. నరేంద్రుఁ డప్పటికిని జెఱలోనే యుండెను. కట్టుదిట్టములుగల యొక ప్రత్యేకగృహములో నతఁ డుంచఁబడెను. అతని స్థితికి, గౌరవమునకుఁ దగినట్లు సౌఖ్యము లన్నియు జరుగుచుండెను. అతని కుత్తరప్రత్యుత్తరములు వచ్చిపోవుటకు వీలులేదు. అతనితో నెవ్వరు వచ్చి మాటాడుటకు వీలులేదు. ఆయుధపాణులైన సిపాయీలా గృహమును గాచుచుండిరి. ఏలయన వీరనగర నివాసులు తిరుగుబాటుచేసి తమ యజమానుని బంధమునుండి విడిపింతురేమో యని యనుమానము. కొంతప్రయత్నము జరిగెను. చెఱసాల వద్ద కొంత యల్లరి జరిగెను. వీధులలోఁ గొంత పోరాటము నడచెను. కొందఱు చచ్చిరి. కాని యది యంతయు వ్యర్థమయ్యెను. ఆ యువకుఁడు నిర్జనమైన యాగదిలో దిగులుపడి చిక్కి తెల్లబడి విచారగ్రస్తుఁడై యుండెను. అప్పుడప్పుడు కోటలోనున్న యుద్యానవనమువైపు గవాక్షములనుండి తాళశక్యములేక బాష్పాకులితములైన కన్నులతోఁ జూచుచుండెను. ఆసుందరోద్యానములలో తన కావించిన విహారములు జ్ఞప్తికిఁ దెచ్చుకొని యా సుఖదినములు గతించెనని విచారించుచుండెను. రాత్రులు ప్రొద్దుపోవువఱకు మేలుకొని యుండును. కళా

హిందుస్థానము యొక్క దేశము గోలకొండ వెలి యొరిపోయు కారాగారము నంధకారమయము చేయుచుండెను.

మానసింగురాజు రాజమహేంద్రపట్టణము నకు వచ్చినట్లును స్వల్పకాలములోఁ దన దర్శనము నిచ్చి ప్రజలను గౌరవింపఁదలచుకొన్నట్లును వార్తలు తెలిసెను. అయనకుఁ దగినట్లు సన్మానించుటకా చిన్నపట్టణములో గొప్ప ప్రయత్నములు జరిగెను. వీధులను శుచిపించి, నీళ్లు జల్లించి, తోరణములు కట్టించి, వీధులందక్కడక్కడ నరఁటిస్తంభములు పాతించి నగరము నెంతయు నలంకరించిరి. గ్రామవాసులు బంగాళా దేశ పరిపాలకుని సందర్శించుటకై వేవేలు వీరనగరమునకు వచ్చిరి. మానసింగురాజు మొగిలాయీలయొక్కయు, రాజపుత్రులయొక్కయు బలములతోఁ దివిగల యేనుఁగునెక్కి యాపట్టణము జేరగానే యూరేగింపులు, మంగళవాద్యములు, నృత్యగానవినోదములు విశేషముగ జరిగెను. చిన్నపిల్లలు స్వాగతగీతములు పాడిరి. పౌరసుందరులు మేడల మీఁదినుండి ముతనిహారాద లాజలు, పుష్పములు చల్లిరి. నూఱు యుద్ధములలో గెలుపుగొన్న మహాశూరుఁడును, అక్బరుచక్రవర్తియొద్ద నున్న కొలువుకాండ్రలో నతిసమర్థుఁడునైన మానసింగు విజయమంగళ ధ్వనులతోఁ బట్టణము జేరి సన్నాయిలు గుభిల్ గుభిల్ మని మ్రోయఁ గృతజ్ఞులైన జనులు జయజయ ధ్వనులొసఁగ తననిమిత్తమై యలంకరింపఁబడిన రాజమందిరముఁ బ్రవేశించెను. అతనిని, సింగపుఁగొదమల వలె నతనిచుట్టు నున్న వీరశిఖామణులను ననేకులు కిటికీలలోనుండి తొంగితొంగి చూచి యానందించిరి.

ఉత్సవముల సందడిలోఁ గొన్నిదినములవఱకు రాజకార్యము లంతగా జరుగలేదు. రాజపుత్రోద్యోగస్థులు బజారులలోను వీధులలోను దిరిగిరి. బిరుసుగడ్డములు గల మొగలాయీలు బంగాళాదేశపు పట్టు దుస్తులు ధరించి, దూరదేశమున నున్న తమయిండ్లకుఁ బోయినప్పుడు

తను యీ బిడ్డలకు బహుమానము జేయవలెనని ఢాకాలో నేసిన సన్నదువ్వలువలను గొనిరి.

చక్రవర్తిగారి యుత్తరువును మానసింగురాజు ప్రకటింప నిశ్చయించిన దినము వచ్చెను. అది మేఘచ్ఛన్నము గాక ప్రకాశవంతమైన శీతకాలపు దినము. ఆకాశము నీలవర్ణమై యుండెను. వాయువు నిర్మలమై యుండెను. సూర్యుఁడు ప్రభాభాసమానుఁడై వీధులలో బజారులలో వెలుగుచుండెను. ఆదినమున మానసింగురాజు భవనములో బంగారు గద్దెపై నాసీనుఁడయ్యెను. సార్వభౌముని కొలువు చేయుచున్న గొప్పయుద్యోగస్థులాతనిచుట్టు నిలిచియుండిరి. వారివెనుక నవకుమారుఁడును గోకులనాయుఁడును మిక్కిలి వినయముతో నిలువంబడిరి.

అనేక యుద్ధములలో మానసింగు చేతిక్రింద పనిచేసి విజయములు గాంచిన వీరసైనికులు పరివేష్టించిరి. కుస్తీపట్లు సాములు మొదలగునవి జనులను సంతోషపఱచెను.

కొంతసేపైన తరువాత మానసింగురాజిట్లనియె "సిపాయీలను శిబిరమునకుఁ బంపివేయుము. కాలాతిక్రమణమైనది. మనమవసరమైన పనులు చూచుకొనవలయును."

అనవుడు నవకుమారుఁడిట్లు బదులు చెప్పెను. "మీయాజ్ఞ శిరసావహించెదను. కాని రాక రాక మా పట్టణమునకు విజయంచేసి మమ్ము గౌరవించిన చక్రవర్తి యుద్యోగస్థులను, మా పేదబంగాళ దేశమున కనువయిన రీతిని గొంత వినోదపెట్టఁ దలఁచుచున్నాను. మా దేశమున మంచి కవులు, మంచి గాయకులు నున్నారు. దేవర వారి కిష్టమగునేని పాటకుఁ డొకఁడు కొన్నికృతులు, పద్యములు పాడఁగలఁడు."

"నవకుమార! నీకోరిక నేను నిరాకరింపఁజాలను. నీవు చక్రవర్తికి మిక్కిలి విధేయుఁడవు. విశ్వాసపాత్రుఁడవు. తోడరమల్ నీకు విధించిన

కృత్యములను నీవు సంతృప్తికరముగా నెరవేర్చితివి. పశ్చిమదేశవాసులమైన మేము మీ మృదువైన భాషను గురించి యేమియు నెఱుఁగము. అయినను మృదువైన మీగానమును, శ్రావ్యమైన మీ గానమును— మేము విని యానందింపఁగలము. ఆ కవిని రమ్మను. మేము సావధానులమై విందుము."

అనవుడు సభకు బారుఁడు—"అతఁడు కవి యని చెప్పుటకు వీలు లేదు. అతఁడు తన నివాసమైన వర్ధమానమునుండి యిక్కడికి వచ్చి యున్నాఁడు. బంకూరాసనములలో నతఁడు నివసించును. చండీదేవత యాతని హృదయమును నాకర్షించెను. అందుచేత నతఁడు చండీగీతములను చక్కఁగాఁ బాడఁగలఁడు." అని బదులు చెప్పెను

అంతట నొకకవి వచ్చి చండినిగూర్చియు, నేలమీఁద, సముద్రముమీఁద జరిగించు మానవులకు నామె చేసిన యుపకారములఁ గూర్చియు మంచి కీర్తనలు పాడెను. అతఁడు పాడిన పాట యొక వర్తకునిగుఱించి. ఆ వర్తకుఁడు స్వదేశమైన బంగాళమును విడిచి, సుగంధద్రవ్యములను, మఱికొన్ని యితరవస్తువులను గొప్పయోడలో వేసికొని సముద్రయానము చేయుట, నట్టనడిసముద్రములో నావ దగులుట, యతఁడు సింహళద్వీపమున బంధింపఁబడుట, ఇంటియొద్ద నతని చిన్నకుమారుఁడు క్రమక్రమముగాఁ బెరిగి పెద్దవాఁడై తండ్రిని గురించి తల్లివలన వినుట, విని జనకునిఁ జూచునాసక్తిచే నోడపయనము జేసి సింహళము జేరుట, చండీదేవి యనుగ్రహమునఁ దండ్రీ కొడుకులు కలిసికొని సుఖప్రయాణముచేసి యిల్లు జేరుట మొదలగు వృత్తాంతమంతయు నాపాటలో నుండెను. పాటలోని సాహిత్యము సులభముగా నున్నందున మానసింగా గేయము రచించినవాని భక్తిప్రపత్తుల మెచ్చుకొని వానికి గొప్ప బహుమానము చేసెను. సార్వభౌముని యుద్యోగస్థులుఁ గూడ వానిపై ననుగ్రహము గలిగి

కొన్ని పారితోషికము లిచ్చిరి. ఈగొప్ప యుద్యోగస్థుల పేర్లిప్పు డెవ్వరు నెఱుఁగరు. కాని ముకుందరాముని కవిత్వమును, గేయములును నేఁటికి సైతము బంగాళీజాతివారు నిధినిక్షేపములవలె గూఢవాఙ్మయమును దాచుకొని పాడి యానందించుచుందురు.

గానము ముగిసిన పిదప నరేంద్రుని మానసింగు సన్నిధికిఁ దీసికొని వచ్చిరి. ప్రదేశ మంతయు నిశ్శబ్దముగ నుండెను. గొప్పకుటుంబములోఁ బుట్టి, చక్కనివాఁడై దుష్ప్రవాసమునఁ జెడిపోయిన యీ మంద భాగ్యునిఁ జూచి మానసింగు జాలిపడి "నరేంద్రనాథరాయ," యను పూర్ణనామముతో నా బాలుని బిలిచి యిట్లనియె—

"మీ తాతగారు మిక్కిలి గౌరవము పొందిన చోటనే నిన్నింత దీనదశలోఁ జూడవలసి వచ్చినందుకుఁ జాల విచారముగా నున్నది. మహామహులైన తోడరమల్ రాజు నీ వంశస్థుల వీరఖడ్గమును చిన్ననాడు నీ తొట్టిలోఁ బెట్టి నిన్ను గౌరవించెను. నీవు చాల తొందరపడి తప్పుదారి త్రొక్కి నీ సంరక్షకునకుఁ బ్రాణాపాయమును తేఁ జూచితివి. విశేషించి శాంతి నెలకొల్పుటకై నవకుమారుఁడు నిలిపిన సైనికులపై నీ యనుచరులు తిరుగుబాటు జేసిరి. రక్తపాతము గూడ నయ్యెను. అయినను నేను నిన్ను దయాపూర్వకముగ విచారించెదను. నీ పితామహుని సత్కార్యములును, రాజభక్తియు నీపక్షమున వాదించుచున్నవి. తనప్రాణములు నీవు తీయఁ సంకల్పించితివని నీ సంరక్షకుఁడు నవకుమారుఁడు నీమీఁద దోషారోపణము జేయలేదు. ఆయన ప్రాణముల రక్షించిన యా మంచిబాలకుఁడు శిరీషుఁడు నీ సంరక్షకుని జంపవలెనను సంకల్పము నీ కెన్నఁడు లేదని ప్రమాణముచేసి మాతో నొక్కి వక్కాణించెను. వారి వాక్యములు నేను నమ్మెదను. నీవు నవకుమారుని పడవమీఁదికి నీ పడవను నడుపుట, యాసమయమునందుఁ గలిగిన యుత్సాహముచేతనే గాని దురుద్దేశముచేత నా పిచ్చిపని నీవు

చేయలేదని నేను నమ్ముచున్నాను ఇంత పనికిమాలినపని పదేండ్ల బాలుఁడైనను జేయఁడు. నరేంద్రనాధరాయ! నీవు నేరము చేయలేదని నేను నమ్మి నిన్ను విడిచిపెట్టుచున్నాను."

విషాదముచేత రక్తహీనుఁడై పాలిపోయిన యా బాలుఁడు తన శత్రువుల పన్నుగడలచే దనకు మహోపద్రవము తప్పక వాటిల్లునని నమ్మి నిరాశజెంది యున్నందున బంగాళదేశ పరిపాలకుని కృపారసపరిపూరితమైన తీర్పు వాని నాశ్చర్యమగ్నుని జేసెను. అతను మాట్లాడఁదలఁచి పెదవులు కదపెను. కాని తొట్రుపాటుచే మాట రాలేదు. కన్నులనుండి రెండు వేడి బాష్పబిందువులు చెక్కులపైఁబడి యాతని కృతజ్ఞతను వెల్లడించెను.

అప్పుడు మానసింగు వానితో నిట్లనియె—"నీ సంస్థానవ్యవహారములు చిక్కులలోఁ బడియున్నవి. వానిని గూర్చి మంచి విచారము చేయవలెను. అక్కడక్కడ తిరుగుబాట్లు జరిగినవి. గత సంవత్సరము మాకియ్యవలసిన పేష్కషు చెల్లలేదు. నీకు యుక్తవయస్సు రాలేదు. నవకుమారుఁడు తన సంస్థానమునకు వెళ్లవలసియున్నది కాబట్టి మునుపు రాజా తోడరమల్ చేసిన యేర్పాటులలోఁ గొన్ని మార్పులు జరుగవలసిన చక్రవర్తిగారి యభిప్రాయము. నవకుమారుఁడు తన సంస్థానమును దాను స్వయముగా నేఁడు మొదలుకొని పాలించుకొనును. నీ సంస్థాన పరిపాలనమునకు నేను నేఁడే యొక యుమలుదారు నేర్పరచినాను. అతఁడు నీకు యుక్తవయస్సు వచ్చువఱకును, బకాయిపడిన పేష్కషు చెల్లించువఱకు నతఁడే నీ సంస్థాన వ్యవహారములు చక్కఁబెట్టును."

ఇదియు నరేంద్రునకు నిష్టమైన యవస్థయే. ఏలయన తనసంస్థానము కఠినుఁడైన నవకుమారుని హస్తమునుండి విముక్తమగును. తానుయుక్తవయస్సు వచ్చి, తన పితామహుని గద్దె తా నెక్కువఱకు తన సంస్థా

మెఱసెను. అక్బరుచక్రవర్తియొక్క మహాసామ్రాజ్యమునకుఁ బ్రాంత సంస్థానాధిపతుల భక్తివిశ్వాసములు సముపార్జించుటకంటె నధికసంతోషకరమైన కార్యము మానసింగునకు మఱొకటి లేదు.

ఆరాత్రి వీరనగరము భేరీభాంకారములతోను, శంఖధ్వనులతోను మ్రోఁగి ప్రతిధ్వను లిచ్చెను. నగరమంతయు దీపములతో నలంకరింపఁబడెను. రాజభక్తి హిందువుల మతధర్మము. అది వారి కుగ్గుపాలతోఁ బెట్టిన విద్య. వీరనగర యువపాలకుని మీఁద మానసింగు చూపిన దయ పురజనుల కందఱకు మహానందము గలిగించెను. ఇండ్లు, వీధులు దీపమాలికలతో ధగధగ మెఱయుచుండెను. నిఱుపేదరాలు గూడ మంటిప్రమిదలలోఁ గొంచెము చమురుపోసి తన గుమ్మములమీఁదఁ గొన్ని దీపములు వెలిగించి తన సంతోషమును వెల్లడించెను. గాయకులు మేడలమీఁదఁ జేరి యుచ్చైస్స్వరములతోఁ బాటలు పాడిరి. స్త్రీలు, పురుషులు గుంపులు గుంపులుగా బజారులలోను, వీధులలోను, వీధి మూలలలోను, జేరి యాగ్రానగరమందున్న పాదుషాను, బంగాళాపరిపాలకుఁడైన మానసింగును, బంధవిముక్తుండైన వీరనగర రాజకుమారుని మెచ్చుచుఁ బ్రసంగింపఁ జొచ్చిరి. ఆచిన్ని పట్టణమున సందడి యడఁగునప్పటి కర్ధరాత్ర మయ్యెను

ప్రాతఃకాలమున హేమలతి లేచి, యంతఃపురోద్యానమునఁ బూవులు గోయ వెళ్లి యాకసుచీఁకటిలో నరేంద్రుని నిడుపైన విగ్రహమును, దీనమయిన ముఖమును జూచెను. ఒక్కనిమిసమున నామె సంభ్రమమునకు లోనయ్యెను. కాని, మానసింగుని యుత్తరవులు నామె కడచిన రాత్రియే విని యుంటచే, తనయొద్ద సెలవు పుచ్చుకొనుట కాతఁడు వచ్చి యుండునని యూహించెను. అది లజ్జ నభినయించుటకు సమయము కాదుగనుక యామె ప్రశాంతమైన నిశ్చలభావముతో నిలువఁబడెను. ఆమె తన బాల్యమిత్రుని సన్నిధికి మెల్లగాఁ బోయి మీఁదఁ

జేయుచుండెను. క్షణకాలము మాటలాడజాలక యిద్దఱూరకుండిరి. ఒకరి యభిప్రాయ మొకరు గ్రహించిరి.

అప్పుడా హేమలత నిట్లనియె—"ఏమోయి నరేంద్ర! నీవు నేటి జోదునగుటకు [illegible] విడిచి వెళ్ళెదవని వింటిని. నిజమా! మనమింక జాలకాలమువఱకుఁ గలసికొనము గాబోలు! మనము చిరకాల మిత్రులము గదా? యావజ్జీవము మనమైత్రి యిట్లే యుండుగాక!"

"హేమలతా! ఇట్టి ప్రియవాక్యములు బలికినందుకు దేవి నిన్ను ననుగ్రహించుఁగాక! ఔను, మన మెప్పుడు మిత్రములమే. నాకంఠములోఁ బ్రాణమున్నంతకాలము నిన్ను నేను మఱచిపోక యెప్పుడు స్మరించుచుందును."

"నరేంద్ర! అది నేనెఱుఁగుదును. నీవు నామీఁద మిక్కిలి దయగలవాఁడవని, ప్రేమగలవాఁడవని యెఱుఁగుదును. నీహృదయ ముదారమైనదనియు నెఱుఁగుదును. లోకమంతయు నిన్ను నిందించినప్పుడుఁ గూడ దయారసపూరితమైన నీహృదయమున దురాలోచన ముండదని నేననుకొంటిని. కాని, యప్పుడప్పుడు నీకంత వేగిరపాటు, నుద్రేకము, నెందుకుఁ గలుగుచుండును?"

"హేమలత! నాకు వేగిరపాటు గలదని నిశ్చయమైన మాటనుచున్నావు. నేను పొగరుబోతుతనము గలిగి వర్తించితిని. వేగిరపాటు గాదు. నీవు దయచేత నిట్లనుచున్నావు. నేను గర్వముచే నీతండ్రి ప్రాణముల కపాయము దెచ్చితిని. భగవంతుఁ డనుగ్రహించి నన్ను రక్షించినాఁడు. ఆసమయమున నేను నీకు మీయమ్మకు నెంతో యడలు గలిగించితిని. అందుకు క్షమింపుము."

"మాయమ్మ యిదివఱకే నిన్ను క్షమించినది. అంతేగాదు నీపక్షమున మాతండ్రితో వాదించినది గూడ. నీవల్ల నేరములేదని నేనెఱుఁ

గుణమున గనుక నేను నిన్ను క్షమింపవలసిన దేమియులేదు. నీయౌదా ర్యగుణమునకు బాలిశుడనగు నన్నట్లు శాంతము, నోపిక గలిగి యుంటివి. వీరసింగరాజ కుటుంబమునకంతె గొప్పది బంగాళమున మఱియొకటి లేదు. పుత్రా! పూర్వుల మీతాతవలెనే నీవును చిరకాలము జీవించి మాసంస్థానమును పేరు ప్రతిష్ఠలు గలునట్లు పాలింపుము.”

“హేమలత! నీవు క్షమించుటచే నాహృదయము చల్లబడినది. నీచల్లని మాటలు నాప్రాణాభివృద్ధికి సాయపడును. ఇదివఱకు నేను మిక్కిలి కష్ట మనుభవించితిని. ఇకముందు ననుభవింపవచ్చును కాని యికముందు నాకుఁ గలుగు కష్టములను ధైర్య పౌరుషములతో నెదుర్కొని ప్రతిఘటించెదను. ఈనష్టమున నేనొక గొప్పపాఠము నేర్చుకొంటిని. అది జీవితకాలములో నెన్నడు మఱువను.”

“అయితే కొద్ది దినములలో నీసంస్థానము నీ కప్పగింపరా! మాతండ్రి తన కృత్యమును విశ్వాసముతో నిర్వర్తించెను. మాయమ్మ నన్ను పెంచినట్లె నిన్నును ప్రేమతోఁ బెంచినది.”

“హేమలతా! మీయమ్మ భూదేవత. మాతల్లి బ్రతికి యుండినను నన్నంత గారాముతోఁ బెంచదు. మీనాయనగారిని గురించి గూడ నానోటనుండి యొక చెడ్డమాటయైన రాదు. నిజముగా నేనాయన యెడల ద్రోహము చేసితిని. అయినను నన్నాయన క్షమించెను. మన యెడబాటువలసిన యీ సమయమున నీవును నన్ను క్షమించితివని చెప్పవచ్చును. నీవు నాప్రాణమునకు ప్రాణమవు. నా సౌఖ్యమునకు నాకోరికలకు నాప్రేమకు నిధానమవు!”

ఆపలుకులు వినగానె హేమలత మొగము త్రిప్పుకొని యూరకుండెను. ఆమాటల యర్థము సరిగా నామె గ్రహింపలేకపోయినను నామె బాలహృదయ మామాటలు వినఁగానె కొట్టుకొనెను.

"హేమలతా! నీనిమిత్తము నేనిదివఱకెన్నడు మాటలాడలేదు. కాని, నేను మనసిచ్చి మాటాడవలసిన సమయము వచ్చినది. ఇదే మొదటిసారియు నిదే కడపటిసారియుఁ గావచ్చును. అప్పుడప్పుడు మనము సత్యము నొప్పుకొనవలసిన సమయము లుండును. ఇది యట్టి సమయము. మనము విడిపోకముందె సత్యము నొప్పుకొందము. ప్రియమైన నీతల్లియు, నన్ను క్షమించిన మీతండ్రియు నిన్ను నాకిచ్చి పెండ్లిచేయుదురని నేనాసపడుచుంటిని. చిన్నతనమున మన మెట్లు కలసిమెలసి సుఖించితిమో వయస్సు వచ్చిన తరువాత గూడ మన మట్లు సుఖింపవలెనని నాకోరిక. నీవు సిగ్గుచే మొగ మటు త్రిప్పుకొనకుము. మనకుఁ గొన్ని నిమిషముల కాలము మాత్రమె యున్నది. ఈలోగానె మనము మాటాడుకొనవలెను. ఆనక్షత్రములఁ జూచుచు, మన మీయుద్యానవనమున ననేక రాత్రులు కలసి మెలసి గడపితిమి. అవి మనమీఁద దమ చిఱువెలుఁగు లనెడు మంద హాసముల నెల్లప్పుడు వెదఁజల్లునని యూహించుచుంటిమి ఈయుపవనమునఁ దిరుగునప్పుడును, నదియొడ్డున షికారు చేయునప్పుడును, నే నొంటిగాఁ గూర్చుండి యాలోచించునప్పుడును, నీవు నాపితృపితామహుల సంస్థానమునకును, నాహృదయమునకును రాణివై యుందువని యువ్విళ్లూరుచుంటిని."

అనవుడు హేమలత మొగ మెఱ్ఱవడెను. కన్నులనుండి రెండు బాష్పబిందువులు జాఱెను. గడుసుదనముచే నామె యామార్పును గప్పిపుచ్చెను. అదివఱ కామె యెన్న డనుభవింపని యొకానొక విపరీతభావ మామె మనంబునఁ గలఁతపెట్టి యుండవచ్చును. కాని యామె దానిని దాఁచఁగల్గెను.

"హేమలత! నేను విస్తరించి చెప్పఁగూడనట్టియు, నీవు వినఁగూడనట్టియు విషయమును గురించి నేనింక ప్రసంగింపను. నామనోరథము

లన్నియు భగ్నములైనవి. నేనీకమీఁద దేశద్రిమ్మరి నగుదును. నే నీదినమునవే యీనగరము విడిచి రాజమహాలు వెళ్లుదును. మాన సింగురాజునకు నాపైఁద మిక్కిలి యభిమానము గలదు. మాతాత నెకటి యుద్యోగస్థు లనేకు లాయనవద్ద నున్నారు. వారు నాకు క్షాత్రధర్మము యుద్ధకర్మము నేర్పుదురు. ఆరాజు శిబిరము ననుసరించి నేనొక యూరినుండి మఱియొక యూరికి నొక మండలమునుండి మఱి యొక మండలమునకుఁ బోవుచుందును. కాని, నాహృదయము మాత్రము వీరనగరమునందే జన్మమధ్యమునందు నే నెన్నడు మరువఁ జాలని యొకానొక వ్యక్తిమీఁద నిలిచియుండును. నేను దూరమున నున్నప్పుడు హేమలతా! న న్నెన్నడైనఁ దలఁచుకొందువా! ”

అనవుడు హేమలత నేత్రములనుండి స్రవించు బాష్పముల నాపు కొనలేక “ నరేంద్ర! నే నెన్నడైన నిన్ను మఱువఁగలనా? ” యని మెల్లగఁ బలికెను.

“ హేమలతా! కంటఁ దడిపెట్టకుము. మనము విడిపోవలసిన యీ సమయమునందు నీకు నేను ఖేదము గలిగింపఁగూడదు. మనము విడిపోవలెను. సూర్యోదయము కాఁబోవుచున్నది నేను నిన్ను విడు వక మును న న్నెప్పటికి నీవు జ్ఞాపక ముంచుకొనునట్లు నే నొక యభిజ్ఞానము నీకిచ్చెదను. చిన్నప్పుడు మన మీమల్లెతీగ నాటితిమి. అది పెరిగి పూలు పూయుచున్నది. దీనితో నీకొక యభిజ్ఞానము గల్పించి యిచ్చెదను. ”

అని చిన్న మల్లెతీఁగ నొకదానిని దెచ్చి కడియముగాఁ జేసి హేమ లత చేయి పట్టుకొని యాకడియము నామెకుం దొడిగి యిట్లనియె.—

“ ఈపువ్వు లొకటి రెండు దినములలో వాడిపోవచ్చును. కాని యీతీఁగ చాలకాలముండును. నీకు నామీఁద దయయున్నంతకాల మీతీఁగ కడియము నీచెంత నుంచుకొనుము. నీకు నామీఁద దయ

దప్పినప్పుడు—నన్ను నీవు తలంచుకొనినప్పుడు—దానిని దీసి యూఁపు భాజ వేయుము."

శీతకాల సూర్యోదయము నభోమండల మంతను జపాకుసుమ కాంతులలో నింపివైచెను. ఆ యుదయకాలప్రభాకరమండలము స్వస్థానము విడిచి యేకాకియై దేశదేశముల ద్రిమ్మరఁ దలఁచి, చిన్ని నావలో గంగానదిని దాఁటుచున్న యొక యువకునిం జూచెను. వెండియు నది వీర నగరోద్యానప్రాంతలి దేవాలయపు మెట్లమీఁదఁ గూర్చుండి యువతీజనసమాజమైన మక్కువతో ప్రథమబాష్పబిందువులు విడుచుచున్న యొక బాలికను గూడ వీక్షించెను.

౯

నరేంద్రుఁడు స్వగృహమువిడచి యిప్పటికి తొమ్మిది సంవత్సరములైనది. ఈ తొమ్మిదేండ్లు పరియాయముగ జయాపజయముల నడుమ యుద్ధరంగమున వెళ్ళిపోయెను. నరేంద్రుడిప్పటి కిరువదియైదు సంవత్సరములు ప్రాయముగలిగి చక్రవర్తిసేనలో నొక యుద్యోగస్థుఁడై యుండెను. అతని సంస్థానము మాత్రము సార్వభౌముఁడంపిన యమలుదారుని పరిపాలనములోనే యుండెను. వీరనగరమునుండిగాని, దేవీపురమునుండిగాని వార్తలేమియు నతనికిఁ దెలియలేదు. త్వరత్వరగాఁ జేయు ప్రయాణముల సందడిని స్వగృహముమాట తలంచుకొనుటకే యతని కవకాశము లేకపోయెను. యౌవనశాలి భావములను, మనోరథములను గాలమడఁచి మందముగఁ జేయునుగదా! కాలగతి చేత దుస్సహమైన వియోగముయొక్క వ్యథలు తగ్గిపోవును. ఏండ్లుగడచినకొలఁది మొదటఁగలిగిన యాశాభంగములు సులభముగా సహ్యములగును. అయినను చిన్ననాఁటి వేడుకలు, మందిరోద్యానవిహారములు, దాని

యుండిన సరస్సు, తత్తీరమునందలి దేవాలయము మున్నగువానిం గాంచి యతఁ డప్పుడప్పుడు తలంచుకొనుచుండెను. ఆ నాగస్సుల నడుమ నాస్కంధావారజీవితసౌఖ్యమున నరేంద్రుఁ డెడనెడ నిస్పృష్టరామణీయకము గలిగి తన ప్రణయమునకుఁ గారణభూతమైన యొక వ్యక్తిం దలంచుకొని వేఁడినిట్టూర్పులు పుచ్చుచుండును. కాని, వెనుకటి తలంపు లన్నియు నిప్పుడడఁగెను. ఏమన నరేంద్రుఁ డిప్పుడు రోగపీడితుఁడై స్మారకము లేక మంచమెక్కియుండెను. అతఁడు విషమజ్వరపీడితుఁడై సంధివశమున నొడలెఱుఁగక రేయింబవళ్లు పేలుచుండును. క్రొత్తదేశములోఁ గ్రొత్తపడఁతు లతని కుపచారములు చేయఁజొచ్చిరి. వైద్యులు వాని యవస్థఁజూచి తలలూచి పెదవు లవిఱిచిరి. దయాపూర్వకమైన యుపచారమును, విశ్రాంతియు, వానిసహజశరీరపాటవమును వానిని మృత్యుముఖమునుండి తప్పించెను.

ఒకనాఁడర్ధరాత్రమున నతనికి మెలకువవచ్చెను. వెండిగొలుసులకు వ్రేలఁగట్టిన వెండిదీపపు స్తంభములలోని దివ్వెలు విశాలమై సుందరమయిన యా భవనమున నలుదెసల తేజఃపుంజముల వెదజల్లెను. గోడలెల్లరాతివి. సుందరమైన నగిషీలు చెక్కిన తెల్లస్ఫటిక శిలలు, నల్లస్ఫటికశిలలు గోడలో నెడనెడ నమర్పఁబడెను. శిలాస్తంభములు బాగుగఁదీరి స్నిగ్ధములై, గంభీరములై యుండెను. వాని మీఁద నీలములు పగడములు మొదలగు మణులతో, తీఁగలు, పూవులు, కాయలు చెక్కఁబడియుండెను. సరంబీనుండి క్రిందికి పఱాంగుట్టుతెరలు వ్రేలుచుండెను. వెలగలతివాచి నేలఁ బఱచఁబడెను. జౌఖానా యొకటి మధ్యభాగమునందుండి తెల్లస్ఫటికశిలతో నిర్మింపఁబడి విశాలమైన పన్నీరమందు తళతళమెఱయు సన్ననీటి బిందువులను జల్లుచుండెను. ప్రేక్షకుల చూపులను వంచించి క్రింద గలగల పాఱుచున్న నీటిలోఁ బలురంగుల చేఁపలున్నవని వారు భ్రమపడునట్లు పన్నీరములో నానావర్ణము

లుగల మణులచ్చట కాపటము చేయుచుండెను. మందిరమంతయు నిశ్శబ్దముగనుండెను. ఆయచ్చటి స్త్రీ పురుషు లందఱును గుసగుసలుగ విందులు చేయుచుండెను. సవితృస్త్రీకి చిన్నదగు రాణిగారిని ఆతఁడు పాఱఁ జూచి భయభ్రాంతుఁడయ్యెను. అది స్వప్నమా యని యతఁడు మొదట భావించెను. ఇదమిత్థమని నిర్ణయించుట కతని కోపిక లేక పోవుటచే శిరస్సు తలగడమీఁదఁ జేర్చి మరల నిద్రించెను.

మరల నతఁడు మేల్కొనునప్పటికి సుగంధదీపములు వెలవెలఁ బాఱుచుండెను. పట్టుతెరలలోనుండి సూర్యకిరణములు తొంగిచూచుచుండెను. గది నాఁటిరాత్రిచూచిన గదియే. వైభవ మానాఁటి వైభవమే. కాని గది యిప్పుడు జనసమ్మర్దము లేకయుండెను. ఒక వృద్ధపరిచారిక యింకను నిద్రపోవుచుండెను. వేషమునుబట్టి యామె రాజపుత్రస్త్రీయని యూహింపఁదగియుండెను. ఒక పరిచారకుఁడు కూడ నక్కడనుండెను. జన్నిదమునుబట్టి యాతఁడు బ్రాహ్మణకుమారుఁడని తోఁచును. రోగపీడితుఁడైన రాజకుమారునకుఁ దగిన పథ్యపానములు లమర్చుట కతఁడక్కడ నుండియుండెను. అతని మంచము ప్రక్కను నిశ్శబ్దముగా నతనిని గనిపెట్టుచు లేఁ బ్రాయమునందున్న యొక యువతి నల్లనై చూపఱ మర్మభేదకములైన కన్నులు గలిగి నిలువఁబడెను. ఆమె మొగ మతి సుందరమైనదే గాని యెండ తగిలి పాటుపడి యెండవానల కగ్గమగుటచే వివర్ణమై యుండెను. తుమ్మెదరెక్కలవంటి యామె తలవెండ్రుకలు నల్లమొఖమలు టోపీ క్రిందనుండి యుంగరములవలెఁ జుట్టుకొని యామె ముఖారవిందమునకు వింతయందము దెచ్చుచుండెను. బంగారు చెమ్కీపనిగల నల్లమొఖమలు రవిక యామె శరీరమును గప్పెను. చిరకాలము ధరించుటచే నది ప్రాతదై మాసినట్లుండెను. ఆమె బాహువులు దీర్ఘములై వస్త్రాచ్ఛాదన మేమియు లేక నట్టివై స్నిగ్ధములై సౌందర్యనిధులై యుండినను, పోతపోసిన యుక్కు తునుకలలాగున

నుండెను. బంగారు పూత మాసిపోయిన యొకవొడ్డాణమామె నడుము నాశ్రయించెను. దానితో నొక కైజారమర్చఁబడి యుండెను. ఘను పొకసారి యాకుపచ్చగానుండి యిప్పుడు రంగుమాసిన యుత్తరీయము నామెపైట వైచికొనెను. ఆమెయొక యంగరకా ధరించెను. దాని యడుగున తురకలు సామాన్యముగా ధరించు వదులుషరాయి చీల మండకు బిగువుగా నంటగట్టబడి యుండెను. ఆమె జోడు దొడుగక వట్టిపాదములతో నుండెను. ఆమె పొడగరి. మిక్కిలి సుకుమారి. మర్మభేదకములైన యాపల్లనికన్నులు ప్రేక్షకునకు మోహము కలిగింపకపోవు. కాని, నరేంద్రుఁడా సౌందర్యమును జూచి యానందించుటకు వీలులేని మర్మలక్షితిలో నుండెను. "నాకు దాహముగా నున్నది. త్రాగుట కేదైనఁ సిమ్ము" అనుమాట మాత్రమే యతఁడు పలుకఁగలిగెను. అది వినిపించుకొనక యా జనరా లంత క్షోభకురాలయ్యెను.

"నాకు దాహము. ఏదేని త్రాగుట కిమ్ము" అని మరల నతడు పలికెను. అక్కడనున్న బ్రాహ్మణబాలకుఁడు వానిగొద్దకుఁ బోయి మందు కలిపిన రసాయన మేదో యిచ్చెను. అది త్రాగి నరేంద్రుఁడు వెంటనే నిద్రించెను.

ఆవిధముగ కొన్ని పగళ్లురాత్రులు కడచిపోయెను. అయినను నరేంద్రుఁడు మంచముమీఁదనె యుండెను. పరిచారకు లతనితో నెన్నడు మాటలాడరు. మాటలాడఁదలఁచుకొన్నను నతనికి మెలకువయే లేదు. అప్పుడప్పు డతఁడు కలలోనో, నిజముగానో తన ప్రక్కమీఁదికి వంగి తన సుఖలక్షణములు కనిపెట్టుచున్న పొడుగుపాటి యువతి నొకతెను జూచుచుండెను. ఉదయమున నతనికి మెలకువ వచ్చినప్పుడు తివాసిమీఁదనుండి పోవుచున్న యడుగుల చప్పు డతనికి వినఁబడుచుండును. ఒక మానవవిగ్రహముయొక్క నీడగూడ తన ప్రక్కమీఁదనుండి యావలకుఁ బ్రసరించినట్లతనికిఁ గనఁబడుచుండును.

ప్రాణాపాయస్థితి తప్పెను. నరేంద్రుఁడు క్రమక్రమముగా నారోగ్యము నొందెను. పూర్వవృత్తాంతము మెల్లమెల్లగా నతనికి జ్ఞప్తికి వచ్చెను. నరేంద్రుఁడు మానసింగు చేతిక్రింద ననేకయుద్ధములలోఁ బని చేసెను. ఆ మహారాజుని ప్రయత్నములు తరుచుగా జయమునె పొందుచుండెను. వారు పట్టణములు పట్టుకొనిరి. దోచుకొనిరి. అడవులు జయించి స్వాధీనము జేసికొనిరి. ఆఫ్ఘనుల నణగద్రొక్కిరి. పోర్చుగీసుల పొగరు మాన్పిరి. ఆ మహారాజుయొక్క పరిపాలనము క్రింద బంగాళాదేశమున శాంతి నెలకొనెను.

కాని 1598 సంవత్సరమున మానసింగుమహారాజు బంగాళము విడిచి వెళ్లవలసి వచ్చెను. అంతట మొగలాయీల యదృష్టము తొలఁగెను. అతని కుమారుఁడు జగత్సింగు శూరుఁడు యుద్ధప్రియుఁడు నైనను కార్యాలోచనము సేయు మంత్రులఁ గూడ నుంచుటకంటె త్రాగుబోతుల నడుమ నుండుట యతని కెక్కువయిష్టము. దృఢసంకల్పులైన యాఫ్ఘనులు వెండియు నొకసారి లేచి విజృంభించి ఒరిస్సాను జయించి మరల స్వాధీనము జేసికొనిరి. రాజపుత్ర మొగలాయిసేన లాఫ్ఘనుదళములను భద్రక్కను గ్రామమునొద్ద క్రీ. శ. 1600 సంవత్సరమున దాఁకెను. అది మొగలాయిలకు దుర్దినము. ఉస్మానుఖాకుఁ డగ్నివలె విజృంభించి మొగలాయి జోదుల నణఁగఁద్రొక్కి వారిం దెగనఱికి పలాయితులం జేసెను. ఈ పలాయనములోనే నరేంద్రునకు గుండుదెబ్బ తగిలెను. వెంటనే యతఁడు తన సేనాపతియైన గజపతిసింగుప్రక్క నిశ్చేష్టుఁడై పడెను.

భద్రకుగ్రామమునుండి రాజమహాలు నగరమునకు సార్వభౌముని సేనలు సిగ్గులుచేటుగఁ బరుగులెత్తిననాటికథ యతఁడు జ్ఞాపకముంచుకొనెను. గజపతిసింగుయొక్క దయచే నతఁడు గాయపడిన తక్కిన జోదులతోఁ బాటుగా వెనుక బోవునవారిలో నావలకుఁ గొంపో

బడెను. క్రొత్తకోటలోని మహారాణా ప్రేరేపించెను. ఆ సాయ
మునకు రాజస్థానమునుండి కొన్ని బలములు పంపవలెనని జగత్సింహు
చక్రవర్తికి సందేశ మంపించి, మహారాణాబాలము గొనిపోవుటకు
గజపతిసింగును నియమించెను. నరేంద్రుఁడు యుద్ధమునకుఁ బనికిరాక
పోవుటచే నతనాయన నుంచి పోదలచెను. గంగానదిమీఁద
నోడపయనము తగిన విశ్రాంతి నొసఁగి యతని నారోగ్యము గలిగించు
నని నారనుకొనిరి గాని యది విపరీతముగాఁ బరిణమించెను. అతని
గాయము మానలేదు. పైపెచ్చు చలిగాలి మిక్కుటముగా నుండు
టచే దీవ్రమైన జ్వరము వచ్చెను. నరేంద్రుని కంతవఱకె జ్ఞాపక
మున్నది. నాఁడు మొదలుకొని యతఁడు శవపస్మారక మొఱఁగక పడి
యుండి యాక్రొత్తదేశమున నాక్రొత్తగదిలో నున్నట్లు రోగము మళ్లిన
తరువాతఁ జాలదినములకుఁ దెలిసికొనెను.

రాజపుత్రపరిచారిక నరేంద్రునకు రోగము కొంచెము మళ్లినతోడనే
వచ్చుట మానెను. నరేంద్రుని బంగాలిమాట బ్రాహ్మణ బాలకునికిఁ
దెలియదు. అప్పుడు నరేంద్రునకు మనోవ్యగ్రతయు నాలోచనయు హె
చ్చయ్యెను. తానక్కడికెట్లు వచ్చెనో తెలియదు. గుమ్మములు, కిటి
కీలు మూయఁబడి యుండుటచే నది చెఱసాలయని యతఁడు భావించి,
తప్పించుకొనిపోవు మార్గమేదియని యతఁ డాలోచింపఁ దొడఁగెను.

ఈవిధమైన యాలోచన మితఁడు చేసికొనుచుండఁగా నొకనాఁటి
రాత్రి యతని మంచముదగ్గఱ నతని కడుగుల చప్పుడు వినఁబడెను.
అదియేమని ప్రక్కకు దిరిగి యతఁడు చూచునప్పటికి మున్ను పలు
మాఱు తనకంటఁబడిన యా సౌందర్యవతి విగ్రహమె మరలఁ గనఁ
బడెను. తీవ్రములై మర్మభేదములైన యామె నేత్రములతని కక్క
జము గొలిపెను. హిందూదేశయువతుల దేహములయందుఁ గనఁబడు
కాంతికంటె నామె శరీరకాంతి యధిక ప్రభావంతమై యుండెను. ఆమె

చిన్నసివంగిపిల్లవలె మిక్కిలి చుఱుకుదనము గలది. తప్పుటలేని యామె యడుగులజాడలు బట్టి, యొక్కతె నిశ్చయముగా నెదురుచూచు నడవిజంతువు చరిత్ర యాతనికి జ్ఞప్తికి వచ్చుచుండెను.

ఎట్టకేలకు నరేంద్రుఁడామె నిట్లు పలుకరించెను. "కల్యాణి! నేను నిన్ను స్వప్నములలో జూచితిని. కాదేని నేను స్మారక మెఱుఁగక పడియున్నప్పుడు నీవు నా ప్రక్కను నిలిచి నా స్థితిగతుల కనిపెట్టియుం దువు. నా యందు దయయుంచి నే నెక్కడ నున్నానో చెప్పి నాయముగా వలసిన నాకు సాయముజేయుము."

ఆ బాలిక మాటాడక, యేమియుఁ బలుకఁగూడదని తెలియఁ జేయుటకుఁ గాఁబోలు వ్రేలెత్తి తననోటిమీఁదఁ బెట్టుకొనెను. కాని, నరేంద్రుఁ డూరకుండ లేదు.

"అపూర్వసుందరీ! మాటలాడుము. ఈ దివ్యభవనము నీదా? గాయపడిన జోదునకు నీవు నిలువనీడ నిచ్చితివా? నా జబ్బులో నన్ను గనిపెట్టి మందులిచ్చి నా ప్రాణములు గాపాడితివని నా నమ్మకము. ఈ క్రొత్తచోట దిక్కులేని వానికి నీవు దిక్కైయున్నావు" అని పలికెను.

అయినను నా బాలిక మాటలాడక కదలక మెదలక ప్రభావంతమైన దేహముతో, తీవ్రములైన నిరీక్షణములతో వానికట్టెదుట నిలిచెను.

ఆమె యూరకుండుటచే విసుగుజెంది యాతురతతో మరల నిట్లనియె. "నీవు మానవస్త్రీవా? కాక మనుష్యులు మందభాగ్యులైనప్పుడు వారింజూచి యెగతాళిచేయు రాక్షసాంగనవా? నీ వాలకముజూడ గొప్పవంశమునఁ బుట్టిన మహమ్మదీయ యువతివని తోఁచును. నీవు మనుష్యాంగనవు కావు. అసమానరూపలావణ్యవతివి."

ఈ పొగడ్తచే నామె మనుష్యాంగన గాని, లేక రాక్షసాంగనగాని, యెవతెయైన నేమి యించుక సంతోషించినట్లు కనఁబడెను. పరిహాసా

స్వచ్ఛమైన చిఱునవ్వొక యింత యామె మొగము నలంకరించెను. కాని యామె పశ్చాత్తి పలుకలేదు.

అయినను నరేంద్రునకుఁ గొంత యాశపుట్టెను. పుట్టుటయు నతఁ డామెహస్తముఁ బట్టుకొని మృదుస్వరముతో నిట్లనియె—"నీ హృదయమచ్చముగా స్త్రీహృదయము. కల్యాణీ! ఈక్రొత్తవానియందు దయయుంచి స్త్రీసహజమైన జాలిఁజూపుము."

ఎట్టకేలకా బాలిక ముత్యాలకోవ వంటి దంతపంక్తి యించుక గనఁ బడునట్లు చిఱునవ్వు నవ్వె, యా నవ్వుచే నీలనేత్రములు నిగ నిగ లాడ మెఱయ మెల్లగ నిట్లు పలికెను—"నే నాఁడుదానని తెలిసికొనుటకు, పాపము? నీకు చాలకాలము పట్టినది. నేను పిశాచమునా, రాక్షసిని గానని నీకు నమ్మకగలిగినదా? నా చేయి రక్తమాంసములు గల మనుష్యహస్తమేనా?"

"ఔను! నీ నాడులలోఁ బాఱుచున్న వేడిరక్తము నాస్పర్శవల్ల గ్రహించుచున్నాను. నీవు మానవాంగనవే."

"స్త్రీ కనఁబడినప్పు డామె స్త్రీయని యన్వేషవంతుఁడైన మహాయోధుఁడు తెలిసికొనఁ గలిగినాఁడు. నయమె"

"విదేశములోఁ గ్రొత్తయువతి మొగములోఁగూడ నీ యోధుఁడు దయాదాక్షిణ్యములు గనిపెట్టఁగలఁడు సుమీ."

"ఈక్రొత్తదేశమునందలి నీ కేమియుఁ దెలియదు నీవు క్రొత్తవాఁడవు. ఇప్పుడప్పుడే నా దయాదాక్షిణ్యముల మాటనమ్మియుండకుము. నీ వెట్టిదయకుఁ దగుదువో యట్టిదయయే నీకుఁ జూపఁబడును."

"కల్యాణీ! నావిషయమై న్యాయకర్తవుగా నుండుము. ఇంతకంటె నా కధికమేమియు నక్కఱలేదు."

"నీవు నీ వ్యాపారములో గట్టివాఁడవె. ఇతరుల సాయమేమిటికి? ఆ చక్కని పలుకులు క్రొత్తదేశములోనైన నెట్టిసుందరి నయిన వల

పింపఁగలవు. ఎన్నో దినములు గడవకముందే తియ్యనిమాటలుగాక, మఱియొక యధికఫలము నీవద్దనుండి యపేక్షింపఁబడును."

"నా వలనఁ గావలసిన దేదో చెప్పు?"

"మహాయోధుని ధైర్యము మానవుని పౌరుషము"

"అవకాశమిమ్ము నేను తప్పించుకొనినచో నష్టపడనుము."

"ప్రగల్భము లెక్కువగాఁ జెప్పకుము. వాక్సాహసమున్నచోటవ్యాపా యసాహసముండదు శూరుఁడ, నరేంద్రుఁడా! నేను నిన్ను గుఱించి విన్నాను. నేను దగ్గరగానుండి నీ లక్షణములు కనిపెట్టినాను. ముఖ లక్షణములను బట్టి మనుష్యుల గుణములను నేను సరిగాఁ జెప్పఁగలను. నేను కలిసికొనఁదలఁచిన మనుష్యుఁడు నీవేమో!"

"మర్మము బెట్టి మాటాడకుము. తన్ను నమ్మినవారి నెన్నడు మోసపుచ్చి యెఱుఁగని శూరుని విశ్వసింపుము." ఆ బాలిక కొంత సేపూరకుండి మిక్కిలి మెల్లగా నిట్లనియె—"నేను తార్తారజాతిస్త్రీని. నా జాతివారు మిత్రునిమరువరు. శత్రుని క్షమింపరు. మావారు నాకు మహమ్మదీయమతమంతగా నేర్పలేదు. అనేకమతములున్న మీ దేశ ములో నాకది కొంచెమేనియుఁ బట్టుబడలేదు. కాని నా తల్లి నాకొక మంత్రమును నొక కైజారును నిచ్చినది. అందులో నొకటి మిత్రుల కొఱకు, నొకటి శత్రువులకొఱకు."

"రోగపీడితుఁడై యప్పుడు నీ వెవ్వని కుపకారములు చేసి బ్రతికించితివో యతఁడే నీకు మిత్రుఁడని నీవు కనిపెట్టఁగలవు. అతఁడు ద్రోహి యగునేని నీకైజారు తనపని నిర్వర్తించుఁగాక!"

నీవు ప్రాయమునందున్న యోధుఁడవు. నీ మాట నిజము. నీమొ గము సత్యమును జాటుచున్నది. నేను నిన్ను నమ్మెదను. కాని యా లోచనలో నైన నీవు ద్రోహము తలంపఁగూడదు సుమా. జాగ్రత్త. నాకంటె మిక్కిలి ఘనులైనవారు మరొకరున్నారు. వారు శిక్షించు

టకు, ఉపాయమాలోచించుటకు సమర్థుఁడు. వారే నీ బుజాత్యమును గనుఁగొని, నీ వలనఁ గార్యార్థులగుదురు.

"ఓ తార్తాసుందరీ! నీ వింకను మర్మముబెట్టియే మాటలాడుచున్నావు గదా?"

"మనుష్యుఁడెన్నఁడు నడుగుబెట్టని యొకానొకచోటు నీవు చూడఁగలవు. ఒకలోకైకసుందరి యాజ్ఞలను నీవు వినఁగలవు. మహాశూరునైన గంపింపఁజేయు మహాపాయస్థితిని నీ వెదుర్కొనఁగలవు. ఇంతకంటె నీ వాత్రి యధికముగ నడుగకుము. ఒకవారము వేచియుండుము. నీవు చేయవలసిన యా కార్యమునకై నీ యావచ్ఛక్తియు, నీయావద్ధైర్యమును వినియోగించుటకు సిద్ధముగా నుండుము. ఉదయకాలపు టరుణకాంతులు నీ గదిలోఁ బ్రవేశించుచున్నవి. నే నింక వెళ్ళవలెను—"

అంతట నరేంద్రుఁడు కొంచెము భయపడుచు సుకుమారమైన యామెహస్తమును బట్టుకొని "సుందరీ! నీ వెవ్వతెవో పూర్తిగా నాకుఁ జెప్పకుండ వెళ్ళవలదు. ఈ మాయనుగురించి నే నింకను నెక్కువగాఁ దెలిసికొనవలె" నని పలికెను.

అంతఁగానే వెండియు నిశ్శబ్దమైన యొక మందహాస మామె మొగమున వెలయఁజేయు, పాముకన్నులవలె నల్లని కన్నులు మెఱయ "కాముక వ్యాపారమునకు నీవు క్రొత్తవాఁడవు కావని నాయూహ. నా మాయామర్మములు నీవు మఱియొకనాఁడు తెలిసికొనవచ్చును. నన్ను వెళ్ళనీ. నా పేరు జలేఖ" యనుచు నంతర్ధాన మొందెను.

## ౧౦

ఒకవారము గడచెను. నరేంద్రుఁ డారోగ్యవంతుఁడయ్యెను. క్రమముగా బలము చేరుకొనెను. కాని మనోవిచారములు కొన్ని యతనిని

తోఁచెను. అవి గొప్ప రాజులకొఱకే కట్టఁబడి యుండవచ్చునని యతనికిఁ దోఁచెను. నలుగువైపుల చుట్టుకున్న యెత్తైనగోడకు గవాక్షములు లేవు వెలుపలి ద్వారములు లేవు.

ఒకనాఁడు సాయంకాలము ప్రద్యుమ్నోపవనమునకు బద్దెమీఁదఁ దిరిగి గాఢాంధకారము మేడల నన్నిఁటినిఁ గప్పినపిదప, మనస్సున గాఢమైన కలఁతతో నతఁడు క్రిందికి దిగివచ్చెను అన్నము తిన్నగాఁ దినకయే యేదో మత్తుపదార్థము పుచ్చుకొన్నట్లు వంగుకొని యొడ లెఱుఁగక గాఢనిద్ర జెందెను.

మొదటిజాము హాయిగాఁ గడచెను. నగారాఖానలోనుండి ధ్వని యింకను వినఁబడుచుండెను. అప్పుడు దీపపువెలుఁగు మందముగానున్న గూగదిలోనికి జలేఖ మెల్ల మెల్లగ నడుగులిడుచు జాగ్రత్తతో వచ్చెను. ఆమె నేత్రములనుండి యొకవిధమైన కాంతి వెడలెను. ఆమె బాహువులు నగలుగాని చొక్కాయిగాని లేక వట్టివిగా నుండెను. కుడిచేత కైజా యుండెను. చప్పుడు గాకుండ మంచముకడకుఁ బోయి యామె నిలిచి కొన్నినిముషములవఱకుఁ జూచి నిలిచెను.

అతని యుచ్ఛ్వాసనిశ్వాసముల నామె కనిపెట్టి యది స్వప్నహీనమైన గాఢనిద్రయని తెలిసికొనెను. అతని హృదయధ్వని నామె పరిశీలించి యది బలాఢ్యుని హృదయమే యని గ్రహించెను. ఆమె మొగము వికసించెను. చిఱునవ్వు పెదవులపై వెలసెను. మొదట నామెకైజారు కనిపి తనభాషలో నేవో కొన్ని మంత్రములు చదువుచు నాకైజారు వాని తలచుట్టుఁ ద్రిప్పెను. ఆ మంత్రములలోని యర్థ మిది—

1. నడిరేయి చీఁకటి నీడలు విరివిగా వ్యాపించినవి. యోధుని నిద్రమీఁద మంత్రము పాఱఁగలదు. కొండలలో జాగరూకతతో నుండు దేవతలు, నదులలో మేల్కొనియుండు దేవతలు నీ హృదయ

మును దృఢపఱచి, నీ బాహువులను తుష్టి జేయుదురుగాక! అద్భుతమైన నా మంత్రశక్తిచే నిన్నుఁ గాపాడుదురుగాక! నక్షత్రము తరంగముమీఁద నున్నది. లెమ్ము! ఘనుఁడవు గమ్ము!

2. నడిరేయి చీకటి నీడలు విరివిగా వ్యాపించినవి. కాని వాని భూతములు నీచుట్టుఁ బ్రాకుచున్నవి. అవి నీకు బలమిచ్చుచు విశ్రాంతి నిచ్చును. నాయాజ్ఞ ననుసరించి యవి నిన్ను మేల్కొలుపును. వాటి శక్తివలన నేను నిన్ను వశపఱచుకొంటిని. స్త్రీమనోభీష్టము నెరవేర్చుటకు యోధుఁడా! లెమ్ము! ఘనుఁడవు గమ్ము! నక్షత్రము తరంగము మీఁద నున్నది.

3. నడిరేయి చీకటి నీడలు విరివిగా వ్యాపించినవి. కొందఱు నవ్వుదురు; కొందఱు ఏడ్తురు. ఈమంత్రము నుచ్చరించు తల్లులు సుఖింతురు. యుద్ధములలోఁ జచ్చిన తండ్రులకొఱకు బిడ్డలు విలపింతురు. తార్తార దేశపు భూతములు నాయాజ్ఞ ననుసరించుటకు నిన్ను పిలుచుఁగాక! నక్షత్రము తరంగముమీఁద నున్నది. కన్యకు దాసుఁడవుగమ్ము!

4. నడిరేయి చీకటి నీడలు విరివిగా వ్యాపించినవి. ఉదయము తొంగిచూడకమునుపె లెమ్ము! ఈ మాయాకళచేత బద్ధుఁడవై, రక్తమునకు రక్తము, హృదయమునకు హృదయము నిచ్చి, జీవమందు మరణమందు సత్యవంతుఁడవై, లెమ్ము! యోధుఁడువలె విశ్వాసముం బుచ్చుము. నక్షత్రము తరంగముమీఁద నున్నది. యశమో మరణమో కలుగుఁగాక!

మంత్రము ముగిసెను. అంతట జలేఖ కైజారుమొన నిద్రితుని గుండెపై మోపి మెల్లగఁ గ్రుచ్చెను దానితో నొక నెత్తురుచుక్క పైకివచ్చెను. గాఢనిద్రనుండి నరేంద్రుఁడు మేల్కొని కనులు దెఱచి, కళవళపడి చుట్టుప్రక్కలఁజూచి, యప్పుడే కైజారు నొరలోఁ బెట్టి తనమంచము ప్రక్కను నిలిచియున్న యాక్రొత్తబాలికపై చూడ్కులు నిలిపెను.

"యోధుడా! నీ పతి దీక్షాశాలయందు నిద్రించుచున్నదని తలంచుచున్నది. మన మనుకొన్న సమయము వచ్చినది."

నరేంద్రుడు మేల్కాంచి నవ్వి "సుందరీ! నేనును సిద్ధముగానే యున్నాను. ఒక్క నిమిష మవకాశ మిమ్ము. నేను సిపాయి ధరించు దుస్తులును ఖడ్గమును ధరించి వచ్చెదను." అని బదులు చెప్పెను.

"యోధుడు చేయవలసిన కృత్యములు గాక నేటిరేయి నీ వితర కృత్యములు కొన్ని చేయవలయును. నివు వేఱు వస్త్రలు ధరింపవలయును. ఇదిగో నేను నీకొఱకుం దెచ్చినాను."

నరేంద్రుం డా దుస్తులను బుచ్చుకొని చూచి, "ఎందు కివి? ఆడుదాని దుస్తులు" అని క్రిందం బడవైచెను.

"ఔను! అవి యాడుదాని దుస్తులే."

"అట్లయిన నవి పురుషునకు శూరునకు ధరింపందగవు."

"నీవు వీరాలాపము లాడితివనియుం, జచ్చినను బ్రతికినను నరకుం జేయక నాకు మాట యిచ్చితివనియు నే ననుకొంటిని." అని క్రూరమైన చూడ్కులు చూచుచుం బెదవులం జిఱునవ్వు వెలిబుచ్చుచు నుత్తరము జెప్పెను.

"ఔను! పురుషునకుం దగిన వ్యాపారమునందు సాయముచేసెదను" అని శాంతముతో నరేంద్రుడు బదులు చెప్పెను.

జలేఖ మరల చిఱునవ్వు నవ్వెను. కాని యా చిఱునవ్వు నిముసములో నంతరించెను. ఆమె తనమొగము నరేంద్రుని చెవియొద్దం జేర్చి గుసగుసలాడుచు నిట్లనియె: "యోధుడా! నరేంద్రా! నీప్రాణము, నా ప్రాణము, నొక గొప్పయంతఃపురస్త్రీ గౌరవము, నీ యాగీకారముపై నాధారపడియున్నవి. వీరపురుషోచితముగా నీకృత్యము జేయుటకు వ్యవధి లేదు."

నరేంద్రుడు మాటాడక యొప్పుకొనెను. ఉత్తర కోశస్త్రీలు ధరించు

నట్టి పెద్ద నిలువుటంగీ, యతఁడు పటకాసు, కత్తిని వ్రేసట్లు తొడుగుకొనెను. అతఁడు దానిని సరిగాఁ దొడుగుకొనలేకపోయెను. జలేఖ నవ్వుచు వచ్చి తొడుగుకొనుటలో నతనికి సాయపడెను. తలవెండ్రుకల టోపీ యొకటి తెచ్చి గుస్సీ యామె యతని తలపై సమర్చి ముడి బెట్టెను. ముగము సగముసగము గనఁబడునట్లు మేలిముసుగు వైచెను. ఒకశాలువ యతని వక్షమును వీపును గ్రమ్మునట్లు గప్పెను. మెడలో పగడాలహారము వైచెను. బంగారపుగాజులు మిక్కిలి కష్టముతో నతని మోచేతులకు దొడిగెను. గల్లుగల్లు మనునట్లు వెండి యందెలు కడియములు గాళ్లకుఁ దొడిగెను

"రాజాస్థానమందలి సామంతు లందఱీ పోడుగుపడతిని దప్పక ముద్దుపెట్టుకొందురు" రని వేషము పూర్తియైన తరువాత జలేఖ నవ్వుచుఁ బలికెను. వినుగుదలచే నరేంద్రుని మొగి మెఱ్ఱవడెను. అందుచే నతఁ డా మాటలకు బదులు చెప్పలేదు.

అనంతర మామె గోడలో నమర్పఁబడిన యొక సన్నదిడ్డికంత తలుపు దెఱచెను. ఎంతశ్రద్ధతో శోధించినను, బట్టపగలు సైతము దాని నెట్టి నిపుణుఁడును గనిపెట్టలేఁడు. అద దాటి వారు కారుచీఁకటి దారిలోఁ బడిరి. ఈ గుమ్మమునుండియే గాఁబోలు జలేఖ మాటిమాటికి నేను జబ్బుతోఁ బండుకొన్న గదిలోనికి వచ్చి యిట్టె మాయమై పోవు చుండెడిది యని నరేంద్రుఁడు తనలో ననుకొనెను.

నరేంద్రుఁ డా గాఢాంధకారములోఁ దడుముకొనుచు వెళ్లవలసి వచ్చెను.

"అక్కా, షరీఫా! జాగ్రత్త. ఇక్కడ మెట్లున్నవి. అవతల పంపుదారు లున్నవి. ఇది మొదలుకొని నీవు నాతక్కగారు పొదువు ఉత్తరదేశమునుండి వచ్చితివని చెప్పుదును. ఇది మఱచితివా నీప్రాణము నాప్రాణమును బలియగును." అని జలేఖ నవ్వుచుఁ బలికెను.

ప్రస్తుతస్థితిని, దనకు గాంగల యుపాయములను నరకునేయుకొని నరేంద్రుండు తనపైం బడిన విపరీతకార్యమునకు నచ్చెరువందుచు దానిం జేయ నుబలాటపడుచుం బరిహాసములో సముగ్రముగాం బాల్గొనెను. పాల్గొని, సర్వ కాలుజాతి యొక్క దెట్టుమీఁదం బడెను.

"అక్కా, షరీఫా! నే ననుకొన్న దానికంటె నీవెక్కువ ఖంగారు పడుచున్నావు. మన యుత్తరభూములనుండి నీవు క్రొత్తగా వచ్చితివి. హిందూశిల్పులు కట్టునట్టి దారి తెలియదు. యీ చమత్కారమందిరములసంగతి నీకుం దెలియదు. నీవు నా హావాలాలో నున్నప్పుడు నీ కేదైన దెబ్బతగిలెనా యుత్తరదేశమందున్న మన యమ్మ నన్ను గట్టిగా దండించును. ఈ చీఁకటిదారిలో నెన్నో మెట్లున్నవి. ఎన్నో వంకరటింకరమలుపు లున్నవి. కావున నాచేయి పట్టుకో!" అని జలేఖ హెచ్చరించెను.

మెత్తనై వెచ్చగ నున్న యామె భుజము పట్టుకొనుట యతని కిష్టమె. అందుచే మెట్లమీఁదం దడఁబడి పడునను భయము లేకపోయినను నతఁ డామె చేయి మిక్కిలి గట్టిగా నొక్కి పట్టుకొనెను.

"అక్కా, షరీఫా! నీశరీర మెంత మోటగా నున్నదే! నీచేయి తాఁకినవారు మగవానిచేయి యనుకొందురు. ఆడపిల్ల సుకుమారముగా నుండవలయును. ఏమన, జవరాలు మృదుమధురభావములచేత నేగదా ప్రియుని వలపింపఁగలుగుట."

"చెల్లెలా! నీవు నాజూకుతనమునకుఁ బేరుపడితివి. కాని, జవరాలు పురుషునియొద్ద నొకప్పుడు మోమోటముండవలయునని కోరెదను. ఆధునాంధ్రమైన మనమందఱును సాధారణముగా, నాజూకుగా నుండవలెననియే కోరుచుందుము."

"అక్కా! [illegible] లిట్లుండవచ్చునా?"

"సోదరీ! [illegible] మన్నించుము. నీవు నాకుఁ జేసిన మేలు

నెన్నడు మరువజాలను."

"అక్కా! నీవు సోదరీ ప్రేమతోఁ బలికితివి. మిక్కిలి సౌభాగ్యవతి యయిన స్త్రీ పలుకవలసినట్లు పలికితివి. నిన్ను హిందూస్థానీ స్త్రీని జేయఁ దలంచుకొన్న యౌవనశాలి యొక్క పురుషలక్షణము లైన నీ మనసునకుఁ బట్టువడిన వా యేమి?"

"చెల్లెలా! జలేఖా! నీవు సరిగా నూహించితివి. అది నిజము. నా జబ్బులో నన్నొక పొడుగుపాటి పడుచువాఁ డుపచారముజేసి కాపాడెను అతనిమీఁద నేను కన్ను వేసితిని. అతని తెల్లని దీర్ఘబాహువులు నిరుపమానములు. అతనికన్నులు నక్షత్రములవలె మెఱయుచుండును. అతఁడు నాకేదో మంత్ర ప్రయోగము చేసెనేమో యని భయపడుచున్నాను. అతని యెఱ్ఱని పెదవు లెప్పుడప్పుడు చిఱునవ్వుతో వెలయుచుండును. కాని, యతని కన్నొబనుముడి నన్ను వెఱపించుచుండును. అతఁడు క్రూరుఁడుగాఁడు పయికల్లు గనఁబడుచున్నాఁడని నేఁ దలంచెదను!"

"అక్కా! అటువంటివాని విషయమై జాగ్రత్తగా నుండుము. అతనిమీఁద వలపు నిలుపుకొనుము—నిలిపితివా యావజ్జీవము వానికి దాసివై యుండుము."

"చెల్లెలా, జలేఖ! ఔనౌను. నేనిదివఱకే వానికి దాసిననైనాను. అతఁడు నన్ను గొలుసునఁగట్టి యీడ్చుకొని పోవుచున్నాఁ డది నేఁ దెలుపఁజాలను. నీ వెన్నఁడైన నిట్టి దనుభవించితివా?"

"లేదు పరీఫా! లేదు. నేను గొలుసుతో బంధింపఁబడు దాసినవై యుండుటకుఁ బుట్టలేదు. నాకు వలపుకాఁడు కావలసిన—నాయాజ్ఞ శిరసావహించి నాకు విధేయుఁడై యట్టి పడుచువానిని, దాసినైయుండి బోయి క్రయము కుఁ దీసికొందును. నేను చిన్నదాన నైనప్పుడే నా తల్లి కైజాగుమల్లిక యను దేశించినది. మగవాండ్రు [illegible]

జేసికొనుటకు మాకది యుపయోగించును. ”

“ చెల్లెలా! ఆ కైజాను మంత్రమిదివఱ కెవనిమీఁదనైనఁ బ్రయోగించితివా! జన్మములో నాచారముచేసి నీవు వాడిన యా వీరబాల మునిపైఁ బ్రయోగించితివా? ”

“ అక్కా! నీ వతి విచిత్రమైన దానవు. నీ తలలో పురుగునాలుక యున్నదని తోఁచుచున్నది. ”

“ కాదు లేదు. నీవు తోడఁబుట్టిన దానితప్పు మన్నింపవలయును. ఒకానొక లేఁబ్రాయమువాఁడు, పిల్లనగ్రోవివాఁడు నా మనశ్శాంతికి భంగము గలిగించినాఁడని నీతో జెప్పలేదా? ఇల్లువిడిచి సౌఖ్యము లేక ద్రిమ్మరుచున్న లేఁబ్రాయము గలవాఁ డెవఁడో నీకు జ్ఞాపకములేదా? అతనిమీఁద కైజాను మంత్రమునుగాని, నీ వాఁడిచూపు బాణముగాని ప్రయోగించి చూడవచ్చునే?”

“ అక్కా మహిషా! నీవు నెఱజాణవే. నీవు మేధకురాలవని నే నను కొనుచున్నాను. ఒక లేఁబ్రాయము వాఁడున్నాఁడు. అతనిమీఁద నేనిది ప్రయోగింపఁదలఁచితిని. అతఁడు ధైర్యశాలి. సుందరుఁడు. కాని యొతనూహకరుఁడో యెంత మోసగాఁడు కావచ్చునని తోఁచుచున్నది. ఈ దేశపు కామినీజనులకు వంచకుఁడై యుండవచ్చును. నే నలచిన శాలినీఁడు మఱియొక యువతిపై వలపు నిలిపియుండవచ్చును. అతఁడు మృదువైన మాటలతో నన్ను వంచింపఁదలఁచు చున్నాఁడు. ”

ఆ పలుకులు విని నరేంద్రుఁ డాశ్చర్యపడెను. ఇది యదృచ్ఛగా వచ్చిన పలుకా? లేక, నా పూర్వవృత్తాంత మీమె యెట్లయినఁ దెలిసికొన్నదా యని నరేంద్రుఁడు తనలోఁ దలంచెను. అంతట నిద్దరు [illegible] దారి [illegible] పోయిరి.

అక్కచెల్లెండ్రు [illegible] తలుపు [illegible] అది [illegible] దాసియుఁగాను [illegible]

మడతబడి యుండెను. నక్షత్రములకాంతి జలేఖ మొగముపైఁ బ్రసరించెను. ఆ మొగము వింత ప్రకాశము దాల్చెను. ఆ మొగము వెంటనే మాఱిపోయెను. సంతోషము నాయము ప్రకాశించెను. ఆ వాకిలి మొనటినుండి ప్రవహించు నాడిచూచుచుండి నాకు పరిశీలించి చూచెను. సఖికూఁతలు, ఆపలివాండ్ర యడుగుల చప్పుడులు నామెకు వినఁబడెను. ఆమె మనస్సు కలఁతపడఁజొచ్చెను. కలఁతయే గాదామె భయపడియున్నది. ఎంతో రహస్యముగ వినఁబడి వినఁబడనట్టు నామె పలుకఁజొచ్చెను.

"బాలవీరుఁడా! వినుము. మర్మము తీయు విడిచి పలుకవలసిన సమయము వచ్చినది. నీ వంశము దెలిసికొని ధైర్యముతో సంతయు నెదుర్కొనవలయు. ఎత్తుగోడలతో నావరింపఁబడిన యీకోట యాగ్రాకోట. ఇది నీ విదివరకే యూహవలనఁ దెలిసికొనియుందువు. ఇటువంటికోట భూలోకములో లేదు."

"జలేఖా! నే నిదివఱకే యట్లూహించితిని. కాని. చెప్పు చెప్పు, నీ మాట కడ్డమురాను."

"నీ గదిమీఁది మిద్దెమీఁద నుండి నీవు చూచినది యీకోటయొక్క వెలుపలిభాగము. దివ్యమగు భవనములును, సార్వభౌముని మహాసామంతుల గృహములును నక్కడనున్నవి. ఉద్యోగస్థులు, నౌకరులు రేయింబవళ్లు వాని గాచుచుందురు. అంబరురాజపుత్రికయు, చక్రవర్తిగారి రాణులలో నొకర్తెయునయిన దేవికక్కడ నొకమేడ యున్నది. అందులో నాకు జ్యోతిష్కులు, వైద్యులు నుందురు. మానసింగు మహారాజా మెకు మేనల్లుఁడు. నీవు బ్రతుకుదువని నెవ్వరును దలఁపనిదశలో. సతనికోరికమీఁదనే నీవా దివ్యభవనములో రోగముక్తుండవఁగలిగితివి. నీబుబ్బులో చక్రవర్తిగారి వైద్యులు నిన్ను జూచి మందిచ్చిరి.

“ఆ మహారాజు మిక్కిలి మంచివాఁడు. నాకు నాకుటుంబమునకు మేలుచేసెను. నేను దండ్యుఁడనైనప్పుడు నాకు సంస్థానమిచ్చి నన్ను బహూకరించెను. మృత్యుముఖమునుండి తప్పించి రక్షించెను.”

“అతఁ డెంతదయాళువో యెంతయుదారుఁడో, యంతగొప్పవాఁడు, నంతసమర్థుఁడు. అతనిచెల్లెలినే యువరాజగు సలీమునకిచ్చి వివాహము చేసిరి. ఇటుమీఁద నతఁడె చక్రవర్తియగును.”

“ఔను! నే నాలాగె విన్నాను.”

“ ఈరాత్రి నీవతనిని జూచెదవు.”

“ఏమి! యువరాజగు సలీమును జూఁడగలనా?”

“సలీమునే కా, దాయనతల్లిని, నాయనహృదయముమీఁద ముద్రితమైన మఱియొకవ్యక్తియొక్క యద్భుతవిగ్రహమును గూడఁ జూచెదవు.”

“జులేఖా! నీమాటలు విచిత్రములుగా నున్నవి. రాజకుటుంబములోని వారికనులు దక్క, నితరులకన్ను లాయంతఃపురస్త్రీలఁ జూడఁ గలవా?”

“ఔను! రాజకుటుంబములోని పురుషులు దక్కఁ దదితరపురుషులు వారిం జూడఁజాలరు. కాని, నేఁటిరాత్రి నీవాడదానవు. నాసోదరివి యైనమాట మఱచితివా?”

ఆ వీరబాలుని హృదయము ధైర్యవంతమైనదే, కాని జులేఖాయొక్క పన్నుగడలు విన్నప్పుడు వానిమొగము వెలవెలఁబాఱెను. విచ్చుకత్తులుదాల్చిన నూఱుగురు రాజభటులు గాచుచున్న యంతఃపురమును నాఁడువాని వేసము వేసికొని ప్రవేశించుట మృత్యుముఖము ప్రవేశించుట యని యతఁడు భావించెను. కాని, యాలోచించి కర్తవ్యము నిశ్చయించుకొనుట కతనికి జులేఖ యవకాశమీయలేదు.

“ఈ నాళికాపు పెద్దరాతిగోడ కనఁబడుచున్నది చూడుము!

పెద్దగోడ రాణులయొక్కయు, నాగ్రాలోని బేగములయొక్కయు రాణి వాసముల నావరించియున్నది. ఈవఱ కేమనుష్యుఁడు నెక్కి దాఁటి మరల బ్రతికివచ్చియుండని యాపెద్దగోడ నేఁడు నీవెక్కి దాఁటి యావలకుఁ బోవలెను. ఇదివఱ కేపురుషుఁడుఁ జూచియెఱుఁగని యాసుఖముల నేఁడు నీవు చూతువు.”

“ఎందు కీ పిచ్చిసాహసము?”

“నీకుండె తాళుటలేదా? తిరిగివచ్చుటకు వ్యవధియున్నది. భయ ములేదు.”

“నా విధికృత్యములయం దెప్పుడును ధైర్యవంతమైయుందును. తాళక పోవుటలేదు. కాని, గౌరవనీయుఁడై మహామహుఁడైన యాచక్రవర్తి యంతఃపురము, నాఁడుదాని వేసము వేసుకొని, చొచ్చి, పవిత్రమైన రాణివాసముఁ బ్రవేశించుట నావిధికృత్యమా? అది తెలియఁ జెప్పు?

యంతఃపురస్త్రీలలోనెల్ల నత్యున్నతపదవి నిరమీఁద నాక్రమింపఁగల యామెయే నిన్ను రమ్మని యానతిచ్చినది. ఆమె నోటితో నామెయే నీవు జేయవలసినపనిని గుఱించి యాజ్ఞాపించును.”

“అట్లయిన దారిదీయుము. నీవెంట నేను వచ్చెదను.”

౧౧

వారిరువురు నక్షత్రములమందకాంతిని ముంగిలివాకిలి దాఁటి యావలకుఁ బోయిరి.

అభ్యంతరమందిరములకుఁ దీసికొనిపోవు కవాటమునొద్ద జనానా కావలివానిపై నాజ్ఞాయుండెను. అంతఃపురము గాచువాఁడగుటచేఁ జక్ర వర్తి యాతనిని స్వయముగా నెఱుఁగును. ఆకారణమున నమ్మరావులు, మహారాజులు, నవాబులు, రాజులు ధనమిచ్చి, కానుకలిచ్చి యతనిదయ

నవేక్షించుచుండును. అంతఃపురదాసీజనము వానిపేరు జెప్పిన గడగడ వణఁకును. అతఁడు ప్రతిదాని నామధేయము నెఱుఁగును. ప్రతిదాని నానవాలు పట్టఁగలఁడు. తరుచుగా వాని యదృష్టము వానిమాట మీఁదనే యుండును.

"అదిగో! మస్రూరు" అని కొజ్జానుజూపి జలేఖ భయముచే వడఁకెను.

"మస్రూరనఁగా నెవరు?"

"ఊరకో!"

జలేఖయు, వానిమిత్రురాలును ద్వారముకడకుఁ బోయిరి. మస్రూరు తననల్లమొగము మందహాసము వెలయఁ జేయుచు బలుకరించెను.

"తార్తారుపడుచా! జనానావిడిచి నీవు ప్రొద్దుపోవువఱకు వెలుపల నుందువు. ప్రతిరాత్రి క్రొత్తక్రొత్త స్నేహితులను సంపాదించుకొనుచుందువుగాఁబోలు! ఇప్పుడు నీవంతఃపురమునకుఁ దీసికొనిపోవుచున్న యీ జవరాలెవ్వతె? ఈమెను నేను మునుపెన్నఁడుఁ జూడలేదు."

"మస్రూరూ! చిత్తగించుము. ఈమె నాతోఁడఁబుట్టినది. ఈమధ్యనే హిందూస్థానమునకు వచ్చినది. అంతఃపురములో నామె యుద్యోగము సంపాదించుకొనవచ్చినది. దొరికెనా నీకుఁ బరిచితురాలగును."

"కావచ్చును. పనియు దొరకవచ్చును. జలేఖా! వాఁడికైజారులుకల తార్తారుపడుచులు ముఖ్యముగా నీక్లిష్టసమయములలోఁ గావలసియున్నారు. నీతోఁడఁబుట్టినది వింజామరలు విసరుటకంటె కైజారులుపయోగించుట కెక్కువగాఁ బనికివచ్చునట్లున్నది. అల్లాకు మనమీఁద ననుగ్రహము గలుగుఁగాక! వెలుపలి ప్రపంచమునకుఁ దెలియకుండ నెన్నోరహస్యకృత్యములీయంతఃపురమున జరుగుచుండును గదా! నీతోఁడఁబుట్టిన దీకవాటముదాఁటి పోవకమునుపు చాటుగా నామెతో నేనొకమాటాడవలెను. ఏమన్న, నామె వాలకములోను

నడకలోను నేనొక క్రొత్తపద్ధతి కనంబడుచున్నది. అందుచే నామెంగూర్చి లెస్సగాఁ దెలిసికొనవలెను.”

అనవుడు జలేఖ పరములలో రక్తము బాఱి యెఱ్ఱగ నొప్పువడ నెంతో శాంతముగా నతనితో నిట్లనియె—“మాటాడవలెనా! ఈ రాత్రి వద్దు. ఆమెకు మనదేశపుమాట రాదు ఆమె మనమాట త్వరలోనే నేర్చికొనును. ఆమె తెలివిగలది. అప్పుడు నీతో గర్వముతో మాటలాడఁ గలదు. అయ్యా! దయచేసి మమ్ముఁ బోనిమ్ము.”

“నీ మాట నిజమె. నేను కాదనను. నీతోడఁబుట్టినది జనానాకుఁ గ్రొత్తదె. క్రొత్తపడుచుయొక్క చక్కని మొగము నొకసారి చూచిగాని యామెను లోపలికిఁ బోనిండు.”

ఆపలుకులువిని జలేఖ విసుగుతోను, బెట్టలుకతోను, బెదవిగఱచుకొని మొగము జేవురింపఁ గంఠస్వరమునఁ దనయలుక గొంచెముచూపుచు నిట్లనియె—“నేను రాణియైన జోడుబాయిగారి దాసినని నీవెఱుఁగుదువు. నాతోడఁబుట్టినది రాణిగారియుత్తరువు ననుసరించి నావెంట వచ్చుచున్నది. ఇదిగో రాణిగారియుంగరము. ఆనవాలు చూచుకో. మాయక్కను నీవు తాఁకితివా రాణిగారికి నీవు జవాబు చెప్పవలసి యుండును.”

అదివినఁగానే కొజ్జావాని మొగము మఱింత నల్లఁబడెను. అతని కన్నులు కోపము సూచించెను. అతఁడుంగరమును బాగుగాఁ బరీక్షించి రాణి దేయని గ్రహించి యాయుంగరమునకు నేల జాగిలఁబడి మ్రొక్కి మాఱుమాటాడక జలేఖను, నెచ్చెలిని లోనికిఁ బోనిచ్చెను.

“ఆపొగరుబోతునకు నీవు గర్వభంగము జేసితివి. ఇఁక ముందు నీ విషయమై యతఁడెన్నఁడు నిట్లు జేయఁడు.”

“అటులనవద్దు. ఆనల్లపీనుఁగుపగ పాము పగవంటిది. వానిసంగతి నీవెఱుఁగవు. ఈ రాత్రి నేను వానిని విరోధిని జేసికొంటిని. ఆఁడుది

పరాభవమును మరచిపోవచ్చును; మగవాఁడు మఱచిపోవచ్చును. కాని యాఁడుది మగవాఁడుగాని యాకొజ్జాతొత్తుకొడుకు మాత్రము మఱచిపోఁడు. క్షమింపఁడు."

అంతట జలేఖ పెదవులపై వ్రేళ్లుపెట్టుకొనెను. ఇద్దరు సాగివెళ్ళిరి. స్ఫటికశిలలతోను వెలఁగలరాళ్ళతోను నిర్మింపఁబడిన యనేకసౌధము లను గడచి వారువెళ్లిరి. గోపురములు మేడలు నక్షత్రకాంతిలోఁ దళ తళ మెఱయుచుండెను. మార్గములయందుఁ గావలిగాచు స్త్రీలు కత్తులు, కైజారులు ధరించియుండిరి. ఆశీతకాల రాత్రియందలి చీఁకటి యంతఃపురములలోని దీపములవలనఁ గొంత తగ్గెను. కోటగోడ కావల నున్న యమునానదీ ప్రవాహధ్వని కొంచెముకొంచెము వినఁబడు చుండెను. ఎట్టకేలకు వారు మిక్కిలి గొప్పసౌధముకడకుఁ బోయిరి. లోన పెక్కుదీపములు ధగధగ వెలుఁగుచుండెను. సంగీతధ్వని, బయ టికి బాగుగా వినవచ్చెను. జలేఖ మెల్లగా ద్వారముదెఱచెను. వా రిద్దరు గొప్పచావడిఁ బ్రవేశించిరి.

చెమికీ పనితనముగ ప్రశస్తమైన బనారసు పట్టువలువలు పఱుపఁ బడిన యెత్తైన వేదికమీఁద, యువరాజగు సలీము కూర్చుండెను. ఈయన యక్బరుచక్రవర్తి జ్యేష్ఠకుమారుఁడు; భవిష్యచ్చక్రవర్తి. వెండిదీపపు గంబములమీఁద నత్తరుదీపములు వెలుఁగుచుండెను. కాబూలునుండివచ్చిన శ్రేష్ఠమైనఫలములు స్ఫటికపుగిన్నెలలో నుండెను. బంగారుగిన్నెలలో షిరాజునుండివచ్చిన మేలుసారాలు ధగధగ మెఱయు చుండెను. రాజపుత్రరాజ్ఞి, యక్బరుచక్రవర్తి పట్టపుదేవి యగు జోధ్బాయి, తనకుమారుఁడు సలీమునకు విందుసేయుచుండెను. మందిర మంతయు దీపములతోఁ బ్రకాశించుచుండెను. ఆగ్రానగరములోని 'కంచను' లని చెప్పఁబడు వేశ్యాంగన లర్ధచంద్రాకారముగా సింహాసనముచుట్టు నిలిచి యాటలు, పాటల నతనినివినోదపెట్టుచుండిరి.

ఆయన కనుగుణముగా వారు నృత్యము త్రొక్కుచుండిరి. అభినయవశమున రాజకుమారుని గౌగిలించుటకోయనునట్లు వారు చేతులు చాచుచుండిరి వారుధరించిన విలువలగల చీరలమీద బంగారునగలు ధగధగ మెఱయుచుండెను. ఎట్టకేలకు సంగీతమాగిపోయెను. పాటలణగెను. ఆటకత్తెలు వలయముగాగాక తలలువంచి చేతులు జోడించుకొని రాజకుమారుని కెదురుగా నిలువఁబడిరి.

రాజకుమారుడగు సలీము సంతసించెను. మొగము సారాయము త్రాగిన చిహ్నములు లెస్సగఁ గలిగియుండెను. అచ్చరలవంటి యాపడుచులు జూచునప్పుడాతని కన్నులు మెఱసెను. ఆటవెలఁదులకుఁ దూరముగా, స్ఫటికకుడ్యములకుఁ జేరఁబడి, తలలువంచుకొని మాటాడక దాసీజనము వినయవిధేయతలతో నిలువఁబడియుండెను. వారినడుమ నొక స్ఫటికస్తంభముప్రక్కను జలేఖయు, నామె నెచ్చెలియు నిలువఁబడి యుండిరి.

అప్పుడు సలీము తల్లితో నిట్లనియె—"అమ్మా! నీదగ్గఱ మిక్కిలి యందగత్తెలైన నటకత్తెలున్నారు. వాండ్ర పాటలు నాకింపుగానున్నవి. నేను ప్రయాణమై వెళ్ళుటకుముందు నా కీవిందు నీవు చేసినందుకుఁ జాలసంతసించుచున్నాను. నేను దూరము వెళ్ళినప్పుడు నిన్ను, తప్పక తలంచుకొనుచుందును."

అనవుడు పుత్రవత్సలయగు మాత యిట్లనియె—"కుమారా! నాయానందమే నీవు. నామనోరథమే నీవు. నిన్ను జూచుట, నీకు విందుసేయుట నాకుఁ బరమప్రియము. తండ్రిగారు ప్రపంచములో నెల్ల గొప్ప చక్రవర్తి! అంతటియోగ్యులు మఱియొకరులేరు. ఆయన యడుగుజాడలలోనే నీవు నడువుము. నీ రాజపుత్రమాతను మఱువకుము. హిందూప్రజలను దయతోఁ గావుము."

తల్లిమాటలు కుమారుని చెవిని బడలేదు. ఏలయన, సారాయముల

మత్తువలన నతఁడు కన్పడు స్వాస్థ్యమును తప్పిపోవుచున్నది. చిన్ననాఁట నుండియు భోగపరాయణుఁడై పెరుఁగుటచే, నాయువరాజునకుఁ దండ్రి సద్గుణములన్నియు సంక్రమింపలేదు. అస్థిరమగుచున్న బుద్ధిమంతులు సామ్రాజ్యాధికారాత్రత నతిశయించిన పాపక, సామ్రాజ్య మెట్టి యవస్థలో నుండునో యనఁ జింతించుచున్నాఁడు. ఆ రాత్రి యువరాజు జహంగీరు, తల్లిని జూచుటకును, నానాటికిఁ దన హృదయమును నధిష్ఠించిన యొకానొక ముద్దుగుమ్మను గలసికొనుటకును వచ్చెనే కాని, విందులారగించు టకును, దల్లి దీవెనలఁ బడయుటకును రాలేదు.

"అమ్మా! అర్ధరాత్రియైనది. అటుకత్తెల చెక్కులయందలి గులాబి పోవులు శ్రమచేత వాడినవి. ఈ సంది నాటికి బహుమానము లిచ్చి పంపివేయుము."

అందఱు వెడలిపోయిరి. ఆభవనములోఁ దల్లియుఁ గుమారుండును, నమ్మికగల పనికత్తెలుకొందఱు మాత్రమే యుండిరి. జలేఖయు, నామె నెచ్చెలియు నక్కడ నుండఁదగిన వారిలోఁ జేరిరి.

"ఈదినములలో సాధారణముగా నీ వెక్కడెక్కడో యుందువు. తరుచుగా నాగ్రాలో నుండవు. నిరంతర ప్రయాణములచేత నీ మొగమును గొంచెము వెలవెలఁ బోవుచున్నది."

"అమ్మా! ఆగ్రాలో నాకుఁ బ్రియమైన దిప్పు డేమియు లేదు. ప్రయాణశ్రమకన్న, యుద్ధవ్యాపారముకన్న నుత్సాహభంగములు విషాదములు శరీరము నెక్కువ పాడుసేయును."

"నాయనా, సలీమూ! నీవు మున్ను పెండ్లాడఁదలఁచిన యాపార సీకకన్య మాటయా నీవిప్పు డనుచున్నది? మీతండ్రిగారు మంచి పనియే చేసినారు. ఆమెహరున్నీసా యిక్కడి రాజభక్తి గల యొక సేవకుని భార్య యైనది. అపవిత్రములైన తలంపులు నీ మనస్సులోఁ బెంచుకొనకుము. నీ యున్నతపదవికిఁ దగినట్లు మెలఁగుము."

ఆ పలుకులు విని సలీము తల్లి కుత్తరము చెప్పలేదు.

తల్లి కుమారునితో వెండియు నిట్లనియె: "నా రాజపుత్రజాతిలో మహోన్నతవంశములలోఁ బుట్టిన రాజపుత్రికలు పెక్కండ్రు నీ రాచపాన్పు నలంకరించి సామ్రాజ్యమునకుఁ బేరుప్రతిష్ఠలు తేఁగల బుత్త్రులకుఁ దల్లులైనారు. మానసింగుయొక్క చెల్లెలు నీ ప్రియకళత్రము గదా! ఆమె నీవలనఁ జక్కఁదనమునకు మగంటిమికిఁ బేరువడుచున్న కుస్రూకుమారునిఁ గన్నదిగదా, నీ జాతివారు, నీ మతమువారు నైన బేగములుఁ గూడ నీపాన్పు నెత్తుచున్నారుగదా. గౌరవనీయుడైన ఖాజాహాలుస్సేన్ కుమారిక గూడఁ జక్కని పరిపీసు కుమారునిఁ గన్నది గదా! ఉదయసింగుని కూఁతురు గూడ నీ ప్రేమకుఁ దాపలమై, ఖుర్రామను ముద్దులు మూటగట్టు కుమారుని నీకుఁ గానుకగా సమర్పించినది గదా! అతఁ డింకను పసిబిడ్డయేగాని, వాని చూపులు వాని తెలివితేటలు, వాని చక్కఁదనము మెచ్చఁదగినవి. టిబెటుదేశపు రాజు తన ప్రియపుత్రికను నీకు సమర్పించినాఁడు. రాజస్థానమందు ననమానపుష్పంబని పేరుగన్న జగత్సింగు పుత్రిక నీ భార్యలలో నెల్లఁ జిన్నదై నిన్ను సంతోష పెట్టుచున్నది గదా! నీ ధర్మపత్నులను బవిత్రమైన ప్రేమతోఁ జూచుకొనుము. ప్రస్తుతము షేరాఫ్ఘనుని ధర్మపత్నియైన మెహరున్నిసాయొక్క ప్రణయము నపేక్షింపకుము."

"అమ్మా! నీమాట వినుట యనగా శిరసావహించుటయె. నా తండ్రిగారి యిచ్చు భూమి కంతకు శాసనమె. రెండుజాములైనది. నీ నిద్రకు నేను భంగము జేయఁగూడదు. నేను మఱియొకరి దర్శనము చేయవలెను. మానాయనగారి జ్యేష్ఠపత్ని యగు సుల్తానారాఖియా బేగముగారి యెదుట నేనిప్పుడు హాజరు కావలెను."

"కుమారా! నీవిప్పుడు దర్శింపఁ దలచిన కాంత నా సోదరియైన రాఖియా బేగము కాదు. కాని, యిప్పుడు నిన్నపేక్షించునది [illegible]

రయొక్కర్తె. ఆ పారసీకకన్య మెహరున్నీసాను నీవు కడసారి చూడఁ గోరుచున్నావు. వెళ్లు చూడు! కాని, యామె యిప్పుడు షేర్ అఫ్ఘను యొక్క ధర్మపత్ని యను మాట జ్ఞప్తియందుంచుకో! పెండ్లియాడిన స్త్రీ కెంత గౌరవమున్నదనో యంత గౌరవమునకు నామె పాత్రము. నా దాసి జలేఖ నిన్ను నూరుచుక్క రాఖియాబేగమునకు నిన్ను దీసి కొనిపోవును."

రాజకుమారుఁడు మఱియొక గిన్నెఁడు సారాత్రాగి, తల్లికి సలాము జేసి భవనము విడిచిపోయెను. జలేఖయు, నామె మిత్రమును రాకొమరుని యంతఃపురముయొక్క మఱియొక భాగమునకు స్ఫటిక శిలాహర్మ్యమునకు దీసికొనిపోయిరి. యమునానది క్రొత్తగాఁ గట్టిన కోటగోడల నొరసి ప్రవహించుచుండెను. గాలి సుకుమారమై నెత్తావులఁ జిమ్ముచుండెను. ప్రపంచమంతయు నార్ధరాత్రమునఁ నిద్రామగ్నమై యుండెను.

సలీము రాత్రి ప్రసరించుచున్న ప్రకృతి సౌందర్యమును గణింపలేదు. ఆతని కన్నులు మొగమునెత్తిబడెను. రాఖియాబేగము సౌధమునకు వెళ్లు ప్పుడు మెట్లమీఁద నతని యడుగులు తడఁబడెను.

"తార్తారపిల్లా! నీ చక్కని మొగము నేఁడివఱకు జూచియుంటిని. నీ నల్లని కన్నులు నేను వెంటనే మఱచిపోలేదు సుమీ!" అని జలేఖ వంకఁ జూచి రాజకుమారుఁడు పలికెను.

"నేను దేవరగారి దాసిని. మహారాజకుమారా! నేను మీయమ్మగారి కొలువులోనున్న పరికత్తెను." అని జలేఖ వినయముతో బదులు చెప్పెను.

"ఈ పిల్ల నీతోడఁబుట్టినదా? తార్తారు బాలికలు మిక్కిలి పొడగరులు. నీయక్క నీకన్న మూఁడంగుళములు పొడుగుగా నున్నది. దాని మొగము నీ మొగమంత మనోహరముగా నుండకపోయినను

మగవా డ్ర వాలకములు గలిగియున్న యువతులను నేనసహ్యించు కొందును."

జలేఖ నిశ్శంకముగా నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను;—"రాజకుమారా! మాజాతి యంగనలహాలకములు మిక్కిలి మోటుగానుండును. మా మగవారు యుద్ధమన్న జెవి గోసికొందురు. మాయాండుపిల్లలు నిర్జనములయిన కొండలలో మేకమందలను గొఱ్ఱెమందలను మేపుకొను చుందురు. కైజారు ప్రయోగించుటలో మిక్కిలి నిపుణులు."

"మీ యక్కకు హిందూస్థానీభాష వచ్చునా? ముద్దుపెట్టుకొన నిమ్మని యడుగవలెనని యున్నది. ఆమె కామాట యర్థమగునా?"

"రాజకుమారా! మా యక్కకు మాభాషతప్ప మఱియొకటి తెలియదు. మా దేశములో ముద్దుపెట్టుకొనినిమ్మని యడిగితే చాల తప్పు. అడిగిన వానిని బడుచుకన్నెలు కైజారుతో బొడిచెదరు."

"మీ యడవులలోను, కొండలలోను మీ రడవిపిల్లులవలె సంచరింతురు గాబోలు! అయినను నీయుడిపిల్లిని ముద్దుపెట్టుకొనవలెనని నాకోరిక. అది నన్ను బఱికిననుసరె, కొఱికిననుసరే. ఆమెయధరము లో మంచి సారాలోనున్నంత సువాసన యున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. ఈ మోటపిల్ల నన్ను సంతోషపెట్టినా యామెను నా యంతఃపురమునఁ జేర్చుకొందును. మహమ్మదీయాంగనలు మోటవాండ్రు. రాజపుత్రాంగనలు మితిమీఱి వర్తింతురు. తార్తారపడుచు పచ్చిమాంసము వంటిది. అది మహామోఘులకు రుచించును."

నరేంద్రుఁడు జా సంభాషణమును వినుగుతోను, పిట్టలుకతోను బెదవులు విఱిచెను. అతనిచేయి యప్రయత్నముగా, పటకటమీఁదికి వెళ్లెను. అత్తఱి నేమాత్రము తెలివితక్కువ పని జరిగినను జలేఖయొక్కయుఁ, దనయొక్కయు శిరస్సులు ఛేదింపఁబడును. నరేంద్రుఁడు తప్పించుకొని పాఱిపోవుటకైన, మృతినొందుటకైన నవకాశముండునా యని కోట

గోడక్రిందఁ బాఱుచున్న యమునవంకఁ జూచెను. కాని, జహీఖ చిన్ననాఁటనుండియు రాచనగళ్ళలోఁ బెరిఁగిన దగుటచే నానోపాయము లందు మిక్కిలి కుశలురాలు. ఆపత్తులు తప్పించుకొనుయుక్తులు, చమత్కృతులు నామెకు బాగుగాఁ దెలియును. అందుచే ధైర్యవతియై యుండి, యుక్కుముక్కలవంటి తన బాహువులతో యువరాజును గట్టిగఁ బట్టుకొని చిఱునవ్వు మొలకెత్తు నెమ్మొగముతో మధురభాషణముల నిట్లనియె.

"దేవరవారి కన్ను దానిమీఁదబడి, మీ రామెను వలచి మీ యంతఃపురపరిచారికగా మాయక్కను బరిగ్రహించుట, దానికిని నా పితృవంశమునకును గొప్పగౌరవము. కాని నేఁటిరేయి యొకసుందర యువతి మీ దర్శన మపేక్షించుచున్నది. ఆమె మీ విగ్రహమును హృదయపీఠమున నిలుపుకొన్నందున దేవరవారియొద్ద సెలవు పుచ్చుకొని వెళ్ళదలచుచున్నది."

"ఆహా! నిజము చెప్పితివే తార్తారపిల్లా! ఆ సుందరి నా నిమిత్తము కనిపెట్టుకొని యుండును. నే నాలస్యము చేయఁగూడదు. ఆ పారసీక యువతి కటాక్షవీక్షణములలో నొక్కదానికైన, వేయిమంది హిందూ తార్తారపడఁతుల విలాసములు చాలవు."

వారందఱు విసవిస నడిచి గమ్యస్థానముఁజేరిరి. వారియెదుట మహోన్నతమయిన గొప్పసౌధమొకటి కనఁబడెను. దానిచుట్టు నెన్నో వింతవింత క్రొత్తపూల మొక్కలు, పండ్లచెట్లుగల తోఁట యుండెను. తెల్లని మల్లెపూలు నెత్తావులు వెదజల్లెను, గులాబి సంపెఁగ మొదలగు పుష్పములును, పరిమళమును విఱజిమ్ముచుండెను. యమునా నదీజలము తోఁటను దడిపి సౌధముచుట్టుఁ జిన్నికాలువలలోఁ బాఱుచుండెను. [illegible]ముల కాంతి స్ఫటిక గవాక్షములలో నుండి వెలుపలికి గనఁబడుచుండెను.

సలీము లోపలికిం బోయెను. జలేఖయు, మిత్రమును ద్వారముకడ నిలిచిరి. ఆనగరములోఁదనపరిచారకులు పరివేష్టింప, బంగారుపనిచేసిన మొఖమలు దుస్తులు ధరించి సన్నపట్టుమేలి ముసుంగుచాటునఁ దన నిరుపమాన లావణ్యతారుణ్యములు ధగధగ మెఱయుచుండ లోకైక సుందరి యగు నొకతె యుంగరన కూర్చుండెను. ఏ యువతీమణి చక్రవర్తి కుమారుని హృదయము నధిష్ఠించియుండెనో యట్టి మెహరున్నీసా యా కాంతయే.

౧౨

మెహరున్నీసా యొక్క చరిత్ర హిందూదేశచరిత్రములో వినసొంపై మిక్కిలి విచిత్రమైనది. ఆమెతండ్రి పారసీకుఁడు, సత్కులజాతుఁడు, కాని నిఱుపేదయై బాగుపడవలెనని హిందూస్థానమునకు రాఁదల చెను. పయనములో మార్గమధ్యమున గాంధారనగరము నొద్ద మెహరున్నీసా జన్మించెను. ఆ పసిబిడ్డనైనను రక్షించుకొనలేనంత దారిద్ర్యముగలుగుటచేఁ దలిదండ్రు లాబిడ్డను బాటమీఁద వదలివేసిరి. దయాళువైన యొకవర్తకుఁ డామెనుదీసి పెంచుమని యామెతల్లినే దాదిగా నేర్పఱిచెను. ఈ విధముగా మెహరున్నీసా పరమదరిద్రుని కడుపునఁ బుట్టి హిందూస్థానమునకు వచ్చి పెరిగి పెద్దదియై యిరువదియైదు సంవత్సరముల తరువాత భాగ్యము పండుటచే జక్రవర్తికిఁ బట్టపుదేవియై నూర్జహాను నామధేయముతో హిందూస్థానమంతయు నిరాఘాటముగాఁ బరిపాలించెను. నూర్జహానననఁగా జగజ్జ్యోతియని యర్థము.

ఆమెను బెంచుకొన్న వర్తకుఁడు కన్నతండ్రిని వ్యాపారమందుఁ బ్రవేశపెట్టి, యక్బరుచక్రవర్తి దర్బారునకుఁ బరిచితుని జేసెను. ఆమె తండ్రి త్వరలోనే ధనవంతుఁడై ప్రసిద్ధుఁడయ్యెను. తల్లి పాదుషా

యంతఃపురమునఁ బ్రవేశము గలదయ్యెను. ఆ యవకాశమునఁ బురస్కరించుకొని యామెతల్లి కూఁతును నంతిపురమునకుఁ బలాత్కారముగ దోడ్కొనిపోవుచుండెను. రాణులు, బేగములు, రాజపుత్రికలు నామెమీఁద ననుగ్రహము గలిగియుండిరి. మెహరున్నీసాకు నవయౌవన ప్రాదుర్భావమైన తోడనే సాటిలేని యామె చక్కఁదనము సకలహృదయముల నాకర్షించెను.

యువరాజగు సలీము హర్మ్యములమీఁదు నా పారసీకపు జవ్వ నొకసారి తండ్రి యంతఃపురమునఁ జూచి, యామె వలపును దగిలెను. వలపు క్రమక్రమముగ నతిశయమై నివారించుటకు వీలులేనంత తీవ్ర మగుటయు, నామెను సలీము వివాహమాడ సంకల్పించెను. ఆ వివాహము పనికిరాదని యక్బరు నివారించెను. అతని యానతిదోఁప నామె శూరుఁడైన రాజభక్తుఁడైన షేరాఫ్గను నతనికిచ్చి పెండ్లిచేయఁ బడెను. ఆమెభర్తకు బంగాళములో గొప్పపదవులు, జాగీరుల నక్బరు ప్రసాదించెను. మెహరున్నీసాను సలీము దృష్టిపథమునుండి తప్పించుటకుఁ బాదుషా యాజ్ఞాప్రకారమామె భర్తతో బంగాళమునకుఁ బోవలసియుండెను.

బంగాళమునకుఁ బయనము గాకమునుపు, చక్రవర్తి పెద్దభార్యయైన రాఖియాబేగ మామెకు దర్శనమిచ్చి యొకదినము తనయొద్ద నుంచుకొనెను ఆ సమయమున నామె సలీమునకుఁ గడసారి దర్శనమీయఁదలఁచెను.

సలీమా గదిఁ బ్రవేశించినతోడనే పరిచారిక లావలకుఁ బోయిరి. మెహరున్నీసా మాత్రమె యక్కడనుండెను. కాని తనమనోరథ మీడేరునని గంపెడాశతో వచ్చిన సలీమున కాశాభంగము గలిగెను. ఆమె వివాహితయైన స్త్రీ కుండవలసిన యాత్మగౌరవమెట్టిదో యెఱుఁగును. అదిగాక సామ్రాజ్యములో నున్నతపదస్థుఁడైన వాని భార్యయై దాన

గుట యెఱుంగును. ఆమె తెరచాటునకుం బోయి పోయినను మొగము గనంబడకుండ కేలితో నుగు దట్టముగ వేసికొనెను. అతనితో నామె మాటలాడుట సంగ్రహించినదిగాని, యది మితభాషణము, గౌరవ సమేతము. ఆ పలుకులవలన రాజకుమారుని కుత్సాహము గలుగ లేదు.

ఆమె చూపిన యనాదరణచేం గొంత విషణ్ణుండై "మధుర వాణీ! ఇదే మన కడపటి సమాగమమా!" యని రాజకుమారుం డడిగెను.

అది విని యాసుందరి మెల్లగ నిట్లనియె—"రాజకుమారా! మనము కలుసుకొననే గూడదు. ఏమన నేను వివాహితను; పరకాంతను. ఎంతటి చక్రవర్తికినైన—ఎంతటి రాజకుమారునకును—గూడ నేను గనం బడంగూడదు. కాని, నా బాల్యమునుండియు మహారాజ్ఞియైన రాణిమా బేగము, నాతల్లికన్న నెక్కువ మక్కువతో నన్నాదరించినది. ఆమె కోరిక యట్లగా శాసనము అగుటచే మన బాల్యస్నేహముచేతం గూడ నేను మిమ్ముజూడ నొప్పుకొంటిని" అని కడపటి మాటలు మెల్లగా ననెను

"నీ లుకు లన్నియు దారుణములు. నీ వొకరి భార్యవైతివను భావముచే మర్యాద కిట్లనుచుంటివి గాని, యివి నీయంతఃకరణశుద్ధిగా వచ్చిన మాటలు గావు."

"సంస్లిష్టయై యొకనికి నుగ్గనాలి కుండవలసినహృదయమే యుండును గాని వేఱొక హృదయము నుండనేరదుగదా?"

"ఓహో? నీ వాల్నగరములోని ఖాజీవలె మాటలాడుచున్నావు. మోహినీ! నేను కురానులోనుండి ధర్మపన్నములు వినుటకు నీయొద్దకు రాలేదు."

"రాజకుమారా! మగనాలై పతివ్రతగా నుండవలసిన యుత్తమ

కాంత పలుకవలసిన విధముగా నేను బలికితిని. కురానుగూడ పతి వ్రతాధర్మములను బోధించుట లేదా ?"

అప్పు డిద్దరు క్షణమూరకుండిరి. రాజకుమారుఁడు పీఠముపైఁ గూర్చుండియు మనశ్శాంతి లేక యుండెను. ఎవతె హృదయమును దా నాక్రమింపఁదలఁచెనో యామె కఠినోక్తులు పలుకుటచే నతఁ డుత్సాహశూన్యుఁ డయ్యెఁ దన కోరికయంతయు సంపూర్ణముగా నెఱవేరించినచో కార్యము పాకము దప్పుననియు, నామె కోపింపవచ్చు ననియు భయపడి మెల్లగ నిట్లనియె—

"కల్యాణీ ! నన్ను క్షమింపుము. దారుణజ్వరపీడితుఁడైన రోగి యొకప్పుడు వైద్యునియాజ్ఞ మీఱును. అట్లె తీవ్రకామాతురుఁడైన నిర్భాగ్యుఁడును మత గ్రంథములలోని మంచిమాటల మఱువవచ్చును. నాయభిప్రాయము సరియైనదైన పక్షమున నీ హృదయములోఁ గూడ ప్రేమాగ్ని కొంత వెలుఁగుచున్నదని చెప్పఁగలను. నాహృదయము నుండి యాప్రేమాగ్ని యెన్నటికి నారిపోదు. రెండు హృదయములు త్రెంపనలవిగాని బంధముచేఁ గట్టఁబడినప్పు డవి కలుసుకొనుటకు సాధనములు మన మతగ్రంథములలో నున్నవి."

"స్వామీ ! మీ మాటలు నా కర్థముకావు. పవిత్రమైన వివాహ బంధముచేత నే నిదివఱకే యొకని భార్యనై యున్నాను."

"ఆ పవిత్రబంధములను విడియాకులవలనఁ ద్రెంపివేయవచ్చును నేఁదలఁచుకొంటినా నాశాసనముచేత మన మౌలవీలు, ముల్లాలు నీకు, నీ భర్తకు విడియాకు లిప్పించఁగలరు. మనము హిందువులము గాము. వారిలో భార్యాభర్తలకు శాశ్వతబంధము గలదు. ఒకప్పుడు భార్య భర్తతో సహగమనముచేసి యగ్నిఁ జొచ్చును."

"రాజకుమారా! అగ్నిప్రవేశములు, సహగమనములు మనకక్కఱలేదు. ఇతరులనుసరించవలసినదియావశ్యకము పతిననుసరింపవలసినధర్మమె."

" మెహరున్నీసా! నాప్రణయమును నీ వాదరింపవేని నాకగ్ని ప్రవేశమైనట్లి యున్నది. నేఁ బ్రతుకుచున్నంత యగ్నిజ్వాల బాధ, సహగమనము జేసిన నే హిందూవితంతువుగూడ బడియుండదు. నిరంకుశాధికారియైన యామహమ్మదీ చక్రవర్తి యాజ్ఞ నన్నీప్రకారము యావజ్జీవము హింసింపవలసిన దేనా ?"

" రాజకుమారా ! నీ తండ్రియందు గౌరవముంచుము. ఆయన నీకొఱకు మహాసామ్రాజ్యము సంపాదించి యుంచినాఁడు. ప్రపంచమునం దెక్కడ లేని మేటిసింహాసనము నీకాయన యిచ్చిపోవును."

" నీవు నాతోఁ గలసి రాజ్యసుఖ మనుభవింపకపోయిన యెడల నాకు సింహాసనమెందుకు ? సామ్రాజ్యమెందుకు ? నిన్ను నాకౌఁగిట నుండి బలిమిని లాగివైచి నన్ను యావజ్జీవదుఃఖము పాలుజేసిన యాయనయెడ నాకుఁ గృతజ్ఞత యుండుమన్న నెట్లుండును. అట్టి పరాభవములను సలీము సహించువాఁడు గాఁడు. నాతండ్రి యెంతబలవంతుఁడైన—నేఁత వైభవాఢ్యుఁడైనను నేను మహాసాహసుఁడనని తెలిసియుండవలసినదె. "

" అయ్యో! చాలు చాలు! అట్లు పలుకవలదు. గోడలకు చెవులుండును. పూజ్యుఁడైన మీజనకుని పద్ధతులు వివేకముతోను మతధర్మముతోను గూడినవి. కావున నాయనయాజ్ఞ మీరు శిరసావహించుట మీకు ధర్మము శ్రేయస్సును."

"మతధర్మమా! ఆయనకు మతము కలదా? ఆయన కాఫరు. సూర్యారాధకుఁడు; కాని మహమ్మదీయుఁడు కాఁడు. ఆయనయు, మతద్రోహియైన అబుల్ ఫేజలును గలసి క్రొత్తమత మొకటి కల్పించినారు. అది దేవమత మఁట. దాసిచేఁ బనికిమాలిన హిందువులతో వారు మనలను గలుపఁదలచు కొన్నారు."

అనవుడు కోపము నణఁచుకొనలేక యామె యిట్లు బలికెను—

"రాజకుమారా ? ఇట్టి మాటలు నేను విన సహింపను. నాభర్తను గౌరవించి జాగీరులు మొదలగునవిచ్చిన గొప్ప పాదుషావిషయమున గౌరవహీనములైన మాటలను నేను వినఁజాలను. కాఫరులు కాఫరులని నీవనుచున్నావు. మీతల్లిగారు గూడ నాకాఫరుజాతిలోఁ జేరినదే గాదా? స్త్రీజాతిలో నలతటి యుత్తమోత్తమ గుణసంపన్నురాలు గలదా ?"

ఆ పలుకులవలన గర్వభంగము కాఁగా నతఁ డిట్లనియె——

"మెహరున్నీసా! నన్ను క్షమింపుము. నాప్రియజనని గురించి గాని, నాకెంతో యపకారము చేసినప్పటికి నాతండ్రిని గురించిగాని గౌరవహీనముగా మాటలాడుట కిక్కడికిరాలేదు. ఆయపకారమునకు ప్రతిక్రియ చేసికొనుటకే యిక్కడికి నేను వచ్చినాను. నీకిష్టమైనయెడల నాకు సాయమునుచేసి కార్యసిద్ధి చేసెడి భారము నీపై నున్నది. నాయేర్పాటు లన్నియుఁ జేసికొని సిద్ధముగా నున్నాను."

"మీరు మర్మగర్భముగా మాటలాడుచున్నారు. అదియేదో స్పష్టముగాఁ జెప్పండి."

"నీవు కొన్ని వారములవఱకో, మాసములవఱకో యెక్కడనో రహస్యముగా దాఁగియుండవలెను. పిమ్మట నంతయు బాగుగా జరుగును. నీభర్తయగు షేరాఫ్ఘనుకు నాతండ్రి యిచ్చిన దానికంటె, పదిరెట్లు బహుమానము నేను చేసెదను. అందుచే నతఁడు నీతో విడియాకులు పుచ్చుకొనుట కొడంబడును. యువరాజు కోరినప్పుడు ముల్లాలు దానికి సమ్మతింతురు. మాతండ్రి జీవించియుండఁగాఁ గూడ నీవు నాప్రియురాలవై భార్యవై యుండవచ్చును."

ఇట్లని పెదవులు పరిహాసముసూచింప నవ్వి యామె యిట్లనియె.

"మీయుపాయము చాల బాగున్నదండీ! కాని, కొన్ని చిన్నసంగతులు మీరు మఱచిపోతిరి. కత్తిపట్టినశూరులలో నగ్రగణ్యుండు

నాథ_ర్త. మరణభయముగాని, మహాసామ్రాజ్యవైభవాశగాని, యతని చలింపఁజాలదు ఆయన గౌరవమునకు, ప్రేమకు నాస్పదురాలైన భార్య నాతఁడెన్నఁడు విడిచిపెట్టఁడు కొన్ని నెలలలోనో, వారములలోనో నేను నీభార్య నగుటకు మాఱుగా, నాథ_ర్తతోఁ గలిసి చక్కని బంగాళాదేశమున కరిగి సుఖముగా నుందును. అది మాతండ్రిగారి యిచ్ఛయు నాజ్ఞయు."

"మెహరున్నీసా! నేను యుద్ధములయందు దారితేరిన యోధుఁడను. నీకడకు రాకముసుపే నేను తగిన యేర్పాటులు చేసికొంటినని నీవెఱుఁగవు గాఁబోలు? కత్తులు మిక్కిలి నిపుణతతో నుపయోగింపఁగల తార్తారపడఁతు లిద్దఱు ద్వారముకడ వేచియున్నారు. ఈయంతిపురిలోనున్న కొజ్జాలందఱిలో దండిమగలైన యిరువదిమంది యావలివాఁకిటిలో సిద్ధముగా నున్నారు."

"రాజకుమారా! ఈకోటగోడలు గట్టివి. ఆయుధపాణులచే సురక్షితములైనవి."

"నదివైపుననున్న ద్వారము నాసెలవైనచో తెఱువఁబడును. రాచనావ కళాసులతో, సరంగులతో సిద్ధముగానున్నది. మెఱియలవంటి గుఱ్ఱపురౌతు లైదువందలమంది నది కిరువంకలఁ జెట్లక్రింద సిద్ధముగ నున్నారు."

"మహారాజకుమారా! చక్రవర్తి సూక్ష్మదర్శి. చంచలుఁడైన కుమారుని శాసించుటకుఁ దగిన భుజాదండముగలవాఁడు."

"ప్రియురాలా! సురక్షితమైన యాగమ్యస్థానమును కొలఁదిదినములలోఁ జేరవచ్చును. ఇరువదివేలమంది వీరయోధులతోఁగూడిన నలీము నెదరించుటకు సామ్రాజ్యసైన్యములు సందేహించును."

"సురక్షితమైన శిబిరమును భేదించుటకన్నను, చంచలుఁడైన కుమారుని లొంగదీసి బుద్ధిచెప్పుటకన్నను సామ్రాజ్యసైన్యములు

గొప్పపనులు చేసినవి. వృద్ధుఁడయ్యు మీతండ్రి చిన్నయుద్ధములో నైన నోడిపోలేదు. ఏకార్యమును సాధింపకుండ రాలేదు.”

“ప్రియురాలా! ఆయన మహాసాహసుఁడె. మీవాగురాణాను మేము జయించి, వానిసేనలను బాఱద్రోలినప్పుడు హల్దీఘట్టములో నాతండ్రి నాప్రక్కను నిలువఁబడి పోరుట నేనెఱుఁగుదును. మాన సింగు నామీఁదికిరాఁడు. ఏమన బంగాళములో నాప్తునలమీఁది కతఁ డెత్తి వెళ్లవలసియుండుటచే నతనికిఁ జేతినిండ పనిగలదు. అదిగాక తన చెల్లెలిని నాకుఁ బెండ్లి చేయుటచే నాతో నతఁడు పోరాటము సలుపరాఁడు.”

“అయ్యా! మీయేర్పాటు లన్నియు లెస్సగానె యున్నవి. ఆఁడది మీకు హితోపదేశముచేయ సాహసించినందుకుఁ గోపింపక మన్నింపుఁడు. మీతండ్రిగారి కన్నులు సర్వాంగముఁ గనిపెట్టుచుండును. ఆరేకులు నిర్నిద్ర తేజస్కులు. నేను రాణియాబేగముగారి దర్శనము నకు వచ్చుట, మీరిక్కడికి వేంచేయుట, కూడ వారి యవగాహములో నున్నవే. యమునప్రక్కనుండి నేనీకోటలోఁ బ్రవేశించినప్పుడు సామ్రాజ్యసైనికుల యాయుధపుల చప్పుడు వింటిని. అదిగాక కొందఱు సైనికులు నది కావలియొడ్డున దాఁగియుండిరి. నేను మఱి మఱి చెప్పుచున్నాను. నన్ననేక విధములఁ గనిపెట్టిన ప్రభువుగారికి మీకు మర్మములేక దాఁచకుండ స్పష్టముగాఁ జెప్పెదను. మెహరు న్నీసా పతిభక్తిగల భార్య. భర్త కెన్నఁడు ద్రోహముచేయదు. ఇది ముమ్మాటికి నిజము. మనము మిత్రులుగానె విడిపోదము. మన మింక మరల్గఁ గలసికొనము.”

“సరే మన మిప్పుడు విడిపోదుము; కాని శాశ్వతముగా విడి పోము... మరల కలసికొందుము.” అని కొంచె మాలోచించి. సలీము వెళ్లెను.

దీర్ఘ మయిన యీాల యొకటి యంతఃపురములో వినబడెను. అది చెవిని బడఁగానె యిద్దరు లేచిరి. ఆ యీాలసంగతి వారిద్దరు బాగుగా నెఱుఁగుదురు. ఆగదివెనుక స్ఫటికశిలాకల్పితమైన వాఁకిట నడుగుల చప్పుడులు వినఁబడెను. సత్రుత్రముల వెలుఁగున, కత్తులు కైజారులు తళతళ లాడెను. కొన్నికొన్ని గొణగొణ ధ్వనులు వినవచ్చెను. అంతట నంతయు నిశ్శబ్దమయ్యెను. రాత్రి వాయువులు మందిరముల మీాఁద వీచెను. యమునాతరంగములు కోటగోడలు దాఁటజొచ్చెను. సలీనుయొక్క కొజ్జాలచేతులలో నుండి యాయుధములు లాగివేయఁ బడెను. కొందఱు చంపఁబడిరి. అప్పుడే చావనివారు వెనుక దండింపఁ బడుటకు సిద్ధము చేయఁబడిరి.

ఏటి యావలియొడ్డునుండి తుపాకులు ప్రేలెను. సలీము గుఱ్ఱపు రౌతులను సామ్రాజ్యసైనికులు చుట్టవేసిరి. ఆచప్పుడు విని యువరాజు గడగడ వడఁకెను. రాకుమారుఁడు మొదటనుండియు భోగములలోఁ బెరిఁగెను. అతని శూరత్వము సారాగిన్నెలమీాదనే కనఁబడెను. తండ్రి యొక్క దయాళుత్వముగాని, వివేకముగాని, దూరదర్శిత్వముగాని, యతని కించుకయుఁ బట్టువడలేదు. విజయము గలిగినప్పుడు పగసాధించి క్రూరుఁడగును; అపాయము వచ్చినప్పుడు మొదటనే పిఱికికంద గలిగి గడగడ వడఁకును. ఆతుపాకుల చప్పుడు విన్నకొలఁది భయముచే నతఁడొక స్ఫటిక స్తంభమునకుఁ జేరఁబడెను. అతని మొగమును స్ఫటికమువలెఁ దెల్లబడెను.

ఆసమయమున మెహరున్నిసా యెంతో ధైర్యము జూపెను. ఈధైర్యమే తిరువాతఁ గొండొక కాలమునకు విచ్ఛిన్నముగా నుండు సామ్రాజ్యమును నిలుపఁగలిగెను.

"రాకుమారా! పౌరుషము జూపుము. చక్రవర్తివి గాఁదలఁచుకొన్నావుగదా! ఆమేటి చక్రవర్తి కొడుకు నేనని ఋజువు చేసికొ

నుము. ఈ గుంతిపురములు స్త్రీలనైన మాకొఱకు గాని, శూరులకుఁ గావు. ఎంతధైర్యముతో లోనఁ జొచ్చితివో యంత ధైర్యముతో వెలుపలికి వెళ్ళుము. వెళ్ళి దయాళువైన నీతండ్రిని నిర్భయముగఁ గలిసికొనుము. కలిసికొని మున్ను వలచిన యంగనను బ్రయాణసమయమునఁ గడసారి చూచిపోవుటకు వచ్చియుంటినని స్పష్టముగఁ జెప్పుము. మీతండ్రి సహజముగాఁ గృపాళువు. కల్మషము లేనివాఁడు. నీతప్పు గాచును. ఇంక నూరకుంటివేమి? నిముసముక్రిందట నీధైర్యసాహసము॥ గురించి యెన్నో ప్రగల్భములు పలికితివి గదా! అట్లయిన నిలువుము. నీవు నీతండ్రి కభిముఖముగాఁ బోవఁ దలఁపవేని, ఆఁడుదాననైన నేనే యాయన దర్శనముజేసి, యింకముందు నేనెన్నఁడు నిన్నుఁ గలుసుకొనుట కవకాశములేని మిత్రునికై శుభూర్పణ వేడుకొందును."

జంకుగొంకు నెఱుఁగని యా యాఁడుదాని ముందఱ, తన పిఱికితనము వెల్లడించినందుకు సలీము సిగ్గుపడెను. ఆమె పలుకులు ములుకులవలె మనసునకు వచ్చుటయు, సతఁ డెప్పటిగర్వముతో నుత్తరము చెప్పెను.

"మెహరున్నిసా! యోధునకు భయముండునా? నేను గొంచెము మొదట భయపడుట నిజమే. ఎందుకన, మనకుట్ర బైటపడిన తరువాత నీమందిరములలో నిన్నొక్కతెను విడిచి పోవలేక నీప్రేమము నిమిత్తమే భయపడితిని. నా పడవవాండ్రు సిద్ధముగా నున్నారు. నాగుఱ్ఱపురౌతుల నే నిప్పుడైనఁ గలిసికొనగలను. హిందూస్థానములో నా విక్రమక్రీడ లెల్లవా రెఱుఁగుదురు. యువరాజును జూచినతోడనే సామ్రాజ్యసైనికులు తప్పక జంకుదురు. అపాయకాలమున నిన్నొంటిగ నేవిడుతునా? విడువఁ గలనా?"

"అయ్యా! వేగిరపాటు విక్రమము కానేరదు. ఇట్టి తొందరపనుల వలన సిస్థితిని నీవు పాడుచేసికొందువు. మీకొజ్జాలు బంధింపఁబడిరి

నదికిఁ బోవు ద్వారము మూయఁబడినది. ఈపాటికి మీయాశ్వికులు కారాబద్ధులై యుందురు. ఆఁడుదాని మాట విని యామె సలహా నంగీకరింపుము. నీతప్పు రేపు మీతండ్రికి విన్నవింపుము. నీవు కోరి నప్పుడు కృపానిధియైన మీతండ్రి నిన్ను క్షమింపక పోఁడని నానమ్మకము. నావిషయమా—నాపుణ్యము నాది. ఆత్మసంరక్షణవిషయమై మెహరున్నీసా బాగుగ నెఱుఁగును. నేను షేర్ ఆఫ్ఘను భార్యను. నేఁటిరేయి పట్టపుదేవియైన యతిథిని. నన్నెఱిఁగినవారు నాకుఁ గోపము దెప్పించుటకు, నాతో విరోధపడుటకు నొప్పుకొనరు. ”

అని వేయుప్రతిష్ఠలు లేని యొక యుద్యోగస్థుని భార్య గంభీరముగాఁ బలికెను. ఆమె తన బుద్ధివైశద్యమును, తన గొప్పతనమును, దెలిసికొని వానిచేత నావేశింపఁ బడినట్లు బలికెను. మహాపత్సమయమునఁ జెక్కు చెదరక నిలిచియున్న యా దివ్యసుందరవిగ్రహమును సలీము తెప్ప వాల్పక చూచి యక్కజపడి ధైర్యసాహసములకు మెచ్చి మరల నిట్లు పలికెను.

“ మెహరున్నీసా ! నీవు శాసించుటకుఁ బుట్టితివి. ఆ శాసనము జవ దాఁటకుండుటకు నేను బుట్టితిని. మహాసామ్రాజ్యము నీశాసనములకుఁ దలయొగ్గి మన్నించుకాలము వచ్చును. నీకోరిక ననుసరించి నిన్ను నేనిప్పుడు విడిచెదను. నీవు చూపినదారిని నడచెదను. కాని యొక్క యుపకారము కోరెదను. నేను పోకముందు పిదే కడపటి యుపకారము. యువతీజనమునకు నీవు రాణివి ! ప్రభావంతమైన నీసుందరముఖారవిం దము నొక్కసారి మనసారఁ జూడనిమ్ము ! నేను వెళ్లకముందు నీవాలు గన్నులతో నన్నొక్కసారి చూడుము ! ఈమందభాగ్యుఁడు, దేశ ద్రిమ్మరియై తిరుగుచు ననేక సంవత్సరములవఱకు హిందువులు తమ దేవుని విగ్రహమును బలె, నీవిగ్రహమును దన హృదయమునఁ బ్రతి ష్ఠించుకొనును. ”

మెహరున్నీసా యోడుదిగదా! గర్వము, మర్యాదయను కవచములు సంరక్షించుచున్నను నామె స్త్రీహృదయమున నామాటలు నాటెను. నాటుటయు నించుక చలించి, " రాకుమారా! నేను తప్పు చేసితినేని యల్లా నన్ను క్షమించుగాక! నీ కట్టకడపటి కోరిక నేను నిరాకరింపఁ జాలను. " అని బదులు చెప్పెను.

అంతట మేలిముసుగు మెల్లగ జాఱెను. జాఱుటయు నిరుపమాన తారుణ్యలావణ్యములకు నిలయమై సొగసులు గ్రుమ్మరించుచున్న సుందరవదనము బయల్పడెను. ఆనెమ్మొగములో నించుక లజ్జగలసి యుండెను. ఆలజ్జ ముఖచంద్రబింబమునకెంతో వింతవన్నె దెచ్చెను. కవనమునకు, గానమునకు, మెఱుఁగుఁబోఁడులకు మితారులకు బ్రసిద్ధి కెక్కిన పారసీక దేశమున నెందు వెదకిన నింత హాయలుఁగులుకు దివ్య సుందరముఖములేదు. నీలాలనంటి నల్లకన్నులుగల హిందూదేశ పుత్రికలయందు సైతము సమ్మోహనాస్త్రముం బోలునట్టిసుందరి లేదని చెప్పవచ్చును.

ఢిల్లీనగరములోని చిత్రకారు లాలోకైకసుందరి సొబగును దంతము మీఁద మఱి యితరవస్తువులమీఁదఁ జిత్రింపవలెనని వృథాప్రయత్నములు జేసిరి. ఆజగిజ్యోతిని నానావర్ణములతో వర్ణించుటకై మహాకవులనేకులు వృథాప్రయత్నములుచేసిరి. యువతీసౌందర్యము కవులయొక్కయుఁ జిత్రకారులయొక్కయుఁ బరిశ్రమను బరిహసించును. మెహరున్నీసాయొక్క సౌందర్య మామెతోఁ బుట్టి యామెతో నంతరించును.

ఆ సుందరీలలామయొక్క క్రొవ్వాఁడిచూపులు సలీము మీఁద మెల్లగా, మృదువుగాఁ బడెను. పడుటయు నారాకుమారుని హృదయము మేరమీఱి యుప్పొంగెను. కొన్నినిముషములలోనే మేలిముసుగు నా మొగమునావరించెను. సలీమునకది స్వప్నవృత్తాంతము వలె నుండెను.

# ౧౩

నరేంద్రుఁడు చదివిన యత్యద్భుత కథలకంటె నా రాత్రి జరిగిన వృత్తాంతము లతనికి మహాశ్చర్యమును గొలిపెను. జలేఖయున్నిస పన్నుగడలోని రహస్యము తెలిసికొనుటకై యతఁడుచేసిన ప్రయత్నములు సఫలమయ్యెను. ఇప్పుడు తెరపైకి లేచెను. అంతయు విదితమగు చుండెను. యమునాతీరమున నక్బరుచక్రవర్తియొక్క బుద్ధికుశలతవల్ల నిర్మింపఁబడిన యా విచిత్రభవనములలోని కతనికిఁ బ్రవేశముగలిగెను. ఆభవనములు కువలయానందకరములు గదా! చక్రవర్తి ప్రతిదినము దర్బారు జరుపునట్టి మందిరముల సమీపమున నున్నగా లోపలికోట కావల నతిథులనిమిత్తమై కట్టఁబడిన సౌధములో నతనిబసగదా. రాణులయొక్కయు, బేగములయొక్కయు నంతిపురములలోఁ బ్రవేశముగలిగెనుగదా. అక్బరు చక్రవర్తి రాణులలో నగ్రగణ్యయు, యువరాజగు సలీముతల్లియునైన జగత్ప్రసిద్ధికెక్కిన జోదుబాయి దేవిని జూచుభాగ్యము గలిగెనుగదా. అదియటుకే హిందూస్థానమంతట తన రూపురేఖా విలాసముల విషయమై యశస్సు సంపాదించిన యా పారసీకయువతిని సందర్శింపఁబోయిన యువరాజుననుసరించి వెళ్లెను గదా. యువరాజు పన్నుగడలు భగ్నమగుట గన్నులారఁ జూచెను గదా! అదియంతయు నయినతరువాత, నటమీఁదఁ దనగతి యేమి కాఁదలఁచియున్నదో యని నరేంద్రుఁడు మిక్కిలి యాతురతతో నిముస మొకజాముగాఁ గడపుచుండెను.

యువరాజు వెళ్లిపోయినతరువాత జలేఖయు, నామె మిత్రమును లోపలికి రావలసినదని యాజ్ఞాపింపఁబడిరి. స్త్రీ వేషమును దాల్చిన నరేంద్రుఁడు భయపడుచు నిలిచెను. మేలిముసుగులోనుండి యా పారసీకయువతి యాతనివంక నొకసారి చూచెను. అంతలో నతఁడు

కొంచెము ధైర్యము దెచ్చుకొని నిర్భయముగా నిలువంబడి చేతులు జోడించి యామెయాజ్ఞల వీక్షించుచుఁ దలవంచి నేలజూచుచుండెను.

అతనింజూచి రాజకీవితో నామె యిట్లనియె: "ఆయాడవేసము తీసివేయుము. అది మేటి జోదునకుఁ దగనిది. ఈ వేషముతో పురుషుఁడు దాఁగఁడు."

అంతట నరేంద్రుఁడు గదివిడిచి యావలకుఁబోయి మరల వీరపురుషోచితమైన వేషముతోఁ బ్రవేశించెను. అప్పుడు మెహరున్నీసా వానిఁజూచి వెండియు నిట్లనియె: "బంగాళాదేశములోని యొక పురాతన సంస్థానమున కధిపతియై, చక్రవర్తి కొలువులోనుండి, యుద్ధమున గాయపడి స్మారకములేని స్థితిలో నిక్కడికిఁ దీసికొనిరాఁబడిన యువకుఁ డితఁడే గదా!"

"చిత్తము దేవి!" అని జలేఖ బదులు చెప్పెను.

"ఆఫ్ఘనులు సామ్రాజ్యమున కలజడి గలిగించిననాఁడు, రాజా తోడర్‌మల్లుగూడ జయమువిషయమున సందేహించిననాఁడు—ఈతని తాత రాజభక్తి తత్పరుఁడై చక్రవర్తియండను నిలిచెనుగదా?"

ఆమాటకు జలేఖ బదులు చెప్పలేదు. నరేంద్రుఁడు మాత్రము వినయముతో నిట్లనియె:... "మహాదేవీ! సామ్రాజ్య సైనికులకు మా సంస్థానము జేసిన సాయము మిక్కిలి తక్కువ. కాని, మా తాత చక్రవర్తి పక్షమున నిలిచి సర్వస్వముఁ గోల్పోయెను. ఈ మీ సేవకుఁడు గూడ పనివచ్చెనా వెనుకదీయఁడు."

అనవుడు మెహరున్నీసా యిట్లనియె: "ఈదేశపుభాష తిన్నగా రాకపోయినను నీ యోధుఁడు. చక్కఁగానే మాటలాడుచున్నాఁడు. జలేఖ! ఇతనికి మొట్టమొదట గోటలోఁ బ్రవేశమెట్లు గలిగినదో చెప్పు."

"అమ్మా! ఇతఁడు జీవింపఁడని మానసింగు మహారాజు వైద్యము

చేయించుటకై యితనికి కోటలో బసయిమ్మని సిఫారసుచేసెను. మాన సింగురాజుగారి మేనత్త,—మన చక్రవర్తిగారి పట్టపుదేవి—దిక్కు లేని యీబంగాళాయువకునికి నుండిచ్చుటకు, దమ సొంతవైద్యులను బంపి యతని యారోగ్యవిషయములను దరుచుగాఁ గనుఁగొనెను."

"గొప్పరాణుల యనుగ్రహమునకుఁ బాత్రమైన యీవడుచువీరుఁడు ధన్యుఁడు. చక్రవర్తి కొలువుచేసి ప్రాణముసైతమాయనకై ధార వోయఁదలఁచిన వీరకుమారుల నెట్లు గౌరవింపవలయునో రాజపుత్ర కుటుంబములకుఁ జెందిన రాణులుఁ బాగుగా నెఱుఁగుదురు."

అనవుడు నరేంద్రుఁడు నేల సాగిలఁబడి యామెకు మ్రొక్కెను.

అంతట మెహరున్నిసా మనోజ్ఞమైన కంఠస్వరముతో నిట్లు పలి కెను:—"ఆరాణుల యనుగ్రహమునకుఁ దోడుగా నితనికి సంరక్ష ణముగూడ బాగుగా జరిగియుండును. ఆముసలి హింహూవైద్యులకంటె జోద్బాయిరాణిగారి తార్తారుబానిసయొకర్తె యెక్కువ శ్రద్ధతో రేయింబవళు లితనికుపచారములు చేసెనని నేనువింటిని. అదినిజమా?"

అంతట జలేఖమొగ మెఱ్ఱవాఱెను. కాని, యామె వినయము తోనే ప్రత్యుత్తరమిచ్చెను—"అమ్మా! మీకుఁ దెలియని దేమున్నది? నేను ప్రతిరాత్రి రోగియొద్దకు వెళ్లి యతని దేహస్థితి దెలిసికొని తమకు విన్నవింపవలసినదని మహారాజ్ఞిగారు నాకు త్తరువిచ్చిరి."

"జలేఖా! వివరములనుగురించి నిన్నడుగను. మీరాణిగారివద్ద నుండి వెళ్లి రాత్రి ప్రొద్దుపోవువఱకు నీవు తిరిగి వెళ్లకపోవచ్చును, లేక యాపడుచు జోదుమీఁద నాపరిచారికకెక్కువ జాలియుండి నతనికడ జాలసేపు గూర్చుండి యుండవచ్చును. దాని కేమిలే!"

జలేఖమొగము మరల నెఱ్ఱపడెను. కాని, స్థలమెఱిఁగి మసల వలెనుగనుక కోపమడఁచుకొనెను.

అంతట మెహరున్నిసా కంఠముమార్చి యుత్తేజంగునఁ బలికెను—

"ఓయీ! నీవృత్తాంతము నాభర్తవలన నెఱిఁగితిని. విని యీకోట లోనే నీవున్నావని తెలిసి, యీరాణి యంతఃపురమున నిన్నుఁ జూడఁ దలఁచి మాఱువేషము వేయించి పిలిపించితిని. జలేఖ సాహసకారాలు. నా యాజ్ఞ భక్తితో నెరవేర్చినది. దాని యజమానురాలికిఁ గాని, మఱియెవ్వరికిఁగాని తెలియకుండ నిన్నుఁ దోడ్కొనివచ్చినది. ఎంత శూరులైన గజగజ వడకింపఁజాలు మహాసాహసమును నీవుగూడఁజేసితివి. నాకోరిక దీర్చినందుకు నిన్ను నేను మెచ్చుకొనుచున్నాను.

మేము బంగాళమునకు వచ్చుచున్నాము. అదిమాకుఁ గ్రొత్త దేశము. మాకచ్చట మిత్రులులేరు. నాభర్తగారు నీమైత్రి గోరుచున్నారు. అవసరమైనప్పుడు నీసాయము మే మపేక్షింపవచ్చునా?"

మెహరున్నీసా తన యాజ్ఞను కోరికగా పూర్చియెట్లు చెప్పవలెనో యెఱుఁగును. అందుచే వేఁడినెత్తురు శరీరములోఁ బ్రవహించుచున్న యోధుఁడెవ్వఁడు నామెయాజ్ఞను నిరాకరింపఁడు. సురేంద్రుఁడా పలుకులు విని నేలఁ జాఁగిలఁబడి మ్రొక్కి కత్తిపిడి నామెకు విధేయతజూపుటకై యందించెను. ఆమె కత్తిపిడి స్పృశించి, ఖడ్గమును బట్టుకొన్న యాశూరుని హస్తముగూడ కావలెననియే స్పృశించెను. ఆస్పర్శ యాతని మేను గగుర్పడఁజేసెను. దానంజేసి విచిత్ర చరిత్ర గల యా యంగనయెడ నతఁడు పరమభక్తుఁడై యుండెను.

వెండియు మెహరున్నీసా యిట్లనియె—"నాభర్త బర్ద్వానుమండలములో జాగీరుదారుఁడు. దానికి మీ సంస్థానమునకు దూరమెంత?"

"మేము సామాన్యముగా మంచినడ పడవలలో నేటిమీఁద నొక నాఁడు ప్రయాణముచేసి, యచ్చటనుండి మఱియొకనాఁడు బర్ద్వానుకు మెట్టుమీఁదఁబోవుదుము."

"నీవంటి పడుచుజోదునకు నదియొక దూరముగాదు. మాబర్ద్వా నుగృహద్వారము విరనగరప్రభు వెప్పుడు వచ్చునను తెలిచియే

యుంచంబడును. అతనిని సగౌరవముగా మే మాదరింపంగలము. ”
అని మెహరున్నీసా నవ్వుచుం బలికెను.

“ మీ ప్రభువుగారి పరిచయము చేసికొనుటకు మీరు నాకు సెల వియ్యవలెను. అదినాకు మిక్కిలి గొప్పగౌరవము. ”

“ తోడిజాగీరుదారుని జూచుటకు నీవుగూడ జాగీరుదారుని హోదాతోనే యాయన దర్శనమునకు రావలెను. మీ దేశాచారమునకు విరుద్ధము కాని యెడల నీ భార్యనుగూడ నీతోం దీసికొనిరమ్ము. ఈ మహమ్మదీయసోదరి యామెను గౌరవముగ సన్మానించును. ”

అన నరేంద్రుని మొగము చిన్నవోయెను. అతఁడు వినంబడి వినం బడనట్లు మెల్లగా “ బేగంసాహెబా ! నాకు వివాహము కాలేదు. భార్య లేదు ” అని ప్రత్యుత్తరమిచ్చెను.

అతని మొగము చిన్నవోవుటం గనిపెట్టి యతని వృత్తాంతముం దెలిసికొనవలయునని కుతూహలము గలదై యిట్లనియె—“ శూరుడా ! నా తప్పు మన్నింపుము. ఈ దేశమున నీ వయసువారు వివాహము గాక యుండరు. మీ సంస్థానాధిపతులు తమసంస్థానములను, దమ కుమారులకు సక్రమింపంజేయవలెనని కుతూహలపడు చుందురుగదా ! నీవిషయములో మాత్రము దైవసంకల్పము విపరీతమైనది గాంబోలు ! ఈ విషయములు నీకు విచారము గలిగించునేని—ఇంక నేనామాట దలపెట్టను. ”

“ దేవీ ! నేను చిన్నవాఁడనై యుండగానే సేనలో జేరితిని. నాంట నుండి మఱల నే నింటికిం బోలేదు. ” అని స్వల్పముగా నతఁడుత్తరము చెప్పెను. మృదుస్వభావముగల యంగనారత్న మగుటచే మెహరు న్నీసా యాప్రసంగము గట్టిపెట్టి విషయము మార్చెను.

“ ఓయీ ! మీ సంస్థానమువలెనే ప్రాచీనములై, బలదర్పములు గల యితరసంస్థానములు గూడ బంగాళములో నున్నవా ? ”

"మా సంస్థానమువలె పురాతనములయి రాజభక్తిగలవియెక్కువ లేకున్నను మా దానికంటె భాగ్యవంతములైన సంస్థానము లనేకములు బంగాళములోఁ గలవు. జమీందారులు చక్రవర్తికి పేష్కషు చెల్లించి, తమ సంస్థానములలో నల్లరులు లేకుండ శాంతి నెలకొలిపి, చక్రవర్తినిమిత్తము సేనల నిలిపి పోషించుచుందురు." అని నరేంద్రుఁడు గర్వోక్తిగాఁ జెప్పెను.

"నేను నట్లె విన్నాను. ప్రజలయొక్కయు, వారి నాయకులయొక్కయు భక్తివిశ్వాసములమీఁద నాధారపడియున్న సామ్రాజ్యము ధన్యమైనది. మీ సంస్థానమంత పెద్దవి బంగాళములో మొగలాయి ప్రభువులక్రింద, నాష్ఘనుప్రభువుల క్రిందనున్నవని వింటిని."

"ఔనాలాగె! పూర్వకాలము నుండియు నాష్ఘను నాయకులు పెద్దసంస్థానములు సంపాదించుకొని పాలించుచున్నారు. మనచక్రవర్తిగారుగూడ నీ నడుమ కొండఱకు క్రొత్తజాగీరులు దయచేసినారు. నీ భర్తగారి వంటి శూరశిఖామణులు మాత్రమెవ్వరును లేరు. మహమ్మదీయప్రభువులు యుద్ధప్రియులై హిందూజమీందారుల నుండి శిస్తు వసూలు చేసికొని, వారిజోలికిఁబోక ప్రజలకు పాలకులకు సంబంధము చెడఁగొట్టక సుఖముగా నుందురు."

"శూరుఁడా! జమీందారుఁడా! నీ సంగతి నాకుఁదెలిసినది. నీ వింతగాఁ జెప్పినందుకు నీకు నేను కృతజ్ఞురాలను. బంగాళములోఁ బుట్టిపెరిగిన యతినినుండి నేను కొన్ని సంగతులు తెలిసికోఁదలఁచితిని. ఇతరులకంటె నీ వవి చక్కఁగాఁ జెప్పఁగలవు. ఒకయోధుని, తనమగనికిఁ బరిచయములేని వానిని, నర్ధరాత్రమున, నావంటి ఘోషాపడతి కలిసికొని మాటాడుట యాచారవిరుద్ధము. మాస్థితినిబట్టి యిట్టియవసరము లప్పుడప్పుడు వచ్చుచుండును. మా జాతిస్త్రీలు సింహాసనము లెక్కి రాజ్యముచేసి, సేనలుగూడ నడిపినట్లు నే నెఱుఁగుదును."

ఇట్లు మాటాడిన యాసాహసురాలు భవిష్యద్దశను మనసులో నుంచుకొని మాటాడియుండునా! ఆసియాఖండములో నెల్ల మహోజ్వలమైన సామ్రాజ్యసింహాసనము నెక్కి మహాసేనల దాను నడుపంగలసమయమువచ్చునని యామె మనస్సులో భావించియుండునా ?

అంతటం గొంతసేపూరకుండి మెహరున్నీసా మరల నిట్లడిగెను.—

"ఓయీ, జమీందారుడా! బంగాళములోని జమీందారులు పరస్పర కలహములు గలిగి చక్రవర్తి కృత్యములు మఱచి తమలోం దాము పోరాడుచుందురని వింటిని. నిజమా?"

"పురాతన సంస్థానములకు తరతరములనుండి వైరములున్నవి. అందుచే నప్పుడప్పుడు జమీందారులు పోరాడుకొనుచుందురు. కాని యెవ్వరును జక్రవర్తి కృత్యములయెడల నిర్లక్ష్యముం జూపరు."

"అయితే నీ సంస్థానమున కెవ్వరితో నైన ప్రాతవైరమున్నదా!"

"ఓమహాదేవీ! మాకును, మాపొరుగునున్న దేవీపురసంస్థానమునకును మత్సరము తరతరములనుండి గలదు. మూండువందల యేండ్లనుండి మేము శత్రువులము. అయినను మేము పరస్పరగౌరవము గలిగి చక్రవర్తిపని భక్తితోం జేయుదుము. మచ్చరముగల యీ సంస్థానములను గలుపుటకు నడుమనడుమ వివాహసంబంధములు గూడ గలవు.

"జమీందారుడ! గొప్పవంశస్థులట్లు చేయవలెను. కాని, సంబంధములమాట చెప్పితివిగనుక నొకమాట యడుగ కుతూహలముగు చున్నది. మానసింగురాజు నిన్ను తనయధీనము జేసికొనకమునుపు దేవీపురసంస్థానపు బాలిక నెవతనైన నీవు స్వీకరింపలేదా?"

నరేంద్రుడుం డాపలుకులువిని తలవంచుకొని నేలజూచెను. రోషవిషాదములచే ముఖమరుణారుణమయ్యెను. అద్భుతప్రజ్ఞగల యీ యంగన, పూర్వవృత్తాంత మెఱుంగునా! మందహాసగర్భితమైనక్రూరత్వముతో పచ్చిపచ్చిగా నున్న యతనిహృదయ వ్రణమును రేపందలంచు

కొన్నదా? అతఁడు నోట నుచ్చరించుట కిష్టములేక హృదయమున దాఁచిన రహస్యమును బలవంతముగఁ జెప్పింపదలఁచు కొన్నదా? న రేంద్రుఁ డా ప్రశ్నకు వినయముతోను ధైర్యముతోను బ్రత్యుత్తరము చెప్పెను.

"పిల్లవాఁడు స్వప్నములు పెక్కు గనుచుండును. పెద్దవాఁడైన తరువాత వానింగురించి తలంపగూడదు. యుద్ధసిద్ధుఁడైన వీరుఁ డెన్నో యాశలు, భంగములు గలిగియుండును. అట్టి గొడవలు మీ వంటి జనానాస్త్రీలు వినఁదగినవి కావు.

"వీరుఁడా! అవి నీలోనే యుంచుకొనుము. నీమనస్సునకు నొప్పి గలిగించునట్టి విషయములు చెప్పుమని నేను నొక్కి యడుగను. నేను నిన్నిక్కడికి పిలిపించి, యపాయకరమైనస్థితిలోనికిఁ దెచ్చితిని. నా కోరిక దీర్చుటకు నీవు నతిసాహసము చేసితివి. మన సమాగమము నకు నానవాలుగా నీయుంగరము నీయొద్ద నుంచుకొనుము. పౌరుష శాలివైన వీరనగరప్రభువుకడనుండి మేము ముందెప్పుడైన సహాయ మపేక్షించుసమయము రావచ్చును."

అని మెహరున్నీసా తన పీఠమునుండిలేచి యుంగర మిచ్చెను. న రేంద్రుఁడు వినయమున మోకాళ్లపై గూర్చుండి యామెకు నమస్క రించి యామె మృదుహస్తస్పర్శముచే రెండవసారి ధన్యుఁడై యంగు ళీయక మందుకొనెను.

"జమీందారుఁడా! లెమ్ము. వెళ్లుము. నీవు నోట నుచ్చరింపఁ జాలని రహస్యవిషయమును, నాస్త్రీనేత్రములు నీమొగమున కనిపెట్టి నవి. చెప్పఁజాలని కోరికలు మనస్సున నిలుపుకొన్న యాపవశాలిని స్త్రీహృదయము గౌరవించును. నీజీవితము నొక గాఢవిచారము మలినము చేసెనేని, ఏది నీచరిత్రమును బరిశుద్ధము జేసి బలపఱుచును. ఏ స్త్రీయైన భార్యవలన స్త్రీహృదయము నాకర్షించెనేని యాప్రణయము

నీజీవితమును భాగ్యవంతము చేయుఁగాక ! నామాటనమ్ము. బలవంతుఁడై గొప్పవాఁడైన వాఁడు సెతము తల్లియొక్కగాని సోదరియొక్కగాని ప్రియురాలియొక్క గాని, కూతురుయొక్కగాని ప్రేమకు లోనుగాని యెడల వాఁడు సగము మనుష్యుఁడుగాని నిండుమనుష్యుఁడుగాఁడు. అల్లా వానిని సంపూర్ణమనుష్యుని జేయు మఱచియుండును."

## ౧౪

జలేఖయు, నామెమిత్రులును మొదటఁగోటఁ బ్రవేశించిన ద్వారము కడకు వచ్చునప్పటికి మూఁడు నాలుగు ఘడియల రాత్రి మాత్రమె యుండెను. తలుపు తాళము వేయఁబడెను. ద్వారరక్షకుఁ డక్కడ లేఁడు.

అదిచూచి జలేఖ తనలో నిట్లనుకొనెను :—"ఇది చేయవలెనని చేసినది. ఇది వాసిపని. గోడమైన దాటవలెను; నదివైపు గుమ్మమునననయినఁ బోవలెను. రెండవదె మంచిది."

ఒక్కప్రశ్నమైన నడుగక నగేంద్రుఁడు నిశ్శబ్దముగాఁ దారిత్రాఁపడుచువెంట మలుపులు దిరుగుచు, మెట్లెక్కుచు దిగుచుఁ బోయెను. రెండుబిందెలు పుచ్చుకొని నదీద్వారముకడకుఁ బోయి గడియలుతీసి, వారు తలుపులు దెఱచిరి. ఆచీఁకటిలో నీళ్లు తెచ్చుకొనుటకు వచ్చిన యంగనలవలె యమునయొడ్డున వారు నిలిచిరి.

నగేంద్రుఁడు తనయవస్థ మహాపాయమధ్యమం దున్నదని గ్రహించెను. ఇంతలో జలేఖ నవ్వుటచే నతసి యాలోచన లాగిపోయెను.

"జలేఖ ! ఈసమకాలపు వెఱ్ఱినవ్వెందుకు ?"

"నీవెవరవో, నీవెఱుఁగుదువో లేవో యని నాకు నవ్వువచ్చినది."

"పిల్లా ! నీతోడఖులో నుండుటచే నేనెవఁడనో నాకే సరిగా

తెలియకున్నది. గంటక్రిందట నేను నీతోఁడఁబుట్టినదానను, పరీక్షానై యుంటివి."

"కాని, నా సోదరి, పరీక్ష యింతప్రొద్దుండఁగానే నీళ్ళ కెన్నఁడు రాదు."

"నేను యోధుఁడను. నాటకము లాడఁజాలనుసుమీ!" అని మోటగా బదులు చెప్పెను."

"కాదు. ఆయోధుఁ డవతలివాఁకిలిలో నతిథుల మందిరమునఁ బండుకొనియున్నాఁడు. చక్రవర్తిగారి జనానాలో గనఁబడినపక్షమున, నతని తల తీయఁబడును."

"అట్లయిన నీవు నన్నాజ్ఞాపింపుము. విధేయుఁడనై యుందును."

"కాదు. అక్కా, నాసిమా! మన మిద్దఱము తోడిబానిసలము. ఆజ్ఞాపించుటకు నే నెవతను? నేను జోద్బాయిని గొలుచుచుంటిని; నీవు నెవహురున్నీసాయొక్క బానిసవు. మన మిద్దఱము నీళ్లు తెచ్చుటకై యిక్కడికి వచ్చితిమి తెలిసినదా?"

ఎంతో విసిగియున్నను నరేంద్రుఁడు పక్కున నవ్వి యిట్లు బదులు చెప్పెను—"తెలిసినది. జన్మజన్మములకు, ఆడవేషము మాత్రము నాకు వద్దు."

"అక్కా, నాసిమా! నీవెంత యందవికారమైనపిల్లవే. నీ తల వెండ్రుకలన్నియు నొకప్రక్కకే జాఱుచున్నవి. చిన్నప్పుడు మీ యమ్మ తల తిన్నగా ముడివేసికొనుటయైన నేర్పలేదటే. నే సరిగా ముడివేదను—అలాగు—ఇలాగు—అలాగు, ఇప్పుడు సరిగా నున్నది. నిరవిక కొంచెము క్రిందికి లాగుకో! నీకొమ్ము క్రమ్ముటలేదు. ఎంత సిగ్గుమాలినపిల్లవే! నీళ్లబిందె తలమీఁద కుదురుగాఁ బెట్టుకో. ఎడమ చేయి [illegible]. ఎడమకాలు ముందుబెట్టు. నడుచునప్పుడు కుడి [illegible] మంచియంతఃపురదాసివి

కాఁగలవు. నీయజమానురాలైన యూసఫ్‌బేగము మఱికొన్ని మంచి యుంగరములు బహుమాన మిచ్చును."

ఆపరిహాసముసైఁపక తన్నెగతాళిచేయుచున్న జలేఖ నెత్తిమీఁద నీళ్ళబిందె పాఱవేయవలెనని నరేంద్రుఁడు తలంచెనుగాని, యుద్రేక మణఁచుకొని యొకప్పుడు రాళ్లదెబ్బలు తగిలిపడుచు, నొకప్పుడు కాలిలో నీళ్ళు చిమ్ముకొనుచు జలేఖ వెంటనరిగెను.

ఏటిపైపున గస్తీ తిరుగుచున్న యారెకుఁడొకఁడు వారి నాఁపెను. అప్పుడు జలేఖ తన మిత్రమును వానికిఁ జూపి "ఈమె నాసిమ! మెహరున్నీసా బేగముగారిదాసి, నేను జోద్బాయిరాణిగారి దాసిని. జలేఖను" అని చెప్పెను.

అందు కారెకుఁ డిట్లనియె. "ఈనగరున కీమె క్రొత్తది. నేనామె నెఱుఁగను. నేను మసూరు సెలవుచొప్పున వెళ్లెదను. ఈ రాత్రి క్రొత్తపడఁతులను వెలుపలినుండి లోపలికి, లోపలినుండి వెలుపలికి పోనీయ వద్దన్నాఁడు"

నరేంద్రుని గుండె తటతటఁ గొట్టుకొనెను. ఆఁడుదుస్తులలో నణఁగి యున్న కత్తిమీఁది కతని చేయి వెళ్ళెను. జలేఖ సర్వమెఱిఁగినది గదా! సమయస్ఫూర్తిగా నామె యుప్పు డిట్లనియె—

"అక్కా, నాసిమా! మీ యజమానురాలి యుంగరము జూపుము. ఈమానవాలు నతఁ డొప్పుకొనకపోయినయెడల, రాణిగారికి, బేగము గారికి నతఁడే జవాబు చెప్పుకొనును."

నాసిమ యంగుళీయకము జూపెను. ఆరెకుఁడు తలయొగ్గి సలాము చేసి వారిని పోనిచ్చెను.

అట్టి యాటంకములు రెండుమూఁడు త్రోవలో వారికిఁ దటస్థించెను. జలేఖ తనలో "ఇది వానిపనే. వాఁడు వల విరివిగా పన్నినాఁడు. కాని చేఁపలందులో పడవు. తప్పించుకొనకపోతినా నేను ఖొాస్తార

పిల్లను గాను.'' అని యనుకొనెను.

అంబరు రాజపుత్రియొక్క రసపుత్రపరిచారికలు వారి యలవాటు ప్రకారము రాత్రి ప్రొద్దుపోగానే యేటికి వచ్చిరి గాంబోలు ! వారు కుండలు నీలాటిరేవులోఁ బెట్టి యేదో మాటలాడుకొనుచుండిరి. వారి మాటలు జలేఖాకు వినఁబడెను. ఆఁగి యామె వినెను. ఆ కంఠము లామె యెఱుఁగును. వెంటనే యొక పన్నుగడ పన్నెను.

“ ఏమే నాసిమ ! నీబట్ట తడిసిన దేమి ? కుండ చిల్లిపడి నీరుకారు చున్నది. గోడ దగిలి పగిలినది కాంబోలు. అది పావలఁ బాఱ వేయుము.''

“ జలేఖా ! ఈ మొగతాళి చాలులే. ఇదిగో కుండ పాఱవేసితిని. నే నిఁక నేమి చేయవలెనో స్పష్టముగాఁ జెప్పుము. కొందఱు స్త్రీలు మనముందఱ మాటాడుచున్నారు. మనము వాండ్రను తప్పించుకొని పోవలెను.''

“ వాండ్రను మనము కలుసుకొనవలెను. నెత్తినిమీఁద కుండ పెట్టు కొనుటయైన తెలియని తెలివితక్కువపిల్లకు వాండ్రేదైన సాయము చేయుదురు.''

“జలేఖా ! నీకు పిచ్చియెత్తినదా యేమి ? వాండ్రను మనము తప్పించుకొని పోవలెను. లేదా, మన గుట్టు బయలుపడును.''

“ కాదు. మనము వాండ్రసాయము బొందవలెను. పిచ్చిపిల్లా ! అంతగా మాటలాడకుము. నీపని యంతయు నేను చేసెదను. నన్ను విడిచిపెట్టుము. నీవు ఇక్కడికి క్రొత్తదానవు; తెలివితక్కువదానవు.''

“ ఓ బాటసారులారా ! జాగ్రత్త. ఇక్కడ మానీటికుండలున్నవి.'' అని యొక రాజపుత్రస్త్రీ వారిని మందలించెను.

“ అక్కా ! నన్ను, నీనెచ్చెలులను నే నెఱుఁగుదును. జాగ్రత్తగానే యుందుము. అంబరురాణిగారి భవనమునకుఁ జేరినవారు మేము.

నామాటనుబట్టి మీారు సన్ను తెలిసికోలేదా ?" అని జలేఖ మెల్లగ బదులు చెప్పెను.

"ఔనౌను! నే నెఱుగుదును. నీవు జోద్పూరురాణిగారి దాసివి"

"ఔను! ఈమెనాసిమ. మెహరున్నీసాబేగమ్‌గారి దాసి. ఈమె యీానడుమ పారసీకదేశమునుండి వచ్చినది."

"సరిసరి! ఈమె నీతోఁ గూడ నీళ్లు తెచ్చుకొనుటకు వచ్చినదా? మీారు సావధానముగా నీళ్లు తెచ్చుకొను రేవు విడిచి చాల దూరము వచ్చినారే."

"కోట కావలివైపున జబ్బుతో పడియున్న జమీాందారుని యారోగ్యవిషయమై తెలిసికొనుటకు రాణియాబేగముగా రామెను బంపెను. అవతల తలుపులు మూసియున్నవని యీాపిల్ల చెప్పుచున్నది. అందుచేత ఏటిగుమ్మమున వచ్చినది."

"ఔను, జలేఖా! అది నిజమె. ఈరాత్రి యన్నితలుపులకు తాళములు వేసినారు. సలీముగారి కొజ్జా లందఱు పట్టుబడిరి. ఇప్పు డాయనయే మిక్కిలి యపాయస్థితిలో నున్నాఁడట! సలీముగారు నేటిరేయి యెవరినో మాఱువేషముతో మెహరున్నీసాబేగముగారి జనానాకు బంపిరని చెప్పుకొనుచున్నారు. ఈమాట నీవు వినలేదా?"

"ఏదో పోరాటము జరిగినట్లు ధ్వని వినిపించినది. కాని, అదేమిటని నావంటి తాొత్తరదాసి విచారింపఁగూడదు గదా?"

"ఔను జలేఖా! కాని, యీా వార్త మా యంబరురాణిగారికిఁ దెలిసినది. అప్పుడు నేనక్కడ నుంటిని. కాని, ప్రొద్దు పొడవకముందే యీా రహస్యవేషధారిని పట్టుకొని తీరుదునని యీా మాయలమారి మస్రూరు ప్రతిజ్ఞ చేసినాఁడు."

"అక్కా! ఔను. అతఁడు పట్టుకొని తీరును." అనినవ్వుచు జలేఖ పలికెను.

"కాని, యాదారిని బోయినయెడల యీ నాసిమా, కోట కావలి భాగము జేరలేదు."

"ఔను! నేనామెతో నల్లె చెప్పితిని. ఆమె పారసీకపడుచు. మన మాటామెకుఁ దెలియదు. మెహరున్నిసా బేగముగారి పనికత్తెలు తరుచుగా దారి తప్పుచుందురు. వాళ్ళవి మట్టితలలు ?"

"ఈ పారసీకయువతి చూడఁగా మట్టితలపడుచులాగు కనఁబడదు. ఈరాత్రివేళ నీమె యీ యేటికడకు మరేదో పనిమీఁద వచ్చియుండును. ఏదో రహస్యమైన పనిమీఁద రావచ్చును!"

ఆచమత్కారవాక్యము వినఁగానే యందఱు పక్కున నవ్విరి.

అనవుడు జలేఖ యిట్లనియె—"అలాగైనయె యుండవచ్చును. తార్తార పిల్లలమైన మేమీ పారసీకపు యువతులను సరిగా నమ్మము. వారు తఱచుగా వలపుగాండ్రను గురించి పాట పాడుచుందురు. వాండ్రు రాజస్థాన స్త్రీలవలె వివేకముగాని, సద్గుణముగాని, కల వాండ్రు కారు. ఈ మట్టితల పిల్లగూడ నేఁటిరాత్రి యెవరో పారసీక యువకుని జూచి వానిని వలచియుండును. నాసిమా! నీ వేమందువు ?"

నరేంద్రుఁడు వారించుటకు వీలులేని జలేఖ మోటమాటలకు విసిగి పెదవులు కఱచుకొనెను, కాని కాలవశమున నూరకుండవలసి వచ్చెను."

వెండియు జలేఖ యిట్లనియె—"ఈమట్టితల పడుచు మాటాడదు. ఈ నడుమనే పారసీకమునుండి వచ్చినది. మన మాట తెలియదు."

"కాదు. జలేఖా! ఈ పారసీకయువతికి నీమాట తెలుసును. కాని తనగుట్టు దాచుకొనుట యెఱుఁగును. ఈ తెల్లవాఱుజామున విరహ వేదనకు తాళజాలక, రాధ కృష్ణుని వెదకుకొనుచు యమునాతీరము నకు వచ్చినదని తోఁచుచున్నది."

"అవును కృష్ణునికొఱకు ఈలవేయవచ్చును. కాని యీయమ, [illegible]వలె పాడుటకాను, అందవికారముగానున్న యీ [illegible]

మోహించిరాఁడు." అని జలేఖ బదులుచెప్పెను.

అంవుడు సందరును వికవికి నవ్విరి. నరేంద్రునకు మహాగ్రహము పెంపొంద నోపిక పోవుచుండెను.

"గాయపడి వెలుపలి కోటలోనున్న యాతూర్పుదేశపు జమీం దారుసమాట యేమైన తెలిసినదేమో చెప్పుము." అని జలేఖ యడిగెను.

"జలేఖా! తెలిసినది. ఆయన అంబరురాజగృహములోనున్నాడు. మారాణిగారి వైద్యులే మందిచ్చిరి. ఇప్పుడు నెమ్మదిగా నున్నది. ఆతఁడు కోట విడిచి రేపు పోవును. మానసింగురాజు తనమేనత్త కల్లె వర్తమాన మంపినాఁడు."

"అక్కా! అట్లయిన ఈకొంటెపిల్లకు త్వరగా సాయముచేయుము. ఆ జమీందారుఁడు వెళ్ళకమును పీమె యాతనితో మాటాడవలెను. తూర్పుదేశములకుఁ బోవఁదలఁచుకొన్న మెవ్వరున్ని సాబేగము, ఆతూర్పుదేశపు జమీందారునకు నవో హుకుము లీమె ద్వారా బంపుచున్నదని నేననుకొన్నాను. ఆబేగముగారి యాజ్ఞ చెల్లింపదేని— యామె యీమెతల తీయించును."

"ఆగ్రానగరమునకు నీ క్రొత్తపిల్లలు వచ్చుట నాకిష్టములేదు. కాని జలేఖా నీనిమిత్త మీమెకు నేను సాయము చేసెదను."

"అక్కా! నీవు జాలిగుండెదానవు. మా రాణిగారుకూడ నీవంటే యెంతో గౌరవము. నీవు తలచుకొంటే యన్నితలుపుల తాళములు తీసి వేయుదురు."

"జలేఖా! నిజమే. మాతలుపులు తెఱచుటకు నాదగ్గఱ తాళము చేయి యున్నది. ఈపిల్లను అంబరు రాజగృహమునకు పోవుదారిలో విడిచెదను. అక్కడినుంచి యామె పోఁగలదు."

"ఆపని చేయఁగలదు. అక్కా! నీకు దండము. రాజపుత్రస్త్రీ

హృదయ మెప్పుడును జాలిగలదే. మా జోద్పూరురాణిగారు మీ యంబుగరాణిగారిని చాలాచాలా అడిగినదని చెప్పుము."

వెంటనే జలేఖ నరేంద్రునికడకుఁబోయి చెవిలో "ఆ రాజపుత్రి వెంటపో! ఆచీఁకటిదారియొద్ద నాకోసము కనిపెట్టుకొని యుండుము" అని గుసగుసలాడెను.

ఆరాజపుత్రబాలిక దారిజూప నరేంద్రుఁడు చీఁకటికోణములో నెన్నో చిక్కుదారులంబడి వెళ్ళెను. అంబగరాణి యక్కడ లేకపోవు టచే మందిరము చీఁకటికోణమయ్యెను.

అంతట వారు వెలుపలికిపోవుటకు, జనానాకు నడుమనున్న గోడకడకుఁ బోయిరి. రాజపుత్రస్త్రీ యొకతలుపు తాళము దీసి, యామెను గచ్చువాకిండ్లలోనుండి తీసికొనిపోయి, చీఁకటిదారి మొగజేరి యిట్లనియె——"క్రొత్తపిల్లా! ఈదారినివెళ్లు. ఆబంగాళా జమీందారుఁడున్న చోటికి తిన్నగా వెళ్ళఁగలవు. ఇంతమట్టుకు నా మాట తెలిసినదా?"

నరేంద్రుఁడు నోరెత్తక తలయూఁచి తన కృతజ్ఞతఁ దెలుపుటకు సలాముజేసెను. రాజపుత్రకన్య చిఱునవ్వు నవ్వి తన దేశపుపాట నేదో పాడుకొనుచుఁ గనబడకుఁ బోయెను.

ఆ గాఢాంధకారములో నరేంద్రుఁడు చాలసేపు వేచియుండెను. అతని కేమియు వినఁబడలేదు. కనఁబడలేదు. జలేఖకు నెన్నో యపాయములు, ప్రమాదములు సంభవించునని యతని మనస్సునకుఁ దోచెను. తోచగానె గుండెలు జల్లుమనుచుండెను. శీతకాలపు చలి గాడ్పులు జివ్వున విసరుటచే నరేంద్రుఁడు వడఁకెను.

అంతట జలేఖవచ్చి మీఁద జేయివైచి "ఆ చప్పుడు వినఁబడు చున్నదా?" యని యడిగెను.

"నాకెవ్వడు తప్ప నా కేమియు వినబడుటలేదు."

కాని, మఱియొకమాఱు చప్పుడయ్యెను. అది గాలిచప్పుడుగాదు. అడఁగియడఁగి బైటికివచ్చిన పిశాచపునవ్వువలె పెద్దనవ్వు. ఉక్కు-తును వంటి జలేఖ గూడ యాధ్వని విని నరేంద్రుని గౌఁగిలించుకొని వడఁకి "అల్లా మనలను గాచుఁగాక!" అని మిక్కిలి మెల్లగ ననెను.

"జలేఖా! ఆపారసీకస్త్రీ యుంగరము నేను దెచ్చెదను. అది మనల నిశ్చయముగాఁ గాచును."

"జనానాలో మగవాఁడు దూరినట్లు తెలిసెనేని చక్రవర్తి యుంగరమైనను గాపాడఁజాలదు. అదృష్టవశమున నీవు రాజపుత్రస్త్రీలతో వచ్చితివి గనుక నిన్నెవరు ననుమానింపలేదు. నన్ను వారు కనిపెట్టుచుండిరి. ఏటియొడ్డుననున్న కావలివాండ్రకు నన్నుఁ గనిపెట్టుమని యుత్తర్వులు వచ్చినవి నేను వెళ్లినచోట్లు వారెఱుగుదురు. నన్ను వారు వెంబడించుచున్నారు."

"నీవు ధీరురాలవు. లేనిపోని భయమును బెంగపెట్టుకొనకు! వారు నిన్నేల వెన్నంటి తిరుగవలెను?"

"నేను రాచనగరులోనికి మాఱువేషము వేసి క్రొత్తవానిని దీసికొని పోతినని యనుమానముచేత."

"అట్లయిన మన గదిలోనికిఁ బోదము రా! అచట మనము క్షేమముగా నుండవచ్చును."

"అట్లయిన మనలను వారు కనుఁగొని యిరువురఁ జంపుదురు. వారు మన వెంటనంటి వచ్చెదరు."

"ఎవరు వెంటఁదగులుదురు? ఎవరు నీజాడలు కనిపెట్టుచున్నారు?"

"ఎవఁడా? ఎవఁడు కన్నుమూయఁడో, ఎవని క్రూరత్వమున కంతములేదో వాఁడు."

"ఎవఁడు వాఁడు?"

ఆమాటకుత్తరము రాలేదు.

చాలసేపు వారక్కడ నిలిచియుండిరి. కొంతసేపైన నడుగులజాడ వారున్నచోటికి వినబడెను. తొలుత తీగసిలె జలేఖ వేగముగా మనస్సు దిట్టపఱచుకొనెను.

“వెళ్లు. నీగదిలోనికి వెళ్లు. మనము కలిసియుండరాదు. అన్నియుం టిపా చెప్పితిని. ఉదయముగాకమునుపే నిన్ను నేను మరల చూచెదను. ఈలోపుగా నా—నావలపుగాని తెలుసుకొనవలెను.”

చప్పుడుగాకుండ వెలవెలబోవుచున్న యాయువతి గుట్టుమాయమయ్యెను.

ఈసారి సురేంద్రుడామె సలహాకు వ్యతిరేకముగా నడిచెను. దీని పర్యవసానమేమో తెలిసికొనుటకు సురేంద్రుడు చీకటిదారిలో నొక మూల కనబడకుండ దాగియుండెను; కాని, యాతడు గదిలోనికి బోలేదు; అతడు కత్తిపిడిపై చేయివైచి శ్రద్ధతో గనిపెట్టుచుండెను.

అటమీద అడుగులజాడ కనబడలేదు. ఆలేకున్న దూరముగా మఱియొకచోటికిబోయి యుండును. జలేఖ వారిననుసరించియుండును. ఇట్లరగంట జరిగెను. మఱియేమియు వినబడలేదు. కనబడలేదు.

దూరమున నెవరివో మాటలవలె ధ్వని వినబడెను సురేంద్రుడు భయవిహ్వలుడయి తలుపుదగ్గఱకు బోయెను. ఆధ్వనులు ప్రతిమాటలుగా మారెను—పిమ్మట కోపపుమాటలుగా వినబడెను—అవ్వాలు కుయ్యో మొఱ్ఱో యను ధ్వనులువలె వినవచ్చెను—పిమ్మట నాధ్వను లంతరించెను.

మఱియొకసారి దూరమున సన్నని దెబ్బ—తరువాత సన్నని యార్తనాదము—తరువాత దీర్ఘరోదనము. అటమీదట సురేంద్రునకు దుర్భరమయ్యెను. అతడీవలకువచ్చి చుట్టుప్రక్కలం జూచెను. ఎటు చూచిన దుర్భరగాఢాంధకారమె యతని కడ్డపడుచుండెను. ఎటు

బోవుటకు ధ్వనియే వినఁబడుటలేదు.

మఱియొకసారి పెద్దమూలుగు వినఁబడెను. తరువాత మెత్తని వస్తువుమీఁదఁగొట్టిన దెబ్బ. పిమ్మట నిశ్శబ్దము!

అంతట జలేఖ విసవిసవచ్చి చేయిబట్టుకొని నతనిని వేగముగా గదిలోనికీడ్చుకొనిపోయెను.

జలేఖతోఁగూడ నతఁడు గదిఁ బ్రవేశించినపుడు. పకపక నవ్వు తన చెవులకు వినఁబడెను. దీపపువెలుఁగున నతఁడాశ్చర్యకరమైన దృశ్యముఁజూచెను. జలేఖయొక్క దుస్తులు చీకాకుపడియెను. తల వెండ్రుకలు విడిపోయెను. నుదుటిమీఁద నెత్తురుగా దెబ్బకొట్టఁబడెను.

నరేంద్రుఁడు పిచ్చివానివలె వెనుకకుఁబోయి తొందరతో నిట్లనియె—"జలేఖా! ఇది నవ్వులాటకు వేళగాదు ఆవాకిటిలో నేమో జరిగినది. అది నాకుఁ జెప్పు. నీవు నాయొద్ద నది వృథాగా దాఁచఁదలఁచుచున్నావు."

"ఏదో జరిగినది. అది నీకుఁ దెలియఁగూడదు దాఁచవలెనని నా కోరిక. రాచనగరులో నెన్నో రహస్యములుండును పరిచారికలెన్నో సాహసకృత్యములం దగిలియుందురు. అవి వెలిబుచ్చఁగూడదు!"

"జలేఖా! రాకుమార్తె. నీవు నాకు చుట్టమైనంతట నెక్కువదానవు. నీకేమైన నేను సాయపడఁగలుగుదునేని, ప్రాణమిత్రముగా నుండఁ దలఁచుకొన్నాను. నీమృదుశరీరమింతను భయముచే వణఁకుచున్నది అందుచే నిది వలపుసంబంధమైన సాహసములఫలితము గాదు."

"శృంగారయువకుఁడా! నీ దృష్టి యతిసూక్ష్మము. పడుచుదాని మనోదౌర్బల్యము గ్రహింపఁగలుగుదువు. కాని నేను భయపడు చుంటినా క్షమింపుము. రహస్యముగా దానినెవఁడైన ముద్దువెట్టుకొన్న తరువాతఁ గంగు కంపము పడుచుపిల్ల సిగ్గులేక చెప్పుకొనవలెనాయేమి!"

"ఈయసందర్భపు వేళాకోళముచేత నీవు కాలము పాడుచేయుచున్నావు. తెల్లవారఁబోవుచున్నది. ఇద్దఱకు సహాయము రావచ్చును. నేనొక దెబ్బచప్పుడు వింటిని. అది ప్రణయకలహముగాదు. పిమ్మట పెద్దమూలుగు వింటిని. అది వలపుకాని ముద్దుగాదు."

"నీవు పిసుటగూడ తిటస్థించినదా? ఈ నగరులో నీవు క్రొత్తదానవు. ఇక్కడ నెన్నో కలయికలు జరుగుచుండును. వాటిలోనుండి వలపుకాండ్రు మరల విడిపోరు. ఎన్నో గాఢాలింగనములు జరుగుచుండును. అవి ప్రళయకాలముదనుక నుండును."

"జలేఖా! మనస్సు కుదురుబాటు చేసికో! పిచ్చిపిచ్చిమాటలు ప్రేలుచున్నావు."

అనవుడు జలేఖ నరేంద్రునితోఁ జెప్పినట్లుగాక, తనలోఁ జెప్పుకొన్నట్లుగా నిట్లనియె— "ఓయీ! కోటగోడలు మాటలాడఁగలిగెనా యెన్నికథలైనఁ జెప్పును. బేగములుగూడ నెత్తురు మాంసముగల మనుష్యులవలే. అంతఃపుర స్త్రీలందఱు చీఁకటిదారు లెఱుఁగుదురు తలలు వంచుకొని నేలచూపులుచూచు బానిసకూఁతుల కెవరిరహస్యములు వారికున్నవి. ఖిల్లకొజ్జాలు మోహావేశములో నోడలెఱుఁగక వాళ్లవెంటఁ దగిలి చివఱకు పెద్దపులులవలె నాండ్ర నెత్తురు ద్రావుదురు."

"చాలు. జలేఖా! చాలు. నీవు పిచ్చిదానివలె ప్రేలుచున్నావు. నీకు నిజమైన మిత్రునిమాటలు వినుము. నీవు నాప్రక్కనఁగూర్చుండి వడఁకుచున్న నీ చేతులు నామీఁద వేసికో. నీవు నా జబ్బులో నెంతో యుపచారము చేసితివి. నీ కష్టములో నేను నీకు నుపచరింపఁ గోరుచున్నాను. నీ మనస్సు క్షోభపడుచున్నది. నవ్వుచున్నావుగాని యది మునుపటి నవ్వుకాదు."

జలేఖయందు కోడంబడెను. నరేంద్రుఁడు తనచేయిబట్టుకొని ప్రక్కను గూర్చుండఁ బెట్టుకొనుట కొప్పుకొనెను. తనదుఃఖము వంచుకొన

వలచిన యా పరపురుషుని ప్రక్కను గూర్చుండఁగానే యామె వడఁకుచున్నను, చిత్తక్షోభము కొంత తగ్గెను.

“జలేఖా! యిల్లు నీ వుండుట నాకిష్టము. నీవును కుదుర్చుకొని విశ్రమింపుము. నీ గుట్టుమట్టు తెలిసికోవలెనని నాకిచ్ఛలేదు. సమానాపాయము మనల నిద్దఱను గలుపుచున్నది. నన్ను నమ్ముము. ఇష్టమైన యెడల రహస్యము చెప్పుము. లేనిచో దాఁచుకొమ్ము. మిత్రద్రోహినైన యీ మోఘుఁడు నీ కుపకరించునేని, యా యుపకారము వానివలన నీవు పొందుము. అతఁ డది కృతజ్ఞతతోఁ జేయును.”

అంతకుముందు జలేఖ యనుభవించిన సంభవము తరువాతఁ బొడమిన శాంతిచేతనో, నరేంద్రుని మాటల మాధుర్యముచేతనో, యెందుచేతనో యామె యింతవఱ కెన్నఁడు నేమనుష్యునకు నొదిగి యుండనంత సులభముగ విధేయతలతో, “కాని చెప్పుచెప్పు” మని యాతని మాటలకుఁ జెవి యొగ్గెను.

“జలేఖా! ఇంతకన్న జెప్పవలసిన దేమియు లేదు. ఏమన? అక్కడ నేమి జరిగినదో నే నెఱుఁగను. నేను నీ దయాదాక్షిణ్యము లెఱుఁగుదును. నీ సాహసకృత్యములను కనులారఁ జూచితిని. నీ స్వభావము మోటదైనను సులతానుగారి యంతఃపుర పరిచారికవైనను, నీవు సరియైన యాఁడుదానవు; సాహసురాలవు. సరియైన మనుష్యుని నన్ను నమ్ముము. నిన్నతఁడు ద్రోహము చేయఁడు.”

జలేఖ మెత్తనై వలచుట కదే మొదటిసారి. కన్నీటిచుక్కలు రెండు దంతపు పలకలవంటి యామె చెక్కులనుండి జారెను. ఆమె యహంభావము కరఁగెను. నరేంద్రుఁడు మానవప్రకృతికి లోనై యామెను దనదగ్గఱగాఁ జేరఁదీసి మొగము ముద్దుపెట్టుకొని ముంగురుల సవరించి సముచితముగ లాలించెను.

ఆ స్పర్శవలన జలేఖ పులకాంకురములు గలిగి, కంపించి, తనలో

దాక్షిణ్యదృష్టి నీకన్నులలోఁ జూడఁగనున్నాను. నేనెవరికొఱకు చిరకాలమునుండి నిరీక్షించుచుంటినో—ఆ పుణ్యపురుషుఁడవు నీవు." అని జలేఖ గద్గదకంఠముతోఁ జెప్పి యంతర్హితయయ్యెను.

## ౧౫

ఉత్తరహిందూస్థానమునఁ జలికాలమందలి ప్రాతఃకాలము మిక్కిలి సుందరమై యుండును. అట్టిది ప్రపంచమున మఱెచ్చట నుండదు. ఆకాశము మబ్బులేక నీలముగ నుండును గాలి చల్లగా నుండును. సూర్యమండల మెల్లరకు సౌఖ్యప్రదముగాని వెచ్చగా నుండి గోపురములమీఁద, మసీదులమీఁద, దేవాలయములమీఁద, ప్రాకారములమీఁద, విశాలములైన పరిపాలనులమీఁద దేదీప్యమాన ప్రభలతో వెలుగుచుండును. అట్టి యొకనాటి యుదయమున గజపతిసింగును, నరేంద్రుఁడును జెఱియొక గుఱ్ఱమెక్కి యాగ్రానగరవీథుల స్వారి వెడలిరి. పట్టణ మప్పుడెంతో రమణీయముగా నుండెను ఇప్పటి ఢిల్లీ నగరము మనుమఁడైన షాజహానుచేతఁ గట్టఁబడినట్లు, యిప్పటి యాగ్రానగర మక్బరుచేతఁ గట్టఁబడెనని చెప్పవచ్చును. మొగలాయీ చక్రవర్తులలో నగరనిర్మాతలయినవారలలో నక్బరు ప్రథముఁడు. ఆగ్రా, ప్రయాగ, యట్టక్, అను మూఁడు పట్టణములలోని కోటలు వాని నిర్మాణశక్తికి సాక్షులు. అతని మనుమఁడైన షాజహాను కాలమున భవనాది నిర్మాణచాతుర్యము మహోచ్ఛదశ జెందెను. అతని కాలమున నెక్కువ ప్రశస్తమైన స్ఫటికశిలాదు లుపయోగింపఁబడెను. కాని హిందూమహమ్మదీయ శిల్పమును జూడవలెనన్న నక్బరుచక్రవర్తి నిర్మించిన మహాభవన ప్రాసాదములే చూడవలెను.

ఆగ్రానగర మిప్పటిలాగున్నట్లు పదునాఱవ శతాబ్దాంతమునఁ గూడ

మహానగరమై యుండెను. గజపతిసింగు మిత్రసహితముగాఁ బట్టణముఁ జుట్టియున్న పేటలలో నెత్తైన తావున నిలిచి చూడఁగా, నట పట్టణముపలెఁ దోఁపక దూరమునుండి పల్లెటూరువలె వారికిఁ గనఁబడెను. సామ్రాజ్యమందలి ప్రధానపురుషు లనఁగా రాజులు నవాబులు, మునసబుదారులు మొదలగు సామంతులు నగరపరిసరములు ఫలవృక్షముల నాటి వారి మందిరముల చుట్టు నుష్ణదేశమున కనువగునట్టి యుద్యానవనములఁ బెంచిరి. ఎడనెడఁ దెల్లని భవనములతో హర్మ్యములతో నా యుద్యానవనములు, పచ్చని యాకులతోఁ జిగుళ్లతోఁ గాయలతోఁ బూవులతోఁ జూపఱ నేత్రములకు విందులు సేయుచుండును. హిందూవర్తకు లెఱ్ఱరాళ్ళతోఁ గట్టిన గృహములును సౌందర్యము హెచ్చించెను.

ఆస్థలము విడిచి యా రాతు లిద్దరు మెట్టనేల దిగి సన్నని వంకఱ టింకరసందులలోనికి రాఁగానే యాసౌందర్యము తగ్గెను. ఇక్కడ వ్యాపారము జేసికొను మనుష్యుల సందడి యెక్కువగా నుండెను. ఈ భాగమందలి యిండ్లు మట్టివి. పైకప్పుగడ్డి. సిపాయీలు శిబిరానుచరులు, తమతమ కుటుంబములతో నీప్రాంతములయందే కాపురముండిరి; అచ్చటనే చిన్నచిన్న వ్యాపారము జేసికొను పేదలు గూడ నివసించియుండిరి. చిన్న చిన్న దుకాణములు బెట్టుకొని చిన్నవర్తకు లక్కడ జీవయాత్ర జరుపుచుండిరి. పండ్లవర్తకులు కాబూలునుండియు, సమరఖండమునుండియుఁ దెప్పించి బాదము, పిస్తా, యాల్బకారా, నల్లద్రాక్ష, తెల్లద్రాక్ష, ఖర్జూరము మొదలగు పండ్లనంగళ్ళలోఁ బ్రదర్శించి విక్రయించుచుండిరి. రొట్టెలవాండ్రు, మిఠాయిదుకాణదారులు, తమతమ ఖాతాదారులకు సరకు లిచ్చుచుండిరి. మేకమాంసము వేల్చియు, నానావిధములుగ వండియు భాటప్రక్కను మాంసము లమ్ముచుండిరి.

సన్నసందులనుండి వారు కాయగూరల బజారులకును, జేపలబజారులకును బోయిరి. కాని, యచ్చట నరేంద్రుఁడు బంగాళాదేశపు బజారులకును, నీ బజారులకును భేదము గనిపెట్టెను. అప్పటి కప్పుడే జను లా బజారులో గుమిగూడిరి. బంగాళాదేశమందలి కూరలతోఁ బోల్చిన నాగ్రానగరమందలి కాయగూరలు మిక్కిలి తక్కువగ నున్నట్లు నరేంద్రునకుఁ దోఁచెను. యమునానదిలో దొరకెడి చేపలు బంగాళమందలి మితిలేని నదులలో, మడుగులలోను దొరకు మత్స్యములకంటె మిక్కిలి తక్కువగ నుండెను. బంగాళమందు విరివిగా దొరకు, కోళ్ళకు, బాతులకు బదులుగా నా రాజధాని యంగళ్లలోఁ గొన్ని పావురములు తక్కువరకపు కోళ్లు, కౌఁజుపిట్టలు మాత్రమే కనఁబడెను.

జనసమ్మర్దమైన యీ భాగము విడచి యాత్రికు లిద్దరు విశాల వీథులు గల నగర మధ్యభాగమునకుఁ బోయిరి. ఈవీథుల కిరుప్రక్కల విశాలములై సుందరములైన మేడలు మిద్దెలు కట్టఁబడియుండెను. వానిమీఁదఁ జిత్తరువులు, నగిషీపనులు మెండుగఁ గనఁబడెను. మేడల కడుగున నున్న గదులలో ధనవంతులగు వర్తకు లున్నిసరకులను, బట్టు సరకులను విక్రయమునకుఁ బెట్టుకొనిరి. ఉత్తరహిందూస్థాన మిప్పటికి నేపథ్యార్థములకుఁ జేరువడియున్నదో, యట్టి నగిషీపనులు గల వెండి వస్తువులను బంగారునగలను గంసాలులు దుకాణములలోఁ బ్రదర్శించిరి. వీథుల కిరువంకల నున్న యంగళ్లలో, కాశీనగరపు టిత్తడివస్తువులు, ఢిల్లీనగరపు చెమ్కీవస్తువులు, బంగారపునగలు, రాజస్థానపు మలామాసరకులు, గుజరాతులోఁ జేయఁబడిన యీటెలు, కత్తులు, బంగాళములలో నేయఁబడిన ప్రశస్తమయిన నూలుబట్టలు వర్తకు [illegible] ప్రదర్శించిరి. అక్బరుచక్రవర్తి చేతిపనులను, [illegible] మిక్కిలి ప్రోత్సహించుటచే హిందూదేశమందలి నానా భాగములనుండి వర్తకులు తమతమ సరకులను విక్రయమున కాగ్రానగర

మునకుఁ బంపుచుండిరి.

పారసీకము, తార్తారి మొదలగు దూరదేశములనుండి విదేశవర్తకులు సరకుల నమ్ముటకా గ్రామమునకు వచ్చుచుండిరి. యూరపునుండి గూడ వర్తకు లా నగరమున కాకర్షింపఁబడిరి. చక్రవర్తి యూరోపియనులను, క్రైస్తవులను గూడ వచ్చి, యచ్చటఁ గాపుర ముండుమని యాహ్వానించెను. క్రైస్తవ మతబోధకులయిన పోర్చుగీసులు కొంద ఱక్కడ నొక చర్చి కట్టి యొక మతకళాశాల స్థాపించి యందు రమారమి ముప్పదిమంది క్రైస్తవకుటుంబములకు మతవిద్య నేర్పుచుండిరి. వచ్చిన వారు గూడ వారి మార్గము ననుసరించి యానగరమునకే బోయి యొక సరకులసాల నిర్మించుకొని వ్యాపారము సాగించుచుండిరి.

విలువగల యంగళ్లను, బాటసారుల నిమిత్తము కట్టఁబడిన సత్రములను, చావడులను దాఁటి యా రాహుత్తులు ప్రధానద్వారమున కెదురుగా నున్న విశాలమైన చౌకమును జేరిరి. ఆ చౌకమున నిలిచి నరేంద్రుఁడు సుందరమైన యెఱ్ఱరాతి చుట్టుగోడచే నావరింపఁబడి, మహోన్నతములై నేత్రపర్వము జేయుచున్న మహాసౌధముల సౌందర్యముం జూచి యక్బరు చక్రవర్తియొక్క శిల్పనైపుణ్యమును మెచ్చుకొని యక్కజంపడెను. యమునానది యున్నవైపునఁ దప్పఁ దక్కిన మూఁడుప్రక్కల నగరమునకుఁ జుట్టు కోట గోడ క్రింద రాతితో నిర్మింపఁబడి జలపూర్ణములైన కంధకము లుండెను.

చక్రవర్తి కొలువునం దుండి రాజపుత్రనాయకులు గుఱ్ఱముల నెక్కి వంతులమీఁద నీ చౌకమును గాచుచుందురు. కోట సింహద్వారమును గాచుటకే యీ నాయకుల సిపాయీల నిమిత్తము తెల్లని డేరా లా చౌకమున సమర్పఁబడియుండెను. చక్రవర్తి గుఱ్ఱముల కిక్కడ ప్రతిదినము [illegible] కదము నేర్పుదురు. గుఱ్ఱపుదళముల నాయఁకుడు వాని స్థితి జూచుట కక్కడకు వచ్చుచుండును. పట్టణమందలి నానాభాగ

ములనుండి జనులిక్కడ గుంపులు గూడుచుందురు. దొమ్మరాటలు, గారడీలు, కోతులు, భాగవతములు, భోగమువాండ్ర యాటలు మఱి పలు తెఱంగుల వినోదములు నిక్కడ జరుగుచుండును. జ్యోతిష్కులు గూడ నిక్కడ జేరి జ్యోతిషము జెప్పి ధన మార్జించుకొనుచుందురు.

ఇక్కడఁగూడ నన్నివిధములైన సరకుల నమ్మునట్టి బజారొకటి బయలుదేరెను. చిన్నబిడ్డలు, మేలిముసుగులుఁ దాల్చిన యాఁడువాండ్రు నచటికిఁబోయి కావలసిన సరకులఁ గొనుచుందురు. రాజులు, మనసబుదారులు నాయుధపాణులైన సైనికులతో జనసమ్మర్దముగల యాచోటునుండి పోవుచుందురు. 'ఓం ఓం' అని ధ్వనిచేయుచు బోయలు మోయు పల్లకులనెక్కి సామంతుఁ డాదారిని బోవుచుందురు. సామాన్యజనులు కోటలోనికి వెళ్లుటకై నరప్రవాహమో యన్నట్లా దారిని నడుచుచుందురు.

ఆరౌతులిద్దఱు చౌకమునువిడిచి సురక్షితములైన రాజద్వారముల వంకజని, లోపలికిఁ దీసికొనిపోవు విశాలమైన బాటమీఁదికిఁ బోయిరి. అక్కడ మహమ్మదీయ గుఱ్ఱపురౌతులు కావలిగాచుచుందురు. ఆబాట కిరువంకల నంగళ్లుండెను. ఆగ్రాలోని మంచిమంచి పనివాండ్రందఱు నంతఃపురవాసులనిమిత్తము ప్రశస్తమైన వస్తువులనుజేసి, యమ్మకమునకు దెచ్చుచుందురు. వెండిబంగారు చెమికీపనివాండ్రు, బంగారు వెండి నగల పనివాండ్రు, చిత్రకారులు, ముచ్చివాండ్రు, పట్టు, మొఖమాలు నేతగాండ్రు, బేగములకు మిక్కిలి ప్రియములైన సన్నదువ్వాలువల నేతగాండ్రు, ప్రశస్తమైన సూదిపనిచేయు కుట్టుపనివాండ్రు, మున్నగువారుదయము మొదలు సాయంకాలమువఱకు నిచ్చటనేయుండి సరకు లమ్ముచుందురు. హిందూదేశములో వృత్తులు వంశపరంపరగా వచ్చును గదా! నేర్పరియైన ప్రతి పనివాఁడు తనకుమారునికిఁ దనవృత్తియే నేర్పి తన [illegible] వివాహము చేయును. ఈ యాచారము

హిందువులేగాక మహమ్మదీయులుగూడ, ననుసరించిరి. ఉగ్రమావులు, రాజులు, తక్కినసామంతులు కోటలోనున్న యీ యంగళ్లలోనుండియే తమకుఁగావలసిన, వెలలేని పదార్థములను గొనుచుందురు.

ఆబాటనుబోవుచు నరేంద్రుఁడు రెండుదెసలనున్న యున్నతప్రాసాదములను జూచుచుఁ దనకు నివాసమైన యంబరురాజ గృహమును గొంతియాసక్తితోఁ గనుంగొనెను.

"నీ జబ్బులో నీకునికిపట్టయి, నీకుపచారము జరిగిన యీ మందిరమువంకఁ జూడు! రాజవైద్యుల తెలివితేటలవలన బ్రతికితివిగాని, లేనిచో వీరనగరమునకు మంచిప్రభువును, నాకుఁ బ్రాణమిత్రుఁడును లేకపోవునుగదా!" అని గజపతి నవ్వుచు నరేంద్రునితోఁ బలికెను.

ఉదయకాల సూర్యప్రభలు ధగధగ మెఱయుచున్న యంబరురాజు గృహమువంక తాను జూచినప్పుడు వైద్యులమాటయు మందుల మాటయు నతనికి జ్ఞప్తికిరాలేదు. ఏహోయితరవిషయము లాయన మనంబునకుఁ దట్టెను. ఏదోబెంగ యతనిని బీడించెను. ఆ మేడకిటికీ నుండి తెల్లనిచేయిరుమా, యేదేని గుడ్డముక్కయో తనసేమము సూచించుటకు తార్తారుబాలిక యాడించునేమో యని యతఁడా కిటికీవంక మాటిమాటికిఁ జూడఁజొచ్చెను. కాని యే యానవాలు గనఁబడలేదు. ఆభవనమున మనుష్యులున్న జాడయే కనఁబడలేదు.

భేరీధ్వనులు, బాకాలచప్పుడులు, నగరానాదములు నరేంద్రుని యాలోచనల కంతరాయము గలిగించి, చక్రవర్తి దర్బారుమందిరము నకువచ్చి సింహాసనాసీనుఁడై కొలువుండినట్లు సూచించెను. జనులు ప్రవాహమువలెఁ జొరఁబడి తమ చక్రవర్తిని దర్శింపఁగోరిరి. గజపతి నరేంద్రులుగూడ గుఱ్ఱములను హెచ్చరించి త్వరలోనే సభామంటపముఁ గలిసిరి.

చక్రవర్తి ప్రతిదినము కొలువుదీర్చినను దక్షిణ దండయాత్ర జేసి

యహమ్మదునగరమును జయించివచ్చినతరువాతఁ జేసిన గొప్ప దర్బారిదియె. అందుచే నాగ్రాలోనున్న సామంతులే గాక దూరమండలముల నుండి మేటి సుబేదారులు గూడఁ జక్రవర్తికిఁ దమ భక్తిం దెలియఁ జేయ సభకువచ్చిరి. అక్బరు వారిమధ్యమున గొప్ప సింహాసనమునఁ గూర్చుండెను. మనుమఁడైన షాజహాను గట్టించిన మయూరపీఠమంత సుందరమైనది గాకపోయినను నీతని గద్దెకూడ బ్రశంసనీయమైనదె. అక్బరు పొడగరి. చామనచాయవాఁడు. విశాలమైన ఫాలతలము, నీలాలవంటి నల్లకనులను గలిగియుండెను. అతని దీర్ఘబాహువులు ప్రమాదకరములైన యుద్ధరంగములలో నతనికెంతో యుపకరించెను ; కాని యతని దేహదార్ఢ్యము వయస్సుమళ్లుటచే క్షీణిపోయెను. అపాయములకు యుద్ధములకు నలవడియుండినను, నతని హృదయము దయారసపూరితమై జంతువు బాధపడుచుండినను సహింపక నంత మృదువుగా నుండెను. కార్యారంభములయందు దృఢసంకల్పమును, నిర్వాహణమునఁ జాకచక్యమును గలిగియు నతఁడు మిక్కిలి దయాళువై దేశముబాలించెను. అతనిచే జయింపఁబడిన శత్రువులే రాజ్యభవన భారమువహించు స్తంభములు. అక్షరజ్ఞానము లేనివాఁడయ్యు నతఁడు తత్వశాస్త్ర సంబంధములైన వాదములం దెలిసికొనగలఁడు. మహా తార్కికుల హేతువాదములకు సైతము లొంగని పరమార్థము నతఁ డప్పుడప్పుడు గ్రహించుచుండును. సహజవివేకముతోడను సాటిలేని కార్యదీక్షతోడను, దన విశాలసామ్రాజ్యమునఁ బ్రతివిషయమునఁ దానే సన్నాహముసేయుచు వచ్చెను. ప్రతిచిన్న వ్యవహారమున, నతనికి బుద్ధికుశలతయు, గ్రహణశక్తియు ముదితములై యుండెను.

తండ్రిపాలన నతనికి దేశములో నాలుగైదు చిన్నమండలములు మాత్రమె సంక్రమించినప్పటికి, నక్బరు తన బాహుబలముచేతను, [illegible] ఉత్తరహిందూస్థాన మంతయు, నొక్కఁగొడుగు

క్రింగికిఁ దెచ్చి న్యాయముగఁ బరిపాలించెను. అతఁడు తన చుట్టు శూరులైన యోధాగ్రగణ్యులను, రాజనీతివేత్తలను, నార్థిక శాస్త్రపరిజ్ఞాతలను, మహాకవులను, విద్వాంసులను జేర్చెను. ఇట్టి కీర్తి తరువాత మఱే చక్రవర్తికి రాలేదు. విశేషించి యతఁడు తన ప్రజ లందరియందు సమాన విశ్వాసముంచెను. అతఁ డన్ని మతములయందు సమానాదరము జూపెను. అట్టి సమబుద్ధి యతని కాలమునఁ బ్రపంచమునం దే దేశమునను, నే రాజును బ్రదర్శింపలేదు.

ఆనాటి దర్బారులోఁ జక్రవర్తి ప్రక్కను జ్యేష్ఠకుమారుఁడు యువరాజు నైన సలీము నిలువఁబడెను. సభాసదు లందఱు వానివంకనె జూచుచుండిరి. ఈ నడుమ నతఁడు తండ్రియెడఁ జేసిన తిరుగుఁబాటు కర్ణాకర్ణిగా జనులు వినిరి. కాని, నిజమైన వృత్తాంత మెవ్వరికి సరిగఁ దెలియదు. ఆవిషయమై యొక్క మాటయు సభలో రాలేదు. సింహాసనముక్రిందఁ గొంతదూరమున వెండిజవ్వాలతో నొక హద్దు కట్టఁబడెను. ఆ యావరణములో నుమ్రావులు, మనసబుదారులు, రాజులు, విదేశపు రాయబారులు, సామంతులు గూర్చుండిరి. అచ్చటనే మహాశూరులై చక్రవర్తి నిమిత్తము పరిసరదేశములను గెలిచిన బాహుశాలురు, వివేకముతోను సామర్థ్యముతోను దేశమును బరిపాలించిన ప్రజ్ఞావంతులుఁ గూడఁ జేరియుండిరి. తక్కిన ప్రభువులు మఱికొందఱు గౌరవనీయులు నా యావరణమున కావల నుండిరి. వీరుగాక చూడ వచ్చిన జను లనేకులు దర్బారుమందిరమునకు వెలుపల నిలిచిరి.

ఆచారప్రకారము నానావిధాలంకారములు గల యుత్తమజాతి హయములు, బంగారు హౌదాలుగల మదపుటేనుఁగులు చక్రవర్తి మొదటనుండి నడిచి పోయెను. ఆ యేనుఁగులు తొండము లెత్తియు, [illegible] పాదములు వంచియు, సార్వభౌమునకు సలాములు చేసిపోయెను. అనంతరము జంతుప్రదర్శనము జరిగెను. పెంపుడు

జింకలు, నల్లయెద్దులు, బారిడేసి కొమ్ములుగల బంగాళీ దున్నపోతులు, చిఱుతపులులు, సివంగులు, పలుజాతికుక్కలు రాజసమ్ముఖమునకుఁ దీసికొని రాఁబడి పిమ్మట తొలఁగింపఁబడెను. ఎన్నో పక్షులు గూడఁ బ్రదర్శింపఁబడెను. తరువాత గొప్ప యుద్యోగస్థులు కొందరు కవచములు, చెమికీగుడ్డలు, దాల్చిన గొప్పగుఱ్ఱములపై నెక్కి చక్రవర్తి యెదుట స్వారి జేసిరి.

అవ్వల నగారాఖానానుండి నాదము వినబడెను. అది కార్యారంభమునకు సూచన.

జనులు నిశ్శబ్దముగ నుండిరి. అప్పుడు చక్రవర్తి "కుమారా! సలీము! యువరాజ!" అని ప్రియపుత్రుని బలుకరించెను.

సలీము వంగి తండ్రికి సలాముజేసి యుత్తరువు నిరీక్షించుచుండెను.

"నేను నిన్ను మిక్కిలి గారముతోఁ బెంచి, దయతో బెద్దవానిని జేసితిని. అచిరకాలములోనే యీ సామ్రాజ్యము నీచేతిలోఁ బడఁగలదు. అందుకు నీ వర్హుడవై యుండవలెనని నాకోరిక. పడుచువాండ్ర నెత్తురు వేడిగ నుండును. పడుచువాండ్ర భావము లోకప్పుడు తప్పుదారి ద్రొక్కును; కాని పశ్చాత్తాపము దోషమును గడిగివేయును. కుమారుని దోషముల యెడలఁ దండ్రిచూపు గ్రుడ్డిది. ఇది మొదలు నీవు విధేయుఁడవై యుండుము. నీ వెంత శూరుఁడవో యంత ధర్మశీలుఁడవు గమ్ము. సర్వేశ్వరుఁడు నిన్ను ధర్మమార్గమునఁ ద్రిప్పుగాక! పూర్వపు తప్పులన్నియు క్షమించితిని. మఱచితిని. కావున నీ దుస్తులను, గౌరవచిహ్నమైన యీ ఖడ్గమును దాల్చి నీతండ్రి ప్రక్కనే నీవు గూర్చుండుము. నీయెడ నాప్రేమలో నెట్టి మార్పు లేదు."

యువరాజు, తండ్రికి వంగి సలాముచేసి ఖడ్గము దుస్తులను వినయముతో నందుకొని, యాతని కుడిప్రక్కను గూర్చుండెను. ప్రభువుల [illegible] యొక్కయు హర్షధ్వానములు, తప్ప

దారిని నడచిన తనయుని యెడలఁ దండ్రిచూపిన వాత్సల్యమును నౌదార్యమును మెచ్చినందుకు సూచనలయ్యెను.

తరువాత రాజబంధువులు కొందఱు కొన్ని గౌరవముల నందిరి. పిమ్మట మానసింగురాజు వంతు వచ్చెను. అందఱిదృష్టియు నామహాయోధునిపైఁ బడెను. అతఁడు చక్రవర్తి కట్టెదుట వినయముతో నిలువఁబడెను.

అంతట చక్రవర్తి యతని నుద్దేశించి యిట్లనియె—"అంబరుమహారాజా! యావజ్జీవము నీవుచేసిన సేవకు నీకు నీ వివేకమునకు, నీ నిరుపమాన ప్రతాపమునకు నేనిచ్చున దేమియు లేదు. నాయాస్థానములో నెల్ల నీవంటి ప్రతిభాశాలురు లేరు. సామ్రాజ్యముయొక్క కొట్టకొన భాగములఁ గూడ నీయశము వినఁబడినట్లు మఱియొకరి యశము వినఁబడదు. నీవు మాయధికారమును పశ్చిమమున కాబూలుస్థానములోను, జబులుస్థానములోను స్థిరపఱిచితివి. తూర్పున నోరిస్సాను, బంగాళమును, నాఫ్ఘనులఁ జేతినుండి విడిపించితివి నీప్రయత్నము లెప్పుడు జయప్రదము లైనవి."

అనవుడు మానసింగు వినయగర్భితమైన కంఠముతో నిట్లుత్తరము జెప్పెను—"రాజాధిరాజా! నే నిప్పుడు మాటలాడఁదగను. కాని, కృతజ్ఞత నాహృదయమున నిండియున్నది. నాఖడ్గము నీది. సార్వభౌమ! నాకత్తికంటె వాఁడియైన మఱియొక ఖడ్గము ఒరిస్సాను, బంగాళమును మీసామ్రాజ్యమునకుఁ జేర్చినది. కీర్తిశేషుఁడైన మామహాత్ముని యడుగుజాడలలోనే నేనును నడచితిని."

అప్పలుకులు విని చక్రవర్తి విషాదసూచకమైన కంఠధ్వనితో నిట్లనియె "కాలధర్మమునొందిన యా మిత్రులను, కృతజ్ఞులైన యాసేవకులను మఱవఁజాలను. కీర్తిశేషుఁడైన తోడరుమాలురాజు, మహాయోధుఁడు, రాజకార్యవేత్త, ఈసామ్రాజ్యమున కలంకారము. నారా

ష్ట్రమును వ్యాపింపఁజేసి యతఁడే దిట్టపఱిచెను. ముసలితనమున నతఁడు కొలువు చాలించుకొని, విశ్రాంతి గైకొని, గంగాతీరమునఁ గాపుర ముండి యచటనే మృతినొందవలెనని కోరెను. కాని, సామ్రాజ్య మతనిసాయ మపేక్షించుటచే మరలఁ గొలువులోఁ జేరి కాలధర్మ మొందెను. ప్రభువు సేవకులకు నీయఁగల బహుమానముల కెల్ల నతఁ డర్హుఁడై యున్నాఁడు. గతించిన మిత్రునకుఁ జక్రవర్తి కన్నీరు విడుచు చున్నాఁడు.”

పరమపదము నొందిన యా మిత్రునిగురించి యట్లనుచుండ, నాతని ముసలి చెక్కిలనుండి బాష్పబిందువులు జాఱెను. అచ్చటఁ జేరిన జనులందఱుఁగూడ విషాదగ్రస్థులయిరి.

పిమ్మట నెండియు నతఁ డిట్లనియె: “మానసింగురాజా! నేనీయఁ గలిగినన్ని బిరుదములు గౌరవములు నేఁడు నేను నీ కిచ్చెదను. నీకుమారునిసేన భద్రకయుద్ధమునఁ బరాజయము నొందిన తరువాత, వృద్ధుఁడ వయ్యు నీవు మహాయోధుఁడ వగుటచే వెంటనే తూర్పు దేశములకు మరల నరిగి షేర్పూరు యుద్ధమున నాఫ్ఘనుల నోడించి బరిస్సాను వారి చేతినుండి విడిపించి మరల సామ్రాజ్యమునకుఁ జేర్చితివి. నేను నీ కేడువేలసైన్యమున కాధిపత్య మిచ్చుచున్నాను. ఈగౌరవము రాజ బంధువులకుఁ దప్ప నీవఱకు మ రెవ్వరికి నిచ్చినదిగాదు. గౌరవార్థ మీవస్తువులను నెన్నటికిని మార్పు జెందని నామైత్రిని స్వీకరింపుము.”

సార్వభౌముని హస్తమునుండి యిట్టి యపూర్వగౌరవము బడసిన తోడనే యతని హృదయము కరఁగెను. అతఁ డేవో కొన్ని కృతజ్ఞతా సూచక వాక్యములు బలికెనేమో యవి జనుల జయజయ ధ్వనులలో [illegible]

[illegible] పాదుషా [illegible] నెట్లు [illegible]
[illegible]

వఱకు తురకరాజు పక్షమున( బోరాటము సలిపి జయము చేకూర్చిన హిందూరాజు చరిత్రను హిందూస్థానములో కథలుగా ముందు ముందు చెప్పుకొందురు."

అంతట మానసింగు కొంత చనవు మెఱయ జాగరూకతతో నిట్లనియె: "మామగారూ! ఇనుముకన్న నిశ్చలమైన ప్రేమతోను మైత్రితోను హిందూరాజులనెల్ల తన కుటుంబమునకు బంధించిన తురక చక్రవర్తి చరిత్రముగూడ జనులు ముందుముందు కథలుగా చెప్పుకొందురు సుండీ!"

అని మానసింగు రాజు వెనుకకు( దప్పుకొనెను. మఱియొక రాజు ముందుకు వచ్చెను. ఆతడు 'ఖాన్ ఖానన్' అను బిరుదుగల అహదూర్ రహీము. అతడు లేచినతోడనే అదిగో ఖాన్ ఖానన్ గుజరాతు జయించిన శూరుడు! శూరులలో శూరుడు, మహాకవి, దయాళువైన దాతయని జను లతనిని గూర్చి ప్రశంసావాక్యములు బలికిరి.

చక్రవర్తి యతని నుద్దేశించి యిట్లు ప్రసంగించెను :—"ఓ ఖాన్ ఖాననా! స్వాగతము. చాలకాలమునుండి యిక్కడలేక నూతనముగా వచ్చిన నీకు స్వాగతము. సామ్రాజ్యములోనెల్ల మిక్కిలి సారవంతములైన గుజరాతు, బంగాళాదేశములను గెలిచినందుకు నీపేరును మానసింగుపేరును కలకాలము కలసియుండును. నీ పరాక్రమమును మెచ్చి మే మిప్పుడు నీకైదు వేలసేనకాధిపత్య మొసంగుచున్నాము. శూరశిఖామణీ! విక్రమమునకే గాక, మఱియొకందుకుగూడ నిన్ను గౌరవింపవలసి యున్నది. నీఖడ్గము నీతో సమాధిలో నున్నతరువాత [illegible] చిరకాలమువఱకు నీమధురకవిత్వము భవిష్యత్కాలమున జనులు గానముచేసి సంతసింతురు. అహమదునగరములో మొన్న [illegible] చూపిన విక్రమమున కివిగో వెండియు నీదుస్తుల గ్రహింపుము."

అనవుడు రహీము వంగి సలాముచేసి గౌరవసూచకమైన యామీ దుస్తుల నందుకొనునప్పు డీ క్రిందిపద్యము పారసీకమున జేసి చదివెను.

ద్విపద. అతనిమార్గ్మెసెను సక్బరుకథల
గవి వ్యర్థముగఁజేయుగాస మాప్రట్ల
నతని నామమువిన్న నడలువైరులకు.

"కరామత్ ! కరామత్ !" (అద్భుతము. అద్భుతము) అనుచు నతని కవిత్వముకంటెఁ బరాక్రమమునే మెచ్చుచు జనులు హర్ష ధ్వనులు జేసిరి.

తరువాతఁ బాదుషా చనవును మైత్రియు మెఱయ నతని నిట్లడిగెను. "ఓయీ, ఖాన్‌ఖాననా ! ప్రభువులకు ప్రభువా ! నీ త్యాగము నీవివేకమును మించి నడచుచున్నదని చెప్పుకొందురు. నిజమా ? బిచ్చగాండ్రు నిన్ను మిక్కిలి పీడించుటచే నిచ్చుట కేమియులేక కట్టకడపటి భిక్షుకునకు నీసిరాబుడ్డి నిచ్చివేసితివని వింటిని. అనేక మనోజ్ఞ పద్యములకు నాధారమైన యానుషీభాండము లట్టె యుంచుము. ఆ సిరాబుడ్డి పోయినచో మా యాస్థాన మడఁగినట్లె !"

"ప్రభూ ! దేవరవారి యంతఃపురమునకు నాసిరాతో పనిలేదు. కవనము మీ మందిరములోనే పుట్టి పెరిగినది." అని ఖాన్‌ఖానను చమత్కారముగా నుత్తరము చెప్పెను. అక్బరు రాణులలో నొకర్తయైన సలీముబేగము గొప్ప కవయిత్రి. అది మనసులో నుంచుకొని యాకవి యట్లు బదులుచెప్పెను. ఆమాట మెల్లగా నుండుటచేఁ జక్రవర్తికిఁ దప్ప నొరులకు వినఁబడలేదు. పాదుషా సంతోషించెను.

ఖాన్‌ఖానను వెనుకకుఁ బోయినతోడనే మీర్జా అజీజ్ పాదుషా సన్నిధి నిలిచెను. అతనింజూచి చక్రవర్తి యిట్లనియె : "మోధుఁడైన మహాకవి యింకొకఁడు వచ్చుచున్నాఁడు. స్వాగతము ! భక్తిగల మహమ్మదీయుని విధిప్రకారము చేయ పవిత్రమైన మక్కాక్షేత్రమునకు

యాత్రచేసి వచ్చితివి. నీకు దివ్యజ్ఞానము గలిగినది. భగవంతుని మతమే నీ వవలంబించితివి. ఆమతమే మనకందఱకు నుపదేశింపఁ దలఁచుచున్నాము. హిందువులు మహమ్మదీయులుఁగూడ సర్వేశ్వరు నొక్కనినే కొలుచుచున్నారు. నీవు దూరముననున్న బిహారు దేశమును మిక్కిలి వివేకముతోఁ బరిపాలించిన సంగతి మాకు జ్ఞాపకమున్నది. ఈనాటి బాలకులు మీపద్యములను మిక్కిలి తమకముతో వల్లింతురు. గౌరవనీయుని గౌరవించుట మంచిది."

మీర్జా అజీజు వంగి సలాముచేసి తనకుఁ బ్రసాదింపఁబడిన బిరుదములను, గౌరవములను స్వీకరించెను.

అనంతర మనేకు లొకనితరువాత నొకరువచ్చి చక్రవర్తియొక్క కృపారసభరితములైన పలుకులచేఁ గౌరవింపఁబడిరి. వారిలో నొకఁడు కాశ్మీరరాజు. అతఁడు తురక. అతనిరాజ్య మక్బరు కలుపుకొనెను. పదభ్రష్టుఁడైన యారాజునకు దయదలచి యక్బ రొకజాగీరును బ్రసాదించి మఱికొన్ని బిరుదములను గౌరవములను నతని కొసఁగెను. అందుచే నతఁడు చక్రవర్తియెడ భక్తిగలిగి యుండెను. వారిలో నక్బరు కుమార్తెను వివాహమాడిన మీర్జాషారకుగూడ నుండెను. మఱియు గాంధార దేశపు మీర్జా లిద్దరుండిరి. అక్బరు వారికి గాంధార దేశముకన్న పెద్దవగు జాగీరుల హిందూస్థానమున నిచ్చెను.

అంతట నొకరాజపుత్ర రావుత్తు, తన దేశమునకు, జాతికి నను గుణములైన దుస్తులను ధరించి చక్రవర్తికి సలాముచేసి యెదుట నిలిచెను. అతఁడు కనఁబడఁగానే జనులు మిన్నుముట్టునట్లు హర్షధ్వనులు చేసిరి. అక్బరు వానిని బహూకరించి యిట్లనియె.

"ఓహో! రాజకుమారుఁడు, మహాకవి, రాజపుత్రశౌర్యావతారుఁడు, బికనీరు ప్రభువగు పృథ్వీరాజునకు స్వాగతము! శస్త్ర ప్రయోగమందును, కవితా నైపుణ్యమునందును పేరుగాంచినవాఁడవు.

నీపద్యములు నీ రాజస్థాన ప్రతాపమును నద్దములోవలె ప్రతిఫలింపఁ జేయును. ”

అనవుడు నతఁడిట్లనియె : “ నా స్వదేశ వీరగాథలను నేను కావ్యములుగా రచించుట కశక్తుఁడను. అవి యింతకు మున్దే కాలధర్మము నొందిన మహాకవులు రస ముట్టిపడునట్లు తమ కవితాచమత్కృతిచే వర్ణించియుండిరి. మహాశూరులైన మాపూర్వులుగూడ గతించిరి. మావీరులలో కట్టకడపటి యతఁడుగూడ నశించెను. ”

“ నీవు ప్రతాపసింగుని గూర్చి గదా మాటాడుచున్నావు ! నాతో నిరువదిసంవత్సరములు పోరాడియు నాకు లోఁబడకపోయిన శూరుఁడు. అతఁడే మీవారు దేశపురాణా. నీవు నీపద్యములచేత నతనిం బురికొల్పి యుద్ధము సాగింపుమని ప్రోత్సహించిన ద్రోహివి పృథ్వీరాజా ! ” అని యక్బరు నవ్వుచు నతనితో ననెను. ”

“ ఆ రాణా ప్రతాపమును కీర్తించుట రాజద్రోహమైన యెడల నీ విషయమై నాకన్న నెక్కువద్రోహము చేసిన యతఁడు మఱొకఁడున్నాఁడు ” అని యతఁడు బదులుచెప్పెను.

దయాళువైన చక్రవర్తి యప్పలుకులు మెచ్చి యిట్లనియె : “ తన దేశముకొఱకు, తనజాతికొఱకు పోరాడి గతించిన శూరశిఖామణిని అక్బరు మెచ్చుకొనును. ఇట్లనుటచే సామ్రాజ్యసేనాపతులు నాపై కోపగింపవచ్చును. మానసింగు రాజు కీర్తిశేషుడైన యారాణాతోఁ గలిగినకలహముల నిప్పటికిని మఱువలేదు. నేను జీవించినంతకాల మతని కుమారునకు స్వాతంత్ర్యమును, శాంతిని బ్రసాదించెదను. వట్టికొండలు నిస్సారభూములు గల మీవారు దేశముకంటె హిందూప్రజల గాథా [illegible] సాక్షి గావలసినది. ”

అక్బరు [illegible] సౌజన్యములు. జయింపఁబడిన శత్రువులు [illegible] త్రిసతోడ పోరాడి లోఁబడకయున్న

సంస్థాన ప్రభువుల యెడలఁగూడ నతఁడు మహౌదార్యము జూపెను. ఇతరనాయకులు, వీరులుకూడ గౌరవింపఁబడిరి. పిమ్మట వేదాంత శాస్త్రము, కవిత్వము, సంగీతము నేర్చిన మహావిద్వాంసులు గౌరవింపఁబడిరి.

"విచారకరమైన నిరంతరదీర్ఘాలోచనను సూచించు మొగముగల యాబుషినిజూచు! చక్రవర్తికి సలాముచేయు చున్నాఁడు" అని గజపతి పలికెను.

"చూచినాను. కాని యెవరో, యెఱుఁగను." అని నరేంద్రుఁడు బదులు చెప్పెను.

" నిరాడంబరముగా నున్న యావృద్ధుఁడీ యాస్థానమునందున్న వారందరిలో గొప్పపండితుఁడు. ఈకాలమున ననేక పండితులున్నారు గాని వ్రేలుగుడిచి చెప్పుట కతనిసాటివారొక్కరు లేరు."

"గజపతీ! నీ మాటలు నా కాశ్చర్యము గలిగించుచున్నవి."

" ఔనతఁ డట్టివాఁడె. అతఁడు చరిత్రకారుఁడు. తత్త్వశాస్త్రవేత్త. రాజ్యవ్యవహారవిదుఁడు. ఆయన పేరు అబుల్ ఫేజులు."

" ఇతఁడా అబుల్ ఫేజులు! ఈ సంస్థానమున కితఁడుదీపము. ఇతని పేరు హిందూస్థాన మంతయు గౌరవించును."

"అతనియెడ గౌరవమున్నది. ద్వేషమున్నది. చిన్ననాఁడితఁడు దర్బారునుండి వెడల గొట్టబడి మిక్కిలి పేదయై చాలకష్టపడెను. ఈచక్రవర్తి పెద్దవాఁడై గద్దెనెక్కిన పిదప, ఈయనను రావించి సన్మానించెను. ఇతని యొద్దనుండియే చక్రవర్తి యీశ్వరమతము నుపదేశము నొందెనని చెప్పుకొందురు. ఆమతమువలన నతఁడు హిందువులను మహమ్మదీయులను నేకముజేయవలెనని సంకల్పము. ఈయాస్థానమందలి ముల్లాలాయనను ద్వేషింతురు; అతని బోధనలను విను వారు మహమ్మదీయులలో మిక్కిలి తక్కువ. చూడుము! యువరాజుసలీము చూచు

చుటమని యతనిపై నెట్లు చూచుచున్నాఁడో? ఈసలీము సింహాసన మెక్కినపిదప నీ స్వచ్ఛచరిత్రకారుని పని యేమగునో యని భయము."

"కాని యీ యువరాజొకప్పుడు చాల నానందభరితుఁడగును." అని యేవో సంగతులు జ్ఞప్తికిఁ దెచ్చుకొని నవ్వుచు నరేంద్రుఁడు బదులు చెప్పెను.

"చాలు! ఊరకో! ఊరకో! చుట్టుప్రక్కల వారందఱికి వినఁ బడును. ఇట్టిచోట రాజకుమారులు తప్పులు చెప్పుకొనగూడదు."

"బుద్ధిశాలియు, నబుల్ ఫేజులు తమ్ముఁడునైన ఫేజి యెక్కడున్నాఁడు? మృదుమధురములైన యాతని పద్యముల నాగ్రాలో నెల్లు బ్రీతితోఁ జదువుదురో, బంగాళమునఁ గూడ నట్లె చదువుదురు."

"అయ్యో! అతఁడు గతించినాఁడు. సార్వభౌముని యాస్థానము లోని యా దీపము మిక్కిలి త్వరలో నారిపోయినది!"

"అనేక విచిత్రకథలలో పాదుషా పేరుతోఁ గలసియున్న వీర బలుఁడుగూడ గతించినాఁడు. అతనిని గురించిన కథలు, చమత్కార వాక్యములు, బంగాళములోను, దేశమందలి ప్రతిగ్రామములోను చెప్పు కొందురుగదా!"

"గొప్పయోధుఁడు, మంచియుపదేశకుఁడు, చమత్కారముగల స్నేహితుఁడునైన యావీరబలుఁడు పశ్చిమపర్వతములలో నొక దండ యాత్రా సందర్భమున మృతినొందెను. ప్రియమిత్రుఁడు, మంచిసేవ కుఁడునైన యాతని మరణమువిని చక్రవర్తి యన్నము తినలేదఁట! నీళ్లు త్రాగలేదట! అబులు ఫేజులకు సమీపమున, ఆకువచ్చతలపాగ తోను, పొడుగుగడ్డముతోను నిలచి, అసూయా సూచకములైన కన్ను లతో [illegible] జూచుచున్న యామనుష్యుని జూడుము."

"[illegible] సూచించు నతని వాలకమువలనే గనిపెట్టు చున్నాను [illegible] యాలోచించుచున్నాను."

" ఆయనగూడ గొప్ప చరిత్రకారుఁడు. మంచివ్రాతగాఁడు. ఈ చక్రవర్తియొక్క చరిత్రను, కథలను అతఁడు వ్రాయుచున్నాఁడు. ఏకవ్యాపారము చేయువారి కెప్పుడు మైత్రియుండదుగదా! ఆయనకు నబుల్ ఫేజలుకు సరిపడదు. అతని పేరు బాదాని."

అత్తఱి నగార్ ఖానానుండి భేరీమ్రోత వినఁబడెను. చక్రవర్తి కొలువు చాలించుచున్నాఁడని దానిసూచన. దర్బారు ముగియక మునుపు సామంతప్రభువులకుఁ బ్రజలకు నేదోయొక విషయము ప్రకటింపవలెనని చక్రవర్తి తలంచినందున నొక యుద్యోగస్థుఁడు లేచి పాదుషాకు సలాముచేసి యిట్లు వచించెను—

"ఓ మహాచక్రవర్తీ! ఈశ్వరప్రతినిధీ! మతసంరక్షకా! చిత్తగింపుఁడు. పడమటదేశములో నివసించుచు సముద్రసంచారమునందు, వాణిజ్యమునందు నిపుణులైన యొకజాతివారు దేవరవారి దేశములతో వర్తకము చేయఁదలచుచున్నారు. ఆ జాతివారి దేశములతో వర్తకము చేయుఁదలచు చున్నారు. ఆ జాతివారి రాణియొద్దనుండి దేవరవారి కొకయుత్తరము వచ్చినది. హిందూస్థాన జనులతో వ్యాపారము చేసికొనుటకు సెలవు దయచేయుఁడని యాతెల్లరాణి కోరుచున్నది. ఆ జాతివారు పడమటిసముద్రములలో నొకదీవిలోఁ గాపురముందురు. ఇంగ్లాండు దానిపేరు.

ఆ యింగ్లీషురాణి వ్రాసినలేఖ పారసీకమునకు తర్జుమా చేయఁబడెను. అందిట్లుండెను :

"ఎలిజబెత్తు, దైవానుగ్రహమువల్ల, ... ... ... దుర్జేయులై, మహాబలవంతులైన, యెరాబ్దిన్ ఎకబర్, కాంబేయారాజులునైన మహాచక్రవర్తిగారికి.

"మా ప్రజలు ప్రపంచమున మిక్కిలి దూరముననున్న దేశములు జూడ నాసక్తిగలవారు. వారికి శక్యమైనంతవఱకు నానాదేశముల

సరకులను మీ దేశములో దింపవలయునను మంచియుద్దేశము గలదు. అందువలన నుభయులకు లాభకరమైన వ్యాపార మెల్ల సరకులలో జరుగును. అందుచే నీ లేఖ దెచ్చిన జాన్‌న్యూబెరీయను నతఁడు తన సహచరులతో గలిసి మిక్కిలి వినయముతో దేవరవారి దర్శనము నిమిత్తమై వచ్చియున్నాఁడు. మీ రాజ్యములోను, సరిహద్దులలోను వ్యాపారము చేయఁగలఁచు చున్నాము. మహాసార్వభౌములైన మీరు, వీనిపై సంపూర్ణానుగ్రహముంచి మా మనవి సమ్మతింతురుగాక యని కోరుచున్నాము.

" మే మిందుకు మీకు మిక్కిలి కృతజ్ఞుల మగుదుము."

" దేవరవారు మహాసార్వభౌములై పరమదయాళులని కీర్తి మా ప్రాంతములఁగూడ వినఁబడుటచే భారము తగ్గి మిక్కిల తక్కువ మాటలతో నీ విన్నపము పంపుకొన్నాము. వీరు మా ప్రజలు గనుక వానిని దయతోను, గౌరవముతోను ఆదరింపవలెనని మిమ్ము కోరుచున్నాము. వీరు కడుదూరముననున్న మీ దేశమునకు, సముద్రములమీఁద మిక్కిలి ప్రయాసపడి ప్రయాణముచేసి వచ్చినందున వర్తకము నిమిత్తము మీ కుచితమని తోఁచిన హక్కులను, సౌకర్యములను వారికి దయచేయవలెనని కోరుచున్నాము. మీరిట్టి సదుపాయములు చేసిన పక్షమున మేము మీకు శాశ్వతముగా కృతజ్ఞులమై యుందుము. మీకు శుభమగుఁగాక !"

అని యుద్యోగస్థుఁడాబాబు జదువ నాస్థానమందున్న జనులందఱుం దాఘుదివఱకు విని కని యెఱుఁగని దేశప్రజలమాట యేదో విచిత్ర కల్పితకథగా భావించి యాశ్చర్యముతో నాలకించిరి.

"ఓసామంతులారా ! స్థానజనులారా ! ఆ లేఖ [illegible] విన్నారు గదా [illegible] నాకు [illegible] గావలెను. ఓయా! [illegible]

"మొదటివాఁడవు; ఓట్టరివి. చెప్పు! సలహా చెప్పు!" అని పాదుషా అడిగెను.

అడుగుటయు, వివేకియైన ఖాన్‌ఖానను డిట్లనియె; "లోకము విశాలమైనది. ఇస్లాముమతము యొక్క జయపతాకములు పారసీకమున, ఈజిప్టుదేశమున, టర్కీ దేశమున నెగురుచున్నవి. అంతే కాదు. ఆల్జీర్సులోను, ట్యూనిసులోను, మొరాకోలోనుగూడ నున్నవి. పడమటనున్న యీచిన్నదీవిని గురించి మన మేమియు నెఱుఁగము. నజ్యమతస్థుల విజయములు (మహమ్మదీయులవిజయములు) ఫ్రాన్సు, స్పెయిను దేశములలోను ఈనడుమ ఆస్ట్రియా, హంగేరిదేశములలోను వ్యాపించినవి గాని, దీనిమాట మనకు తెలియదు. పడమటి దేశముల జనులు నౌకాయాత్రలలోను, వాణిజ్యములోను గట్టివారు. అందుచే భాగ్యవంతమై నిత్యకల్యాణప్రదమైన మీసామ్రాజ్యముతో వారు వ్యవహరింపఁదలచుకొన్నారు."

అని యాతఁడు చెప్పగానే "రాజామానసింగు చెప్పెడు సలహా యేమి?" అని పాదుషా యడిగెను.

అనవుడు మానసిం గిట్లు విన్నవించెను: "పశ్చిమరాజ్యములను గురించిగాని, యక్కడి ప్రజలను గురించిగాని, నాకు తెలియదు. నేను కాబూలుస్థానును, జబూలుస్థానును, హిందూకుష్‌పర్వతములను నెఱుఁగుదును. ఏలినవారి జయధ్వజముల నక్కడ మా రాజపుత్రులు నాటిరి. నాకంటె బుద్ధిమంతులగు వారీవిషయమున సలహా చెప్పవలెను."

అంతటఁ జక్రవర్తి కన్ను లబుల్ ఫేజలుమీఁదఁ బడెను. పడుటయు నతఁడు వినయముతో నిట్లు మనవిచేసెను:

ఖాన్‌ఖానను సెలవిచ్చినట్లు ప్రపంచము విశాలమైనది. ఈపశ్చిమ జాతులవారే క్రొత్తప్రపంచమును గనిపెట్టిరి. ఆక్రొత్తప్రపంచమున స్పెయినుదేశపురాజునకు జాల దేశములులోఁబడినవి, పోర్చుగీసు పాదు

ఆసియా, ఐరోపా, ఆఫ్రికాఖండములచుట్టునున్న సముద్రములనన్ని టిని దున్నినట్లు కలంచివేయుచున్నారు. డచ్చివారు గూడ నౌకా విహారమున, వాణిజ్యమున నిపుణులు. అన్నిప్రక్కల సముద్రముచేతఁ జుట్టఁబడిన యింగ్లాండుదేశీయులు మిక్కిలి గర్వముగలవారు. కొన్ని యేండ్లక్రిందటనే వారు స్పెయినుదేశపు నౌకాసైన్యమును నాశనము జేసిరి. ఇకమీఁద వారు సముద్రముమీఁద సర్వాధికారము సంపాదింతురు. వాణిజ్యమే యెల్లజాతులు భాగ్యమునకు సాధనము. విదేశీయుల వాణిజ్యమును ప్రోత్సాహపఱచుట దేవరవారి కీర్తిముగదా."

అతని సలహా విని పాదుషా యిట్లనియె:

"వివేకియైన నాపుత్రుఁడు చక్కఁగాఁ బల్కెను. తూర్పుననుండి పడమరనుండి వచ్చెడు నెల్లజాతులవారికి నారాజ్యము వర్తకము నిమిత్తమై ప్రవేశయోగ్యమై యుండును. ఈలేఖ తెచ్చిన యూరపియను దేశదూతకు నారాజ్యము స్వాగత మిచ్చును. మామైత్రి సూచించుప్రియభాషణములు పడమటి దీవినేలుచున్న మహారాణికి, తెల్ల రాణికి పంపెదము."

## ౧౬

ఆ సాయంకాలముననే నరేంద్రునకుఁ బాదుషాయొక్క కార్యాలోచన మందిరముఁ బ్రవేశించు భాగ్యము గలిగెను. దర్బారుమందిరమున నున్న వైభవమునకుఁ గార్యాలోచన మందిరమున నున్నదానికి నెంతో భేదము గలదు. బంగాళములోని స్థితిగతులు వివరముగాఁ దెలిసికొనవలయునని తలంచి, చక్రవర్తి బంగాళాదేశపు యువకుని దోడ్కొనిరమ్మన్ని మానసింగును గోరెను.

[illegible]మందిరము దర్బారు మందిరముకన్న మిక్కిలి చిన్నది. [illegible] గురించి [illegible]

కార్యాలోచన విూభవనమునసే చేయుట యక్కరున కలవాటు. మిక్కిలి గొప్పవారు తప్ప తదితరు లీమందిరమునం బ్రవేశింపరాదు; చక్రవర్తికి విశ్వాసముగల యుద్యోగస్థులు మాత్రమే యిక్కడికి రానర్హులు. ఈమందిరమునఁ బాదుషా వెలలేని నగలు, దుస్తులువలు దాల్చి చక్రవర్తివలెఁ గూర్చుండక, తన సామ్రాజ్యముయొక్క పరిపాలనా వ్యవహారమును నడుపుకొనుచున్న సామాన్య మనుష్యునివలె నాసీనుఁ డయ్యెను.

ఈ మహాచక్రవర్తి నలువదయిదు సంవత్సరములు సామ్రాజ్యమును బాలించెను. ఆకాలమందు దేశ మలజడులు, తొందరలు లేక ప్రశాంతమై యుండెను. రాష్ట్రములన్ని ప్రక్కలఁ బెరిఁగెను. కాబూలు, గాంధారము, కాశ్మీరము, సింధుదేశము, ఘూర్జరదేశము, రత్నగర్భవంటి బంగాళము సామ్రాజ్యమునకుఁ జేర్పఁబడెను. అతని కాలమున సామ్రాజ్యము హిమాలయము మొదలుకొని దక్షిణమున వింధ్యపర్వతము వఱకును, పడమట హిందూకుష్ కొండలు మొదలుకొని, ఆసాము పరిసరములవఱకును వ్యాపించియుండెను. ఈనకుమనే యతఁడు వింధ్యపర్వతము దాఁటి యహమదునగరముఁ బట్టుకొని, దక్షిణదేశమునఁ గూడఁ దన విజయధ్వజముల నాటెను. ఈగొప్పరాష్ట్రము పదిహేను మండలములుగా విభజింపఁబడెను. అన్నిజాతులవారు, నన్ని తెగలవారు గలసి పదికోట్లజను లతనిపాలనము క్రిందనుండిరి. సహనవిశ్వాసములవల్ల నీ జనులందఱుఁ జక్రవర్తియెడ భక్తియు ననురాగముఁ గలిగి యుండిరి.

అంతటి చక్రవర్తి యీకాలమున నాసియాఖండమునఁ గాని, యూరపుఖండమునఁ గాని లేఁడు. కాని యీమహాచక్రవర్తియొక్క యవసానదశ బహు విచారములతో నిండియుండెను. ఆయన విశాల ముఖమున విషాదము ముద్రితమైనట్లు నరేంద్రున కగపడెను. కొన్ని

విషయములను గుఱించి యాలోచించుటకే చక్రవర్తి కొంతకాలము సాయం కాలమునఁ దనను సమ్మినట్టి బంటులైన పురుషులఁ గొందఱ రావించెను.

చక్రవర్తి, తన సన్నిధానమున నిలువఁబడిన ఖాన్‌ఖానానును జూచి సాదరముగ నిట్లనియె: "అహమదునగరమును నీ భుజబలమువలన సాధించితివి. వివేకముతోను న్యాయముతోను దానిం బరిపాలించు భారము నీపైఁ బెట్టి నిన్ను నమ్ముచున్నాఁడను."

" దేవరవారు వింధ్యపర్వతము దాటి స్వయముగా వచ్చి యీ కార్యములన్నియు నడుపకపోయినయెడల మాకు గెలుపు చేకూరకయే పోవును. మహాతేజఃపుంజమైన సూర్యమండలమునుండియే కాంతి మెరవుదెచ్చుకొని గ్రహములు ప్రకాశించుచుండును గదా!

అనవుడు ఖాన్‌ఖానానుఁడు తనయెడఁ జేసిన స్తోత్రమును, ప్రసంగములోఁ దెచ్చిన యుపమానమును సరకుసేయక పాదుషా యిట్లనియె. "కష్టమైన పనియంతయు ముందేయున్నది. అహమదు నగరములో నింకను దండిమగలు చాలమంది యున్నారు. మన కాలముననుు, మన దేశమునను మిక్కిలి శూరురాలైన యానారీమణిని స్మరించి యాదండిమగలు గట్టిగఁ బోరుదురు."

"దేవర వారట్లనఁ దగినదే. చాంద్‌బీబీ రాణీ అహమదునగరపు మహాత్మ్యదీయుల గాథలలోఁ జిరకాలముండును. దుర్గావతి గాండ్వానా హిందువుల కథలలో నున్నట్లే యీమెయు నుండును. అసమానమైన ప్రజ్ఞాశౌర్యములుగల యీ యిద్దరు కాంతలు నాగ్రా నగరములోని స్ఫటికపు మసీదు ద్వారముకింది వెలుగునట్టి రెండు జ్యోతులవలె నీవరి పాలనాకాలమును దీపింపఁజేయుటకై భూమి మీఁదఁ బుట్టిరి."

ఆనాఁటి సాయంకాలమునఁ జక్రవర్తి యాయకువది తనసద్గోష్ఠి [illegible] ప్రయోగించు మనమహాపాద్యాలంకారముల [illegible] నొచ్చి వంతపించె [illegible]

మనోవికాసము లేకయుండెను. పగవారి ధైర్యసాహసముల మెచ్చుకొనుటలో హుమాయూనంతటి యుదారపురుషుఁడు మఱియొకఁడు లేఁడు.

"ఆ సంస్థానములు రెండు పడిపోయిన తరువాత, నా యిరువురు కాంతలు బ్రతికియుండిన నెంతో బాగుండును. దుర్గావతీదేవి నేఁడు జీవించి యుండెనా, నా రాష్ట్రములో మిక్కిలి ప్రశస్తమైన జాగీరొకటి, యామె కిచ్చియుందును. నా వంశస్థుఁడైన యుత్తమరాజకుమారుఁ డొకనికి చాంద్‌బీబీని మిక్కిలి గౌరవముతోఁ బెండ్లియాడి యుండును. ఓయీ, ఖాన్‌ఖాననుఁడా! ఆమె ధైర్యసాహసముల నీవు స్వయముగాఁ జూచితివి గదా!"

"చిత్తము. మహాచక్రవర్తీ! ఆ ధీరురాలివలన నేనును, రాకుమారుఁడగు మురాదును, పరాజయము నొందితిమని యొప్పుకొందుము. రెండు దినములవఱకు జరిగిన, యాగొప్ప యుద్ధమున, గోదావరీతీరమున, మొగలాయీసేనలోని శూరులెందరో మడిసిపోయిరి. దేవరవారి కనిష్ఠపుత్రుఁడైన దేనియలు తక్కినవారికంటె నెక్కువ విజయము బడసెను. దేవరవారు వచ్చి స్వయముగా మా ప్రయత్నములకుఁ దోడ్పడునంతవఱకు నహమ్మదునగరము మన యధీనము గాలేదు."

తన కుమారుల పేళ్ళు చెవిని బడినంతనే చక్రవర్తి మొగమున విషాదచ్ఛాయలు పొడకట్టెను. మరల నతఁడు మాటలాడునప్పుడు కంఠములో నించుక గాద్గద్యము కనఁబడెను.

"నా కుమారుఁడు మురాదు మద్యపానమను భ్రమపెట్టు తప్పుదారిని నడిచి యకాలముఁ జెల్లిపోయెను. నా కుమారుఁడు దేనియలు కూడ వీరధర్మము విడిచి భోగపరాయణుఁడై యుండఁ దలఁచినట్లు తోఁచుచున్నది. నీవు నీకుమార్తె నిచ్చి పెండ్లి సేయుటచేత నతనికి తండ్రివంటివాఁడవు. ఒక కన్ను తనిమీఁద వేసి కనిపెట్టుచుండుము. అతఁడు పేరునకు అహమ్మదునగర పరిపాలకుఁడైనను, సంస్థానవ్యవ

హారమంతయుఁ జూచు భారము నీదే."

"దేవరవారి శాసనము శిరసావహించెదను. రాకుమారుఁడైన దేనియలునకు నా కుమార్తె నిచ్చుటవల్ల నే నెంతో గౌరవనీయుడఁ నైతిని. నా తల దన్నిన గొప్పవా రెందరో, యీసంబంధము నపేక్షించుచున్నారు. బీజపూరు సుల్తాను గూడ మిక్కిలి సుందరియైన తన పుత్రికను గూడ నీకుమారునకే యీయఁదలఁచినట్లు వింటిని. దక్షిణ హిందూదేశమున మహావిద్వాంసుఁ డొకఁడు పెండ్లి రాయబారము నడుపుచున్నాఁడు."

"అతని పే రెవరు ?"

"ఆయన పేరు ఫెరిస్టా. గజినీమామూదు కాలము మొదలుకొని దేవరవారి కాలమువఱకు హిందూస్థానచరిత్రము నతఁడు వ్రాయుచున్నాఁడని చెప్పుదురు. మన మిత్రుఁ డబుల్ ఫేజలు దానిం జూచి మెచ్చుకోవలెను."

"పండితుఁడైన యబుల్ ఫేజలు జ్ఞానసంపన్నుడైన యట్టి పండితునికి స్వాగతమిచ్చి యాదరించును. దక్షిణదేశమందున్న యామిత్రుని బదాని గూడ తప్పక యాదరించును." అని చిఱునవ్వు నవ్వి "యీ ముగ్గురు పండితులు తలఁచుకొన్న పక్షమున, మేము పోయిన తరువాతఁగూడ, మా గాథలు, మా విక్రమములు నీ దేశములోని జనులు చాలకాలము చెప్పుకొందురు."

అనవుడు ఖాన్ ఖానుఁ డిట్లనియె: "ఇతర దేశములలోఁ గూడ జెప్పుకొందురు. అబుల్ ఫేజులు కీర్తి హిందూస్థానముననే బంధింపఁబడ లేదు. మీకాశాస్త్రుఁ డయిన పారసీకపురాజు 'నే నక్బరు ఖడ్గమునుగూడ లేదు, యబుల్ ఫేజులు కలము మిక్కిలి వెఱపుగొలుపు' నని యనెన్నాఁ డఁట. [illegible] చేసిన మొదటిపని సమాధులలో [illegible] గూడఁ జాలకాలము నిల్చును."

"ఓయీ, ఖాన్‌ఖానుఁడా! వివేకములేని యాబిచ్చగానియొద్దనుండి నీవు మరల సంగ్రహింపఁగలిగుదువేని, నీ సిరాబుద్ధి యశస్సు గూడఁ బ్రపంచమునఁ జిరకాలముండును." అని తననుగూర్చి ఖాన్ పల్కిన యుపచారవాక్యమున కుత్తరముగా నబుల్ ఫేజిల్ పలికెను.

అప్పుడు చక్రవర్తి యబుల్ ఫేజలున కిట్లనియె : "అబుల్ ఫేజలు! జీవితములో మేము చేసిన కార్యముల నెల్ల నీవు జాగ్రత్తగా నడపుటచే నీకును, మేము జేసిన కార్యములనెల్ల సరిగా లిఖించుటచే నీ కలమునకును, మేము కృతజ్ఞులము. ఇదిగాక కొన్ని యితర విషయములలో మేము నీసాయ మపేక్షించుచున్నాము. నా జ్యేష్ఠకుమారుని ప్రవర్తనము నాకు మిక్కిలి విచారము గలిగించుచున్నది."

అంతట మానసింగురా జిట్లనియె : "మహాప్రభూ! మీరు దక్షిణదేశమునకు వెళ్ళినప్పుడు మీ పెద్దకుమారుని సలీమును దేవరవారికి మీరు దేశమునకు పరిపాలకునిగా నియోగించిరి. ఆయనకు సాయము జేయవలెనని నేను బంగాళమునుండి వచ్చితిని. అంతట బంగాళములో మరల సల్లరులు బైలుదేరుటచే యువరాజు నజిమీరులో విడిచి నేను బంగాళమునకుఁ బోవలసి వచ్చెను. బంగాళము మరల జయింపఁబడినది. గట్టిగా బుద్ధిచెప్పితిమి గనుక నికమీఁద నాఫ్ఘనులు మనమీఁద తిరుగుబాటు చేయరు. దేవరవారి కిష్టమగునేని నేను యువరాజునొద్దకుఁ బోయి యిప్పటికిని బెనఁగులాడుచున్న కడపటి రాజపుత్రసంస్థానమును సాధించుటలో సాయపడెదను."

"ఆహా! రాజపుత్రున కిది తగినపనియే!" అని యెగతాళిగాఁ బృథివిరాజు తనలో గొణుగుకొనెను.

గర్వితమైన యా పృథ్వీరాజు మాట వినినట్లె మానసింగు నటించెను; కాని యతని మొగమునఁ గోపచిహ్నములు కనఁబడెను.

చక్రవర్తి మానసింగుతో నిట్లనియె :—"రాజా! అట్లు గాదు,

నిన్ను బంగాళమునుండి వెలుపలికి తీసికొనిరాను. నీవు మేలైన బంగాళ దేశమును న్యాయముగా పదిసంవత్సరములకంటె నెక్కువ కాలము పరిపాలించితివి. నేను బ్రతికియున్నంతకాలము నీ వా దేశమే పాలింప వలయును. అదిగాక మీావారుదేశపు యుద్ధము నామనస్సులో ప్రధాన విషయముగ నుండలేదు ; నా కుమారుఁడు సలీమును గురించియే నాకు బెంగగా నున్నది. నీవు బంగాళమునకు వెళ్ళినప్పుడు, మీావారును జయించుట విషయమై మఱచిపోయి కోటను బట్టుకొని యువరాజు తాను సింహాసన మెక్కవలెనని మిక్కిలి వేగమున నాగ్రాకు వచ్చెను. బుద్ధిహీనుఁడైన యీయువరాజీసామ్రాజ్యము భగవంతుఁడు మన కప్పగించిన ధర్మసంస్థ యనియు, భగవంతుని యిచ్ఛయైనప్పుడా సంస్థ తనకు సంక్రమించు ననియు నెఱుఁగఁడు. కాని రాజకుమారుల కోపిక లేదు. ముసలివానిని సుఖముగాఁ జావనీయరు.”

కడపటి పలుకులు పలుకునప్పు డక్బరు చిఱునవ్వు నవ్వెను. కాని యతని కన్నులలో పెద్దబెంగ పొడకట్టెను. అది మానసింగు గ్రహించి యిట్లనియె:—“దేవరవారికి సలీము విషయమున నిట్టి యభిప్రాయ మున్నపక్షమున, మన యనంతరమున సామ్రాజ్యము క్షేమముగా నుం డుటకుఁ దగిన యేర్పాటులు చేయుట మంచిదిగాదా? సలీమునకు బుద్ధిమంతులగు కుమారులున్నారు. చెడుబుద్ధిగల సలీము చేతిలో కంటె రాజ్యము కుమారుల చేతులలో నెక్కువ బాగుగా నుండదా ?”

మానసింగు మనస్సులోనున్న యాలోచనలను మహామేధావియగు చక్రవర్తి తత్క్షణమే గ్రహించెను. మానసింగు చెల్లెలిని సలీము వివాహమాడి కుస్రూ యనుకుమారుని గనెను. అతఁడు కాఁగలవాఁడని యెల్లవారు తలంచుచుండిరి. సామ్రాజ్యక్షేమమో, మేనల్లునిమీాఁది ప్రేమయో, యేదైన నేమి పనికిమాలిన సలీమును రాజ్యహీనునిజేసి, కుమారుఁడైన కుస్రూను సామ్రాజ్యపదవియం దుంచుట మంచిదని

యతని మనంబునకుం దోంచుటచే నతం డాసలహా చెప్పెను. కాని, బుద్ధిశాలియగు నక్బరు వాని సలహానుఁ గమనింపలేదు. అక్బరు మృతి నొందునప్పుడు బలవంతుండైన మానసింగుయొక్కయు, వానిమిత్రుల యొక్కయు కోరికలకు వ్యతిరేకముగా సలీమునకే సామ్రాజ్యము సంక్రమించునట్టి యేర్పాటులుచేసి పోయెను.

కొంత యాలోచించి యక్బరు మానసింగున కిట్లనియె;—"రాజా అట్లుగాదు. నీయాలోచన నే నంగీకరింపఁజాలను. నీ చెల్లెలికొడుకు చక్కనిపిల్లవాఁడే యని నేనెఱుఁగుదును. పౌరుషశాలియైన కుస్రూ, మనుమ లందఱిలో నాకు మిక్కిలి ప్రియుఁడు. కాని, తండ్రిని దీసి వైచి కొడుకును గద్దె నెక్కించుట దురభ్యాసము నెలకొల్పుట. రాజ్యముయొక్క యక్రమసంక్రమణము ముందుముందు బలవద్విరోధము నకు రక్తపాతమునకు c గారణమగును. సలీము నాయెడల విధేయుఁడు గానిమాట నిజమె ; కాని వినయవిధేయతలు వానికిఁ గలుగునట్లు నేనేర్పాటు చేసెదను. ఓయీ అబుల్ ఫేజలు ! నా కెల్లప్పుడు ప్రియ మిత్రుఁడవు, ధర్మోపదేష్టవు. ఈ విషయములోఁగూడ నీవు నాకు సాయము జేయువలెను."

"దేవరవారి కేమిగావలెనో సెలవిండు. ఈ సేవకుఁడు తప్పక దానిం జేయును."

"నేను లేనప్పుడు యువరాజుసలీ మాగ్రాకు వచ్చెను. కాని, యతనిని కోటకాచువారు లోపలికి రానీయలేదు. ఆగ్రానుండి యతఁ డలహాబాదునకు వెళ్ళి, బిహారుదేశమువల్ల వచ్చిన శిస్తునంతయు నపహరించి తిరుగుబాటునకుఁ బ్రయత్నములు చేసెను. అంతట నతఁడు తల్లి జూడవలెనను వంకబెట్టి యీ యంతఃపురము జొచ్చెను. వచ్చి వెళ్ళనిమ్మని కావలివాండ్రాజ్ఞాపింపబడిరి. అతనికి దురుద్దేశమేదో పుట్టెను. నదియొద్ద కొంత గుఱ్ఱపుదళమును నిలిపి, యాయుధపాణులైన కొజ్జా

లను గోటలోఁ బ్రవేశపెట్టెను. వివరముగ నతని చెడ్డపన్నుగడలను నేనిప్పుడు చెప్పను. అతని ప్రయత్నములవలననే ప్రమాదము జరుగలేదు. అత డాగ్రాకు వెళ్లకమునుపు నేను నేఁటియుదయమున నిండు దర్బారులో వానిని గౌరవించితిని. అతఁ డిప్పు డలహాబాదునకు వెళ్ళినాఁడు. నీవు కావలసిన పరిజనముం దీసికొని యచటికిఁబోయి ధర్మపథ మిదియని బోధించి చెప్పి వానిం బాగుజేయుము. తిరుగుబాటు చేసినవాని బొగరణఁచుటకు సేనాధిపతివలె నీవు వెళ్ళవద్దు. తప్పుజేసిన తనయునియొద్దకు, పుత్రవత్సలుఁడగు తండ్రిపంపున రాయబారివై పొమ్ము!"

"మీమాట వినుటయనఁగా శిరసావహించుటయె." వెండియు నక్బ రిట్లనియె: "అబుల్‌ఫేజలు! నీవు సహేతుకముగ, మనసు కరఁగునట్లుగ మాటలాడు శక్తిగలవాఁడవు. మానవులలో నిట్టిశక్తి చాల మందికి లేదు. కావున నీవుపోయి సలీమును ధర్మపథమునకుఁ ద్రిప్పుము. సమర్థుడైన ఖాన్‌ఖాననుఁడు దక్షిణదేశమునమన్న నా రెండవకుమారునకు బుద్ధిచెప్పి బాగుచేసినట్లే యీకుమారుని నీవు చక్కఁబఱుపుము."

అనవుడు నబుల్‌ఫేజలు వినయమున వంగి సలాముచేసి రాజాజ్ఞను మన్నించి సలీముకడకుఁ బోయెను. కాని యచ్చటనుండి తిరిగిరాలేదు. నీచుఁడైన సలీము లంచమిచ్చి హంతకులచేత నీమహాత్మునిం జంపించెనని చరిత్ర చెప్పుచున్నది.

అనంతరము బంగాళమువిషయమై సంభాషణము జరిగెను. అప్పుడు మానసింగురాజు ప్రధానవక్త. ఖాన్‌ఖాననువలెఁ జమత్కారపుమాట గాని, కవనముగాని, యతనికి రాదు. బంగాళములోని స్థితిగతులను సంగ్రహముగా నతఁడు చక్రవర్తికి విన్నవించెను. అఫ్ఘనుల ప్రయత్నము లారిపోవుచున్న యగ్నిమంటవలె నుండెను. మొగలాయీల

పరిపాలనమునకు బంగాళాదేశము సమ్మతించెను. రాజ్యవ్యవహార మంతయుం జక్కఁగ నేర్పఱుపఁబడెను. హిందూజమీందారు లందఱు మొగలాయీల యధికారమునకుఁ దోడ్పడిరి. అట్లుకొంత జెప్పి మానసింగు నరేంద్రుని, సింహాసనముకడకుఁ దోడ్కొనిపోయి, రాజా తోడరుమాలుయొక్కస్థితి బంగాళాదేశములో సంశయాస్పదమైయున్న కాలమున, నరేంద్రునితాత మొగలాయీలకు మంచియదనునఁ దోడ్ప డుటయు, నరేంద్రుఁడు గూడఁ దనకునచ్చిన తెఱఁగున నెన్నో భయం కరయుద్ధములలో మొగలాయీల పక్షమునఁ బోరాటము సల్పుటయు సంగ్రహముగాఁ జక్రవర్తికి విన్నవించెను.

మానసింగుమహారాజు తన్నుగురించి ప్రశంసావాక్యములు బలుకు టయుఁ, జక్రవర్తి యాసక్తితో వినుటయు నరేంద్రున కుత్సాహము, సంతోషము, గరువము గలిగించెను. చక్రవర్తియుఁ బ్రశంసాపూర్వ కముగాఁ గొంతసంభాషించెను. నరేంద్రుని హృదయమున సంతోషము మిక్కుటమగుటచే నతఁడు మాటలాడలేకపోయెను. రాజానుగ్రహము నకుఁ దనకృతజ్ఞతను దెలుపుటకై నేలసాగిలఁబడి సలాముజేసెను.

అనంతర మక్బరు వెండియు నిట్లనియె: "భక్తివిశ్వాసములుగల మంత్రులారా! ప్రొద్దుపోవుచున్నది గనుక నేను మిమ్ము చాలసేపు నిలు పను. మఱియొకవిషయము నాహృదయమును పీడించుచున్నది. ఇరు వదిసంవత్సరములు కొండలలో, నడవులలో నాసేనలనెదిరించి, నాతో గత్తికట్టి పోరిన మీనారు రాణాప్రతాపసింగు మృతినొందెను. అతఁడు నాకుఁబగవాఁడె. అయిననేమి! ప్రపంచమునందలి మహావీరులలో నతఁడొకఁడు. మానసింగురాజా! యుద్ధములో నీవతనిని గలిసికొంటివి గదా!"

మానసింగు ప్రతాపునిపేరు వినఁగానే వచ్చెడుకోపము నణఁచు కొని, కంఠము గంపింప నిట్లుబదులుచెప్పెను. "అయ్యా! చిత్తము.

ఇరువదియైదేండ్లక్రిందట నతనినొకసారి కలిసికొంటిని. మేము మరల విడిపోవులోపున హల్దీఘట్టము రాజపుత్రమొగలాయీ సైనికుల నెత్తురుతో నెఱ్ఱబడెను. అతఁడు మృతినొందకమునుపు మరలఁగలసికొనవలెనని నాకుత్సాహ ముండెడిది. మాకిరువురకును ప్రాతఋణములు కొన్నియుండినవి. ఆకలహఋణములు రాజపుత్రులెన్నడు మఱువరు. కాని ప్రతాపసింగు మృతినొందెను. ఆ మహావీరుని యాత్మకు శాంతి గలుగుఁగాక !"

రాజ్యపుత్రులశౌర్య మెట్లెఱుఁగునో యక్బరుచక్రవర్తి వారిద్వేషములు, వారికయ్యములుగూడ నట్లె యెఱుఁగును. అందుచే మానసింగుయొక్క మనస్తత్వమతనికిఁ దెలియును. కాని యాకలహముల నతఁడెన్నడుఁ బురికొల్పలేదు. తనకులోఁబడి రాజపుత్రులు సామ్రాజ్యమునకు సాయము చేయవలయుననియే యతనికోరిక. అందుచే నతఁడు రాజపుత్రసంస్థానములలోపలి వ్యవహారములజోలికిఁబోక, వారి యాత్మగౌరవమును గాపాడెను. ప్రతాపుఁ డొక్కఁడే చక్రవర్తికి లోఁబడని రాజపుత్రవీరుఁడు. ప్రతాపుని శౌర్యము కొంతనఱకతని మెప్పుకోలుఁబడసిన కారణమునను, సామ్రాజ్యముయొక్క యితరభాగములలో నవసరమైనపనులు తగిలిన కారణమునను, హిందూప్రజల మనస్సులు రంజింపఁజేయవలెనను కారణమునను, నక్బరు తనపరిపాలనములోని కడపటిదినములలో మీవారు దేశముపై యుద్ధము సాగింపలేదు.

ఆసభలో నప్పు డక్బరిట్లనియె : " మీవారు రాజధానియగు చిత్తూరు నాది. కొన్ని కొండలనడుమ నొకసరోవరతీరమున నున్న యుదయపూరుపట్టణమున, ప్రతాపుని కుమారుఁడు నివసించుచున్నాడు. శూరుఁడైన యతనితండ్రి గతించినాఁడు. నేనిఁక యుద్ధముసాగింపను. కనుక నతఁడా పట్టణములో సుఖముగా జీవించుగాక !"

అప్పలుకులువిన్న మానసింగుని మొగమున నాగ్రహమును, పృథివి రాజు వదనమున వికాసములును నేక కాలమునఁ దోఁచెను.

వెండియు నక్బరిట్లు వచియించెను—"అంతియేగాక, నాకతనియెడఁ గల మంచిభావమును దెలుపుటకును, తండ్రి చనిపోయినందుకు పరామర్శము దెలుపుటకును, నేనతనికొక సందేశమంపెదను. త్వరగానో ఆలస్యముగానో యీ రాజకుమారుఁడు తనతండ్రిత్రొక్కినత్రోవ తప్పు త్రోవయని తెలిసికొని, యందఱకు సామాన్యసుఖకరమైన యీమహా సామ్రాజ్యమును స్థిరపఱచుటకై తక్కిన రాజపుత్రులవలె తానుగూడ తోడ్పడఁగఁడు. ఆకార్యము చేకూర్చుటకై నేను తొందఱపడను. ఈలోపున దేశమున శాంతి నెలకొలుపవలెను."

మానసింగుతప్పఁ దక్కినవారందఱందుకు సమ్మతించిరి. మానసింగు మాత్రము మొగముముడుచుకొని యూరకుండెను. కఠినులైన కొందఱు మహమ్మదీయ సర్దారులు తమమతమందు విశ్వాసములేని కాఫరులతో సంధిచేసికొనుట కింతమాత్ర మిష్టపడలేదు; రాజనీతికోవిదులూరకొన్నప్పుడు మతగురువులు తమగోడవలు విప్పుచుందురు.

"పూజ్యులైన గురువులారా! మీతో నేను వేఱొకసారిమాటాడెదను. ఇంతలో ప్రతాపుని కొమారుఁడైన యమరసింగునకు, నా మిత్రభావమును, నాపరామర్శమును దెల్పుటకు మీలో నెవ్వారుసమర్థులో తెలుపుఁడు!" అని యక్బరుపలికెను.

అదివినిసంతసించి పృథివిరాజుగర్వముతో సార్వభౌముని యెట్టయెదుటికేఁబోయి నిలిచి సలాముజేసి మీవారు రాజకుటుంబమునకు గౌరవమునలుపుటకుఁ బ్రతి రాజపుత్రనాయకుఁడు సంతోషముతో నొడంబడును. అది మారాజపుత్రులలో నగ్రగణ్యమైనసంస్థానము. దేవరవారిట్టి యుత్కృష్టకార్యము నన్నునమ్మి నాకప్పగించినందున నేను మీకు మిక్కిలి కృతజ్ఞుఁడను. ఇందునన్ను నియోగించి మిక్కిలి గౌరవించిరి."

అని విన్నవించెను.

విన్నవించుటయు, సార్వభౌముఁడు సంతసించి, "వీరరాజా! నీ మనోరథ మొసంగితిని. రాజస్థానమున నీవంటికవి పుట్టలేదు. ప్రతాపునకు నీకంటె నెక్కువ ప్రియులు లేరు. నారాయబారము నీద్వారమున వెళ్ళినా యది ప్రతాపుని పుత్త్రునకు రెట్టింపు సంతోషము గలిగించును. ఈ రాయబారమున నీ వెంటవచ్చుటకు నాయాస్థానమందలి యుద్యోగస్థులలో నీయిచ్చవచ్చినవారి నేరికొనుము." అని సెలవిచ్చెను.

అనవుడు నతఁడిట్లనియె—"మానసింగు మహారాజు సమ్మతించునేని అతనిచేతిక్రింద పనిచేయుచున్న గజపతిసింగును సహకారిగాఁ దోడ్కొని పోవలఁతును. అతఁడు జోద్పూరురాజ వంశస్థుఁడు. మాబికనీరురాజ కుటుంబమునకు బంధువు. విశేషించి నేనును గజపతిసింగును బాల్యమిత్త్రులము. ఈ రాయబారములోఁగూడ మేము సహకారులుగా నుండుట నాకిష్టము."

అందుకు మానసింగిట్లు ప్రత్యుత్తరము జెప్పెను: "నా తాబేదారులందఱు చక్రవర్తిగారి సేవకులే. ఆయన యీ రాయబారమునకు గజపతిని నియోగించునేని వారియాజ్ఞకు నేను బద్ధుఁడను. గజపతి నా చేతిక్రింద మిక్కిలి పౌరుషముతోఁ బనిచేసెను. ఏ పని నప్పగించిన నతఁడది మిక్కిలి శ్రద్ధతోఁ జేయును."

"ఆలాగేకానీ. ఈశాంతిదౌత్యమున గజపతి నీసహకారిగానుండుఁగాక! గజపతి మన యాస్థానమునకుఁ దోడ్కొనివచ్చిన యా బంగాళీ యువకునిగూడ నీవెంటఁ దోడ్కొనిపొమ్ము." అని గద్దెనుండి లేచుచుఁ జక్రవర్తి పలికెను.

మంత్త్రులందఱుఁ జక్రవర్తికి సలాముచేసి వెడలిరి. నరేంద్రుఁడు వెడలుటలోఁ గట్టగడపటి వాఁడయ్యెను. ఈ క్రొత్త సందేశములో

బాల్గొనుటకుఁ దనకవకాశ మొసఁగి యనుగ్రహించినందుకు, సార్వభౌముని యెడఁ గృతజ్ఞతా సూచకముగ నతని కన్నులనుండి యానంద బాష్పములు జాఱెను. చక్రవర్తి యతని మనోభావము దెలిసికొని, తండ్రి కొడుకునకుఁబలె ననురాగముట్టిపడ మాటాడెను.

“నరేంద్రనాథరాయా! రాజస్థానము సందర్శించుటకు నీకు కోరికకలదని గ్రహించి నీ యభిలాష మొసఁగితిని. జాగుచేయకుము. ఈసందేశమున నాలస్యము పనికిరాదు.” అని చిఱునవ్వుతో వెండియు నిట్లనియె— “ఆగ్రాకోటకంటె నీకు రాజస్థానమె సురక్షితమైన స్థలము. కోటలో తార్తారుబానిసలు మోహపాశములఁ బన్నుదురు. ఆయుధపాణులైన కొజ్జాలు సాధించి కసిదీర్చికొనుచుందురు.”

ఈమాటలు పిడుగులవలె నరేంద్రునిచెవిని బడి, యతనిని భయవిస్మయములఁ బాలుజేసెను. ఆ పాటునుండి యతఁడు కోల్కొనక మునుపే చక్రవర్తి వెడలిపోయెను.

## ౧౫

అప్పు డర్ధరాత్రము. అక్బరు తన యంతఃపురమున స్ఫటికశిలానిర్మితమైన యొక గదిలో నిద్దఱుమిత్రులం గూడియుండెను. ఆ గది యమున కెదురుగా నుండెను. స్ఫటికగవాక్షములలోనుండి చల్లని చంద్రకాంతి గదిలోఁ బ్రవేశించుచుండెను. క్రింద నదియొక్క మర్మరధ్వనులు విన వచ్చెను. గదియంతయుఁ గమ్మకమ్మని తావులతో నిండియుండెను. మేలైన నగిషీపనులుగల రంగురాళ్లు నడుమ నడుమఁగల గోడలకును, స్తంభములకును బ్రక్కను మెత్తని యాసనము లమర్పఁబడియుండెను. అక్బరు మిత్రులిరువురతోఁ గలసి యల్పమైన సాయంకాలాహారము నారగించి, విశ్రాంతి గైకొనుటకు ముందు నొకగంట వారితో నిష్టా

గోష్ఠి నలుపఁదలఁచెను.

ఆ యిరువురుమిత్రు లెవరన, నక్బరున కాప్తమిత్రుఁడు, హితోపదేష్ట యునగు నబుల్‌ఫేజ లొకఁడు ; పరమభక్తిగల మహమ్మదీయుఁడు, నబుల్ ఫేజలునకుఁ బ్రత్యర్థియగు చరిత్రకారుఁడు నగు బాదానీ రెండవ వాఁడు. ఈ గదిలోనికి రావింపఁబడుట మిక్కిలి గౌరవము. సంస్థానము లోని గొప్పగొప్ప యుద్యోగస్థులు సామంతులుఁగూడ నిక్కడికి రావింపఁబడరు. చక్రవర్తికి మిక్కిలి మిత్రుఁడై యతని విచారము లన్నిటిని దనచమత్కార వచనములచేత నిమిషమాత్రమున నడఁపఁ జాలిన ప్రజ్ఞగల బీరబలుఁడు పలుమాఱు లీగదిలోనికి రావింపఁబడును. కవియైన రాకుమారుఁడు పృథివిరాజుగూడఁ దాను రచించిన రాజపుత్రు వీరులపాటల నిచ్చటఁ బలుమాఱు గానముచేసెను. క్రైస్తవమత గురువులు, మహ్మదీయముల్లాలు, హిందూపండితులుఁ గూడఁ దమ తమ మతసిద్ధాంతములను జక్రవర్తి యెదుట సూర్యకిరణములు స్ఫటిక గవాక్షములనుండి తొంగిచూచు వఱకు నీగదిలోఁ జర్చించుచుందురు. కాని నేఁటిరాత్రి చక్రవర్తి విశ్రాంతిఁగోరెను. ముసలితనమున నక్బరు చక్రవర్తి మనస్సున కానందము గలుగఁ జేయఁగల యతడబుల్ ఫేజలు తప్ప మఱియొకఁడు లేఁడు.

అత్తఱిఁ జక్రవర్తి యిట్లు ముచ్చటించెను. "అయ్యా, అబుల్ ఫేజలు ! మహాకవియుఁ గీర్తిశేషుఁడు నీ సోదరుఁడు నైన ఫైజీ పాటలలో నేదైనఁబాడుము. ఆయన చిన్ననాఁడు తన గేయములతో మిక్కిలి నన్నలరించెను. లేదా, నీ పాటలనైనఁ గొన్ని పాడుము. గభీరభావమును మృదుమధురపదములతో గుంఫనముసేయు సామర్థ్యము నీ కొకనికే గలదు."

అంతట నబుల్‌ఫేజలు తన పాటలలోఁ గొన్ని పాడెను.

"నిన్ను ప్రజలు చాలకాలము స్మరింతురు. సత్యసంధుఁడైన ప్రజ్ఞా

శాలిదొరకుట యరుదుగదా ! నీ భావము గంభీరము. నీ కవనములో ప్రాచీనకవిత్వములో నుండు విజ్ఞానము చూడఁగలము. ఈ నాఁటివారి కవనములో నది కనఁబడదు. ” అని యక్బరు వచియించెను.

“ పూర్వులు విశేషముగా ప్రకృతిసంబంధము గలిగి బ్రతికి ప్రకృతి రహస్యముల మనకు విప్పి చెప్పిరి. మనమో మనచే సృష్టింపఁబడినను తన ప్రపంచములో జీవించుచున్నాము. ”

“ చిరంజీవిరైన మన పెర్దూసీయొక్క యుద్రేకపూరితమైన కవనమును, హిందూదేశములోని భారతరామాయణాది మహాకావ్యములను బోలిన కావ్యములు మన మీనాఁడు చూడఁగలమా ? ఈ నాఁటి కృతులు వానిప్రక్క నిలువఁగలవా ? ”

“ అయ్యా ! లేదు. మన యాస్థానములలోని కవిత్వము రేపు వికసించి మాపు మాడిపోవు పూవువంటిది. పారసీకహిందూదేశముల ప్రాచీనకవిత్వమన్ననో హిమాలయపర్వతముల యందుఁ బుట్టి మిక్కిలి లోతుగా వ్రేళ్లుబారిన టేకువృక్షముల వంటిది. అవి యుగయుగము లుండును. ”

“ మనదానివంటి గొప్పసామ్రాజ్యము దాని ప్రతిష్ఠకుఁదగిన గొప్ప కావ్యము నేదైన లోకములో విడిచిపోవలయునని నా యభీష్టము. ఈ కాలమును జిరస్మరణీయముగాఁ జేయుపాట యేదయిన నున్న బాగుండును. ”

“ ఈ నాఁటి గొప్పచరిత్ర రాజభాషయైన పారసీకములోఁ గాక జనులభాషలలో జీవించియుండును. రాజభాషయగు పారసీకము, కొందఱు మాత్రమే మాటాడుదురు. మన యాస్థానకవుల కవిత్వము కుండ్లలోఁబెట్టి పెంచిన మొక్కయందు పూచిన చక్కనిపూవువలె నొక్కనాఁడు తావుల వెదఁజల్లి, మఱునాఁడు నశించును. జీవజ్జాతుల కవిత్వమన్ననో ఫలవంతమైన భూమిలోఁబుట్టి యేపుగాఁబెరిగి, జనులకు

నీడల నొసగినట్టి పెద్దయడవి వంటిది.”

“అబుల్ ఫేజిలూ! మనభాషయైన పారసీ, మనయందు భాగముగనే హిందువులుగూడ వ్రాయ చదువఁ గలరని వింటిని. కీ॥ శే॥ రాజా తోడరుమాలు హిందూదేశమందంతట మనకచేరిలలో పారసీభాషనే వాడుకచేసెను.”

“అయ్యా! హిందువులు బుద్ధిమంతులు. రాజభాష యేదైనను వారు సులభముగా నేర్చికొనఁగలరు కాని, తమహృదయగతభావములు తల్లిపాలతో సంక్రమించిన దేశభాషలలోనే వారు విస్పష్టముగాఁ దెల్పుదురు.”

“అట్లయిన సత్కావ్యములు వారు నేటికాలమున వ్రాసిరా?”

“అయ్యా! సూరదాసుని యొక్కయు, కేశవదాసుని యొక్కయు పాటలు జనరంజకములని దేవరవా రెఱుఁగుదురు. తులసిదాసుఁడు రామాయణమును హిందీభాషలో మరల వ్రాసినాఁడు. ఉత్తరహిందూస్థానమున నెల్లగ్రామములలోను, పల్లెలలోను, కోట్లకొలది స్త్రీలు పురుషులు దానిని జదువుచుందురు, వినుచుందురు. ఇప్పుడే కాదు.— మనమందఱము పోయినతరువాతఁగూడ దానినెల్లవారు చదువుదురు.”

“ఔను! అబుల్ ఫేజిలు, నీ పలుకులు జ్ఞానపూరితములు. ఈ కాలమున నుత్తరహిందూస్థానమునవలె, తక్కిన మండలములలోఁ గూడ వాఙ్మయ మభివృద్ధి నొందుచున్నదా?”

“అయ్యా! దేవరవారికా విషయమై మానసింగురాజు విన్నవింపఁగలఁడు. బంగాళాదేశములో హిందూదేశపు గొప్ప యితిహాసములను నవీనకవులైన కాశీరామకవియు, కృత్తివాసకవియు మాతృభాషలో రచియించిరి. అవి ప్రతిపట్టణములోను పల్లెలలోను జనులు విశేషముగా చదువుచున్నారు. ఇప్పుడిప్పుడే పైకిలుదేరుచున్న ముకుందరాముఁడను కవి తనగేయముల నీ రాజునొద్ద పాడి మెప్పించెను.”

"అబుల్ ఫేజలు! బంగాళీల కవిత్వమును గుఱించి యీ రాజా నాతోఁ జెప్పెను. వినవలెనని కుతూహలమున్నది. కాని బంగాళీ భాష నాకురాదు. ఇంతవయస్సులో నిట్టి కార్యభారములో నిప్పుడిత్తు రములు నేర్చుకొని యీ భాష నభ్యసించుట యసాధ్యముగదా?"

"ఖాన్ఖానసుఁడు పాలించు దేశముల కింకను దక్షిణమున శూరులు యుద్ధప్రియులునైన మహారాష్ట్రులకుఁగూడ, మంచికార్యములున్నవి. శ్రీధరుని పద్యములు గొప్పవారికి, తక్కువవారికిఁ గూడ దెలియును. మహాచక్రవర్తీ! మీ కాలమున వర్ధిల్లిన వాఙ్మయమిది. ఈ కాలపు భావమును, విజ్ఞానమును, రాఁగల తరములవారికవి తెలియఁజేయును."

"నా ప్రజలలో నన్ని జాతులవారు, నన్ని తెగలవారు, తమ తమ మాతృభాషలలో కావ్యములు రచించు గానముచేయవలెనని నాకో రిక. అనేక సంస్కర్తలుగూడ నీ కాలమున బైలుదేరినారు. వారికి లక్షలకొలఁది స్త్రీలు, పురుషులు శిష్యజనముగాఁ జేరుచున్నారు. మనము నిర్మించిన 'దిన్-ఇలాహి' యను నీశ్వరమతములోఁ గూడ కొందఱు చేరుచున్నారుగదా!"

"అయ్యా! వారిభావములును మీ భావములవంటివే. కాని, వా రవి సామాన్యజనులకు బోధించుచున్నారు. కాని, మీ మతము మీార లను సమ్మారావులను నాశ్రయించి యున్నది. నూఱుసంవత్సరముల క్రిందట కాశీలో రామానందుఁడని యొక మహాత్ముఁడుండెను. ఏకే శ్వరారాధన మతఁడు ప్రజలకు బోధించెను. అతని శిష్యుఁడు కబీ రుఁడు. దేవరవారవలెన యొక్కఁడై సత్యుఁడైన పరమేశ్వరుని నా రాధింపవలయునని జనులకు బోధించెను. ఎన్నటికి నాశిమొందని యీ క్రింది యర్థమిచ్చు గేయమతఁడే పాడెను. GR 4730

"అన్నా! హిందువుఁడా! కాశీ నీ దేవుఁడుండు చోటా?"

"అన్నా! మహమ్మదీయుఁడా! మక్కా నీదైవమునకు నిలయమా"

"కాని, మీ యంతఃకరణములను వెదకికొనుఁడు. భూమ్యాకాశ ముల దేవుఁడు, హిందూ మహమ్మదీయుల దేవుఁడు నక్కడనే యున్నాఁడు."

"ఓయి, అబుల్ ఫేజలు! అది మిక్కిలి యున్నతభావము. మనపండితులు పెద్దపెద్దమాట లుపయోగింతురు, అవి జనులకు నచ్చవు. అట్టివారీ దేశములో ననేకులున్నారా;"

"పంజాబు దేశమున నూరేండ్లక్రిందట నానకుఁడను మహాపురుషుఁడుండెను. అతని యభిప్రాయము నిట్టిదే. అతని మతములో హిందువులు, మహమ్మదీయులు గూడ జేరిరి. వారుసిక్కులని పిలువఁబడుదురు. వారె శూరులు. శాంతభావులు. దేవరవారి ప్రజలలో మిక్కిలి రాజభక్తి తత్పరులు."

"అయ్యా, వారినిగురించి విన్నాను. వారేకేశ్వరారాధనా తత్పరులు. కావున వారియెడ నాకు గౌరవముగలదు."

"నూరేండ్లక్రిందట బంగాళములోఁ గూడ నొకమత సంస్కర్త పుట్టెను. ఆతని పేరు చైతన్యుఁడు. అతఁడుగూడ నేకేశ్వరారాధనము బోధించి హిందువుల మహమ్మదీయులఁ గలుపఁజూచెను. అతనిమతము వారిప్పుడు పదిలక్షలున్నారు."

"మనవైభవముతోను, మనశక్తితోను, మనము చేసినదానికంటె నెక్కువపనచేసి, పనులలో కలసిమెలసి నిరాడంబరముగ జీవించి, యెక్కువ విజయముగాంచిన యా మహాత్ముఁడు ధన్యచరిత్రుఁడు."

"అది యెప్పుడు నిట్టిదే. పేదలై నిరాడంబరజీవులైన మహాత్ముల బోధలే కోట్లకొలఁది హృదయములకెక్కి వారి హృదయము లజ్ఞాన జ్యోతిని వెలిఁగించి వారికి సౌఖ్య మొందగూర్చును. జీససుమహాత్ముఁడు పేదవాఁడు. గెలిలీ సముద్రతీరమున పేదలగు పల్లెవాండ్రతోఁ గలిసి మెలఁగెను. కడపటి దేవదూతయగు మహమ్మదు మక్కానుండి మదీ

నాకుఁ జాటిపోయెను.”

“నేను పాశ్చాత్త్యులగు పురుషులఁ గొందఱను కలిసికొంటిని. వారు జీససు చరిత్రమును నాకుఁ జెప్పిరి. ఆయన సిలువమీఁద వధింపఁబడినాఁడని వినఁగానే నాకనులనుండి బాష్పబిందువులు జోట జోట జాఱినవి. పశ్చిమఖండవాసు లంద ఱాయన మతము ననుస రించిరని వారు చెప్పినారు. పోర్చుగీసు, డచ్చివారు, చిన్నదీవు లలోఁ గాపురముండు నింగ్లీషువారు కూడ నామతములోనివారే.”

“హిందువులకు మహమ్మదీయులకుఁ గూడ దేవుఁడైన సర్వేశ్వరు నొక్కనినే నాప్రజలంద ఱారాధింతురేని నామనస్సు సంతుష్టి జెందును. మననాఁడు మనము విత్తనములు నాటుదుము. పంట క్రమముగ పండును. నేను కాశ్మీరము జయించిన తరువాత నచ్చట హిందువులకు మహమ్మదీయులకుఁ గూడ నుపయోగించుటకై యొక యాలయమును గట్టించితిని. అయ్యో! దానిమీఁద నేమి వ్రాయఁబడియున్నదో యెఱుఁగుదువా ?”

అజాలుఫేజ లామాట లెఱుఁగును గనుక, వాని నప్పుడు చదివెను:

“ఓమహాదేవా! నే నెటుజూచినను జనులందఱు నిన్నే వెదకి కొనుచున్నారు.”

ఏ భాషమాటాడినను దేవా! మనుష్యులందఱు నిన్ను గూర్చియే మాటాడుదురుగా.

భక్తుని భక్తియు, శంకితుని శంకయు, నిన్ను గురించియే పోవు చుండును.

నీ వద్వితీయుఁడవు—అన్ని మతములు నిన్నే తెలుపును. మసీదులోఁ జేరిన జనులందఱు నిన్నే లోలోనఁ బ్రార్థింతురు.

“ఆలయములలో భక్తులు నీకొఱకే గంటలు వాయింతురు. నేను గుడికి మసీదునకుఁ గూడ తరచుగాఁ బోవుదును,

నీయనుగ్రహామును పంచుకొనుటకు గుమ్మగుమ్మమునకుఁ బోయి నిన్ను వెదకికొందురు.

ఛాందసమునుండి నాస్తికతను వేఱుపఱచి యెవ్వ రెన్నఁడు చెప్పఁజాలరు.

ఛాందసులు తెరచాటుననున్న వెలుఁగును జూడలేని నాస్తికులు.

ప్రతినాఁడును తననుతానె సత్యమని నమ్మి నేను వేరుగా ప్రార్థనలు చేయుదును.

గులాబిపుష్పాడి విక్రయించువాని హృదయమును నెత్తావితో నింపును."

"మానవజాతికి తన నామకీర్తనములు నేర్పుటకై నియోగింపఁబడిన యూతని హృదయమునందుఁగూడ గులాబిపుష్పాడి యుండుఁగాక. పరమేశ్వరుఁడు నన్ను కాశీపురపవిత్రస్థలమం దుంచినాఁడు—భూమిమీఁద నతని ప్రతినిధిగా నన్ను జేసినాఁడు—తన పని చేయుమని విధించినాఁడు. జ్ఞానియగు బదాని తలయూఁచుచున్నాఁడు. మిత్రుఁడ! నీ మనోభావము స్వేచ్ఛగాఁ దెలుపుము. పండితుఁడైన యబుల్ ఫేజలు నీ కుత్తరము జెప్పును. మీ చర్చలు విని నేను జ్ఞానము ప్రోగుచేసికొందును. ఏమన మీకిద్దఱికి అల్లా గొప్ప మేధ నిచ్చెను. ఉపన్యసించుటకు భగవదావేశము పొందిన మహాత్ములయందునుండి జ్ఞానసంపాదనము జేయుట నాకు పరమసంతోషము."

"మహమ్మదీయదేశములైన అరేబియా, ఈజిప్టు, పారసీకము మొదలగు భూముల చరిత్రలు నేను చదివితిని. ప్రతిచోట నిస్లాము మతమే యవలంబింపఁబడినది. మస్లిందేశములోఁ గ్రైస్తవమతము బోధింపఁబడినదని నేను వినలేదు." అని బదానీ గర్వోక్తితోఁ బల్కెను.

"ఎక్కడ రాజు, ప్రజలుగూడ ముస్లిముమతస్థులో నట్టి దేశములను గురించి నీవు మాటలాడుచున్నావు." అని అబుల్ ఫేజలు బదులుచెప్పెను.

"ఓయీ, అబుల్‌ఫేజులు! వేయియేండ్లక్రిందట నిట్లుండలేదు. పారసీకము జోరాష్ట్రమతము నవలంబించెను. ఈజిప్టులో మతియొక మతముండెను. అది వారి హైరోగ్లాఫిక్ శాసనములలో లిఖింపఁబడి యున్నది. కాని, మన మహమ్మదు వారి బోధనలు బైలుదేరి యీ దేశములలోని యపవిత్రమతములను తుడిచివైచెను. గొప్ప మహమ్మదీయ చక్రవర్తుల పరిపాలనములలో హిందూదేశముగూడ తన యబద్ధపుమతములను, విగ్రహములను వదలుకొని, కట్టకడపటి దేవదూతయైన మహమ్మదు వారి మతము నవలంబించునని మేమాశపడితిమి. అరేబియాలోను, పారసీకములోను, ఈజిప్టులోను జరిగిన మార్పులును హిందూస్థానముగూడ మనకేల నూడఁగూడదు:"

"చరిత్రకారులలో నగ్రగణ్యుఁడా! నీపట్టుదల నే మెచ్చితిని. కాని, యీజిప్టు, అరేబియా, పారసీకములోనున్న జనము మన చక్రవర్తిగారి పదిహేనుపరగణాలలో నేపరగణాలలోనున్న జనముకంటె తక్కువన్నమాట నీవెఱుఁగుదువా? నైలునదీతీరమునను, అరేబియా యెడారులలోను, పారసీకపుకొట్టనేలలోను, కొన్ని లక్షలజనులు మాత్రమే యున్నారు. హిందూస్థానమున పదికోట్ల జను లున్నారు. వారు మిక్కిలి పురాతనమైన మతమును, వేదాంతశాస్త్రమును గలిగి యున్నారు. అలగ్జాండరునాఁటినుండి యెందరో దేశమువచ్చినను వారామతమును కదపలేకపోయిరి."

"అయ్యా, అబుల్‌ఫేజల్ పండితుఁడా! నన్ను క్షమింపుము. మహమ్మదుపయిగంబరువారివల్ల బోధింపఁబడిన మతమును మిక్కిలి గొప్పఖండములుగూడ ననుసరించినవి. మహమ్మదువారు గతించిన నూఱేండ్లలోపుగానే, మహమ్మదీయులు గుఱ్ఱపుదళము ఆక్ససునదియొక్కయు, నైలునదియొక్కయు, టేగసునదియొక్కయు జలములు త్రాగెను. దేవుని పరమసేవకులవల్ల నిస్లాముమతము వ్యాపింపఁజేయఁ

బడఁగా ఆసియా, ఆఫ్రికా, యూరపుఖండము లామతమవలంబించెను. ఈ పని బాగ్దాదును పరిపాలించిన కాలిఫుల కాలమున జరిగినది."

"అయ్యా బదాసీ! ఆకాలిఫులు చిర స్మరణీయులగుటచే వారిని నేను గౌరవించెద. తార్తారదేశమునను, ట్రిపోలీ మొదలగు నాఫ్రికా దేశములలోను నిలువనీడలేక దేశదిమ్మరులగు మోటజాతులకు సత్యమత ముపదేశించి, వారికేకభావము గుదిర్చి యేకేశ్వరసేవ నేర్పినందుకు నేను వారిని మెచ్చెదను. కాని, విశేష జనముగల చీనా, హిందూదేశములు వారిప్రాచీనవేదములనుండి సత్యము గ్రహింతురు. వారు సత్యమును గ్రహించినంతకాలము దేనినుండి గ్రహించినను, ఏభావమునుండి గ్రహించినను మంచిదే. జనులుయందైకమత్యము నెలకొల్పుటె మన చక్రవర్తి యభిప్రాయముగాని, విడదీయుటగాదు."

"మిత్రుఁడా! మనచక్రవర్తిగారి పూర్వులు జనులలో నైకమత్యము ననేకవిధముగా, నెలకొల్పిరి. మహామహులైన కాలిఫులు యూరపు ఖండమునఁగూడ సత్యమైన యిస్లాం మతమును స్థాపించిరి. మహమ్మదీయుల యర్ధచంద్రధ్వజము స్పెయినులో నైదువందల సంవత్సరముల వఱకు నెగిరెను."

"మిత్రుడా! ఆధ్వజ మక్కడ నిప్పుడేల మెరుగుటలేదు? స్పెయినులో నుండిన సారసినులు గొప్పవారు బలవంతులు గదా! వారు మహాభవనములు నిర్మించిరి కళాశాలలు స్థాపించిరి. కళలను, విద్యలను వ్యాపింపఁజేసిరి. యూరపుఖండమున నాగరికతయను కాగడా వెలిగించిరి. కాని, వారికి లోఁబడి యుండిన క్రైస్తవులను మెప్పింపలేకపోయిరి. జనుల హృదయములను రంజింపఁజేయని యధికారము చిరకాలముండదు. మన చక్రవర్తిగారు జనుల సంతుష్టిమీఁద శాశ్వతముగా సామ్రాజ్యమును సంస్థాపింపఁ దలఁచుకొన్నారు."

" మిత్రుడ ! క్షమింపుము. స్పెయినులోని సారసినుల తరువాత నితరు లారాజ్య మాక్రమించిరి. అందుచేత యూరపుఖండమున నిస్లాం మతము నాశమొందలేదు. మన చక్రవర్తిగారికంటె నూఱేండ్లు ముందు మహాయోధుం డొకఁడు పూర్వము క్రైస్తవుల రాజధాని యైన కాన్‌స్టాంటు నోపిలుపట్టణము బట్టుకొనెను. ఆయన యనంతర మున వచ్చిన రాజులు యూరపు ఖండములో నిప్పటికి నిస్లాం పతాక ములను ప్రసరింపఁ జేయుచున్నారు."

" బదానీ పండితుఁడా! మహాయుద్ధములుచేసి యూరపులో విజయ మొందిన యావీరుల శౌర్యము గొప్పది. వారి యధికారము, వారి కీర్తియుఁ జిరకాల ముండుఁగాక. కాని, రాజ్యతంత్రమును, దేశచరిత్ర మును జదివిన వృద్ధుని కొంచెము విశ్వసింపుము. యుద్ధరంగములఁ బ్రదర్శింపఁబడు మహాపౌరుషము మాత్రమే సామ్రాజ్యమును స్థిరపఱు పదు. తురుష్కులు శౌర్యవంతులు, గొప్పవారు. కాని యూరపులో వారి స్థితి యిప్పటికిని దుర్బలముగానేయున్నది. తమ సామ్రాజ్యములో నున్న క్రైస్తవులను గూడ నోడంబఱచి రంజింపఁ జేయగల నూతన తురుష్క సామ్రాజ్యమొకటి ముందు ముందు బైలుదేరవచ్చును."

"సత్యమతము విషయమున విశ్వాసము లేని కాఫరులతో నెట్టి రాజీనామా పనికిరాదు."

' సత్యమతము బలవంతపెట్టి కలుపుట మొదలగు నీచపు పన్నుగడ లకు దిగఁగూడదు. రాజులనఁగా ధర్మకర్తలు. వారు జనుల యభిమ తము ప్రకారము పరిపాలింపవలెను.'

పిమ్మట బదానీ కొంతసే పూరకుండెను. మతమునఁ బట్టుదల గల వారు వానికి నచ్చిన విషయములలో వెనుదీయరు. ఈ చరిత్రకా రుఁడు చక్రవర్తి సముఖముననైనఁ దన యభిప్రాయమును దాఁచు వాఁడుకాఁడు.

" ఈ యేఁబది సంవత్సరములనుండి మనము నేర్చుకొన్న రాజ్యతంత్రమును విసర్జించుటకు నీ గులామునైన నాపనిగాదు. కాని, యిట్టి వాదములో నేను నోరు మూసికొని యుంటినా యిస్లాం మతమునకు ద్రోహినగుదును. సత్యమతము విశ్వాసహీనులగు వారితో నెట్టిసంధికి నొడంబడదని యిదివరకే చెప్పితిని. ఇస్లాం మతము హిందూస్థానమున విజయ మొందును. ఏవేదమును నమ్మక యీశ్వరమతమని మీఁరు క్రొత్తగా పేరుపెట్టి స్థాపించిన యీమతము మీఁతరువాత నామరూపములు లేకుండ స్వప్నవార్తవలె నశించును."

' బదానీ! అట్లేకాని. నేటికాలమున గుడిసెలలో నివసించు వేద గురువులు ఏసిద్ధాంతములను మహాసక్తితో వినవచ్చు లక్షలకొలఁది జనులకు బోధించుచున్నారో, యాసిద్ధాంతములనే సింహాసనపు నీడను నిలువఁబడి నేనును బోధించి, దేవుని సేవకుఁడనై ప్రపంచమున స్మరణీయుఁడనైనచో సంతుష్టుఁడ నయ్యెదను.'

' కాని మహమ్మదీయసామ్రాజ్యము విశ్వాసహీనుల బోధనల మీఁదకంటె స్వమతభక్తుల ఖడ్గముమీఁదనే యధికముగా నాధారపడి యుండును. ఈ మహాచక్రవర్తియొక్క రాజనీతిని గురించి ప్రసంగించినందుకు చరిత్రము జదివిన యీయల్పుని క్షమింపుము. కాని గజని మహమ్మదునాఁటనుండి హిందూస్థానమును జయించిన మహమ్మదీయ ప్రభువుల రాజనీతి యదికాదు. ఇఁకముందు రాఁబోవు మహమ్మదీయ చక్రవర్తుల నీతియు నట్లుండదు. హిందువులకు బుద్ధిచెప్పి వారి నుంచవలసినచోటనే యుంచి ఖడ్గబలముననే దేశము పాలించునట్టి చక్రవర్తులీ రాజకుటుంబమునందే యుద్భవించెదరు. ప్రపంచములో సగముభాగము నేఁడు మహమ్మదీయులే పరిపాలించుచున్నారుగదా!'

ఇది చక్రవర్తి మీఁదనే కొట్టిన దెబ్బ. సంవాదము పెరిగినకొలఁది బదానీకి నుద్రేక మెక్కువగుచుండెను. కాని యక్బరుచక్రవర్తి పండి

తులు వచ్చి తనయెదుట వాదము జరిపినప్పుడు భయపెట్టి యడ్డగింపక వారికిఁ గావలసినంత స్వేచ్ఛ నొసఁగుచుండును. అబుల్ ఫేజలు వాద మూమూని యూరకుండ నతఁడు మెల్లగా జదానీ కిట్లనియె :

" సౌజన్యమునకు బదులుగా ఖడ్గము నుపయోగించునట్టి రాజులు నావంశమున బుట్టవచ్చును. కాని వారి దేశమును జిరకాలము పాలింపఁజాలరు. నాసామ్రాజ్యపుయోధులు పరాక్రమశాలురు, గుఱ్ఱపుదళము చుఱుకుగలది, కోటలు దుర్భేద్యములు, ఫిరంగులు ప్రబలములు, అటు చూడు ! కట్టెలమ్ముకొనువాఁడొకఁడు తెల్లవారకమునుపే యాగ్రా బజారులో నాలుగు డబ్బులకు కట్టెపుల్ల లమ్ముకొనఁ దలఁచి పోవుచున్నాడు చూడు. చిన్న చిఱుగులగుడ్డ కట్టుకొన్న యా పేదవాఁడు మొగలాయిసామ్రాజ్యపు మహాబలము నంతను నెదిరింపఁగల శక్తివంతుఁడు. అట్టివారి యిష్టము మీఁదనే యీ సామ్రాజ్యము మేము నిర్మించితిమి. వాని సమ్మతి ననుసరించియే మేము పరిపాలించుచున్నాము. వాని యసంతుష్టిచేతనే మేము పడిపోదుము. మీకున్న పాండిత్యము నాకులేదు. పూర్వకాలమునఁ బుట్టి పెరిగి పడిపోయిన సామ్రాజ్యముల చరిత్రము నేను చదువుకొనలేదు. అనేక మనుష్యులతోను, అనేక జాతులతోను వ్యవహరించిన వృద్ధునిమాట నమ్ముము. గూఢమో బహిరంగమో యేదోవిధమైన ప్రజాసమ్మతిని బడయకుండ పాలనము సేయు రాజుల యధికారము చిరకాలము సలుపదు. నాపరిపాలనము కాబూలు మొదలు బంగాళముపఱకుఁ గల యావద్దేశ జనులయొక్క మెప్పును బడసినదని నా నమ్మకము. నా కొడుకులలో, మనుమలలో నెవఁడైన, నాజనుల సహాయమును, ప్రేమను గోల్పోయిన యెడల, నేఁబదియేండ్లలోపుగా నీసామ్రాజ్యము తునియలై పోవునని నేను ఘంటాపథముగాఁ జెప్పెదను. నే నెక్కువకాల మిచ్చినాను. ఆలోపుగానే యది పోవచ్చును. "

## ౧౮

చక్రవర్తి నరేంద్రున కిచ్చిన హెచ్చరిక యూరక పోలేదు. ఆగ్రాలోఁ
దనకు సంభవించు నపాయముల నతఁ డెఱుఁగును. యువరాజు సలీము
నగరులోనికి గూఢచారిణియైన యొక స్త్రీని దీసికొని వచ్చెననియు,
రేయి గాఢాంధకారములో నొక కొజ్జాకు గాయములు తగిలెననియుఁ
దార్తారబాసిస యొకర్త పాఱిపోయెననియు ప్రవాదములు బైలు
దేరెను. గూఢచారిణి యెట్లు తప్పించుకొని పోయెనో యెవ్వరెఱుఁ
గరు. కాని జలేఖమీఁద ననుమానము గలిగెను. ఆమెయే గూఢ
చారిణిని బ్రవేశపెట్టెను. ఆమెయే కలహములో మస్రూరునకు గాయము
గలిగించెను. ఆమె యెట్లో తప్పించుకొనిపోయెను. అనుమానింపఁబడిన
యా గూఢచారిణి నరేంద్రుఁడే యని యెవ్వరెఱుఁగరు. చక్రవర్తియు
నెఱుఁగఁడు. కాని, నరేంద్రుఁడు రాజమందిరము విడిచిపెట్టిన దినము
ననే జలేఖగూడఁ బాఱిపోయినదని జనులు విశేషముగఁ జెప్పుకొన
సాగిరి. అంతఃపురమందలి కొజ్జాలందఱేకమై రహస్యముగా విచారణ
సేయుచుండిరి. వారికసియు, బూనికయు వేఁటకుక్కల కసి పూని
కలవంటివి;

నరేంద్రుఁడు సాధ్యమైనంత త్వరగా నాగ్రా విడుచుట మంచిదని
వివేకి గావునఁ దెలిసికొనెను. కాని, తానిచ్చిన మాటచొప్పున
నే నాటిరాత్రి తాను, కోటవెలుపలి ద్వారముకడ జలేఖను గలిసికొ
నవలయునో, యా రాత్రి యేవగారాఖానాలో నర్ధరాత్రమైనదని తెలియఁ
జేసినప్పు డాస్థలమునఁ దాను నిలిచెను. అక్కడఁ జిక్కని జవరాలెవ్వ
తెయుఁ గనఁబడలేదు. వీపుమీఁదఁ గట్టెలమోపు పెట్టుకొని మిక్కిలి
వంగిపోయిన ముదుసలి యొకఁ డచటఁ గనఁబడెను. సిపాయీ లతనిని
మోటతనముగఁ దఱిమివైచిరి. ఆవృద్ధుఁడు తడఁబడి నేలఁగూలెను.

వీపునుండి పుల్లలమోపు క్రిందబడెను. వాఁడు తన దినములు బాగున్నవి కావని వగచుచు మెల్లగ లేచి యావలకుఁ బోయెను. అతఁడు నరేంద్రుని దగ్గఱనుండి పోవుచు నతిరహస్యముగ 'రా' యని యొక మాట చెప్పెను.

నరేంద్రుఁడు మిక్కిలి యక్కఱపడెను. అతఁడా కంఠధ్వనిని, బాము కన్నులవలె మెఱయు నా నేత్రములను లెస్సగ నెఱుఁగును. కట్టెలవాఁడు తనదారిని బోయెను. ఏమియుఁ దోఁచక నరేంద్రుఁడును వాని వెంట వెళ్ళెను.

కోటయొక్క సింహద్వారమునుండి యరక్రోసులోపున దట్టమైన యడవి యొకటి యుండెను. కట్టెలవాఁడు కారుచీఁకటిలో నాయడవిలో నదృశ్యుఁడయ్యెను. నరేంద్రుఁడును వెంటఁదగిలిపోయెను;

" నీవు నీమాట నిలబెట్టుకొంటివి. నీకన్నులలో సత్యాగ్రతము కనఁబడుచున్నది. ఈరాత్రి భగవంతుఁడు మనలను రక్షించుఁగాక! కాని, రాచనగరులోని వేటకుక్కలు మన జాడలు వెదకుచుండును." అని జలేఖ తాను దాల్చిన వృద్ధవేషము దీసివైచి యతనిం బలుకరించెను.

" జలేఖా! నే నిదివఱ కెన్నోసారులు యుద్ధపు వేటకుక్కల నెదుర్కొంటిని. నేను చక్రవర్తి రాయబారిని. కనుక నగరులోని నీచసేవకులకు భయపడ నక్కఱలేదు."

" చిన్నవాడవు. నీచసేవకుల శక్తి నీవు సరిగా నెఱుఁగవు. చక్రవర్తికొడుకులకైనను వారివలన నపాయమగుచుండును."

" జలేఖా! నీ వెవరికి భయపడుచున్నావు? ఆ పాపిష్ఠి మన్సూరునకేనా?"

" మన్సూరువలన మనకింకఁ గొన్నాళ్ళవఱకు భయములేదు. వానిని మెత్తని పాన్పు జేర్చితిని. నెలవఱకు వాఁడు మంచము దిగలేఁడు. కుట్ర పన్నుటలోను, నీచకృత్యములు చేయుటలోను కొజ్జాలంధఱు నహా

కారులె. వారు శత్రువును పసిగట్టి చీకటిలోనైన పట్టి యీగలరు."

"ఆకులు కాల నిప్పమువచ్చినట్లు మొఱఁగనీ. తెల్ల వాఱుకతమునకే నరేంద్రుఁడు తన యంగరక్షకుల నడుమనుండును."

"సరే! అంతవఱకుగు నతఁడు బ్రతికినప్పుడుగదా? విను!

ఆ యడవులలో సన్నని యీల వినఁబడెను. గట్టి మోసపుడయ్యు నరేంద్రుడు భయమున వడఁకెను. వెంటనే యతఁడు జలేఖను దాని యెడమచేతితో నామెం బట్టుకొని కుడిచేయి ఖడ్గముపై వైచెను.

ఈల మరల వినఁబడెను. ఎవనినో వెదకుచున్నట్లు నలుగురైదుగురు మనుష్యులు చెట్లక్రిందఁ గనఁబడిరి. జలేఖయు నరేంద్రుఁడును దాఁగి యున్న పొద యొక్క నీడ, యీవలివారికిఁ గనఁబడకుండ వారిని మాటుజేసెను. కొన్ని నిముషములలో సంతయు నిశ్శబ్దమయ్యెను.

జలేఖ నిట్టూర్పు విడిచి యిట్లనియె: "నరేంద్రా! కోటగుమ్మమువద్ద వారు నిన్ను గుర్తుపట్టిరి. నీ వడవికి వచ్చుచుండఁగాఁ జూచిరి. నీవని యింకను ముగియలేదు. వారి పాటలు నాకు వినఁబడినవి. మఱికొంత బలగమును దీసికొనివచ్చి వారీయడవియంతయు వెదకుదురు. ఇంక వ్యవధానములేదు."

"వారి యుద్దేశమేమో నాకుఁ దెలియుటలేదు. రాత్రి నన్ను వారిక్కడ వెదకుకొననేలా? నేను రేయింబవళ్ళు పట్టణములోను, దర్బారులోను నుంటినిగదా. వారక్కడే నన్ను నెదుర్కొనవచ్చును గదా!"

"తెలివితక్కువవాఁడా! వారిబుద్ధి తలిగాదు. ఆగ్రావీథులలో పట్టపగలు వారు చక్రవర్తి యుద్యోగస్థులను గొట్టరు. అర్ధరాత్రమున నిక్కడ వధించినచో నీ చెట్లు కొండలు చెప్పవు. శవమును భూమి చల్లగా తన కడుపులో బెట్టుకొనివాఁచును. కాని, మనము కాలము వ్యర్థముచేయుచున్నాము. నీ యంగరక్షకులేరి?"

"నలుబదిమైళ్లదూరములో నున్నారు."

"ఈ రాత్రి నీవెక్కడికి వెళ్లఁ బోఁగలవు ?"

"నాగుఱ్ఱము శంభునాథుని లాయములో నున్నది."

"అది చక్కని యేర్పాటే. శంభునాథుఁడు దానిదగ్గఱనే కాపురమున్నాఁడు. నీశిబిరమునకు నీవు దారెఱుఁగుదువా ?"

"ఆగ్రావీధు లెట్లెఱుఁగుదునో యట్లె యెఱుఁగుదును."

"అట్లయిన వేగము పొమ్ము. మరలఁ గలిసికొందము."

"అట్లయిన జలేఖా! నీ వెట్లు తప్పించుకొందువు ?"

"ఇంతకన్న గొప్ప యుపాయములను జూచితిని. తార్తారగండభేరుండ మెగురుటకు ఱెక్కలు విప్పినేని దానిని పంజరములో బంధింపఁగల మగవాఁడు హిందూస్థానమున లేఁడు."

"ఈపాదుషాలోఁడేన్లబాగి నిన్నుఁ బడవైచి నే నిచ్చటనుండి యొక యంగుళమైనఁ గదలను."

"మూర్ఖుఁడా! నే నింకను చావఁదలఁచుకొనలేదు. నా తార్తార నాళములలో రక్తమింకను వేఁడిగా నున్నది. నిన్ను నేను సంరక్షించుకొను మార్గ మెఱుఁగుదును. నిన్ను మరల చూడఁగలను. వడిగాఁ బొమ్ము నీ కవకాశము తక్కువగా నున్నది."

"ఘోరకృత్యములు జరుగునట్టి యీచోటినుండి నిన్నావలకుఁ బంపకుండ నేను చోటువిడువను. ఈవఱకు నేను నాప్రాణము నిన్ను నమ్మి నీచేతిలోఁ బెట్టితిని. ఇప్పుడు నీవు నన్ను నమ్ముము."

"నీవు యుద్ధములో గడిపిన దినములు వ్యర్థముగఁ గడపలేదు. పడుచుపిల్లను స్వాధీనము చేసికొనుట యెట్లో యెఱుఁగుదువు. కాని తార్తారుబాలిక యిటువంటివానికి లోఁబడదు. నీదారిని నీవు వెళ్లుము. నాకిష్టమైనప్పుడు నిన్ను గలిసికొందును."

"నెత్తురు త్రాగు ఆ వేఁటకుక్కలు నన్ను బట్టుకొనుటకంటె

నిన్ను పట్టుకొనుట కెక్కువగా వెదకుచున్నవి. ఎఱుఁగుదువా ?
ఒక తార్తారబాలిక పాఱిపోయినదనియు, పోవునప్పుడు త్రైజాసుతో
నది దుష్కార్యము చేసినదనియు, రాజభవనమునఁ వింటిని. నస్రూసు
నకుగాని, వాని దుష్టమిత్రులకుఁగాని, దయాదాక్షిణ్యము లున్నవా ?
మఱపున్నదా ? ఈ యడవులలో వారు నన్ను వెంటాడి పట్టుకొని
సంకెళ్లు వేసి, కోటలోనికి తీసుకొనిపోయి, మూఁడు దినములు హింసించి చిత్రవధ
జేసి పిమ్మట పొడిచి చంపుదురు. అది యెఱిఁగి నే నిన్ను విడిచి
పోదునా ?"

ఈమాటలు వినఁగానే లోహదేహముగల జలేఖ శరీరములోఁ
గంపము ప్రసరించెను. కాని యామె నవ్వి యిట్లు బదులు చెప్పెను :
"ప్రియుఁడా ! నీవేదో పనిమీఁద రాజభవనమునకు, వెళ్ళినట్లును,
అక్కడ రహస్యములను దెలిసికొన్నట్లును నీమాటలవలన నా కవగతమగు
చున్నది. నన్ను నీతోఁ గూడ తీసికొనిపోవుదువేని నీ ప్రాణములకు
క్షేమములేదు. ఎఱుఁగుదువో లేదో. నన్ను వదలుము, నాథుఁడా !
వెళ్లుము నిన్ను మరల కలిసికొందునులే."

నరేంద్రుఁడు సంగ్రహముగా నిట్లు బదులు చెప్పెను : "నీయిష్ట
మైనయెడల నిక్కడనే యుండుము. నేను నీప్రక్కనేయుండి చచ్చెదను."

అతని నిశ్చితాభిప్రాయము జలేఖ మనస్సున నాటుకొనెను. ఆమె
మెత్తపడి "మూఢశూరుఁడా ! నీసంరక్షణమును నే నంగీకరించితిని.
పేదబాలికకొఱకు తమ ప్రాణములు ధారవోయు సత్పురు
షులు లోకమున నరుదుగానుందురు. అట్లయినను నేను నీనిమిత్తమై
చిరకాలము నిరీక్షించుచుంటిని."

నిశ్శబ్దముగా వారా యడవి విడచి శంభునాథుని యింటికిఁ జనిరి.
కళ్లెము పెట్టి జీనువైచి వాఁడు గుఱ్ఱమును సిద్ధముచేసి చెట్టునకుఁ గట్టి
పెట్టెను. నరేంద్రుఁడు ముందుగా గుఱ్ఱ మెక్కి, చేయూతనిచ్చి జలేఖ

నెక్కించి తన వెనుక గూర్చుండఁ బెట్టుకొని తోలుపటకాతో నామెను దన నడుమునకు బంధించెను. మాటామూటలేక గుఱ్ఱము, రౌతులుఁ గూడఁ గారుచీకటిలో నాగ్రాం నగరపుఁ బొలిమేర దాటిపోయిరి.

ఆవలఁబడిన తరువాతఁ బొలాలలోను, నిద్రావశములైన గ్రామములలోను నరేంద్రుఁడు గుఱ్ఱమును మిక్కిలి త్వరటుచేసి పరుగెత్తించెను. అతఁడు రాచబాటను విడచి, తన్నెవ్వరుఁ దెలిసికొనకుండఁ జుట్టుదారులఁ బయనము జేసెను. అప్పటికి రెండుగంటలలోఁ జంద్రోదయమగును. అత్యంతాపాయకరమైన ప్రయాణములో సగమప్పటికి ముగియవచ్చును.

ఆ సమయములో వారి నోటనుండి యొక్కమాటయైన వెడల లేదు. మాటచేతఁగాని, సంజ్ఞచేతఁగాని తన స్త్రీమిత్రమును హెచ్చరించుటకు నరేంద్రుఁడు వెనుకకుఁ దిరుగలేదు. ఒక్కమాట నాడలేదు. ఆ ధీరురాలికి హెచ్చరికతోఁ బనిలేదు. ఇనుపత్రాడువలెఁ దన యెడమచేయి నరేంద్రుని నడుమునకుఁ జుట్టవైచి, పామకన్నులవలె మెఱయు నేత్రములతో నాగాఢాంధకారమున నలువంకలఁ జూచుచుఁ గుడిచేయిగట్టిగ, కైజారుమీఁదఁ బెట్టి యుంచెను. ఆమె కొప్పు విడిపోయి గాలిలో నెగురఁజొచ్చెను. ఉద్రేకముచే నామె మేనువడఁకెను. నడిరేయి గుఱ్ఱమునవారి కట్టి మిత్రను నెవ్వరుఁ దోడ్కొనిపోవరు. ఒర నుండి తీసిన వాఁడి కైజారు చేతిలో నుండఁగా నట్టిపడఁతితో వలపు మాటగూడ నెవ్వరాడ సాహసింపరుగదా!

చుక్కలవెలుఁగున గుఱ్ఱముసామాన్యమైన దౌడులుదీసియొక్కొక్క క్రోసుదూరము గడచెను. చప్పుడు గాకుండఁ బోవుచున్న యాబాటసారుల జూచి యెడనెడ నేదో యొక యూరి కుక్క మొఱిఁగెను. ఒక్కసారి యొక ధర్మశాలప్రక్క నొక మంటవెలుఁగున దుపాకులు దాల్చిన కొందఱు సిపాయిలుమాత్రము కనఁబడిరి. జులేఖ పట్టు మరింత దృఢమయ్యెను. నరేంద్రుఁ డాసంజ్ఞఁ దెలిసికొని ధూఢారి

దప్పించి యరక్రోసుమేర చుట్టుఁదిరిగి పోయి ధర్మశాలకు దూర మయ్యెను. ఆసిపాయిలు తన సగవారిపంపునఁ దన్ను బట్టుకొనుటకే వచ్చిరో, లేక యాగ్రాకుఁ గొంపోఁబడు ఖజానాను గాచుటకే వచ్చిరో నరేంద్రుఁ డెఱుఁగఁడు.

పదిక్రోసుల పయనమయ్యెను. ఆ యుత్తమాశ్వము జెట్టుక్రింద నతఁడు కొంతసేపు నిలిపెను. నరేంద్రుఁడు తన మిత్రమును జేయూఁత నిచ్చి క్రిందికి దింపి "సాహసురాలా! ఈ పయనము నీవు సమర్థముగ నిర్వహించితివి. మన కపాయము దాఁటి దని నా నమ్మకము." అని నరేంద్రుఁ డామెను బలుకరించెను.

"అయ్యా, అప్పుడే యట్లనుకొనవద్దు. రాచనగరులోఁ గుఱ్ఱలు పన్నువారి చేతులు చాల పొడుగైనవి. ఎంతదూరమైనఁ బోవును."

"మన మాగ్రానుండి పదిక్రోసులు వచ్చినాము. ఇదె యొక మకాము. ఇక్కడఁ గ్రొత్తగుఱ్ఱము మనకై వేచియున్నది."

"వారి చేతులు నూఱుక్రోసుల దూరములో నున్నను మన నంటు కొనఁగలవు. ఈ మకాములు నీకుఁ దెలిసినట్లె వారికిఁ గూడఁ దెలి యును."

"పిల్లా! నీ లేనిపోని భయములు విడిచిపెట్టు. నాగుఱ్ఱపుసకిలింపులు వినబడుచున్నవి. దాని దార్ఢ్యము నేను బాగుగా నెఱుఁగుదును. చంద్రోదయ మగుచున్నది గనుక నది మన శిబిరమునకు రెండుగంట లలో మనలను గలిసికొని పోఁగలదు."

"పాప మీగుఱ్ఱమువంక జూడు! అది నిలఁబడలేక గడగడలాడు చున్నది" అని గుఱ్ఱమును గట్టినచోటికిఁ బోయి దానిని జూపి జలేఖ బలికెను.

గట్టిగా శోధింపఁగా రెండు కత్తినాటులు దాని కాళ్ళపైఁ గనఁ బడెను. అది నిలిచినచోట నెత్తురు కాలువ గట్టెను.

"ఇది యేమిటి!" అని నరేంద్రుఁడు భయవిహ్వలుఁడై పలికెను."

అనవుడు జలేఖ యిట్లు బదులు చెప్పెను: 'ఇదేమిటా? గ్రుడ్డివాని కైన నిది తెలియును. నీ గమ్యస్థానము వారికిఁ దెలిసెను. నీగుఱ్ఱము వెనుకనే వారు వచ్చి దానిని నఱికిరి. నీప్రాణములు, నాప్రాణములు దీయఁదలఁచినవారీ ప్రక్కనే యెచ్చటనో దాఁగియుందురు.'

"ఆ పరమనీచు లెక్కడ దాఁగొని యున్నారు?"

"ఇక్కడ గాదు. ఇది బట్టబయలు. ఆ పొదలలో దాఁగియుందురు. జాగ్రత్త యని యీవఱకే నేను నిన్ను హెచ్చరించి యుంటిని."

"వా రాపైశాలము దాఁగలేరు. నా కత్తి వారిపైఁ బడును."

"తొందరపడకు. నీవు చక్రవర్తి రాయబారి నను మాట జ్ఞాపక ముంచుకో. కారుచీఁకటిలో వారు మన సంక గుర్తింపలేదు. గాయు పడిన యీ గుఱ్ఱమును విడువుము. అది చచ్చిపోవును. ఆయాసపడి యున్న రెండవ గుఱ్ఱము మనను మోయలేక యున్నయెడల, రేపు ప్రొద్దెక్కులోపుల మన మీ యిరువదిమైళ్లు నడిచిపోఁగలము."

గాయపడిన గుఱ్ఱమును విడిచి జలేఖతో గూడ నరేంద్రుఁడు కొంత ముందుకు నడిచెను. గాయము తిన్న యాగుఱ్ఱమును గట్టిన యాచెట్టు వంక సతఁడు పలుమాఱు వెనుక దిరిగి చూచి చూచి, యాదుష్కృత్యమునకుఁ బ్రతిక్రియ చేయకుండఁ బోవలసి వచ్చినందుకు విచారించెను.

వారు చాలదూరము వెళ్లకమునుపే డెక్కలచప్పుడు వినఁబడెను. జలేఖ యూహించిన ప్రకారము సరిగా నిరువు రాశ్వికులు పొదల మాటుననుండి తమవంక వచ్చుచుండుట నావెన్నెలలో వారు కని పెట్టిరి.

"జలేఖా! యీ గుఱ్ఱము నొక చెట్టుచాటునకుఁ దీసికొనిపోయి విడువుము. ఒక సిపాయికి నీవు పని గలిపింతువు, నేనొకఁడను; వారిద్దఱు.

ఈరాయి నన్ను గొన చాటున దాచుంగలను."

ఆ గుఱ్ఱపురౌతులు నరేంద్రసింహుని, జలేఖయు సక్కుచేసి వచ్చినది మొదలుకొని, వారిం గనిపెట్టుచునే యుండి యిప్పుడు మెల్లగా వీరి వంక రాసాగిరి. నరేంద్రసింహుఁడు కత్తిఁ జేతఁ బట్టుకొని గుయొక నల్లరాతి వెనుక నిబ్బరముగా నిలువఁబడెను. అగ్రాసుఁడి నచ్చుటచేత నలసి పోయిన యా రెండవ గుఱ్ఱమును జెట్టుకుఁ గట్టి జలేఖ చెట్టుచాటున నిలువఁబడెను.

ఆ యాత్రికులు నరేంద్రుఁడు చక్రవర్తి యువరాజ్యస్థుఁ డని యెఱుఁగుదురు? దాసియైన జలేఖను గూడ నెఱుఁగుదురు. అందుచే బహిరంగముగా నతనితో యుద్ధమున కిష్టపడక ప్రసంగించుటకు నిశ్చయించు కొనిరి.

"ఈరాత్రి నీవు చేసిన పనికి నీవు జవాబు చెప్పవలెను. ఎవ్వరును నిన్ను క్షమింపఁ దలఁచుకొనని మాతోని యెదుట నిలిచి నీవు జవాబు చెప్పవలెను." అని నొక యాత్రికుఁడు నరేంద్రునితోఁ బలికెను.

"ఎవని యాజ్ఞ నేను నిర్వర్తించుచున్నానో యాచక్రవర్తికే నేను సమాధానము జెప్పెదను. చక్రవర్తి రాయబారిని బాధింపఁ దలఁచి రాజాశ్వము కాళ్ళునఱికి దుండగులైన గజదొంగల నెదురించినందుకు తప్పక సమాధానము జెప్పెదను.'

"చక్రవర్తి రాయబారి కంతఃపురదాసిని దొంగలించుకొనిపోవుట మంచిపనియే గదా! అంతఃపురమునుండి దాసిని దొంగిలించినవాఁడు తప్పక చావవలయునని నీ వెఱుఁగవా! రాజమూత! నీ దారిని నీవు పొమ్ము. నీతో మాకు పనిలేదు. జోద్బాయిదేవిగారి దాసిని న్యాయముగా విడిచిపెట్టుము. మాఁకు గావలసిన దామె! ఆమెను తిరిగి పట్టుకొమ్మనియే మా కుత్తరువులు.'

"ఏదో చీఁకటిరాత్రి నీ పేద బానిస వడుచును పొడిపించి చంపఁ

దలంచుకొన్నది జోద్బాయిరాణియా? లేక యీమెను చంపింపం దలంచినది మీ యజమానుండైన యీ నల్లకొజ్జా, మసూరుండా? దురాత్ముండైన కొజ్జాయొక్క చేంటిబానిసీలారా! ఈమెమీంద వాండు పగదీర్చుకొనకుండ నా కత్తితో నేను రక్షించెదను. ఇట్లె దేవుని బిడ్డల నపమృత్యులపాలు పడకుండ నాశక్తికొలంది నేను రక్షించెదను.”

“రాత్రి జరిగిన కలహమును మేమెఱుంగుదుము. అందులో కొందఱు దెబ్బలు కొట్టిరి. కొందరు దెబ్బలం తినిరి. అంతఃపురమునుండి పాఱిపోయినందుకు న్యాయముగా జలేఖ నిమ్మని నేను కోరుచున్నాను. నీవు రాజదూతవు. ఆనెపము బట్టి గౌరవింపుమని నిన్నడుగుచున్నాము.”

“ఇట్లడుగుటకు చక్రవర్తిగారి హుకుము గలున్నదేమో చూపుము! రాచకన్యకాస్త్రీల నంటుకుటకు, రాజదూతను నాగరికత్వముచే బట్టి బాధించుటకు నీ కుత్తరువు లెక్కడున్నవో చూపుము! మఱియొకరి యుత్తరువు నేను మన్నింపను. మీ యజమానుండైన యీ నల్లకొజ్జా యుత్తరువు నేను తృణీకరించెదను.”

అటువిమ్మట సంభాషణము ప్రయోజనములేదని “రేపు సూర్యాస్తమయములోపుగా రాచనగరునుండి పాఱిపోయిన యీ బానిస కూఁతునప్పగించినను నీవు జవాబు చెప్పవలసి యుండును” అని యీ గుఱ్ఱపురౌతు, తన సహకారితోఁ గూడ నరేంద్రునిమీఁదికిఁ బోయెను.

“రేపు సూర్యోదయము గాకుండ నీవు నాకు ముందుగా జవాబు చెప్పవలయును. రాచగుఱ్ఱమును కుంటుపఱిచినందుకు నీ వేమి చెప్పెదవు” అని నరేంద్రుఁడు మేఘగర్జనమట్లు బలికి, రౌతులలో నొకని మీఁదికి దుమికి, కత్తియొక్క వెనుకప్రక్కతో నతనిని గూల్చి “యీ గుఱ్ఱమునకు బదులుగా దీనిం దీసికొనెడు” ననెను.

అత్తఱి జలేఖ రెండవగుఱ్ఱము కళ్లెము బట్టుకొని యాపి, తన

కై జారుతో నాతనినిం బొడిచి, 'యీగుఱ్ఱము నేను దీసికొనెద' నని బలికెను. రెండవ దెబ్బ తగులకుండ గాయపడిన యా మనుష్యుడు నేల కుఱికితప్పించుకొనెను.

గుఱ్ఱముమీఁద నుండి, క్రిందికిఁ ద్రోయఁబడిన యానౌతులు కన్నో వాలు ముడివిడి బిట్టలిగి కత్తులు దూసిరి. కాని నరేంద్రుఁడు వారిని జంపుట కిష్టపడక యిట్లనియె :—"వెనుకకు బొండు! లేదా మీ యజమానుఁడైన నల్లకోజావలెనే మీరు కూడ, మీ వాడికత్తులకంటె నాఁడుదాని కైజాకే యెక్కువ సామర్థ్యము కలదని త్వరలోఁ దెలిసి కొనఁ గలరు. మీరు వెనుకకు వెళ్ళి యొక యుద్యోగస్థుని గుఱ్ఱమును కుంటుపఱిచినందుకు తగిన శాస్త్రి మీకైనదని మీ యజమానునితోఁ జెప్పుకొనుఁడు. ఆ చెట్టునకు మేము గట్టిన యీగుఱ్ఱమును జాగ్రత్త పెట్టుఁడు. గాయపడిన జంతువు మనుష్యునివలెనే సంరక్షణ మపేక్షించును గదా! ఈరాత్రి మీప్రాణముల నేను రక్షించితిని. రేపో మాపో యుర్రిత్రాఁడు మీ మెడల జుట్టుకొనునని యీ మొగములమీఁద వ్రాసి యున్నది."

అట్టియెడఁ గయ్యము నిష్ప్రయోజనము గదా! గాయపడిన యానౌతు తన మిత్రునిమీఁదఁ జేయివైచుకొని, యచ్చోటు వాసి పోయెను.

నరేంద్రుఁడు, జలేఖయు నట జాగుచేయరయిరి. రెండుగుఱ్ఱములు శ్రమపడి యుండనివగుటచే బలముగల్గి యుండెను. గాలి చల్లగా నుండెను. ఇద్దఱు జెరియొక గుఱ్ఱ మెక్కి బైలుదేరిరి. జలేఖ దారిదీసి ముందు జనుచుండెను. నరేంద్రుఁ డామెతో సమానముగాఁ జనలేక పోయెను. ఆమె కొప్పు విడిపోయెను. ఆమె దుస్తులు చీకాకుపడెను. ఆమె పకపక గట్టిగ నవ్వఁజొచ్చెను. తెల్లని చేతులతో నామె గుఱ్ఱమును దరటుచేయుచుండె దయ్యమువలె, భూతమువలె గాలిలోఁ బయ

నము సేయుచున్నట్లు కనఁబడుచుండెను. అంతలో నరేంద్రుని యంగ రక్షకుల తెల్లడేరాలు గూరగున వెన్నెలలోఁ బొడసూపెను.

అక్కడ వారాగిరి. నరేంద్రుఁడు గుఱ్ఱమునుండి దుమికి, యంత వఱకు గుఱ్ఱముమీఁదనే కూర్చుండిన జలేఖ కడకుఁ బోయెను. అతని కన్నుల కగపడిన దృశ్య మేమని వర్ణింపవచ్చును?

జీనుమీఁదఁ గూర్చున్న యాబాలిక భూతమా, మనుష్యాంగనయా యని సంశయమును దోఁచెను. మొగ మెఱ్ఱవడెను. చమటపట్టు మొగ మంత గూఁ గ్రమ్మెను. ఆమె క్రూరనేత్రములమీఁద నుదయసంధ్యా రాగము మిక్కిలి శోభావంతమై మెఱసెను. సన్నని పెదవులయందు నుండి క్రౌర్యముతోఁ గూడిన మందహాసము వెలువడెను. వీడిన తల వెంద్రుకలు తెల్లని మొగమును గప్పి భుజములపైఁ బడెను. చీకాకు పడిన యామె వస్త్రములు వక్షస్థలమునుండి జాఱి గుండె తటతట గొట్టుకొనుచుండుట స్పష్టముగ సూచించెను. అంత వికృతముగా శోభావంతముగా జగన్మోహనముగ నున్న విగ్రహమును నరేంద్రుఁ డంతకు ముం దెన్నఁడుఁ జూచి యుండలేదు.

ఆ సుకుమారశరీరము జీనుమీఁదినుండి మెల్లగ జాఱ, నరేంద్రుఁడు నందిటఁబట్టి దింపెను. కెంజిగురువంటి యామె యధరము నాసమయమున నరేంద్రుఁ డొకసారి ముద్దుపెట్టుకొనెను. జలేఖ దాని కిష్టపడక నవ్వి కేకవైచి తప్పించుకొని యావలి కరిగెను.

కాని, మరలఁ బ్రీతితో నామె యతనికడకు వచ్చి మెల్లగ మాటా డెను. పలుకునప్పుడు బాష్పబిందు వామె కంటినుండి జాఱెను.

"ఆప్తమిత్రులు లేక దిక్కుమాలిన యొక దానిసకొఱకు నీవు గొప్పసాహసము జేసితివి. మాదేశపు దేవతలు నిన్నాగ్రాకు రప్పించిరి. నీవు వచ్చి నా సంకెళ్లు విడగొట్టువఱకు నీకొఱకు నేను వేచియుంటిని. మన మిప్పుడు విడిపోవుదము. ఏమన మన మార్గములు భిన్నములు,

తాత్పర్యపడుచు ఉపకారము, నెన్నడు మఱువగు. అందులో జలేఖ మిత్రు నెన్నడు మఱచిపోదు. ”

అని పలికి యద్భుతచరిత్రగల యామెగన నరేంద్రుఁడు ప్రత్యుత్తర మిచ్చులోపలనే వినవిన బోయి యడవిలో నదృశ్యమయ్యెను. అతని యంగరక్షకులు తమ యజమాను నాగ్రానగరమునుండి దారి జూపి యటకుఁ దోడ్కొని వచ్చిన తురకపడఁతి కొఱకు వెదకిరిగాని, యామె కనఁబడలేదు. నరేంద్రుఁడు జలేఖయొక్క ప్రణయకాలపు వాక్యములను, తత్కాల బాష్పబిందువులను స్మరించి తనలో విచారించెను కాని యామె చిత్రచరిత్ర మాత్ర మతనికిఁ దెలియలేదు.

## ౧౬

నవకుమారుఁడు దారపుత్రికలతోఁగూడి నెట్టకేలకు దేవీపురమునకుఁ బోయెను. గ్రామమందు మహోత్సవములు జరిగెను. మరల సంస్థానము సంపాదించుకొన్న తమ పూర్వప్రభువును సందర్శించుటకై పల్లెలనుండి వేలకొలఁది జనులు వచ్చిరి. బాలికలు చక్కని హేమలతను జూచుటకై యంతఃపురములోనికిఁ బోయిరి. వారందఱు నచిరకాలమున జరుగఁ బోవు నామె వివాహమును గురించి ప్రసంగించుచు వచ్చిరి. ముసలి వాండ్రు గోకులదాసు ప్రక్కను జేరి తమ కాలములోఁ దాను జూచిన భాగ్యవిపర్యయములను గురించి చెప్పుకొనిరి. అమ్మలక్కలు బావుల చుట్టుఁ జేరినప్పుడు నవకుమారుని భార్యయొక్క సద్గుణములను బ్రశం సించి యామె సుగుణములం బట్టియే దేవత లామెపై ననుగ్రహము జూపి యామె భర్తకు జన్మచేతనే రావలసిన సంస్థానమును బ్రసా దించిరని చెప్పుకొనిరి.

సంస్థానము తనకు మరల వచ్చుటకు దేవతానుగ్రహమే కారణ

మని నవకుమారుఁడు తలంచుచుండెను, నిజము చెప్పవలసెనా నిశ్శబ్ద ముగా గోకులదాసు చేసిన ప్రయత్నమే ప్రధానకారణము. అయినను నవకుమారుఁ డతని నిట్లు ప్రశంసించెను! "గోకులదాసుడా! నీవు నాయెడ భక్తి గలగి యుంటివి. అనేక సంవత్సరములు పాటుపడి కృత కృత్యుఁడ వైతివి. నాకష్టములలో నాప్తమిత్రుఁడవై నాయండ నిలిచి, నా కుటుంబమునకు మరల సుఖసంతోషములను నొడఁగూర్చి చూచి సంతసించుటకు బ్రతికియుంటివి."

"అయ్యా, యిందు నాప్రజ్ఞావిశేషము లేదు. నీ యదృష్టము మంచిది. గ్రహము లనుకూలముగా నున్నవి. అవి నా ప్రయత్నమునకు తోడుపడునేని, నేను మృతి నొందకముందే మఱియొక సంస్థానము గూడ మీకు రాఁగలదు.'

"సాలెపురుగు తన దారమును, గోకులదాసు తన పన్నుగడలను, విరివిగా పన్నును. కాని మిక్కిలి తెలివిగలవాఁడు గూడ జయప్రద ములు గాని యెక్కువ పన్నుగడలను పన్నును." అని నవ్వుచు నవకుమారుఁడు పలికెను.

కాని నవకుమారుని భార్య మాత్రము గోకులదాసుని సరిగా మెచ్చి ప్రశంసింపలేదు. ఆమెకు వైరాగ్యము ముదిరినందున లోక వ్యవహారములను శక్యమైనంతవఱకు విడిచి స్నానములు జపములు మొదలగు వానియం దధికాసక్తి గలదయ్యెను.

అయినను క్రొత్తగా దీపీపురము వచ్చినందున నక్కడి సందర్భ ములం బట్టి తనకు వివాహమైనతోడనే క్రొత్త పెండ్లికూఁతురై తానా గృహప్రవేశము జేయుట, యాగృహ యజమానురాలై తానక్కడ గాపురము జేయుట మొదలగు పూర్వ విషయములామెకు జ్ఞప్తికి వచ్చుచుండెను. అంతఃపురము, పూఁదోఁటలు, దేవాలయములును మునుపటివే. కాని నేఁడు జవ్వనమున నామె కుండిన మనోవికాసములు

హృదయానందనములు గతించినవి. చుట్టును సాయంకాలపు నీడలు వ్యాపించినవి. హిందూదేశమందలి యనేక పుణ్యాంగనలవలె దేవీపుర రాణియు శరీరబంధమునుండి విముక్తి నిమిత్త మెదురు చూచుచు ముందు జన్మమున త్వరలో మోక్షము గలిగించు జీవితము ప్రసాదింపు మని దేవతలను వేడుచుండెను.

ఆమె గోకులదాసును గాపురమునకు వచ్చిన క్రొత్తదినములలోఁ జూచెను. అతని మెత్తదనమునకుఁ బేదతనమునకు నామె కొంత జాలి పడెను. ఆమె తనయెడల దయగలిగి యున్నందుకుఁ గృతజ్ఞుఁడై యుండెను. కాలము గడచినకొలఁది గోకులదాసుఁడు బుద్ధికుశలత గల వాఁడై తన భర్త యనుగ్రహమునకుఁ బాత్రమయ్యెనని విని యామె సంతోషించెను.

నవకుమారునకు సంస్థానము పోయినప్పుడు వారు కలసి యొక చోటనే యుండిరి. గోకులదాసుఁడు తోడునీడవలె యజమానునివెంటఁ బోయి, వాని యింటిలో నొకఁడై యుండెను. నవకుమారుని భార్య గోకులదాసు కనఁబడినప్పుడు మేలిముసుగు వేసికొనుటలేదు. ఆమె యతనితోఁ బ్రతిదినము తరుచుగ మాటలాడుచుండును. అట్టి సమయములయందే యామె యతని మనోరథములను, గంభీరమైన కుట్రలను గుఱించి కొంత యెఱుఁగుట కవకాశము కలిగెను.

కలుగుటచే నామె భర్తతో నిట్లనుచుండెను:—"అయ్యా! గోకుల దాసు కృతకృత్యుఁడగును. మన సంస్థానము మనకు వచ్చును."

"ఆమనుష్యుని శక్తి నీవు కనిపెట్టితివి. నిరాధారుఁడైన యీ మనుష్యుఁడు తన శక్తిని, బుద్ధికుశలతను కనబఱచెను. ఇంకను తన కృతజ్ఞతను దెలుపఁగలఁడు."

అన్నట్టుగానే గోకులదాసుఁడు కృతకృత్యుఁ డయ్యెను. నవకుమారుఁడు పిరినగరమునకు, దేవీపురమునకుఁ గూడఁ బరిపాలకుఁడయ్యెను.

ఆలస్యముగానైన సంతతి గలిగినందు కతఁడు మిక్కిలి సంతసించెను. ఆమె కతఁడు హేమలత యని పేరుపెట్టెను. ఆమాటకు బంగారుతీగ యని యర్థము. ఆమె యెదిగినకొలఁది దలిదండ్రులపైఁ దన మృదు హృదయము నిలిపి, యత్యంతప్రేమ గలదయ్యెను.

"అయ్యా! ఆబిడ్డయే నాయానందము. ఆబిడ్డయే నామనోరథము, అదేనాప్రాణము. దానిని విడచి నేను బ్రతుకజాలను." అని నవకుమారునితో భార్య తరుచుగాఁ జెప్పుచుండును.

"నేను దాని నెప్పుడు విడిచిపెట్టను. కుమారుని బెంచుకొనను. నరేంద్రుఁడు వీరనగరమునకై నట్లే యీబిడ్డ దేవీపురమునకు వారసురాలగును."

కాని, కష్టములు సంభవించెను. నవకుమారుని మనస్సునఁ గ్రొత్త కోరికలు పొడమెను. వీరనగరరాజకుటుంబము మీఁద మాత్సర్యము ముదిరెను. భార్య వీరనగరరాజపుత్రిక యగుటచే నతనికి, భార్యకు మనస్పర్థలు బైలుదేరెను. ఆమె భర్తను బిలిచి యేప్రశ్న లడుగలేదు. కాని, స్త్రీసహజమయిన తెలివితో మార్పును గుర్తించెను. అప్పుడామెకు మొట్టమొదట గోకులదాసుమీఁద ననుమానము గలిగెను.

కాని, గోకులుసుదాఁడు మునుపటివలెనే తన యజమానురాలి యెడల వినయవిధేయతలు గలిగియుండెను. ఉన్నను మునుపటివలె మనసువిప్పి మాటాడుటలేదు. వంగివంగి దండములుబెట్టి వినయముతో మాటలాడునే గాని, యేవిషయమునను నామె సలహా పుచ్చుకొనఁడు. మొదట జాలిగొని యెవరికామె సాయముజేసి వృద్ధిలోనికిఁ దెచ్చెనో యాగోకులదాసుఁడు, మాయలమారియై, యనుమానములకునికిపట్టయి, ముసలితనము రాకమునుపే వృద్ధుఁడయ్యెను. మున్ను దమ పంచనుజేరి బ్రదికిన యానిఱుపేద నేఁడు రెండు సంస్థానములకు సర్వాధికారియై, తనదారి కెవ రడ్డము వచ్చినను, మిత్రుఁడుగాని,

శత్రుఁడుగాని వారి నావలకు గెంటివేయఁగల శక్తివంతుఁ డయ్యెను. అతఁడు తొల్లింటిమాటఁ దలఁచుకొనఁడు. స్నేహభావములు, మానవుల కుండవలసిన మోమోటలు వానియొద్దఁ బసికిరావు. అతఁడు గమ్యస్థానము జేరుటకై తన ప్రియమిత్రుని నయిన సతికి నేలఁగూల్చి, వాని శరీరము మీఁదినుండి బండి తోలించుకొని పోఁగలఁడు. నవకుమారుఁ డీ దురాత్ముని వలలోఁ జిక్కియుండెను.

నవకుమారుని స్వభావము సహజముగ మృదువైనదే గాని, కాలక్రమమునఁ గఠినమయ్యెను. కోపమతని కిట్టకట్టె వచ్చుచుండెను. బహుకష్టపరంపరలు సంభవించిన కాలమున, నతనిని ధైర్యముతో నిలువఁబెట్టిన యా మనోదార్ఢ్యము మాఱిపోయెను. ఇట్టిదని చెప్పుటకు వీలులేని యహంకారము, కోపము దాని స్థానము నాక్రమించెను. ఏవేళప్పు డతఁ డెట్లుండెనో యెవఁడును జెప్పఁజాలఁడు. నిర్మల మనోదృష్టి గల యా యిల్లాలు తన మగనియందలి మృదుమధురభావముల క్రమక్రమముగా నొకదాని వెనుక నొకటిగా రూపుమాసిపోవుటయు, నొకానొక నీచుని వలలోఁబడి పెద్ద యగాధములో మునిఁగిపోవుటయు నామె కనిపెట్టెను. మగని నిట్లు బాధుచేయుచున్న యానీచుని క్రూరనీతుల నామె ఘూఁత వెఱచుచుండెను.

మగవానిని దన యధీనము జేసికొనుటయే యాఁడుదాని గట్టి కోరిక. అతఁడు భర్త గాని, వలపుగాఁడు గాని, యనుచరుఁడుగాని, మిత్రుఁడుగాని, యెవఁడైనను వానిమీఁద నధికారము చేయుటయే స్త్రీ మనోరథము. మానవుని వశపఱుచుకొనుటకు స్త్రీ చచ్చిపోవునంత యాయాసపడును. ప్రకృతివలనఁ దనకు సంక్రమించిన తెలివితేటల నన్నిటిని మగవానిం దనవశము సురక్షితముగా నుంచుటకై యువతి యుపయోగించును. సన్నిధినుండి యనాదరణమైన ననుభవించును గాని వియోగమును సహింపదు. క్రౌర్యమైన భరించును గాని, నిర్ల

త్న్యము భరింపదు. లతలకు దేనికైనఁ జుట్టుకొని ప్రాఁకి బ్రతుకునట్టి శక్తి నిచ్చిన ప్రకృతియే, లతాంగులకుఁగూడ నీశక్తి నొసఁగెను. సుఖమునకో దుఃఖమునకో నవకసూరుని ధర్మపత్ని యావజ్జీవ మేవృక్షము నాశ్రయించి బ్రతికెనో యది యామె హృదయమునకు దవ్వుగాఁ జేయఁబడుచుండెను. ఆత్మగౌరవము గల పడఁతి యగుటచే నామె యేదో పోయినట్లు దనలో నగవఁ దొడఁగెను. మహావృక్షమును బట్టి తినుచున్న యావేరుపురుగును నిండు నెన్నఁగళ్లతో నూరక చూచుచుండెనే గాని, కాలితోఁ ద్రొక్కి నలిపి చంపలేకపోయెను.

భూలోకబంధ మొకటి యింకను నామెయందు దృఢముగా నుండెను. అభము శుభ మెఱుఁగక, నవనవ వికాసములఁ జెలువొందు మొగ్గముతోఁ గుమారిక యుక్తవయస్కురా లయ్యెను. తల్లిగనుక, మంచి వరుని వివాహమాడి కూఁతురు సుఖముగాఁ గాపురము జేయవలెనని యామె కోరెను. రెండు సంస్థానముల వ్యవహారములలో నామె యెట్టి జోక్యము గలిగించుకొనుటలేదు. చక్కని బాలుఁడైన నరేంద్రుడును, సుకుమారియైన హేమలతయు జిన్ననాఁడు తనకడ నాడుకొనుచున్నప్పుడు, వారిరువురు దంపతులైన బాగుండునని యామెకోరిన కోరిక, యిప్పు డామెకు మరలఁ బ్రాదుర్భవించెను. ఆబాలుఁడు యౌవనము బ్రాపించి, బాలిక ప్రాయము సమీపించునప్పుడు సైతము హిందువుల యాచారమునకు విరుద్ధముగా వారిద్దఱను జెలిమి జేయనిచ్చి యాడుకొనవిచ్చి యామె వారిరువురకు వలపు పెంచెను.

గోకులదాసుఁడు మొట్ట మొదట శిరీషుని దేవీపురమునుండి తీసికొని వచ్చి హేమలతానరేంద్రుల నడుమ నిలిపినప్పుడు మెఱుపువెలుఁగునఁ జూచిన ట్లామె యామంత్రి దురాలోచనలను గనిపెట్టి యాశ్చర్యమును భయమును మనోవేదనను బొందెను. మాత్సర్యము స్త్రీల సామర్థ్యమునకు బదును వెట్టును. మగవాని దృష్టికి నగోచరము లగు

చిహ్నాల నామె చూచి చదువఁగలదు. నవకుమారుని యిల్లాలా చిన్నెలఁ జూచినప్పుడు గరునతనముగల యామె మనస్సు మఱింతదృఢ మయ్యెను. గృహకృత్యము లయందు గోకులదాసుఁడు గాని, తనమగఁడు గాని జోక్యము గలుగఁజేసికొనుట యామె కెంతమాత్రము గిట్టదు. తన కుమార్తెను బిచ్చగానికిచ్చి పెండ్లిసేయుట యామె కిష్టములేదు.

ఆమె దృఢసంకల్పము దెలిసికొని నవకుమారుఁడు జంకెను. "అబ్బా నే నెందరనో సుబేదారులను, ఫౌజుదారులను జూచితిని గాని, యీామె సాటియైన వారి నెన్నఁడుఁ జూడలేదు" అని యతఁడు తనలో ననుకొనుచుండును. గోకులదాసుఁడుగూడ మొట్టమొదట సంశయించెను. కాని "దేవీపురసంస్థానము మట్టుకు వీరనగరమున కెన్నఁడు సంక్రమింపఁగూడదు" అని యతఁడు నిశ్చయించుకొనెను.

చిన్న యార్పుగాలిసైత మొకప్పుడు గొప్ప మంచుగడ్డను బర్వతమునుండి క్రిందికిఁ ద్రోయును. నావలపందెములో యదృచ్ఛగా జరిగిన ప్రమాదము వీరనగర దేవీపురసంస్థానముల భావిస్థితిని నిర్ణయించెను. హేమలత తల్లి యప్పుడు కోపముతోఁ బెదవులుగఱచుకొనెను. కాని, యేమియు మాటలాడదయ్యెను. తన మగని ప్రాణము దీయఁ దలఁచిన పిల్లవాని కామె తనకూఁతు నిచ్చునా యని లోకము చెప్పుకొనఁ జొచ్చెను.

హేమలతతల్లి యోడిపోయెను. న్యాయమైన యుద్ధములో మాత్రముగాదు. మనుష్యుఁ డామె నణఁచలేదు; విధి యామెనణఁచెను. పరాజయమును మెల్లగా ననుభవించి నోరెత్తక యూరకుండెను. ఈలోకముతో నామెను బంధించిన కడపటిగొలుసు తెగిపోయెను. పురాతనమై గౌరవనీయమైన సంస్థానమునకు రాణి యగుటచే దేవీపురమున నామె యెల్లరమన్ననఁ బడయుచుండెను. గాని, యామె యాలోచనలన్నియుఁ బైలోకముమీఁదనే యుండెను; ఆమె హృద

యము దేవుని సన్నిధినుండెను.

హేమలత వివాహమునిమిత్తమై గొప్ప ప్రయత్నములు చేయఁబడెను; ఒకటిరెండు తరములనుండి యట్టి యత్నము లెన్నఁడు జరుగలేదు; పట్టణమంతయు ధ్వజములతోను, తోరణములతోను, సింగారింపఁబడెను. వీధిమూలలలో గాయకుల నిమిత్తము వేదికలు వేయఁబడెను. గెలలతో నరఁటిచెట్లు వీధులకిరువంకల నాటిరి. ప్రక్కను నీళ్ళకుండలుంచిరి. పెండ్లికుమారుఁ డూరేఁగునప్పుడు నిలుచుటకై చల్లనిపందిళ్లు, లాజులు నిర్మింపఁబడెను. పేదలకుఁ బంచిపెట్టుటకు నన్నము, కూరలు, పిండివంటలు బండ్లలోనింపి తెచ్చిరి. బట్టలు వారి నిమిత్తమై కట్టకట్టలుగాఁ దెచ్చిరి. ఉత్సవమునిమిత్తము వీధులు శుభ్రముగా నూడ్చి నీళ్లుజల్లిరి. వేలకొలఁది జనులకు, పొలములలోను, వీధులలోను సన్నదానము జేయుట వారి సంకల్పము.

వివాహమున కంతకుముందెన్నో దినముల క్రిందటనే యుదయము మొదలు సాయంకాలము వఱకు నెడతెగక పట్టణమున సంగీతము వినఁబడుచునేయుండెను. ఆయుత్సవములలోఁ బాల్గొనుటకుఁ బల్లెల నుండి వేలకొలఁది జనులు మూగుచుండిరి. ఎవరు వచ్చినను మంచిదె. అన్నము బట్ట ఎల్లవారికి నీయ నిశ్చయించిరి.

వివాహదినము వచ్చెను. సాయంకాలమయ్యెను. శిరీషుఁడు మేలి పట్టుబట్టలు గట్టుకొని వెండిపనిచేసిన పదియారుబోయల పల్లకిలోఁ గూర్చుండెను. వేలకొలఁది స్త్రీలు, పురుషులు పెండ్లికుమారుని గనుల పండువగాఁ జూచుటకై వీధులకిరువంకల బారులుగట్టి నిలిచిరి. దీపముల వెలుఁగు పట్టపగలువలె నుండెను. భేరీధ్వనులు పెండ్లికుమారుని రాక సూచించెను. పెండ్లికూఁతురు గృహమున సందడి యింతంత గాదు.

దేశములోనెల్ల మిక్కిలి గౌరవనీయులగు వారందఱు వివాహమున

నకు వచ్చిరి. మహోత్సవము వారియెదుట జరిగెను. అగ్ని వెలిగింపఁ బడెను. మేలిముసుగుదాల్చి వధువు వరునకభిముఖురాలై కూర్చుండెను. పురోహితుఁడు సంస్కృతమంత్రములు చదువ నవకుమారుఁడు కాళ్ళు గడిగి కన్యాదానము జేసెను. పాణిగ్రహణకాలమున పెండ్లికుమార్తె హస్తము సిగ్గుచే వడఁకెను.

"నవకుమారుని సాలంకృతకన్యను హేమలతను నీవు భార్యగా పరిగ్రహించుచున్నావా ?" అని పురోహితుఁడడుగ "గృహ్ణామి ! (పరిగ్రహించుచున్నాను.)" అని శిరీషుఁ డుత్తరముజెప్పెను.

అంతట మేలిముసుగుదీసి సిగ్గుపడుచున్న యావధువునుజూచి "నీ భర్తవంక జూడవమ్మా !" అని పురోహితుఁడు పలికెను. అంతట నాలుగుకన్నులుఁ గలుసుకొనెను. హేమలతయొక్క నీలికన్నులు వెంటనే క్రిందికితిరిగెను. ఆసుందరముఖమున లజ్జ పొడకట్టెను. శిరీషుఁడు స్వభావముచేత నెమ్మదియైనవాఁడే గాని యాశ్లక్ష్ణ చక్కనికన్నులు, తనకన్నులఁ గలసినప్పుడును అంతమధురమై, యంతసుందరమై, చిర ప్రేమాస్పదమై, యుండిన యా మోహనాంగి తనసాత్త్వికతచేత నపూర్వమైన యుద్రేకమున కానాఁడు వశుఁడై కంపమొందెను.

పురోహితుఁడు తక్కిన మంత్రములు చదివి మిగిలిన వివాహవిధు లన్నియు నిర్వర్తించెను. పెండ్లికుమారుఁడు లాజహోమము చేసెను. అగ్నిమండెను. సప్తపది ద్రొక్కెను. అంతట వివాహవిధి సంపూర్ణ మయ్యెను. మంగళసూత్రము గట్టినపిదప వధూవరు లంతఃపురము లోనికిఁ బోయిరి.

వివాహమునాఁటిరాత్రి వధూవరులు యథేచ్ఛముగాఁ గడుపుటకు హిందూదేశమున వీలులేదు. అది వివాహమహోత్సవము జూడవచ్చిన బంధువులందఱు సంతోషముతోఁ గడపుటకేర్పడినది. పూర్వాచార ప్రకారము వధూవరులారాత్రి విశాలమైనగదిలో నాఁకుచుట్టములు

నడుమఁ గడుపవలయును. పెండ్లికూఁతురు సాధారణముగా మాట లాడదు. కాని, యామె చెలికత్తెలకును, పెండ్లికుమారునకును జమ త్కార సంభాషణములు చాలజరుగును. ఆంధ్రయుక్తులు చమ త్కారములు పెండ్లికుమారునిమీఁదఁ బ్రయోగింపఁ బడినప్పుడు మిక్కిలి చులుకగాను, జిత్రముగాను నుండును. పెండ్లికై కాంపురము చేయుచున్న యువిదలును, బెండ్లికాని కన్నెలును దమ చెలికత్తెను దమలోనుండి విడఁగీసి తీసికొనిపోవుటకై వచ్చిన పెండ్లికుమారుని వేళాకోళమాడి, వానితోఁ జమత్కృతిగల వాగ్యుద్ధము జేయుటకై తయారైవచ్చుచుందురు. అప్పుడు నారి యిచ్చవచ్చినట్లు మాటలాడు టకు, నానందమొందుటకు దేశాచారము సెలవిచ్చును. దేవీపురము నకు వీరనగరమునకుఁగల చిరకాలస్పర్ధ దెప్పులతోఁ గూడిన పరిహాస మునకుఁ గావలసినంత యవకాశమిచ్చెను. శిరీషుఁ డగ్నిహోత్రమధ్య మున నున్నట్లుండెను ఏలయన రెండు రాజకుటుంబములలోని యాఁడు వడుచులు పరిహాసపుదెబ్బలు జాలిలేకుండఁ గొట్టిరి. కాని యతని చిఱునవ్వులును, మధురసంభాషణమును బరిహాసింపవచ్చిన యాపడఁతి మిన్నలను బరాజయము నొందించెను. ఈపరిహాసములలోనే ఝల్లునఁ దెల్లవాఱెను. గవాక్షములనుండి సూర్యకిరణములు ప్రసరించెను. అంతవఱకు శిరీషునకు విశ్రాంతి లేదు.

మిగిలిన వివాహవిధులన్నియు నుదయమున నిర్వర్తింపఁబడెను. ఇప్పుడు శిరీషునిభార్యయైన తమకుమార్తెప్రక్కను, నవకుమారుఁడును, భార్యయు నిలిచిరి పెండ్లికూఁతురు తండ్రి తత్కాలోచితములైన కొన్ని పలుకులు పలికెను.

శిరీషుఁడా! నేనీబిడ్డను మిక్కిలి గారాబమునఁ బెంచితిని. ఇంత దనుక నీబిడ్డ నాది. నేఁడు మొదలు నీయది. ఈమెను నీవు ప్రేమతోను దయతోను, ఏలుకొనుము. నీవు మంచి భర్తవుగమ్ము. ఆమె నీకు గుణ

వతి యగు భార్యయగుఁగాక !”

అప్పగింతలవేళఁ గన్నులనుండి బాష్పములు విడువకుండఁ గూఁతుల నప్పగించుతండ్రులు మన దేశమున సాధారణముగ నుండరు. పుత్రికలకు వివాహమైనందుకు సంతసించినను, జననీజనకులు చిన్ననాఁటనుండి పెంచి ప్రేమించి పెద్దవారుగఁ జేసిన గాదిలికూఁతులు తమ్ము బాసిపోవు చున్నందుకు విచారించుచుందురు. నవకుమారుఁడు సాధారణముగా విచారమునకు లోనగువాఁడుకాఁడు. హేమలతయును, శిరీషుఁడు దన గృహమందే సుఖముగాఁ గాపురముసేయుదురని యతఁడెఱిఁగియుఁ, దన యేకపుత్రికను, దనముద్దులమూటను భర్తకప్పగిఁచినప్పుడు కన్ను లనుండి బాష్పములు విడువకపోలేదు.

నవకుమారుని భార్య ధైర్యముతోఁ బనిచేసెను. ఆమె తన కృత్యము లెఱిఁగి యవి నిశ్శబ్దముగా నెరవేర్చెను. ఆ మహోత్సవ సందర్భమున విరసమైన మాట యొకటియు నామె నోట రాలేదు. నిలువ నీడ లేని బిచ్చగాఁడొకఁడు సత్కులప్రసూత యగు తన కూఁతురును జేపట్టినందు కామె కోపింపలేదు. కనుబొమ ముడివేయ లేదు. అన్ని యేర్పాటులు నెమ్మదిగఁ జేయించెను. వివాహవిధు లన్నియు రీతితో నెరవేర్చెను. అప్పగింతలైనపిదప నభ్యంతర మందిర మునకుఁ బోయి యొక్కసారి వెక్కివెక్కి యేడ్చెను.

పెండ్లియైన వారముతరువాత నింటి తాళముచేతులు దెచ్చి యామె హేమలత కిచ్చి యిట్లనియె :—

“ అమ్మా ! ఇప్పుడు నీయిల్లు చక్కఁబెట్టుకొనుటకుఁ దగిన యీడు వచ్చినది. మీనాయనగారిని సరిగాఁ జూడుము. నీభర్తకు విధేయు రాలవై యాయన యాజ్ఞ మీరక వర్తింపుము. సేవకులకు బంధువు లకు నిష్టురాలవై వారియెడ దయాదాక్షిణ్యములు గలిగియుండుము. ఈజీవితములో నాపని ముగిసినది. ఇంక నేనాట్టేకాలము బ్రతుకను.

నెత్తనములో నేను జేసికొనవలసిన పూజాపునస్కారములకు, భక్తి ప్రపత్తులకు నన్ను విడిచిపెట్టుము. భగవంతుఁడు నీకు సుఖముగలుగఁ జేయుఁగాక. కొమరులను కూఁతుండ్రను సకలైశ్వర్యములను భగవంతుఁడు నీకుఁ బ్రసాదించుఁగాక!"

హేమలత తన్నుల నీరువెట్టుకొను యట్టి నియమములు పూనవలదని తల్లి నెంతో బ్రతిమాలెను. కాని యామె వేడికోలు వ్యర్థమయ్యెను. నాఁడు మొదలుకొని యామె తల్లి విరాగిణి యయ్యెను. ఉపవాసవ్రతములు దేవాలయమందు ఇంటిలో నున్నప్పుడు దేవారికోఁబలుకక జపమాల ద్రిప్పుకొనుచు నొక చోఁ గూర్చుండును.

## ౨౦

హేమలత చిన్నబిడ్డయై యాడుకొనుచున్నప్పుడు శిరీషుని మిక్కిలి ప్రేమించెను. హేమలత యిల్లాలైననాఁడును, వాని సద్గుణములను, వాని యోగ్యతను మెచ్చెను. ప్రశాంతిమైన యాతని ముఖమున లీనమైయున్న కార్యదీక్ష నామె గ్రహింపఁగలిగెను. ఆతని సత్ప్రవర్తనమునకును, సత్యనియమమునకును భార్యకుండవలసిన గర్వ మామె కలిగియుండెను. జననీజనకులు తనకు భర్తగా నేర్పఱచినట్టియు, దేవతలచేత నియుక్తుఁడైనట్టియు నాయుత్తమ పురుషు నామె యారాధించి గౌరవించుచుండెను.

మిక్కిలి గొప్ప సంస్థానమునకు వారసురాలయ్యును సహజముగా సత్కులజాతుఁడై, కాలవశమున దుస్థితి బ్రాపించిన యువకుని బెండ్లాడినను నామె మిక్కిలి వినయవిధేయత గలిగి, సాధుశీలములు గలిగి, తాను గొప్పదానను, అతఁడు తక్కువవాఁడు నను భావము మదిలోఁ బెట్టుకొనక, యట్టి శాంతుఁడు—నట్టి బుద్ధిశాలి—యట్టి యుదార

శీలుఁడు—తన్ను జేపట్టినందు కెంతో సంతోషించుచుండును.

ఇట్లు సుఖముగాఁ గొన్ని యేండ్లు గడిచెను. నవకుమారుని దేహస్థితి క్రమక్రమముగాఁ జెడిపోవుచుండుటచే శిరీషుఁడు సంసారవ్యవహారములను స్వయముగాఁ జూచుకొనుచుండగా నున్న తపనవికి నర్వామైన వివేకముతో మెలఁగఁజొచ్చెను. హేమలతయు, కాలక్రమమునఁ బెద్దదై యనుభవము గలిగి శాంతముతోను వివేకముతోను డిన గృహకృత్యముల నన్నిటిని మిక్కిలి జాగ్రత్తగాఁ జక్కపెట్టుకొనుచుండెను. ఇంటిపనియైన తరువాత నామె మెల్లగా భర్తకడకుఁ బోయి ప్రక్కను గూర్చుండి, ఘన కార్యనిర్వాహణముచే నలసియున్న హృదయేశ్వరుని దన సరసల్లాపములచేత నలరింపఁజేయుచుండును.

అయినను హేమలత మనంబున నప్పుడప్పు డొక యాలోచన పొడముచుండును. అది యామె హృదయములోనే యడఁచుకొనుచుండును. చిన్ననాఁడు తనకుఁ జెలికాఁడై, యౌవనారంభమునఁ దన్నుఁబాసి దేశభ్రమ్మరియైన యా బాలకుసమీరాది కామె మనస్సప్పుడప్పుడు పోవుచుండును. తీక్ష్ణమైన యా మొగము, మెఱయుచున్న యా కన్నులు, నరేంద్రుని యాయసందర్భసంభాషణములు నామెకు జ్ఞప్తికివచ్చెను. బాలికగా నున్నప్పు డామె గ్రహింపలేక పోయినను యువతియైనపిదప స్మరించి యామె గ్రహింపఁగలిగెను. సద్వంశజాతుఁడైన యా యువకునకు సంభవించిన కష్టములు, వానిని భరించిన యాతని మనోధైర్యము, వానిని జయించిన యాతని దృఢనిశ్చయము గూడ నామె తలఁపునకు వచ్చెను. వీరనగరోద్యానవనమందలి దేవాలయముకడఁ గడసారి యతఁడు తన్నుఁ గలిసికొనుటయు, నతఁడప్పుడు కన్నీరు విడచుటయు, నతఁడప్పుడు పలికిన పలుకులు నామె తఱచుగా స్మరించుచుండును.

ఇట్లనుటచే హేమలత తలంపులలోనైన గలలోనైనఁ బతిభక్తిలేని దని మన మూహింపరాదు. నరేంద్రుఁడు వీరనగరమున సుఖముగా నుండిన పక్షమున నామె యతనిని దన యూరికి రావించి, మగని ప్రక్కను గూర్చుండఁబెట్టి, వారిరువుర సంభాషణములు చిన్నప్పుడు విన్నట్లే మిక్కిలి తమకముతో వినుచుండును. అతఁడు సంస్థాన భ్రష్టుఁ డగుటయు, యోధుఁడై సైన్యమునఁ జేరుటయు, యోధున కనే కాపాయములు గలుగుచుండుటయు, నతని చరిత్రమంతయుఁ బ్రచ్ఛన్న మగుటయు, జాలిగల యామె హృదయమును గరగించెను అట్లుండు టచే నొక్కనాఁడామె శిరీషుని సోదరిం జూచి యిట్లడిగెను.

"శైవలినీ! రాజమహాలునుండి వార్త లేమైనఁ దెలిసినవా?"

"హేమలతా! పాదుషాసేనలు ఆఫ్ఘనులతో మరల యుద్ధముచేయు టకు దక్షిణమునకుఁ బోయినవని మాతమ్మునకు వార్తలు తెలిసినవి. మన నరేంద్రుఁడు సేనతో వెళ్లినాఁడు కాని భయపడకు. పాదుషా సైన్యము మునుపటివలెనే గెల్చును. నరేంద్రుఁడు మరల వచ్చును."

హేమలత ముగము వెలవెలఁబారెను. బాష్పబిందువు లాపు కొనలేకపోయెను.

"హేమలతా! పాపము సంస్థానమును గోలుపోయి, యతఁడు దేశాం తరములఁ దిరుగుచుండుటచే, మన కందఱకు విచారము గలుగు చున్నది." అని శైవలిని యోదార్చెను.

బొటబొట గారిన యాకన్నీరు హేమలత తుడుచుకొని యూర కుండెను.

హేమలతా! విచారింపకు. సంతోషించు దినము సమీపించు చున్నది. యుద్ధములు త్వరలోనే ముగియు ననియు, నరేంద్రునకు వీరనగరసంస్థాన మిచ్చివేయుదురనియు మాతమ్ముఁడు చెప్పినాఁడు. మాశిరీషుఁడు నరేంద్రుని తన సోదరునివలెనే చూచుకొనును. నరేం

ద్రుఁడు మరల తన తాతగారి సంస్థానమును చేకొని సుఖించునట్లు మాతమ్ముఁడు జేయ నిశ్చయించుకొన్నాఁడు."

శైవలినీ! మీతమ్మునికంటె నుదారశీలురు లోకములో లేరు. నా పుణ్యవశముచేత నన్నాయన ప్రేమించి చెట్టఁబట్టినాఁడు."

" నరేంద్రుఁడు చాలాకాలమునకువచ్చిన పిమ్మట నాతమ్ముఁ డెంతో సంతోషించును. మన మందఱ మాయనను ప్రేమతో నిక్కడకు రావింతము. అతఁడు నీ చిన్ననాఁటి చెలికాఁ డగుటచే నతనికిఁదగిన పిల్లను వెదకి పెండ్లి చేయుదుము. "

" అతఁడు సుఖముగా జీవించుటకు నాచేతనైన సాయము నేఁ జేసెదను. "

" హేమలత! మనము వీరనగరములో నున్నప్పుడు కోటలోనికి మనలను దీసికొనిపోయి, తన పూర్వుల వృత్తాంతము చెప్పుచుండెడి వాఁడు. జ్ఞాపకమున్నదా? ఆ సమయమున నతని కన్నులనుండి బాష్పములు జొటజొటఁ గాఱెడివి. తన జాతి కుండవలసిన పౌరుషమంతయు నతని మొగమున నప్పుడు గనఁబడుచుండెడిది. జ్ఞాపకమున్నదా?"

హేమలత ప్రత్యుత్తర మీయలేదు. బాష్పపూరితములైన యాకన్నులును, నా చమత్కారవచనములును నామెకు జ్ఞప్తిలో నున్నవి. అందుచే నిట్లనియె: " ఆ తరువాతనే గదా నదిలో పడవల ప్రమాదము, మానసింగు విచారణచేయుట, దేశములోనుండి వెడలఁ గొట్టుట జరిగినవి. అది మొదలతనిని మరల మనము చూడలేదు. ఏమమ్మా! మనను మరల నొకసారియైనఁ జూడకుండఁ బోవుట క్రూరత్వము గాదటమ్మా?"

" శైవలినీ! రాజమహాలు వెళ్ళకమును పొక్కసారి మాత్రము మనలను జూచినాఁడు."

" నేనప్పుడు చూడలేదు. నీవు చూచితివా?"

"వెళ్లుచు వెళ్ళుచు నాకు కనఁబడినాఁడు. శైవలినీ! ప్రొద్దుపోయినది. లే. మీతమ్ముఁడు మనకోసము కనిపెట్టుకొని యుండును. వెళ్లుదము రా."

శైవలిని సరియైన హిందూవితంతువు. చిన్ననాఁడే యామె భర్త గతించెను. అందుచే దాంపత్యసుఖ మేమో యామె యెఱుఁగదు. పశ్చిమఖండములలోఁ బెండ్లికాని ముసలికన్నెల బ్రతుకువలెనే హిందూదేశమున బాలవితంతువుల జీవితము సంతోషహీనమై భరమై యుండును. భగవంతుఁ డెట్టివారికిని నేదో యూరట గలిగించును గదా! సంతతిలేని వితంతువు మన దేశములో పుట్టింటి పెత్తనము వహించి, తనవారికి సంరక్షణముచేసి, యిల్లు దిద్ది కాపాడుచుండును. తనకు బిడ్డలు లేకపోయినను నామె యితరుల బిడ్డలను బెంచును. తండ్రికో, యన్నదమ్ములకో నెల్లప్పుడు సేవచేయుచుండును. హిందూవితంతువు తనపాలఁ బడినవారిని దయతోఁ జూచినట్లు మఱియొక రెవ్వరుఁ జూడరు. మతధర్మము గూడ నామెను విడువదు. ఉపవాసములు, తీర్థయాత్రలు, స్నానములు, జపములు మొదలగు నియమము లన్నియు నామె నిత్యజీవితములో భాగములే. ఈవిధముగా నామె తనకు విధింపఁబడిన జీవితమును తృప్తిగలిగి జీవించును. వివాహము చేసికొన్న తన యక్కచెల్లెండ్రకంటె నే [illegible] లేక యెక్కువకాలము జీవించును. ఆమెను పెద్దలయాచారము ననుసరించి నడుచుచుండుటచేఁ జుట్టములు, పక్కములు గౌరవింతురు.

శైవలిని మిక్కిలిసాధువు. స్వార్థపరత్వము లేదు. మంచి యాలోచనము గలది. చిన్ననాఁడే తలిదండ్రులు పోయినను తన తమ్ముని మిక్కిలి శ్రద్ధతోఁ బెంచెను. శిరీషుఁడు పెద్దవాఁడై గొప్పపదవిఁ బ్రాపించినందునఁ దన యగ్రసోదరియందు గౌరవముంచి యన్నివిషయములలో నామె సలహా పుచ్చుకొనుచు నతిగౌరవము గలిగి యుండెను. ఎంతో

మంది సేవకు లున్నను శిరీషునకుఁ దన యొక్క స్వహస్తములతో వండిన వంటకములే యెక్కువగా రుచించును. సంస్థాన వ్యవహారము లలో సలహా చెప్పవారెందరో యున్నను నతఁడు తన యొక్కకడకు వచ్చి యామె సలహా నపేక్షించుచుండును. అట్టి సమయము ల హేమ లత యచ్చటికిఁ బోయి మెలిమెలుగ సగము దిగఁదీసికొని వారి సంభాషణములు వినుచుండును. రాత్రి ప్రొద్దుపోయిన తరువాత హేమలతా శిరీషులు పడకటిల్లు చేరిన వెనక శైవలిని జమీందారీ గృహము నాశ్రయించి యుండు చుట్టములు పక్కములు భోజనము చేసిరో లేదో కనుఁగొని, వారి కన్నపానాదులు సమకూర్చి పిదప నల్పాహార మేదో తీసికొని నిద్రపోవును.

ఆదినములలోఁ జదువుట వ్రాయుట నేర్చిన స్త్రీలు చాలమంది లేరు. మతధర్మములు, గృహకృత్యములు నేర్వనివారు మాత్రము చాలమంది లేరు. ఆమె చిన్నబిడ్డయైనప్పుడు పురాణేతిహాసములలోని కథలు వినెను. బాలికగా నున్నప్పుడు, దనగ్రామములోని కోవెలలో దేవతలను బ్రతిదినముఁ బూవులతోఁ బూజించుచుండును. పెద్దదైన తరువాత నామె సాయంకాలము తనచుట్టుఁ జేరినవారికిఁ బురాణ గాథలు చదివి వినిపించుచుండును. ఆమె తక్కిన హిందూస్త్రీలవలెనే తమ కాలమునాఁటి వీరులయొక్క, రాజులయొక్క కార్యములకంటెఁ బురాణగాథలె నిజముగా జరిగిన వృత్తాంతములని నమ్మచుండును. దేవతలు కనఁబడకుండఁ దన చుట్టుప్రక్కలు దిరుగుచుందు రనియుఁ బూజలు మొదలైనవి కోరుచుందురనియు నామె విశ్వసించెను. ఇంటి లోనున్న వృద్ధస్త్రీ లామెచుట్టుఁ గూర్చుండి యినుకపాతరవలెఁ దెంపులేక యామె చెప్పు పురాణకథలను దమకముతో వినుచుందురు.

ఇంటిలోనున్న బిడ్డలందఱకు నామెమీఁద మిక్కిలి యిష్టము. చిన్నబిడ్డలు గూడ నోరులేని జంతువులవలెనే భగవంతుఁ డిచ్చిన

యంతిశ్శక్తిచేత మనుష్యుల స్వభావములను గనిపెట్టఁగలదు. చూపును బట్టియుఁ గంఠధ్వనిని బట్టియుఁ గ్రొత్తమనుష్యుఁడు తమపై బ్రేమగల వాఁడో కాఁడో బిడ్డలిట్టె తెలిసికొనఁగలరు. మధ్యాహ్నముగాని, సాయంకాలముగాని తీరుబడిగాఁ గూర్చున్నప్పుడు చిన్నబిడ్డలాడుచుఁ బాడుచు శైవలిని దగ్గఱకుఁ బోయి యదివఱకు నూఱుమారులు వినినను నాకథలనే మరల మరలఁ జెప్పుమని తలవెండ్రుకలు లాగి, బట్టపీకి పీడించుచుందురు.

శైవలిని చెప్పునట్టికథలు, చదువునట్టి పురాణములు, హేమలత వలె మిక్కిలి శ్రద్ధతో నాలకించువా రాయింట మఱెవ్వరు లేరు. అన్నికథలకంటెఁ బాతివ్రత్యము, గృహిణీధర్మములు, భక్తివిశ్వాస ములు మున్నగు విషయములను గుఱించి చెప్పఁబడు కథలు హేమ లతకు మిక్కిలి యిష్టముగా నుండును. పరమపతివ్రతల కథలు వినుట కంత యాసక్తి గలుగుటకు నామె భర్తయొక్క నిష్కలంక చరిత్రము కారణమా? అట్టి సద్గుణవంతునకు నీమె తగినభార్య యనిపించుకో వలెనను కోరిక కారణమా; సకల విధముల భర్త కుపచారములు జేసి లోకఖ్యాతి బడయవలెనను నభిలాష కారణమా? శైవలిని హేమలత కోరిక నెఱాకరించి, కప్రపంచమునం దెల్ల మహాపతివ్రతలని విఖ్యాతిగాంచిన సీత, సావిత్రి, దమయంతి మొదలగు నారీశిరోరత్న ముల చరిత్రములు జెప్పుచుండును.

అట్టి కథలు విని హేమలత యన్యుల కెవ్వరికిఁ దెలియని యొకా నొక తలంపు హృదయమునఁ బెట్టుకొనిఁ బ్రతిరేయి శయనాగారము నకుఁ బోవును. అప్పుడు భర్త నిద్రించుచున్నను, గాఢనిద్ర పోవుచున్న భర్తమంచముకడ మోకాళ్ళమీద నిలువఁబడి యిట్లు తరుచుగాఁ బ్రార్థించును: భగవంతుఁడా! లోకములో నేనుత్తమస్త్రీగా నుండు నట్లనుగ్రహింపుము. నేను మనోవాక్కాయకర్మముల మహాపతివ్రతనై

యుందునుగాక! జీవించినప్పుడు, మరణించినప్పుడు సస్లేయగుంగాక! పరపురుషుల తలంపులు నామనంబునం జేరకపోవుగాక!"

## ౨౧

దేవీపురపు రాజభవనము నేఁడు బెంగకు దుఃఖమునకు నిలయమయ్యెను. హేమలత తన గృహకృత్యములను సరిగాఁ జూచుకొనుట లేదు. తల్లియుఁ దన వైరాగ్యమును విడిచిపెట్టవలసి వచ్చెను. నవకుమారుఁడు జబ్బుపడి మంచ మెక్కెను. జీవించునను నాశ యంతగా లేదు.

చిరకాలము కష్టపడుటచే నినుపచట్రమువంటి యాతని శరీరము చెడిపోయెను. దేవీపురమువచ్చిన తరువాతఁ తత్ఫలితము గనఁబడెను. సహజముగా నతని కప్పుడు విశ్రాంతిగావలసియున్నను నట్టి విశ్రాంతి సుఖ మతఁ డనుభవింపఁడయ్యె. తనకు జయము గలిగినదని గర్వించి వెండియు నధికారము గలిగినందు కుబ్బి చెలరేగి, తనవయస్సు వానికిఁ బ్రాణహాని గలుగఁజేయు ననర్హకృత్యములు మితిమీఱి చేయఁదొడఁగెను. అతఁడు భోగపరాయణుఁడై నిరంతర ముత్సవములయందుఁ నానందప్రదములగు కార్యములందుఁ గాలము గడుపఁ దొడఁగెను. తత్ఫలము త్వరలోనే కనఁబడెను. కొన్నియేండ్లలోనే శరీరపాటవము చెడ నతఁడు మంచ మెక్కెను. కొన్ని సంవత్సరములక్రిందట నడివయస్సులోనుండి మంచియారోగ్యస్థితిలోనున్న యా జమీందారుని పాలిసమొగము, గుంటలుపడిన కన్నులు, జూచి దివాణపు ముసలి వైద్యులు తలలూఁచి పెదవులు విఱిచిరి.

అప్పుడు చిరకాలముక్రిందట భర్తనుండి విడిపోయి, దేవతారాధనల్లలోఁ గాలము పుచ్చుచున్న యాతని ధర్మపత్ని, తాను గొలుచు

చున్న దేవతలపేళ్లు లిఖింపఁబడిన చీరగట్టుకొని, వచ్చి రేఖుంబవళ్ళు భర్తసమంచముకడనే యుండి, తన జీవితేశ్వరుని యవస్థను బాష్ప పూరిత నేత్రయై కనిపెట్టుచుండెను. సహజముగా నాదంపతు లిరువురు నున్న తౌదర్యము, సాధుశీలము గలవారు. కాని, చిన్నభేద మొకటి యామైత్రిని జెడఁగొట్టెను. ఆమెయెడ నాతని ప్రేమ సత్యమైనది. కష్టకాలములనామె యోపికయు, భర్తృసేవయు, మిక్కిలి ప్రశంస నీయములు. ఆమెసాయమును సలహాయు వివేకగర్భితములు. ఉత్తమ ధర్మాసక్తియు, మంచివివేకము, గలదని యాదేశమంతటఁ బేరు పడిన యానారీమణి కొన్నిసమయములలోఁ గొన్నిసంగతులు మఱచి పోయి యావలివారిని క్షమించి సుఖింపవలయునను మాట యెఱుఁ గదు. మగని యపరాధములు, ననాదరణములు నాత్మగౌరవముగల యామె స్వభావమున వ్రణములఁ గల్పించెను. ఆశాభంగములు మన స్సున ముద్రితములయ్యెను.

ఎవతె దండించి క్షమింపఁగలదో యాజ్ఞాపించి సంతోషపెట్టఁ గలదో తన సంసారసుఖము చెడకుండ లోఁబరచుకొనగలదో యామె లోకమున సుఖించును. తప్పులు మఱచి క్షమింపనిపడఁతి సంసార సుఖము లనుభవింపఁజాలదు. తెలివియు, వశీకరణశక్తియుఁ గల యంగనకే భరతఖండమున గృహలక్ష్మి యని పేరు. చీవాట్లుపెట్టి యామె దోషులను దండించునుగాని నూఱుతప్పులయిన సైరించును; అధికారముచేసి యానతు లిచ్చునుగాని, జీవనము సుఖప్రదముచేసి కొనును; ఆమె యినుపగొలుసులకన్నఁ గట్టివైన ప్రేమయను పట్టు త్రాళ్లతోఁ దనవారినందఱ బంధించును. అట్టి తల్లుల పెంపుచేతనే కొడుకులు విధేయులగుదురు. కూఁతులు తలిదండ్రులఁ బ్రేమింతురు. స్త్రీల యోగ్యతలోనే గృహసంపద యున్నదని ప్రాచ్యదేశపు సామెత చెప్పుచున్నది.

ఆ గృహమందుఁ బండుకొన్న సమయములలో మగని కేమేమి విషయములు, భార్య కేమేమి తలంపు గలిగెనో వారివురకే తెలియును. అప్పటితలంపులు వెనుకటి క్రూరకార్యముల మరపించును. కఠినవాక్యములు నోటరాకుండఁజేయును. పూర్వవృత్తాంతముల గురించి యేమో మాటయు నక్కడ రాలేదు. ప్రతిరాత్రియు నాపతివ్రత మగని తలగడలుసర్ది యౌషధులు రాసి, బాధానివారణముచేసి యనేకోపచారములు జేసెను. చిక్కి శల్యమై పాలిపోయి మంచమునఁ బడియున్న హృదయేశ్వరుని జూడఁ జూడ నెట్టి దుర్దశలోనైన నీరువిడిచియెఱుగని యామె కన్నులు బాష్పములతోఁ దడియుచువచ్చెను. తన కెల్లప్పుడు విధేయురాలై ఋజువర్తనము గలిగినట్టి యాపతివ్రతాతిలక నతఁడు గూడఁ జూచి యింతకాలము నే నీమె సద్గుణముల దెలిసికొనలేకపోతిఁ గదా యని విచారించి కన్నీరు నించుచుండును. వారి భావములప్పుడు కలసిపోయెను. దుఃఖము సమానమయ్యెను. ప్రార్థనలు నిశ్శబ్దముగా వారి హృదయమందుండి ప్రసరించియుండును.

పాపము హేమలత దుఃఖము నణఁచుకొనలేక వెలిబుచ్చెను. ఏకపుత్రికయగుటచే నతిప్రేమచేత నామె తండ్రి దోషముల గణింపలేదు. బాల్యమునుండియుఁ దండ్రి తనయెడఁ బ్రేమయు దయయు నుట్టిపడఁ దన్ను బెంచెనని యామె యెఱుఁగును. ఆమె తండ్రిబలమును, మనోదార్ఢ్యమును, గొప్పతనమును జూచి గర్వించుచుండును. తల్లియొడిలోఁ గూర్చుండి, తన ప్రియజనకుఁడు—తన ప్రాణసమానుఁడు—తన్ను విడిచిపోవుచున్నాఁడని దుఃఖించుచు నతని కేసి గంటలకొలఁదిఁ జూచుచుండును. చూడఁ జూడ నడఁచుకొనలేనంత యేడుపామెకు వచ్చుచుండును. గుండెలు వ్రీలఁజేయునట్టి యా మహాదుఃఖము నొక్కసారి పెద్దపెట్టున యేడ్చి వెళ్లబుచ్చుట కామె తండ్రిగదినుండి వేఱొక స్థలమునకుఁ బోవుచుండును.

శిరీషుఁడు గూడఁ దరుచుగ నాతనికడ నుండును గాని, మగవాఁడగుటచే దుఃఖమునను వశుఁడు గాకపోయెను. అతఁడు తగిన వైద్యము జేయించి రోగనివారణమున కేమేమి కావలయునో యా వస్తువుల నెల్లఁ దెప్పించి, కావలసిన యేర్పాటు లన్నియుఁ జేసెను. వైద్యుఁడు చెప్పిన మందులు, రసాయనములు నతఁడే స్వయముగా నిచ్చెను. పథ్యపానములు తన యెదుటనే చేయించెను. కన్నులు నాచున నొప్పిసప్పుడు హేమలత నూరడించి, యతఁడును, శైవలినియు విశ్రమింపుమని యామెను బలుమాఱు బ్రతిమాలుచుండును. ఎల్లప్పుడు మేల్కొని యుపచారములను చేయుచుండుటచే నలసి సొలసిన యత్తగారిని గూడఁ గొంచె మాహారము పుచ్చుకొని విశ్రమింపుమని యతఁడు వేడుకొను చుండును. శిరీషునిమీఁద హేమలత తల్లి కెప్పుడు నిష్టములేదు. కాని, ప్రాణాపాయము దుఃఖము హృదయము నాక్రమించినప్పుడు నిర్హేతుకమైన ద్వేషమును, గర్వమును వెనుకఁ బడిపోవును. అల్లుఁడు బిచ్చగాఁడని యతనిం గడు నీచముగాఁ జూచిన హేమలత తల్లి నిరంతర భర్తృపరిచర్యవల్లను, దుఃఖమువల్లను డస్సియుండుటచే వెనుకటి గర్వమును దురభిప్రాయమును విడిచెను. సహాయ మవసరమైనప్పుడు దా పిల్లవానియందే సహాయమునఁ బత్తుల నామె యపేక్షించెను. దుఃఖముచే నామె వడఁకుచున్నప్పుడు వాని కావుచుమీఁదనే యామె యానుకొనెను. తనకు నుహాపద గలిగినప్పు డతని యాదరణమే తనకు దుఃఖవిమోచనమని యామె నమ్మియుండెను.

కుమారుఁడువలె నతఁ డహోరాత్రములు తెరిపిలేక యుపచారములు చేసెను. కొడుకుండినను నట్లు చేయఁడు. రాత్రి ప్రొద్దుపోయిన పిదప, రోగికి నిద్రపట్టినప్పుడు శ్రద్ధతో నతఁ డేదో కొంచె మాహారము దెచ్చి యామె కిచ్చి, పండుకొనుటకుఁ బక్క వఱచి కొంచెము విశ్రమింపుమని యామెను బ్రతిమాలుచుండును. అప్పుడప్పు డామెకు

గన్నుల నీరు వచ్చును. అది పశ్చాత్తాపమున వచ్చియుండుటచే శిరీషుని శైవలిని దగ్గఱ దీసికొని యి ట్లనుచుండును—"మీరే నాబిడ్డలుం నా హేమలత యెట్టిదో నాకు మీరు నట్టివారే. నేను జాల కష్టముల ననుభవించితిని. అందుచేఁ గొన్ని విషయములు మఱచిపోతిని."

ఆ దీర్ఘరోగమువలనఁ బెద్దలు పిన్నలుఁ గూడఁ గొన్ని పాఠములు నేర్చికొనిరి. రేయింబవళ్లు శిరీషుఁడు రోగి కుపచారములు చేయుటచే భార్య కతనిమీఁదఁ మఱింత ప్రేమ గలిగెను. అతఁడు జాలిగుండెగల వాఁడని యదివఱ కెఱుఁగకపోయినను నప్పుడు స్పష్టముగాఁ దెలిసి కొనెను. అతని మెత్తని లోతుకన్నులలో నిదివఱ కెన్నఁ డామె చూచి యెఱుఁగని తలంపు లామె చూడఁ గలిగెను. ఆమె తండ్రికై యధిక దుఃఖాక్రాంతయైన సమయమున నతఁ డామెను మెల్లగాఁ దోడ్కొనిపోయి, ముద్దుపెట్టుకొని కన్నీరు దుడిచి పాన్పు జేర్చును. అప్పు డామె యతని వక్షఃస్థలముమీఁదఁ దల చేర్చి పండుకొనఁ గొప్ప యూరట, గొప్ప బలము గలిగినట్లు గొంత ధైర్యముతో మెలఁగు చుండును.

ఎంత జాగ్రత్తగా సంరక్షణము జేసినను, నెంత వైద్యము జేయించి నను నది యెల్ల వృథ యయ్యెను. శీతకాలమున నొకనాఁటి యుదయ మున పిశేష వేదన లేకుండ నవకుమారుడు లోకయాత్ర ముగించి వెళ్లిపోయెను. అంతఃపురమున గొప్ప రోదనము బైలుదేరెను. దాని వలన ముసలి జమీందారుఁడు మృతినొందెనని బంధువులకుఁ బుర జనులకుఁ దెలిసెను.

మరణము సమీపించుచున్నదని కనిపెట్టి శిరీషుఁ డెల్ల ప్రయత్నము జేయించెను. అఁడువాండ్ర యేడ్పులు, బ్రాహ్మణుల మంత్రములుఁ బ్రతి ధ్వను లొనఁగ శవమును బాడెమీఁదఁ బెట్టి మంచునాటి తెల్లనిబట్ట గప్పి వెలుపలికిఁ గొంపోయిరి. గంగాతీర మక్కడికిఁ జాలదూరమున్నదిం

దూరమైన నక్కడికే దీసికొని పోవలసి యుండెను. అంతదూరము బంధువులు మిత్రులు మోసిరి. శిరీషుఁడు ముందు నడువ శవమువెంట విషాదముతో ననేకులు కాలినడకతో నారాయణనామస్మరణఁ జేయుచు బోయిరి. వారు గంగాతీరమునకుఁ గొన్ని గ్రామములలో నుండి వెళ్లవలసివచ్చెను. ప్రతిగ్రామమునందు స్త్రీలు, పురుషులు గుంపులు గూడి చూచి నవకు గూర్చిఁ బ్రశంసించిరి. రెండుజాములు ప్రొద్దెక్కెను. అప్పటికివారు సగముదూరము పోయిరి. కటుకు భుజములమీఁదినుండి దింపి చెట్లక్రిందఁ బెట్టి వాహకులుఁ దక్కిన వాండ్రుఁ గొండొకసేపు విశ్రమించిరి. గంగానది వారి కంటఁ బడునప్పటికిఁ బగలు వెళ్లిపోయెను. శీతకాలపు రాత్రి ఛాయలు క్రమ్మెను. హరినామస్మరణపూర్వకముగా వారు శవమును గంగాతీరమునకు దింపిరి.

ముందు కొందఱు మనుష్యులను బంపి శిరీషుఁడక్కడఁ బ్రయత్నమంతయుఁ జేయించెను. మంచిగంధపుఁ జెక్కలతో జగినట్లు కాదు పేర్చి బ్రాహ్మణులు మంత్రములు చదివి కర్మ జేయింప శవమును దానిపై భక్తిప్రపత్తులతోఁ బెట్టి యగ్నిసంస్కారముఁ జేసి నేయిపోసిరి. దానితో నగ్ని విశేషముగా మండ శవదహనము పూర్తియయ్యెను.

జాగ్రత్తతో నస్థికలు ప్రోగుచేసి వానిని గంగానదిలోఁ బాఱవైచిరి. అంతట గంగలో దిగి వారందఱు స్నానముఁ జేసిరి. ఆరాత్రి వారొక యింట విశ్రమించి, మఱునాఁడు బైలుదేరి యజమానుఁడు లేకపోవుటచేఁ జిన్నవోయిన జమీందారీభవనముఁ జేరిరి.

మైలదినములలో బంధువు లందఱు దర్భాసనములు చేతఁబట్టుకొని తిరిగి వానిమీఁదనే కూర్చుండిరి. ఎట్టిభోజనము శాస్త్రమునందుఁ జెప్పఁబడినదో యట్టి భోజనమే చేసిరి. చేపలు, మాంసము, పిండివంటలు మొదలగునవన్నియు వర్జించిరి. స్త్రీల యంతఃపురమునుండి ప్రతిదినము రోదనధ్వని వెలసెను. ఆ నూతనవితంతువుయొక్కయు,

హేమలతయొక్కయు దుఃఖము జూడ శక్యము గాకుండెను. నారితోఁ గలిసి చుట్టములైన యాఁడువాండ్రను బెద్దపెట్టున నేడ్చిరి.

పదిదినము లైన తరువాత గతించిన వాని గౌరవమునకుఁ దగిన రీతిని శ్రాద్ధము జేయఁబడెను. శ్రాద్ధసమయమున దేవీపుర కుటుంబము నాశ్రయించిన విద్వాంసులును, బరిసర గ్రామములనుండి వందలకొలఁది బ్రాహ్మణులును వచ్చిరి. వీరనగరమునుండి కూడఁ గొందఱు వచ్చిరి. చుట్టుప్రక్కల పల్లెలనుండి వచ్చిన వేలకొలఁది జనుల కన్నదానము చేయఁబడెను. పూజ్యులైనవారి కనేక బహుమానములిచ్చి, పేదలకు బట్ట లిచ్చిరి. కర్మ యంతయు శిరీషుఁడు చేసెను. కూలినట్టి మనుష్యుల నడుమఁ దిరిగి, పెద్దలఁ బలుకరించి, సేమ మడిగి, పూజనీయునకుఁ దగిన పారితోషిక మిచ్చెను. అందఱును విచారించి దేవీపుర శ్రోత్రజమీం దారును దీవించిరి.

రాత్రి ప్రొద్దుపోయిన తరువాత శిరీషుఁడభ్యంతరమందిరమునకరిగి, యత్తగారి యడుగులకు నమస్కరించి దీవింపుమని యడిగి యిట్లు విన్నవించెను: "అమ్మా! నేను నిజము పేదవాని కొడుకును. గుడిసెలోఁ బుట్టితిని. నీవు నన్ను కుమారునిగాఁ జూచుకొని భాగ్యభోగ్యము లిచ్చి జమీందారుని జేసితివి. తల్లీ! నీవు నాయం దనుగ్రహ ముంచి తోడు పడుదువేని యీ దివాణముయొక్క ప్రతిష్ఠ నా చేతిలో లేశమైనఁ దగ్గిపోదు."

ఆమె యాతని దీవించి కుంచితకరణశుద్ధిగా నిట్లు బలికెను: "ఇహ లోకసంపదలకంటె నెక్కువ సంపద లున్నవి. కుమారా! పరమేశ్వరుఁడు నీ కట్టి సంపదలను, బుద్ధివివేకములను నిచ్చినాఁడు. ఈ గొప్ప పదవి నీకుఁ బ్రసాదించిన పరమేశ్వరుఁడే సాయముచేయును. అతఁడు నీకు దీర్ఘాయు రారోగ్యములిచ్చి నీకీర్తి లోకములో వెలయింపఁ జేయుఁ గాక. నేను బ్రతికినన్నాళ్లు బ్రతుకను. దినములు దగ్గఱఁబడినవి. నావంటి

విశ్రాంతిపొందుటకు మనువంటి పవిత్రక్షేత్రములు నివాసయోగ్యములు. మఱియొక జన్మమునందైన నాభర్తగారిని గలిసికొనుటయే నామనోరథము."

ఇంకను బ్రొద్దుపోయిన తరువాత విచారించుచు నొంటరిగాఁ గూర్చుండి భార్యకడకుఁ బోయెను. కొన్నిమాసములనుండి వా రేకాంతముగాఁ గలిసికొనుటలేదు. శిరీషుఁడు భార్యాదుఃఖమును గుర్తించి యూరడింపఁదలఁచి యామెయొద్దకు జేరి కౌఁగలించుకొని యామెశిరస్సుఁ దనబాహువుమీఁదఁ జేర్చి నుదుట ముద్దువెట్టుకొని బుజ్జగించి యిట్లనియె:

"హేమలతా! చిన్నప్పటినుండి నిన్ను నేను ప్రేమించితిని. నీవు నాకు ప్రేమాస్పదరాలవైన భార్యవైతివి. మనల నిద్దఱను గలిపిన యా మహానీయుఁడు పోవుటచే నీవు నాకు మఱింత ప్రియురాలవైతివి. మనమిరువురము జీవించినంతకాల మాయన పేరు జ్ఞప్తిలోనుంచుకొని గాఢానురాగముగల దంపతులమై యుందము."

"మీరన్నట్లు మహానాయనగారిని జ్ఞప్తిలోనుంచుకొని నేను మీకు యావజ్జీవము సహధర్మచారిణినై యుండెదను." అని పలికెను. ఆ మాటలామె పెదవులనుండియే గాక యంతఃకరణము నుండిగూడ వచ్చెను.

అప్పలుకులువిని యతఁడిట్లనియె—"హేమలతా! నీకెప్పుడు నామీఁద ప్రేమకలదు. కాని, నీవు ధైర్యముతో వినవలసిన విషయ మొకటియున్నది. నరేంద్రునివిషయమై కొంత చెప్పవలసియున్నది. అది యిన్నాళ్ళు జెప్పక కప్పియుంచితిని."

ఆమాటలు చెవిఁబడఁగానే కలఁతఁజెందిన చూపులతో నామెభర్త వంకఁ జూచెను; కొట్టుచున్న గుండెచప్పుడు పైకివినఁబడెను.

ఆప్తనులతోఁ బోరాడుటకు నరేంద్రుఁడు చక్రవర్తి సేనలతో దక్షి

ణమునకుఁ బోయెను. చక్రవర్తిసేనలు పరాజయమొందెను. ఆదారుణ యుద్ధమున నరేంద్రునికి గాయముతగిలినది.”

ఇట్టియాపద వచ్చునని యామె మునుదే యూహించినది. ఊహించి యావిషయమై చాలకాలమునుండి యామె తలపోయుచుండెను. అనుకొన్నంత జరిగినదని వినఁగానే యామె నిట్టూర్పువిడిచి మొగము భర్త వక్షమునఁ బెట్టుకొని దుఃఖించెను.

“ప్రియురాలా! దుఃఖపడవలసినదే. ఏమన నీవు చిన్ననాఁటనుండి నరేంద్రుని సోదరభావమున ప్రేమించితివి. అతఁడు నాకును ప్రియమిత్రుఁడై సోదరునికొఱకు విచారించినట్లు అతనికొఱకు నేను విచారించితిని.”

అప్పుడిద్దఱు మాటలాడక కొంతసేపూరకుండిరి. సమరమారుని జబ్బులోఁ జెప్పక యతఁడు పోయినతరువాతఁ గొన్ని వారములవఱకుఁ జెప్పక యాదుఃఖవార్త నప్పుడతఁడు వెలిబుచ్చెను. మాయస్థుఁడై గాయపడిన మిత్రునికొఱకుఁ దనకళత్రము దుఃఖించుచుండ నతఁ డసూయఁజెందక యామెను మన్నించెను.

“భగవంతుఁ డతనిని బ్రతికించును. నేను జేయవలసిన కృత్యమును జేయుటకు దేవుఁడు నాకు తోడుపడును. మీతండ్రిగారి సంస్థానమునకు నేనిప్పు డధిపతినైతిని: నీవు దేవీపురరాణివైతివి. దేవీపురము పీరనగర విషయమునఁ దీర్పవలసిన ధర్మములు కొన్ని యున్నవి. ఆ భారమిప్పుడు నీమీఁదను నామీఁదను నున్నది.”

దుఃఖాక్రాంతయైన హేమలతకీ పలుకులు మిక్కిలి యూరటగలిగించెను. బలవంతుఁడైన భర్తనుండి యామెకు మనోబలము సంక్రమించెను. అంతట నామె కన్నీరు తుడుచుకొని దృఢనిశ్చయముగల మగని మోమువైపు జూచెను. కంటికి భగవంతునివలెఁ గనఁబడుచున్న యా పురుషవిశేషుని పాదములకామె నమస్కరించి వలెనని యనుకొనెను.

"హేమలతా! ఔను. శూరుఁడును సంస్థాన భ్రష్టుఁడు నైన నరేంద్రుని భగవంతుఁడు తప్పక రక్షించును. నేనింక చేయవలసిన కృత్యమొకటి యున్నది. ఈ కార్యమున నీవొక్కతవే నాకుసాయము జేయఁగలదానవు. ఏమన నీవు నరేంద్రుని చాలకాలమునుండి యెఱుఁగుదువు. అతఁడు చెల్లెలువలె నన్ను జూచుకొనును. నీమాట కెదురాడఁడు. అమ్మగారితోఁ గలసి మనము మధురాపురము వెళ్ళుదము. అక్కడ నరేంద్రుని గలిసికొనవచ్చును. విధేయురాలైన భార్యవై యందుకు నీవు నాపనుపుజేయుము. నరేంద్రుఁడు సోదరుఁడువలె నీ యభిమానము నపేక్షించును. నీపని నీవు చేయునట్లు నాకు మాటయిమ్ము. అతని నిక్కడికి తీసికొనివత్తునని మాటయిమ్ము."

అనవుఁడు హేమలత కంఠమెత్తి భర్తకిట్లనియె:—"అయ్యా! నేను చేయవలసినపని నేనెఱుఁగుదును. నీకు భార్యగాను, నరేంద్రునకు చెల్లెలుగాను చేయవలసిన కృత్యములను జేయుటకు పరమేశ్వరుఁడు నాకు తోడుపడుఁగాక!"

## ౨౨

ఎట్టకేలకు నవకుమారుని వితంతువు గోకులదాసుఁడును గలిసికొనిరి.

దేవీపురపు దివాణమునంటియున్న వృద్ధసేవకులలో నెవరును నవకుమారుని మరణమునుగూర్చి గోకులదాసునివలె దుఃఖింపలేదు. అతని జీవితము పడుగుపేకవలె యజమానుని జీవితముతోఁ గలిసిపోయినది. యజమానుఁడు పదభ్రష్టుఁడైనప్పుడు విడువక వెంటవెళ్ళెను. సంస్థానమతనికి మరల నిప్పించుటకెన్నో యెత్తులు పన్నెను. అతని విజయము తనదని ప్రశంసించెను. ఇంకను మిక్కిలి గొప్పదయినసేవ నతఁడు చేయఁ

దలఁచుచుండఁగా యజమానుఁడు లోకాంతరగతుఁ డయ్యెను. పని
దాదాపుగా ముగియునప్పుడు చేతిలోని పనిముట్టు విఱిగిపోయెను. పని
వాఁడు మిక్కిలి చింతించునుగదా. గోకులదాసుని దుఃఖము నిజమై
నది హృదయమునుండి వచ్చినది. మనుష్యసహజములైన ప్రేమవిశ్వా
సము లతనికంతగా లేకపోయినను చిన్నతనమునుండి నలుబదియేండ్లా
యన ననుసరించియుండుటచే గోకులదాసునకు యజమానునిమీఁదఁ
గుక్కకున్నంత విశ్వాసముండెను. అతఁడు యజమానునికొఱకుఁ గన్నీరు
విడుచుచుండఁ జాలమంది నమ్మక యది నటనయనిరి. కాని యవి నిజ
మైన బాష్పబిందువులె. గోకులదాసుఁడు నిజముగా నేడ్చినది నవ
కుమారుని శవము ప్రక్కనే.

అతఁడు శవమువెంట గంగాతీరమునకుఁ బోయి దహనముఁజూచెను.
కాలినడకను దేవీపురమునకువచ్చి, యుత్తరక్రియలకుఁ దగినయేర్పా
టులుచేసి, శ్రాద్ధము గొప్పగాఁ జేయించెను. శిరీషుని దనయజమానునిగా
నేర్పఱచుకొని యాయన యుత్తరువుల మన్నించెను.

క్రమముగా నుత్తరువులు వచ్చెను. ఇహలోకసంబంధము లన్నియు
వదలుకొన్న వృద్ధవితంతువు యమునాతీరమందున్న మధురానగరము
నకుఁబోయి యీశ్వరసేవలోఁ గాలముబుచ్చఁ దలఁచెను. శిరీషుఁడు,
శైవలిని, హేమలతయు నామెవెంటఁబోయి యామెకక్కడ సుఖప్రద
మైన వసతుల నేర్పఱిచి, పిమ్మట నింటికి రాఁదలఁచిరి. గోకుల
దాసుఁడు ప్రయాణమునకు వలయు నేర్పాటులన్నియుఁ జేయవలెను.
చేసి, వారితో రాజమహలువఱకువెళ్ళి, క్రొత్తయజమానుఁడు దేశము
లో లేనప్పుడు సంస్థానవ్యవహారములు సరిగా నడుపుటకు దేవీపురము
నకు మరల రావలయును.

గోకులదాసుఁ డాయాజ్ఞలను శ్రద్ధతో విని మన్నించెను. అన్ని యే
ర్పాటులు చక్కఁగాఁ జేయఁబడెను. ప్రయాణకాలమునకు వారి పురోహి

తుఁడు పెట్టిన మంచిముహూర్తమున బైలుదేరవలయునని యాదినము నెదురు చూచుచుండిరి. అంతకుముందే కడసారి తన పూర్వపు యజమానురాలిని సందర్శించి, యామె యాశీర్వాదము బడయవలయునని గోకులదాసుఁడు మిక్కిలి వినయముతోఁ గోరెను.

ఎట్టకేలకు నవకుమారుని వితంతువును, గోకులదాసును గలిసికొనిరి. కాని, మునుపటివలెఁ గాదు. వారి మనస్పర్థ లంతరించినవి. వారి యాశాపాశములు కాలవశమునఁ దెగిపోయినవి. వారి జీవితకాలము సమాప్తమునకు వచ్చుచుండెను. పూర్వ మెవరియెత్తులు వారెత్తిరి. ఎవరిఫలము వారు చూపిరి. జయాపజయములు పర్యాయముగ ననుభవించిరి. కనుక గోకులదాసుఁడు దర్శనమునకు వచ్చి నేలమీఁదఁ జాఁగిలఁబడినప్పుడు, జీవితములోఁ జరమావస్థను బ్రాపింపఁ దలఁచిన యా పూజ్యురాలు సామవాక్యములతో నతనిని బలుకరించి దీవించి పూర్వస్పర్థలన్నియు మఱచిపోయెను. కాషాయవస్త్రములు గట్టుకొని, ధర్మాచరణమునందుఁ గాలము గడుపఁదలఁచిన యావృద్ధ వితంతువు దీవించినప్పుడు గోకులదాసుఁడుగూడఁ దన వెనుకటి వర్తనముం దలంచి కొంత మనోవ్యథ నొందెను. మొట్టమొదటఁ దాను దిక్కులేక యా దివాణమునకు వచ్చుటయు, నామె తనకు, కూడు గుడ్డ నిచ్చి, పోషించి పనిచెప్పించి, యాదరించిన నాఁటికాల మతని కప్పుడు జ్ఞప్తికివచ్చెను. గోకులదాసుఁ డెంతలెంతల మొహటనైన గర్వము విడచి లొంగిపోలేదు. కాని యావృద్ధదేవి మొహట నతఁడా దినమున గరువతనము నడఁచుకొని రాణీమొహట నేరస్థుఁడట్లుండెను.

"లోకము లోని గొడవలు విడిచి అమ్మగారు పవిత్రక్షేత్రమైన మథురకుఁ బోవుదురు గాఁబోలు." అని యతఁడు మెల్లగ నడిగెను.

"అలాగే అనుకొన్నాను. ఈశ్వరానుగ్రహ మెట్లున్నదో?"

"అమ్మగారు మంచిహృదయము గలవారు గనుక భగవానుఁడు

మీ కడపటి కోరికలు దీర్చును. భక్తిమగ్నులై మీరు మహానందము నొందుదురు. సంసారపు గొడవలలోఁ బడి పాపాత్ములమైన మేమే మీరులేని వ్యర్థిచేతఁ జిక్కులు బడుచుందుము."

"అన్నిగొడవలు వదలిపెట్టి పోవుచున్న ముసలమ్మకొఱకు విలపించువారు చాలమంది యుండరు నాయనా! నాకూఁతురు సంసారము దిద్దుకొనుచుఁ బనులలో మునిఁగి యుండును. శిరీషుఁడు కులగౌరవము నిలఁబెట్టుచు, సంస్థానము పాలించుచుండును."

"అమ్మగారు సెలవిచ్చినట్లె జరుగును."

"గోకులదాసుఁడ! నీ వేర్పాట్లన్నియు చేసినావు గదా?"

"చిత్తము. అన్నియేర్పాటు లయినవి. మిమ్ము రాజమహాలు దీసికొని పోవుటకు బోయలతో పల్లకులు సిద్ధముగా నున్నవి. అక్కడ రెండు పెద్దపడవలు కుదిర్చితిని. ఇరువదిమంది సిపాయిలు, కావలసినన్నిమంది కళాసులు, ఆపడవలను జాగ్రత్తగా మథురకుఁ దీసికొని పోవుదురు."

"గోకులదాసుఁడా! మంచిపని చేసితివి. నీ వెప్పుడును నాకును దివాణమునకునుగూడ భక్తిశ్రద్ధలు గల సేవకుఁడవే."

ఎంతో దయారస ముట్టిపడ నామె పలుకులచే దోషపూరితమైన గోకులదాసుని మనస్సున నా కడపటిమాటలు గట్టిగా నాటెను.

"గోకులా! నేను కొన్నిదినములు కాశిలో నుండవలెనని కోరిక యున్నది. నావంటిదానికి గంగాతీరమందున్న యావిశ్వేశ్వరాలయము చూడఁదగినది."

"అమ్మగారి కోరిక నేను గ్రహించితిని. కాశీలో గంగయొడ్డున చక్కని నివసన కుదిర్చితిని. అక్కడ మీరు కొన్నిదినము లుండవచ్చును. మీరు మరల బయలు దేరువఱకు పడవలక్కడ నుండును."

"తరువాత త్రివేణీసంగమము గల ప్రయాగలో గూడ మేము

కొన్నాళ్లాగవలెను. గోకులా! గంగాయమునా సంగమములో స్నానముచేసిన ప్రక్షణమున చాలపుణ్యమగును. మేమక్కడ జేరునప్పటికి పుణ్యకాలమువచ్చును."

"అమ్మగారికి, మా యజమానునకు, భార్యకు, చెల్లెలికి నక్కడ గూడ మంచిపని కుదిర్చితిని. అక్కడి నీళ్లు, గాలి మిక్కిలి మంచివని చెప్పుదురు. తేనుసేగల మన బంగాళమునుండి పోవువారి కది సౌఖ్యముగా నుండును. మా యజమానునకు గూడ కొంత విశ్రాంతి, నీటి మార్పు కావలెను."

"గోకులా! నిజమే. శరీరమునకు కొంతస్థలము మార్పు కావలెను. దానిచే నతనికి బాగుపడును. మొదటినుండి మాయందు భక్తివిశ్వాసములు గల యుద్యోగస్థునిచేతిలో సంస్థాన మతనులేనప్పుడు పడును గనుక, నతడదృష్టవంతుడు."

ఈ కపటపుమాటలు వినగానే గోకులుడు తనలో నిట్లనుకొనెను. "అబ్బా! ఈమె మాటలెంత తియ్యనివో! ఈమె భర్త ఉటుకుటిమి నట్లు నన్ను చీవాట్లు పెట్టి తిట్టినప్పుడును, నేను జంకలేదు. ధైర్యముతో నిలబడితిని. ఈమె తియ్యని నాలుక కత్తివలె మంచి వాడి యున్నది. దానితో మనస్సు కోసివేయగలదు?"

అనంతర మామె తంతు నిట్లుచెప్పదొడగెను: "యమునా నదిపైన దేశము మిక్కిలి బాగుండునని చెప్పుకొందురు. నదికి రెండుప్రక్కల నెన్నో దేవాలయములున్నవట. సేవించుట కెందఱో యాత్రికులు వత్తురట. ఇదిగాక వారి వేషభాషలు వేరట. అయినను యాత్రకువచ్చిన వారి నందఱను వారు మర్యాదగా దేవాలయములోనికి రానిత్తురట."

"చనిపోయిన మా యజమానుని పేరు దేశమందంతట ప్రసిద్ధికెక్కినదే. అందుచేత నమ్మగారక్కడికి వెళ్లినను చాలా గౌరవము జరుగును."

"ప్రయాగనుండి పాదుషా వసించునట్టి పట్టణమునకు ప్రయాణము చాలదినములు పట్టునందురు. ఆ పట్టణము పేరేమిటి ? గోకుల !"

"అమ్మా ! ఆపట్టణము పేరు ఆగ్రా. అక్కడనుండి వచ్చినవా రటు వంటి పట్టణము లోకములో నెక్కడ లేదని చెప్పుదురు. అక్కడ నున్న గొప్ప కోటల మనుష్యులు మన దేవీపురములో ప్రత్యక్షముచేయు చున్నారు. మీకు మంచిబస వారిద్వారా యేర్పాటు చేసితిని."

"అయితే దేవుని దయవల్ల మే మక్కడ సురక్షితముగా చేర వలెను. ఏలయన శిరీషుఁడు పాదుషాగారి దివ్యభవనములను గురించి చెప్పుచుండును. హేమలత గూడ రాణులయొక్క బేగముయొక్క స్ఫటికమందిరములను చూడఁ గోరుచున్నది"

"అమ్మా ! అట్టికోరిక యుండవలసినదే. ఆకోరిక దేవుని దయవలన తీరును. పాదుషాగూడ చనిపోయిన మా యజమానుని గురించి మానసింగురాజువలన వినియున్నాఁడు. అందుచే నాయన కుటుంబము నకు తగిన గౌరవము జేయును."

"గోకుల ! నాకేగౌరవము వద్దు. కడపటిదినములు మధురలోఁ గడుపఁ దలఁచుకొన్న ముసలితంతువునకు గౌరవము లెందుకు ? కాని ఆగ్రాత్రోవలో నున్నది గనుక కొన్నాళ్లక్కడ నుండవలెను. శిరీషుఁడు నరేంద్రుని గురించి కొంత భోగట్టా చేయఁ దలఁచుకొన్నాఁడు. చాల కాలమునుండి యతని వృత్తాంతము తెలియుటలేదు గదా."

అనవుడు గోకులదాసు తనలో నిట్లనుకొనెను : "నరేంద్రుని మాట తలపెట్టుటచేత నీమె కేదో దురుద్దేశ మున్నట్లు కనఁబడుచున్నది. ఆ విషయము ఆమె గట్టిగా నెత్తినయెడల నేను కాచుకోఁగలను."

"గోకులా ! ధైర్యశాలియైన యా పిల్లవాఁ డిల్లువదలి తొమ్మిదేం డ్లయినది కాదా ? వాఁడు పాపము చాల బాధపడినాఁడు."

"అదిగో ఆప్రసంగము వచ్చినది. నేను తగిన జవాబు చెప్పెదను."

అని తనలో ననుకొని గోకులుఁడు విసయముతో, విచారముతో నామె కిట్లనియె : "అమ్మా! తొమ్మిదేండ్లకు పైనయినది. అప్పటినుండియు మన మతనికోసము విచారించుచునే యున్నాను. కాని, మా వెనుకటి యజమానులతనిని చాల ప్రేమించి కొడుకువలె చూచుకొనిరి. పడుచుదనము గనుక దుడుకువాఁడై తన వంశగర్వము నప్పుడప్పుడు చూపుచుండెడివాఁడు."

ఆమెయు వీరనగిర రాజపుత్రిక యగుటచే నతని కిట్లనియె : "కుటుంబగౌరవమును బట్టి వానికి కొంత గర్వ ముండవచ్చును. అయినను గర్వము కూడదు. అందుచేత గొప్ప కులములో బుట్టి కష్టము లనుభవించినాఁడు."

"ఔను! అనుభవించినాఁడు. మానసింగురాజు దయదలఁచి క్షమించినాఁడు. మా ప్రభువుగారిని నీటిలో ముంచి యతఁడు చంపఁ దలఁచినందుకు మానసింగు క్షమించినాఁడు గాని, మరొకరైన పక్షమున నతఁ డంత చులకనగా తేలిపోవునా?"

ఇప్పటికి గోకులదాసుఁడు ధైర్యము చిక్కఁబట్టి, కొంత యెదిరించి మాటాడఁ దలఁచెను.

అంతలో నా వృద్ధురాలు మెల్లగ నిట్లనియె: "దేవుఁడు దయగలవాఁడు. పిల్లవాండ్రు దుడుకుతనము, తప్పును అతఁడు దయతో క్షమించును. గోకులా! దేవుని దయ మనము గూడ కోరవలసినదే. ఏలయన కాటికి కాళ్ళు చాపుకొని యున్నప్పుడు గూడ మనము మాయలు పన్నుదుము. పరుల సొత్తు హరింతుము. దొంగిలింతుముగూడ.

ఎందు కీ విషయము గురించి మాటలాడితివా యని గోకులదాసు విచారించెను.

"గోకుల! రాత్రిప్రొద్దుపోయినది. ఈ సంగతు లింక నేను మాటాడను; నరేంద్రుని గూర్చియు, వాని తాతగారి సంస్థానమును

గూర్చియు శిరీషుండు నీతో కొన్ని సంగతులు చెప్పుచున్నాడు. ఆగ్రా నుండి మధుర కెంత దూరమో చెప్పు? ఆ దివ్యస్థలము నా మాటకు నా మనస్సు తత్తరపడుచున్నది. నా ప్రాణములు పోకమునుపే క్షేత్రమును నేను చూచునట్లు దేవుండు దయతో ననుగ్రహించుఁగాక."

"అమ్మా! ఆగ్రాకు మధురకు ఎంతో దూరము లేదు. పడవమీఁద నొక్కనాఁటి ప్రయాణము."

"అట్లయిన యమునయొడ్డున నా కొక చిన్నయిల్లు కుదుర్చు. అక్కడ ప్రతిదినము ప్రొద్దుపొడిచెడివేళ స్నానము చేసెదను. అక్కడ దేవాలయములలో పూజలు చేసికొందును. అక్కడ నే చిత్తశాంతితో దేహము విడిచెదను. ఈలోకములో నేను చేయవలసినపని ముగిసినది."

"అమ్మగారి కోరికలు తప్పక సిద్ధించును. మీరు దూరముగా నున్నను, మీరు సుఖముగా చిరకాలము జీవింపవలెను."

"గోకులా! సాయంకాలపు పూజకు నేను వెళ్ళకమునుపు నీకు మఱొక్కమాట చెప్పవలెను. పిల్లవాఁడుగా నున్నది మొదలు నిన్ను నే నెఱుఁగుదును; పెద్దయిన తరువాత గూడ నిన్ను పోషించితిని. నేను వెళ్ళిపోయిన తరువాత నన్ను గుఱించి నీ మనస్సులో మరభిప్రాయ మేమియుఁ బెట్టుకొనవద్దు. మన మొకప్పుడు గర్వముచేత మనస్సులో ద్వేషభావము పట్టుకొంటిమి. ఈ లోకములో వ్యర్థప్రయత్నములు చేసి మన మొకరిపై నొకరు ఈర్ష్య బూనితిమి. అవన్నియు మఱచిపోవలెను సుమీ. ఇఁక మనము బ్రతికియుండఁగా కలిసికొనము. దేవునియనుగ్రహము బడసి దేహము చాలింపక మునుపు నే నందఱి యనుగ్రహము నుండు కోరెదను. నీవు నా కెప్పుడయిన అపకారముగాని, తప్పుగాని చేసియున్నయెడల, నాయనా! నే నది మఱచిపోయి అంతఃకరణశుద్ధిగా నిన్ను నా బిడ్డవలెఁ జూచుకొందును. దయాళువైన భగవంతుఁడు నా పాపము లన్నియు క్షమింపఁగలఁడని

నానమ్మక. నాయనా! వెళ్లు. దేవుఁడు నీమీఁద దయయుంచును.''

ఈ పలుకులు పలికినప్పు డామె కన్నులనుండి మెల్లగా బాష్పములు జాఱి నామె లోపలికిఁ బోయెను. ఆ పూజ్యురాలి యెదుట గోకులదాసుఁడు నేల సాఁగఁబడి మ్రొక్కెను. అదివఱ కెన్నఁడు నతఁ డెఱుఁగని భయ మతని నాదినమున నావహించెను. అతఁడు లేచి, నుదురు తుడుచుకొని, పరాభవముఁ జెందినట్లు తలఁచుకొనుచు చీఁకటిలో నడిచి యింటికిఁ బోయెను.

## ౨౩

సనకుమారుని భార్యను గోకులదాసుఁడు చూచి మూఁడు దినము లయ్యెను. కాని, యా సమావేశము జ్ఞాపకమువచ్చినపు డెల్ల నతని మనస్సు కలఁతపడుచుండెను. అందుచే నతఁ డిట్లు తనలోఁ దలంచెను :

"చక్కనిదై నిండుజవ్వనియై క్రొత్తపెండ్లికూఁతురై వచ్చినప్పు డామెను నే నెఱుఁగుదును. సాటిలేని తెఱఁగున నెన్నో యెత్తు లెత్తినప్పుడు నే నామెను బ్రతిఘటించితిని. కానీ, యీ విధముగా నుండుట నెన్నఁ డెఱుఁగను. అన్ని వ్యవహారములు వదలుకొన్నదైయుండి యెంతో యధికారము చెల్లించుచున్నది. చూడఁగా వితంతువు, 'ఒంటి మనిషి. కాని, నన్ను నేలకఱఁగఁ ద్రొక్కుచున్నది! ఆమె రేపు వెళ్ళిపోవును. చాల మంచిది. ఇఁక నామె మొగము నేఁజూడను. దేవీపురమువంటి పురాతనసంస్థానముయొక్క యభివృద్ధి యీఁడుదాని జపములమీఁదను తపములమీఁదను ఆధారపడియుండదు! నేను నా క్రొత్తయజమాను నీ సాయంకాల మరగంటలో గలిసికొనవలెను. నిజముగా క్రొత్త యజమానుఁడె! దిక్కుమాలిన స్థితిలోనుండఁగా నడివీధిలోనుండి తన్ను దీసికొనివచ్చి యెవ్వఁడు' సనకుమారుని కప్పగిం

చెనో, యీ సంగతి యతనికిఁ దెలియునో లేదో, ఈ పెండ్లికూఁతును, ఈ సంస్థానమును తన కెవ్వఁ డిచ్చెనో యీ సంగతి జ్ఞాపకముున్నదో లేదో? ఇవన్నియు నొక యినుపగొలుసులోని లంకెలు. ఈ లంకెలతోనే నేను వానిని గట్టివేసెదను. ఈ బాలుఁడు గోకులదాసు వేసిన సంకెళ్ళు గట్టివని త్వరలోనే గ్రహించును. ఆయన ప్రమాణము గాక మునుపు నా కేవో కొన్ని యుత్తరువు లిచ్చుచుండెట. నవకుమారునివద్ద నుండియే నాకుత్తరువు లవసరము లేకపోయినవి. ఎందుచేతనో యీ కుమారుని మూఁకభావములు నాకిష్టములేదు." అని కొంత సేపు తనలో ననుకొని తనలోనే శిరీషు నుద్దేశించి వెండియు నిట్లనుకొనెను—

"ఓరీ, కుఱ్ఱవాఁడా! జాగ్రత్త. ఆ ముసలిపందెప్పుకోడిని అడఁచి పెట్టిన చేయి పిల్లగొంతు కిట్టే నలిపివేయఁగలదు. చేతనైతే కొన్ని కొన్ని కూఁతలు కూయుము. ఇన్నాళ్ళనుండి యెల్లెలినాఁడో అట్లే గోకులదాసుఁ డీ సంస్థానమును—కాదుకాదు—ఈ రెండు సంస్థానములను గూడ నేలును."

అరగంటలోపుగానే శిరీషుఁ డా గదిలోనికి వచ్చెను. గదిలో రెండాముదపుదీపములు వెలుఁగు చుండెను. నేలమీఁదఁ గాశితములు గుట్ట వేయఁబడెను. అవర్జాలు, చిట్టాలు నక్కడే యుండెను. గోకులదాసుఁడు మెల్లగాఁ దలుపు దెఱచి, నవయజమానుని లోపలికిఁ బిలిచి, మంచి యాసనముమీఁదఁ గూర్చుండఁబెట్టి, యెంతో వినయముతో దూరముగా నిలువఁబడెను.

"గోకులదాసుఁడ! నా దగ్గఱగాఁ గూర్చుండుము. నేను నిన్ను సేవకునిగఁ జూడక మిత్రునిగాఁ జూచెదను. ఏలయన యావజ్జీవము నీవి దివాణమునే కొలిచితివుంటివి. నేను పేదవాఁడనైనప్పుడు నీవు నాపై దయతో నుపకారము జేసితివి నీ సహాయము కావలసినప్పుడు

నా కెంతో సాయము జేసితివి. అంత యుపకారము జేసినవానియెడల శిరీషుఁ డెప్పుడు కృతఘ్నుఁడుగా నుండఁడు."

అనవుడు గోకులదాసుడు గౌరవముతో నిట్లనియె—"అయ్యా! మీకు నేను చేసిన దేమియులేదు. మనుష్యులను బాగుచేయునది పాడుచేయునది యదృష్టము. అది కంటికి కనఁబడదు మీ గొప్ప గుణములే మామగారికి మీమీఁద ప్రేమ గలిగించి మిమ్మీ యున్నతి దశకుఁ దెచ్చినని. ఈపదవికి మీకంటె నర్హులు లేరు. ఈ ముసలి నౌకరు ఏదైన కొంత సేవ చేసినయెడల, అతఁడు స్వధర్మమే నివర్తించినాఁడు. అతఁడు అతని పూర్వులు గూడ, ఈదివాణమును గొలిచి యేగదా బ్రతికిరి."

"ఈదివాణమును చిరకాలము కొలుచుటకు నీవు చాలకాలము బ్రతుకవలెను. నీతరువాత నీ కుమారుఁ డాపదవియందుఁ బ్రవేశింపవలెను."

"అయ్యా! ఇట్టి మంచి తలంపులు గలిగినందుకు భగవంతుఁడు మిమ్ము రక్షింపవలె. నేననేక సంవత్సరములు ఈదివాణపు సొమ్ము తినియుంటిని. నా కుమారుఁడును అట్లే మీసొమ్ము తిని యిక్కడేపని చేసి యిక్కడే దేహము చాలింపవలెను."

"గోకులదాసుఁడా! నాకోరిక యదే. పెద్ద పెద్ద వాగ్దానములు నేను చేయఁజాలను. నీవు చేసిన సేవలకు ప్రత్యుపకారముగా నీ కుమారుని మీఁద నేను దయాభిమానములు గలిగియుంటినా, నా ధర్మము సరిగా నిర్వర్తించినవాఁడ నగుదును. మీపిల్లవాఁడు గూడ తగినవాఁడు; మేను మంచి పనిచేయువాఁడు"

ఈకడపటి మాట లంతఃకరణశుద్ధిగా వచ్చిన వగుటచే నవి గోకులదాసుని రాతిగుండెను గూడ కరగించెను. అంతట నతఁడు తన యజమానునికి మ్రొక్కి యిట్లు విన్నవించెను.

"అయ్యా! నాకుమారుని శరీరములో పితృపితామహుల రక్తమే ప్రవహించుచున్నది. అతడు దేవీపుర సంస్థానము పట్ల కృతఘ్నుడు గాడు. మేమల్పులమే గాని మేమెవరిని కొలిచియుందుమో వారి పట్ల కృతజ్ఞుల మగుట మాకు వంశపరంపరగా సంక్రమించిన ధర్మము."

"గోకులదాసా! అది నే నెఱుగుదును. భాగ్యవిపర్యయములలోఁ గూడ విడువక నలుఁబది సంవత్సరములు నీవు నామామగారి నెట్లు కొలచియుంటివో నే నెఱుఁగుదును."

"అయ్యా! నిజమె. మాకాలములో మే మెన్నో కష్టములు పడి దుర్దినములు గడపితిమి. మాప్రయత్నములు దైవము తోడ్పడి నందున మీ మామగారు మరల దేవీపురసంస్థానాధిపతులై సుఖముగా దేహము చాలించిరి."

"గోకులదాసా! అది యంతయు నీప్రయత్నఫలితమె. నీవల్లనే దేశపరిపాలకుల యనుగ్రహము గలుగుటచే, రెండు సంస్థానముల కాయన యధిపతి యగుటయు సంభవించెను. నీ ప్రయత్నమువల్లనే మృతినొందక మునుపు మరల దేవీపురసంస్థానమును సంపాదించుకొనఁ గలిగెను."

"దైవమే మన ప్రయత్నములను ఫలింపఁజేయవలెను. నేను చేతనయినంత పని చేసితిని. నాయజమానుని మరల సంస్థానాధిపతినిఁ జేయఁగలిగితినను సంతుష్టితో నేను నిర్విచారముగా ప్రాణము విడిచెదను."

"గోకులదాసా! నీ వింక చాలకాలము బ్రతుకవలెను. దేవీపుర ప్రజల క్షేమమే నేను కోరెదను. నీవు చిరకాలము మంత్రివై యది సమకూర్తువుగాక!"

"ఇన్నాళ్ళనుండి మన సంస్థానములో పంటలు మిక్కిలి బాగున్నవి. సంస్థానమంతయు నెమ్మదిగానున్నది. శిస్తు చక్కఁగా వసూలగు

చున్నది. మీ మామగారి దినవారకములకు ద్రవ్యము విశేషముగా వెచ్చపెట్టినను ఖజానా యింకను నిండుగానే యున్నది. నేటివఱకు లెక్కలు తయారై యున్నవి. మీరు తనిఖీ చేయవచ్చును." అని గోకులదాసుఁడు నేలమీఁదఁ జక్కగా నొకదాని మీఁద నొకటి పేర్చి పెట్టఁబడిన చిట్టాలు మొదలగు లెక్కపుస్తకములఁ జూపెను.

"నేను నిన్ను నేటి సాయంకాలము కలుసుకోఁ దలఁచినది లెక్కలు తనిఖీచేయుటకుఁ గాదు. నేను తిరిగివచ్చువఱకు లెక్కలట్లేయుండనీ! అదిగాక, యీ యిరువదియేండ్లనుంచి గోకులదాసుని లెక్కలలో నెక్కు-డైన తప్పు లున్నవా? అని పరీక్షింపఁదగు విషయములు. అవి నా మనస్సును బాధించుచున్నవి. వాటినిగురించి జాగ్రత్తగా నాలోచింపవలెను."

అతఁడు చెప్పఁబోవు విషయమేదో గోకులదాసునికిఁ బోడకట్టుటచే వినఁగోరి ప్రతీక్షించెను.

"గోకులదాస! పాదుషానియమించిన యమలుదారుని యధికారముతో వీరనగరస్థాని వ్యవహారములు లేశమాత్రము బాగుపడలేదని చెప్పుకొనుచున్నారు. అది నిజమా!"

"చిత్తము. నిజమేనండి!"

"తొమ్మిదేండ్లక్రిందట మనయూరు విడిచినప్పటికంటె నిప్పుడు బకాయి యెక్కువైనదఁట!"

"చిత్తము. అలాగేనండి!"

"అమలుదారుఁడు నిరాశ జెందినాఁడనియు, ఆమండలపు కాసంగో కఠినపద్ధతుల నవలంబించుచున్నాఁడనియు విన్నాను."

"సంస్థానము పేష్కషు చెల్లింపనప్పుడు కాసంగో చక్రవర్తిహాలుకు మునుబట్టిపోవును."

"అయితే బకాయిపడిన సంస్థానమును అమ్మివేయుదురా!"

"ఆది పూర్వమునుండి రాజశాసనమేనండి!"

"మూడువందల యేండ్లనుండి యక్కచెల్లెండ్రవలె నిరుపద్రవముగ నున్న యీ రెండు సంస్థానములలో నొకటి యంతరించిపోవుచున్న మాటా;"

"మూడువందల సంవత్సరములనుండి యొకదానితో నొకటి పోరాడిన యీ సంస్థానములలో నొకటి నిలుచును. ఒకటిపోవును."

"ఎక్కడనైతే చిన్నతనమున నేను తలదాచుకొని ప్రేమను సంతోషమును అనుభవించితినో, యా వీరనగర రాజభవనమును, దివాణము గూడ పగుల పాలగునా?"

"అయ్యో! వీరనగరసంస్థానము మన్నింపవేఁడుదురు. కాని పరులపాలు గానక్కఱలేదు."

"అట్లైన నాబాల్యమిత్రుఁడైన నరేంద్రుఁడు లోకములో నిలువ నీడలేక తిరుగవలయునుగాబోలు!"

"నరేంద్రుఁడు మానసింగురాజును గొలుచుచున్నాఁడు. ఆరాజతని తప్పులు క్షమించినాఁడు గనుక ఏదో బహుమానము చేయక మానఁడు."

అదివిని శిరీషుఁడు కొన్ని నిముషము లూరకుండెను. గోకులదాసుఁడు మంచిమాటలు చెప్పినట్లే కనఁబడెను. కాని, యీ విషయము మాత్ర మొకనాఁడు విచారించుట కాపివేయవలెనని శిరీషుని మనసొప్ప లేదు.

"గోకులదాసా! నీవు సమస్యలిచ్చినట్లు మాటాడుచున్నావు. నీవు నిజమైనమిత్రుఁడవని నా యభిప్రాయము."

"నేనెల్లప్పుడు మీయెడల భక్తివిశ్వాసములు గల సేవకుఁడనే స్వామీ!"

"గోకులదాసా! అట్లయిన నిజమైన మిత్రునివలె చెప్పుము. వీర నగరమింకొకరి కాధీనముగఁబడి యుండనేల? దేవీపురమున వండినట్లె

అక్కడ కూడ పంటలు బాగుగా పండినవి. రైతులు రాజభక్తిగలిగి నెమ్మదిగా నున్నారు. మన ఖజానా నిండుగా నుండుటకు, వీరనగరపు ఖజానా వట్టిపోవుటకు కారణ మేమో యెఱుగుదువా ? ”

“ అయ్యా ! నే నేమి చెప్పఁగలను ? మానసింగుమహారాజు వీరనగర సంస్థానము నాకప్పగింపలేదు. అందుచే దానిని గుఱించి మీకు కానసమాచారము చెప్పఁగలను. ”

అది విని శిరీషుఁడు గట్టిగా తెలిసికోవలెనను నుద్దేశముతో నెమ్మది గానే యిట్లడిగెను : “ వీరనగర. లో దివాణపు పన్ను లెందుకు చెల్లలేదో నీ వెఱుఁగుదువా ? ”

“ అమలుదారుపై రైతులు తిరుగఁబడి కట్టుగట్టి యల్లరులు చేసిరి. ”

“ మన సంస్థానపు కాపు లెవరైన వీరనగర సంస్థాన గ్రామములలో నిట్టటు తిరిగి పన్ను లియ్యవలదని రైతులను పురికొల్పినట్లు నీ వెప్పు డైన విన్నావా ? ”

“ ఆఁ, ఆవిషయమై విన్నాను. ” అని గోకులుఁడు చల్లగా జవాబు చెప్పెను.

“ సంస్థానము త్వరలో నే నావశ మగుననియు, అమలుదారు నీకు చెల్లింపనక్కఱలేదనియు, నా మనుష్యు లా సంస్థాన గ్రామములలో చాటి చెప్పిరని తెలిసినది ; అది నిజమా ? ”

“ పూర్తిగా నిజమేనండీ ! ” అని దాఁచిపెట్టుటవల్ల లాభము లేదనుకొని గోకులుఁడు పెంకెతనముతో నుత్తర మిచ్చెను.

“ దేవీపురపు దివానుయొక్క మంత్రికి తెలియకుండగనే మన మనుష్యు లావని చేసిరా ? అతఁ డంతయు కనిపెట్టఁగలవాఁడు. అంతయుఁ జేయఁగలవాఁడు. అన్ని యేర్పాట్లు జరుపఁగలవాఁడు గదా ? ”

“ మన మనుష్యులు నా యాజ్ఞమీఁదనే యట్లు చేసిరి, ” అని దృఢ నిశ్చయముతో నతఁడు బదులు చెప్పెను.

అంతట నగల సంభాషణ ముగిసె. వారు కొంచెసే పూర్తిచేసిరి. యజమానుడుం గూడ స్పష్టసంభాషణముయొక్క యవసరము వచ్చునని తెలిసికొనిరి.

"గోకులదాసా! దీపము లారిపోవుచున్నవి. కొంచెము మైనము వ్రేయుము. మన పని ముగించుటకై యింకను గొంతసేపు మన మిక్కడ నుండవలెను."

చెప్పినట్లు గోకులదాసుఁడు చేసెను.

"వీరనగరములో పన్నులు చెల్లించుటకు నుపాయ ప్రయత్నములు చేసితిమి. ఆ కార్యములు నెరవేరినవి గూడ."

"ఔను. చేసితిమి."

"గోకులదాసా! ఉద్దేశ మేమి?"

"సంస్థానము జప్తుచేయించి అమ్మివేయించవలెను."

"కానంగో మఱియొకలాగు చేయఁదలచినచో నేమగును?"

"కానంగో అమ్మివేయఁ దలఁచుకొన్నాఁడు."

"గోకులదాసా! అది నీ వెట్లెఱుంగుదువు?"

"కానంగో నాకు వ్రాసిన జాబును బట్టి తెలిసినది. అది మీకు నే నిదివఱకే చూపవలసినది. ఈ నడుమ వచ్చిన కష్టములవలన నది ఆగిపోయినది."

అని గోకులదాసుఁడు తన నిక్కరలో జాగ్రత్తతో దాచిన యొక జాబు తీసి మడతలు విప్పి శిరీషుని చేతిలోఁ బెట్టెను. ఆ జమీందారీ బాలుఁడు జాబు చదివి యూరకుండెను.

"ఈ వేల మగునని చాటించినారా? గోకులదాసుఁడా!"

"అయ్యా! ఇంకను చాటింపలేదు."

"అట్లయిన ఈ సమాచారము దేవీపురములో నింతె పెందలకడ నెట్లు తెలిసినది?"

"అయ్యా! కార్యసాధనము నిమిత్తము దేవీపుర సంస్థానములోను మిత్ర రాజము లలో కర్చుపెట్టఁ బడినది. రాజసభలు దర్బారులలో మన యభిప్రాయమునకు, మన సలహాలకు కొంత గౌరవమున్నది."

"అట్లయిన మనము చక్రవర్తికి చెల్లవలసిన కప్పము అమ్మకము వల్లనే గాని రాదని సలహా యిచ్చి ఆసలహాకు తోడుగా కొంతలంచముగూడ మన మిచ్చినామా?"

"ఆహా, యిచ్చినాము."

"వీరనగరసంస్థాన మస్మత్ హస్తగతమైనయెడల మన కేమి లాభము?"

"మనముక్రమముగా మనకు తీసుకొనవచ్చును. మీామహామహోన్నతగారితలంపదే"

అనవుడు శిరీషుడు లేచి మంచిగాలి పీల్చుకొనుటకును గొంచె మాలోచించుకొనుటకును బయటికి వెళ్లెను. తనకుఁ దెలియకుండ నింతకాలము గప్పిపుచ్చిన రహస్యమంతయు నతనికి నాఁడు స్పష్టముగాఁ దెలిసెను. మాయలమారియు, టక్కరియునైన గోకులదాసుఁ డనేక సంవత్సరములనుండి వీరనగరము నాశనము చేయుటకై కుట్రలు పన్నెను. రైతులు కట్టుగట్టి పన్ను లెగఁబెట్టునట్లు బురికొల్పు మని యా సంస్థానమునకు మనుష్యుల నంపెను. వేలము త్వరగాఁ గావలెనని కానింగోయొక్క కచేరిలో రహస్యముగాఁ బనిచేసెను. ఆసంస్థానమును గాని దేవీపురమును కతఁడు కలుపఁ దలఁచెను. పొరబాటు లేశమైన లేకుండ నెంతో నేర్పుతోఁ దానుపన్నిన వ్యూహములోనికి నవకుమారుని లాగుకొని పోయెను.

ఇఁక నొక గడియైన నాలస్యము చేయుటకు వీలులేదు. వేలము నెలలోపుగా జరుగును. శిరీషుడు మధురనుండి తిరిగి వచ్చునప్పటికి వీరనగర దేవీపుర సంస్థానములు రెండును దన యధీనమగును. ఆమాయలమారి నిపుణతవల్లనే శిరీషున కంత గొప్పదశ పట్టినది ఆనిపుణతవల్లనే యింకను గొప్పయదృష్టము పట్టనున్నది. సంస్థానము గొప్పదికానున్నది.

ఇవి యన్నియు నాలోచించుకొని శిరీషుడు వాని స్వతంత్రములు సహియించుకొన్నను దేవీపురమును చిరకాలమునుండి కొలుచుచున్న యా వృద్ధసేవకుని తెలివి తేటకు మాత్రము మక్కువపడెను. అతని నలువది సంవత్సరముల యనుభవము, నతని పన్నిన వివిధతంత్రములు, నతని గంభీరభావము, నతని నిశ్చలవిజయములు దలంచుకొని శిరీషుం డాశ్చర్యమొందెను. గోకులదాసుని తంత్రములు చెడ్డవైనను నతం డందులో స్వలాభమపేక్షింప లేదనిమాత్ర మతడు తెలిసికొనెను. స్వప్రయోజనము లేక యతడు దేవీపురపు మేలుగోరియే పనిచేసినట్లు వెల్లడియయ్యెను. కుక్కవలె నతడు యజమానుని యెడ విశ్వాసము గలిగి పనిచేసెనని తెల్లమయ్యెను.

ఆ జమీందారీ యువకుడు వసారాలో నరగంటసేపు పచారుచేసి మరల గదిలోనికి వచ్చెను.

యజమానుని యాలోచనల కంతరాయము గల్పించుట కిష్టము లేక కాగితములు చూచుకొనుచు లోపలనే కూర్చుండి యతడు రాగానే లేచి నిలువబడెను.

“గోకులదాసుడా! నాకోసము నీవింత సేపు కనిపెట్టుకొని యుండు నట్లు చేసినందుకు నన్ను క్షమింపుము. నేను సంస్థానమునకు క్రొత్త వాడను గనుక, కార్యనిశ్చయము చేసికొనకమునుపు కొంచె మాలోచించుకొనవలసి యుండును.”

“నాకాలము నా యజమానునిదే. మీపని నిమిత్తము నేనెక్కడ తెల్లవారునదాక కూర్చుండగలను” అని గోకులదాసు డనెను.

“నీవు గొప్ప కార్యమును సాధింపవలెనని యెంతో శ్రమపడి యుంటివి. నీ వెఱుంగనిది లేదు. కనుక నీరసగర మెంతకప్పమునకు బకాయి పడియున్నదో చెప్పుము?”

“అయ్యా! ఎన్నో యేండ్లనుండి బకాయి పడినది. దాదాపుగా

లక్షరూపాయ లున్నది."

"కొనుక్కొనుటకు మనము వెళ్లిన పక్షమున, రాజమహాలు ఖజానాలో లక్షరూపాయలు మనము చెల్లింపవలెను గదా?"

"అంతేగాదు. మఱికొంత యెక్కువగూడ చెల్లింపవలెను. ఒక గొప్ప సంస్థానము మఱియొక సంస్థానమునకు చులకనగా జేయునా? చాల సొమ్ము ఖర్చుపెట్టవలెను. రెండుమూడు లక్షలు రూపాయలు ఖర్చగును. వీరనగరమంత విలువగలదే."

"మన ఖజానాలో అంత సొమ్మున్నదా?"

"నన్ను నమ్మియుండుడు. సొమ్ముకేమి! మన ఖజానా నిండుగా నున్నది. పయిగా లోకములో మనకు పరపతున్నది. షావుకారులు వడ్డీ వ్యాపారమువల్ల తెగబలిసి యున్నారు. దేవీపురసంస్థానము హామీ యిచ్చిన పక్షమున మనకు సంచులు గుమ్మరించి బదులియ్యగలరు."

"షావుకారులతో బేరమాడుటకు వ్యవధి యున్నదా?"

"అయ్యా! బేరమిదివఱకే కూడితిని. మనకు కావలసినంత సొమ్ము బదులియ్యవలసినదని, వారు రాజమహాలులోని కొఠీలకు వ్రాసిరి. నేను తిరిగి వచ్చిన తరువాత వారికి సొమ్ము తిరిగి యిచ్చెదను."

"నీశక్తి యద్భుతమయ్యా! నీ దూరదృష్టి నిష్కళంకమైనది. నీ యేర్పాటులు ప్రశస్తమైనవి! చేయవలసిన దంతయు ముందే చేసితివే?"

"ప్రభువుగారి సెలవొక్కటే తరువాయిగాని, తక్కిన పనియంతయు జరిగినది. మీ సెలవుగూడ రాజమహాలులో పుచ్చుకొందలంచుకొన్నాను. నా తంత్రములన్నియు మీకు దెలిసినవి గనుక మీరు సమ్మతించిరని నమ్ముచున్నాను."

"మన ఖజానానుండియే పూర్తిగా మనము సొమ్మిచ్చివేయవలెనని,

నాకోరిక." అని ప్రతిమాట తూచినట్లు సరిగా బలికెను.

"ప్రభూ! శిరీషుఁడా! అది నే నెఱుఁగుదును. ఎఱుఁగుదును. మిమ్ము నేను చిన్నప్పు డెఱుఁగుదును. పెద్దవారైన పిదప నెఱుఁగుదును. ఏండ్లకు చిన్నవారైనను మీరు బుద్ధిలో పెద్దలు."

గోకులదాసుఁడు సాధారణముగా నోరుజారి మాట విడుచువాఁడు కాఁడు. కాని, యీసమయమున నతని కపరిమితసంతోషము గలుగుటచే దానిం దాఁచిపెట్ట లేకపోయెను.

గోకులదాసుని పలుకులు ముగిసినక పిమ్మట శిరీషుఁడు తిరిగి యిట్లు చెప్పసాగెను: "వేల మూపివేయుటకు మీనగరము ఒకాయియంతము, మన ఖజానాలోనుండి సున్నమే చెల్లింపవలెను నాకోరిక. అతని తాతగారి సంస్థానము నరేంద్రనాథున కిచ్చివేయ వలెనని నాతలంపు."

ఆమాటలు వినఁగానే గోకులదాసు చెప్పరానంత తత్తరపాటును భయమును బొందెను. తన సంస్థానమును గాపాడుకొనుటను నరేంద్రుని తాత దయ్యమై గీపము మిణుకు మిణుకు మనుచున్న యాతనిలోనికి వచ్చినను గోకులున కంతభయముండదు. చిఱున వ్యాకులతఁ జెందెను. ఆగ్రహమేఘము మతని కనుబొమ్మమీఁదఁ గ్రమ్మెను. అదివఱ కెన్నఁడు లేనంత నలుపు వాని మొగమున గనఁబడెను. అది క్షణమాత్రమే యుండెను. గోకులదాసుఁడు మొగము మఱచేతితో రాచికొని యిట్లు పలికెను——

"నరేంద్రుఁడు ప్రాణములకైన లెక్క సేయక మహాశౌర్యముతో తొమ్మిది సంవత్సరములు చక్రవర్తిని కొలిచినాఁడు. అందుచే పాదుషా యతనికి గొప్ప జాగీరు నేదైన తిప్పక యిచ్చును. అది కారణముగా నతఁడీ చిన్నసంస్థానమున కాశపడి రాఁడు."

"నరేంద్రుని తత్త్వము నేనెఱుఁగుదును. హిందూస్థానములో నెక్కడ నెంతసంస్థాన మతనికి వచ్చినను, తాతగారి సంస్థానము నేలు

కొన్నంత యానంద మతఁడు పొందఁడు."

"ఈతొమ్మిదేండ్లనుండి యతఁడు తాతగారి సంస్థానమును గురించి లేశమైన కనుఁగొనలేదు. సరే, వీరనగరమునకు కెళ్ళుటకు రాఁదలఁచు కొనలేదు. అందు కేవో కారణము లుండవచ్చును."

"గోకులదాసా! స్పష్టముగాఁ జెప్పు? ఇది సనుస్యలకు సమయము గాదు."

"సరే. దేవరవారి మనస్సునకు నొప్పి గలుగునేమో యని భయ మున్నది. కానిచో స్పష్టముగానే చెప్పఁగలను. మీసెలవైనది గనుక చెప్పెదను. చిన్నప్పు డతఁడు హేమంతను పెండ్లాడవలెనని కోరెను. ఆమెతనకు దక్కనందున నుకల నతఁడు వీరనగరము రానిచ్ఛగిం పఁడు. తాను పెండ్లాడఁ దలఁచిన కన్యను గలుసుకొనుట కతని కిష్ట ముండదు. లేదా నూమె పెండ్లాడిన వాని మొగము జూచుటకుగూడ నతనికి మనసొప్పదు. నిండు ప్రాయములో నున్న వారి జీవితములలో నిట్టివి తరచుగా జరుగుచుండును."

ఇది సావమానకరమైన మాట, అయినను గోకులదాసుఁ డావిష యముఁ బోరాడఁ దలఁచుకొనుటచే మొత్తదనము వదలిపెట్టెను. తన యజమానుని బొడిచి చంపఁదలసి వచ్చినను జంకక యతఁడు వీరనగర సంస్థానమును గలఁపఁ దలఁచెను.

శిరీషుని మొగము కోపముతోఁ గొంత జేవురించినను నెమ్మదిగ నిట్లనియె—"చిన్నపిల్లగా నున్నప్పు డామె నాతఁడు పెండ్లియాడఁ దలఁచినను ఇప్పుడు నాభార్య యతని నెట్లు సన్మానింపవలయునో మె లఁగును. ఆసి మర్యాద లెఱుఁగనిదిగాదు. మా గృహకృత్యములలో నీసలహా నాకక్కఱలేదు. చెప్పఁదలఁచిన యెడల సంస్థాన వ్యవహార ములలో సలహాచెప్పు?"

"ఇతర కారణములు చర్చింపవలసిన యవసరము లేదు. నరేంద్రుఁడు

బ్రతికియున్నాఁడో లేదో మాకు తెలియదు. అతఁడు జ్వరపీడితుఁడై సంధిచేత నొడలు తెలియక ఆస్పత్రిగృహములోఁ బడియున్నాఁడనియు, రాజవైద్యులు వాని స్థితిజూచి యాశలేదని చెప్పినారనియు నాకు మొన్న మొన్ననే తెలిసెను."

అని వినఁగానె లక్ష్మి కన్నులనుండి యొకటి రెండు బాష్పబిందువులు విడిచి మరల నెప్పటియట్లె నెమ్మదిగా నిట్లనియె:

"చిన్ననాఁడే యన్నికష్టము లనుభవించి సంస్థానమును గోలుపోయిన యా చిన్నవానికి భగవంతుఁడు తోడుపడుఁగాక! యుద్ధములోఁ దగిలిన గాయములచేత నతఁడు మృతినొందినను—అతని వంశమువారే సంస్థానమునకు వారసులుగాని—జీవించినను జమీందారుఁడు కాఁడు."

"వీరనగరమును తన సంస్థానమునకుఁ గలుపుకొనవలెనని పూర్వప్రభువుగారి కోరిక; క్రొత్తప్రభువుగారును ప్రాతప్రభువుగారి కడపటి కోరికను నిరాకరింపక నెరవేర్చునేమో మాకుఁ దెలియదుగా."

"గోకులదాసా! నాయనగారి ప్రాణము విడుచుచుండఁగా నీవు ప్రక్క యున్నప్పుడు ఆయన చెప్పినపలుకులు యేమైనఁ గలవా? వచ్చి యాయనను నీవు చూచితివా?"

"అయ్యా, చూచితిని. నడివయస్సులోనే యాయన సుఖము విడిచి పోవుటచేత నాగుండె పగిలిపోయినది."

"అప్పు డాయన నీతో వీరనగరమును గురించి మాటాడెనా?"

"లేదు. అతని యాలోచనలు పైకి తిరిగినవి; కడపటి దినములలో నాయన పరమేశ్వరధ్యానములోనే మగ్నుఁడై యుండెను."

"భగవధ్ధ్యానము చేయుచున్న యాచరమావస్థలో తలిదండ్రులు లేని పిల్లవాని సంస్థానము నపహరింపవలెనను తలంపు సంతోషదాయకముగా నుండునని నీ యభిప్రాయమా?"

"అయ్యా! నేను పాపాత్ముఁడను. నాపూర్వప్రభువుగారు మరణ

నను మును నేనుకొన్నానో నాకు తెలియదు. కాని యావజ్జీవ మాయన యేమి యాలోచించినో అదే మీకు చెప్పినాను."

"గోకులదాసా! మరణకాలమున ఆయన యేమనుకొన్నారో చెప్పెద విను. ఆతఁడు మృతినొందుటకు పూర్వదినమున సాయంకాలమున మాయత్తగారాయన ప్రక్కను గూర్చుండి యేడ్చి పిదప దైవప్రార్థనలు చేసెను. ఆమెతో గలిసి యాయన గూడ ప్రార్థించెను. తడఁబడుచున్న యాతని పెదవులనుండి దేశాంతరములలోనున్న నరేంద్రునిమాట మెల్లగా వచ్చెను. అతని కాయన యుపకారము చేసియున్న పక్షమున మరణసమయమున పశ్చాత్తప్తుఁ డయ్యెను. అయ్యా, చచ్చిపోవునప్పుడు నామనస్సునకు విచారము గలిగించు పని నేను చేయను."

ఈవిధముగా వారి కిద్దరికి యుద్ధము ముగిసెను. శిరీషుఁడు అత్తగారి యాయుధాగారమునుండి యాయుధము సంపాదించి ప్రయోగించెను. ఆయాయుధమును గోకులదాసుఁడు ప్రతిఘటింపఁజాలకపోయి తనలో నిట్లు విచారించెను: ఆ యాఁడుదే చివరకు గెల్చి వీరనగరమును గాపాడినది. నే నోడిపోతిని. అటువంటి యాఁడుదానితో కలహము పెట్టుకొనుట నిష్ప్రయోజనమని నలువదియేండ్ల క్రిందటనే నేను తెలిసికొన్న నెంతో బాగుండును!"

"గోకులదాసా! ఊరకున్నావేమి? నేను చెప్పినదే సరి యందువా?"

"అయ్యా! మీ నిర్ణయము సరియైనదో కాదో చెప్పుటకు నేను చాలను. నాతల నెఱసియున్నంతకు నాకున్న తెలివితేటలనుబట్టి నేను వ్యవహరించితిని. నేను పెద్దవాఁడను. ఇఁక మీ కొలువునకు పనికి రాకపోవచ్చును. అందుచే కడపటిదినములు సుఖముగాఁ గడపుకొనుటకు పనిలోనుండి తొలగించి నాకు సెలవిండు."

“నీవు మా కుపయోగింపవని అంతేమాట నే నడుగఁగలను. నేను మిత్రుఁడువలె నీ సాయమునుగోరి నీకడకు వచ్చితిని. నీవు నాతో రాజ మహాలుపట్టణమునకు రా. నీవనగరపుబంగాళాయి నీవక్కడ నుల్లసించుము. వేమక్కడను పూర్తిగా చెల్లిపోవును గనుక కాసంగో, ఢిల్లీనగరమును నరేంద్రున కిచ్చివేయవలసినదని నీ కుత్తరువు నొసంగెదను. నేను దేశ ములో లేనప్పుడు తిరిగి వచ్చువఱకు నీవనగర దేవీపురసంస్థానముల వ్యవహారములు నీవే చూడవలయును. కృతజ్ఞత గల సేవకుఁడవు గనుక ఇవన్నియుఁ జేసెదనని నీవు నాకు మాట నిచ్చెదవా ?”

గోకులదాసుఁ డూరకుండెను. ఋణానుబంధము పన్నిన మహాతంత్ర ములు, పడినబాధలు క్షణములో సూర్యోదయమున మంచువలె నదృశ్యములయ్యెను. దేవీపురముయొక్క యభ్యున్నతికై దాను పన్నిన తంత్రము లన్నియుఁ గూలిపోయెను. సాహసాస్యు లెప్పుడుఁ దెలిసికొన లేని యొకానొక మనోవేదన యతని కప్పుడు గలిగెను. అదివఱ కెన్నఁడు నెవ్వరుఁ జూడని బాష్పబిందువులు కన్నులం బొడమి యెండి పోయిన యతని చెక్కులనుండి దిగజాఱెను.

“గోకులదాసా! పలుకవేమి? చాల రాత్రియైనది. ఈ కుటుం బమునకు కష్టములలోను సుఖములలోను గూడ నీవంటికృతజ్ఞుఁడు, నీవంటిమిత్రుఁడు మఱియొకఁడు లేఁడు. నాకీ లోకమున నీవలె సాయము చేసినవారు మఱొకరు లేరు. నీమాటకంటె మఱొకరి మాట మీఁద నాకు విశ్వాసములేదు. నీమైత్రియందు, నీసాయమునందు నున్నంత నమ్మకము మఱొకరియందు లేదు. ఉత్తరము చెప్పు! మనము బ్రతికున్నంతకాలము పరస్పరవిశ్వాసము గలిగియుందము. చచ్చిపోయిన ఆయనకు నీ వెట్లుంటివో నాకు నట్లే యుండగలవు.”

“మహాప్రభో! తన సంకల్పము లన్నియు భగ్నమైపోవుదినము, తన ప్రయత్నములు నిష్ఫలమైపోవుదినము వచ్చునని నే నెన్నఁడు

కలలోనైన తలంచలేదు. నేనిప్పుడు నా ప్రభువుగారి తత్వము తెలిసి కొంటిని. తన పితృపితామహులు వంశపరంపరగా నీ రాజకుటుంబమును గొలిచి బ్రతికిగో యీకుటుంబమునకు గోకులదాసుఁ డెన్నడు కృతఘ్నుఁడు గాఁడు. నేను మీయిష్టప్రకారము చేసెదను. దేవుఁడు నా మీఁద దయయుంచుఁగాత !"

"గోకుల దాసా! మన కృత్యములయందు మనకు భగవంతుఁడు తోడ్పడవలెను. మనము చేయవలసిన పనియొకటి యున్నది."

అని శిరీషుఁడు వృద్ధసేవకుని గౌఁగిలించుకొని యాగది విడచి పోయెను. గోకులదాసుఁడు నిద్రరాక యొక్కఁడే దీపము లారిపోవు వఱకు, తెల్లవారి వెలుతురు లోపలికివచ్చి నెఱసిన యాతని తల మీఁదను, విచారములతో నిండిన యాతని మొగముమీఁదను బడు వఱకును నక్కడే కూర్చుండెను.

## ౨౪

బంగాళమునుండి కాశికిని, నచటినుండి మధురకును బూర్వకాలమున యాత్ర సేయుట, నేఁటి కాలమునఁ గలకత్తానుండి యుత్తరధ్రువము నకుఁగాని, న్యూయార్కు పట్టణమునకు గాని యోడల మీఁద బయనము సేయుటకంటె నెక్కుడు చిత్రకథలతోడను, నొకప్పుడు ప్రమాదములతోడను గూడి యుండును. మార్గమధ్యమందుఁ దగిలెడు ప్రతిక్రొత్త పట్టణమున నేదో చూడఁదగినవి యుండెను. ప్రతి దేవా లయమునఁ బూజలు చేయవలసి యుండెను. పుణ్యానదులలోఁ బ్రతి యేఁడు జరుగు తిరుణాళ్లలో దేశములో నుండు జాతుల వారందఱుఁ గలిసికొందురు. తమ పల్లెల నెన్నడు విడిచియెఱుఁగని యంగనలు సైతము తీర్థయాత్రలకుఁ బోయినప్పుడు కాలినడకనో, పడవమీఁదనో,

యెద్దుబండి మీఁదనో, పయనము సేయుచును. ఆ యాత్రలలో మహారణ్యములుదాఁటి, కొండలెక్కి, నదీ, నదంబులను లుత్తరించి, పట్టణములుజూచి హిందూస్థానము నంతయుఁ జుట్టివచ్చెను. తీర్థయాత్రలు ముగించి స్వగ్రామమునకు వచ్చినపిదప నాఁడు తాఁజూచిన బహు దేశముల యొక్కయు, బహుజాతుల యొక్కయుఁ జిత్రకథలను శ్రోతలు చెవులు దొరఁబెట్టి వినునట్లు చమత్కారముగాఁ జెప్పుదురు.

దేవీపురమునకు మరల రాఁగలచుకొనని నవకుమారుని భార్య తీర్థయాత్రకై బయలుదేరెను. ప్రతి హిందూ పడఁతియు దేశము లోని పుణ్యక్షేత్రముల దర్శింపఁగోరును గనుక నామెతోఁగూడ యాత్రలుచేసి తరించుటకుఁ జాలమంది స్త్రీలు వెళ్ళిరి. వారి ఖర్చు లన్నియు నామెయే భరించెను. హేమలతయు, శైవలినియుఁ గూడఁ గొందఱు స్త్రీలను వెంటఁదీసుకొని పోయిరి. కొంత పరివారముతో శిరీషుఁడును, గోకులదాసుఁడును వారివెంటఁ జనిరి.

గంగా తీరమునకు మెట్టదారినే వారు పోయిరి. దేవీపురపు జనానా స్త్రీలు గవిసెనలువేసిన పల్లకు లెక్కిరి. కొందఱు కాలినడకను జనిరి. కొంద ఱెద్దు బండ్లెక్కిరి. వారందఱు గంగానదిదాఁటి రాజమహాలుజేరి యక్కడఁ బెక్కుదినము లుండిరి.

శిరీషునకు, గోకులదాసునకుఁ జాలపని యుండెను. కార్యసిద్ధిలో వారనుకొన్న దానికంటె నెక్కువ విఘ్న సంభవించెను. బంగాళా దేశపు కానంగో పన్ను చెల్లింపని సంస్థానమును విక్రయింపఁ గలఁడు గాని, పాదుషా సెలవులేకుండా నమలుదారుని దీసివేయఁ జాలఁడు. అప్పుడు బంగాళమునకు రాజధానియైన యా పట్టణములోని పెద్దపెద్ద యింగళ్లను, దర్శనీయములయిన స్థానములను జూచుచు స్త్రీలు కాలముగడపిరి. అది హిందూస్థానమునకెల్ల రాజధానియైన యాగ్రా నగరమునకుఁ బ్రతిబింబము. రాజమహాలు కోట గంగానదిలోఁ బ్రతి

బింబించెను. దేవాలయములు, మసీదులు మిక్కిలి యున్నతములై శిఖరములతో నాకసము నొరయుచుండెను. పెద్దబజారు హిందూస్థానముయొక్క నానాభాగములనుండి వచ్చిన బేహారులతో నిండియుండెను. అంగళ్లలో అమ్మకము నిమిత్తము పలుతావులనుండి వచ్చిన సరకులను దేవీపుర స్త్రీలు సంతోషముతోఁ జూచిరి.

గోకులదాసుఁడు తొల్లి యెన్నోసారులు జూచుటచే నతనికి రాజమహాలులోఁ జాలమంది మిత్రులుండిరి. శిరీషుఁ డిప్పుడు దేవీపురపు జమీందారుఁ డగుటచే నాపుర నివాసులలో ముఖ్యులనేకు లాయునను గౌరవించిరి. స్త్రీలను గూడ ననేకు లాహ్వానించిరి. నవశివహాయుని భార్య యాస్థలములం జూడఁబోవక దేవాలయములోనే కాలము గడుపఁజొచ్చెను. హేమలత మాత్రము పలుతావులు సందర్శించెను. చిన్నగ్రామమునుండి పెద్దపట్టణమునకు వచ్చిన యంగనకు సమస్తము క్రొత్తగానే యుండును అంతయుఁ గ్రొత్త యనుభవమే.

ఆమెకొక చోటినుండి యాహ్వానముపచ్చెను. అది యామె మానస్సునకుఁ గలఁత గలిగించెను. అది యొక మహమ్మదీయ జాగీరుదారుని భార్యవద్దనుండి వచ్చెను. ఆమె మస్లిములు కాపురముండు వీథులలో బసచేసెను. ఆమె భర్త రాజమహాలు కచేరిలోఁ బనిగలిగివచ్చెను. ఆగ్రానగరమునుండి యానడుమనే తానక్కడకు వచ్చినట్లును, నాగ్రానగరమునకుఁ బోవుచున్న దేవీపురపు జమీందారుని భార్యను దాను జూడఁదలఁచుకొన్నట్లును జెప్పుమని యా మహమ్మదీయ స్త్రీ వర్తమానమంపెను. అదిగాక యాగ్రాలోనుండిన వీరనగరపు జమీందారుని గుఱించి వార్తలు కొన్ని తాను జెప్పఁదలచుకొన్నట్లు గూడ నామె వర్తమానమున సూచించెను. ఆ సూచన వినఁ గానే హేమలత గుండెలు కొట్టుకొనెను. చిరకాలము క్రిందట విడిపోయిన మిత్రుని కొఱకుఁ గన్నులనుండి బాష్పబిందువులు స్రవించెను. ఆమె వెంటనే భర్తకడకుఁ

బోయి యతని సలహా నడిగెను.

"ప్రియురాలా! పోయి చూచిరమ్ము. ఆమె గొప్ప బేగము. ఆవిడ భర్త బంగాళాదేశపు జాగీరుదారులలో నెల్ల గొప్పవాఁడు; శూర శిఖామణి. వెళ్లిచూచి, ఆమె యేమైన యెఱిగియున్న పక్షమున, నరేంద్రుని వార్తలు చెప్పుమని నొక్కి యడుగుము. దూరస్థుఁడైన మన మిత్రునిగుఱించి భయంకరమైన వార్తలు వినిపించుటకు గోకులదాసుఁ డెంతో కుతూహల పడుచున్నాఁడు. నరేంద్రుఁడు సుఖముగానున్న వార్తలు నేను వినఁగోరుచున్నాను. హేమలతా! మన మిత్రుఁడు సుఖియైయున్న పక్షమున నీకునన్నునకు సంతోషము గలుగదా?"

"కలుగకేమి. తప్పక గలుగును."

"అట్లయిన నీవు పోయి నరేంద్రుని వార్తలు తెలిసికొనిరమ్ము. నేనును శూరుఁడైన షేరాఫ్ఘనుని గలసికొని యాగ్రానుండి వార్త లేమైనఁ దెచ్చినాఁడేమో యడిగెదను."

సమావేశమునకు నిర్ణయింపబడిన దినమున హేమలత వెళ్లెను. ఆమె పల్లకి స్త్రీలు వసియించునట్టి యభ్యంతరమందిరమునకుఁ దీసికొని పోఁబడెను. దేవీపురపురాణి నెదుర్కొని, బహురత్నభూషణములను, ముత్యాలహారములను ధరించి లోకైకసుందరి మెహెరున్నీసా సన్మానించెను.

సాయంకాలమగుటచే దీపములు పెట్టిరి. ఆ గది నిలువుటద్దముల తోను, బొమ్మలతోను, చక్కని తెరలతోను నిండి నేత్రపర్వము చేయు చుండెను. స్త్రీజాతి కెల్ల నలంకారమై సొగసులకుఁ దావలమైన యా మెహెరున్నీసా పూర్తిగా జరీతో నేసిన యొక గుడ్డ పఱచిన పీఠముమీఁద హేమలతను గూర్చుండఁబెట్టి, యటువంటి యాసనము మీఁదనే తానును గూర్చుండెను. ఆమె నీలనేత్రములు మెఱసెను. చక్కనివంటి యామె పెదవులు చిఱునవ్వులతోఁ జెలఁగుచుండెను.

నిరుపమానమాధుర్యసౌందర్యములకు నిలయమైన నూర్జహాన్ బేగమును జూడఁ జూడ, స్ఫటికపు వంటి యామె నెమ్మొమున నెంతో భావ గాంభీర్యమును, నెంతో తీవిని మేమంత కనిపెట్టెను.

"అక్కా! నీవు నన్నెంతో గౌరవించితివి. నీవు నన్ను సందర్శింప వచ్చుటచే నేను ధన్యురాలను. దేవీపుర రాజకుటుంబమును గురించియు, వారి క్రొత్త ప్రభువును గురించియు నేను విశేషముగ విన్నాను. శృంగారవతియైన యాతని భార్యను జూడకుండ నేనీయూరు విడిచి పోవలచుకోలేదు. సౌందర్యస్త్రీలు సాధారణముగా నెన్నఁడు జూచుటకు రారు. అమ్మా! నీలో నెంత చక్కదనమున్నదో యంత దయ యున్నది."

"బేగంసాహెబా! అట్లు గాదు. మీరాహ్వానించుటచేత నాకు గౌరవము కలిగినది. నాభర్తగారు గొప్పవారైన మీ భర్తగారిని గురించి విన్నారు. ఆయనకంటె గొప్పవారుఁ డీ దేశమున లేఁడు. అట్టివారి బేగమును గలసికొనుట నా యదృష్టము."

"అమ్మా! నీ చూపు లెంతమధురములో నీమాటలు నంత మధుర ములే. చక్కనికన్నులు, మధురస్వరము గల యంగ నామణులకు బంగాళాదేశము నిలయము. అక్కా! గొప్పదానవు గొప్పదానవని నన్ననకుము; నన్ను నీసోదరిగాను, సఖిగాను ఎంచి యట్లె పిలువుము"

"అక్కా! బేగముసాహెబా! మీరు దయగలవారు; గర్వము లేనివారు. మీయున్నతస్థితికి నీగుణము వన్నె పెట్టుచున్నది."

"మాకున్న యున్నతస్థితేమిటి? ఈ దేశములో మేము క్రొత్త వారము. నీభర్తవంటి బలము, పలుకుబడి, మంచిభావముగలస్నేహితులు నాభర్తగారికి కావలెను. నాభర్తగారు చెడిపోవలెనని యెందఱో కోరుచుందురు; నేనుతురకదానైనను ఎన్నోసుగుణములుగల నీవంటి

హిందూస్త్రీ నాసఖియని గర్వముతో చెప్పుకొందును."

మోహనసున్నీసాయొక్క వచోమాధుర్యమును, నామె యంతఃకరణ శుద్ధియు హేమలత హృదయమును గరగించెను. కొన్ని నిముషములలోనే హేమలత తొట్రుపాటు విడచి నెమ్మది గలిగి చిరకాలమునుండి యెఱిఁగిన చెలికత్తెతో ముచ్చటించినట్లు నామెతోఁ బ్రసంగింపఁ జొచ్చెను.

"అక్కా! దేవీపురములోనున్న మీయింటిని గుఱించియు, మీ దేశపు జనుల గుఱించియు నాకుఁ గొంత వృత్తాంతము జెప్పుము."

"అక్కా! మాకుటుంబ మిప్పుడు దుఃఖమగ్నమైయున్నది. ఏలనఁగన, ఆ సంస్థానాధిపతియైన మాతండ్రి కొన్ని వారముల క్రిందటనె మృతినొందెను. మాతల్లి జీవితశేషమును విరాగిణియై గడపుటకు మధురకుఁ బోవుచున్నది. ఆమె నక్కడ స్థిరపఱిచి మేము తిరిగి వచ్చెదము."

"అట్లే నేనును బానిసస్త్రీలవలన విన్నాను. మీ నాయనగారికి పుత్రసంతతి లేదఁట. అందుచే సంస్థానము నీభర్తకు సంక్రమించెనఁట."

"అక్కా! అలాగె. ఆయనగూడ దేవీపురకుటుంబమునకు దూరపు చుట్టము. మాతండ్రి యాయనను పెంచుకొనవలెనని కొన్నాళ్ళు యోచన పడెను. పుత్రసంతతి లేనివారు పెంచుకొనుట మాలో నాచారము. కాని, మాయమ్మకు నామీఁద మిక్కిలి ప్రేమ; అందుచేత నన్నాతను వదలదలఁచుకొనక యాయనకిచ్చి పెండ్లిచేసెను."

"అక్కా! నీవెంత చక్కఁగాఁ బలుకుచున్నావమ్మా, నీ మాటలలోనే నీ యమాయకత్వమంతయుఁ గనఁబడుచున్నది. నీవు ఆ గర్భశ్రీమంతురాలవు. యోగ్యుని చెట్టబట్టితివి. కనుక నీకు సర్వసుఖములు గలుగుఁగాక! నీకేకష్టములు లేవు. నావలె దూరప్రయాణములు లేవు."

"అక్కా! కాను కాను. నాకు కష్టములు కలిగినవి. ప్రయాణములు కలిగినవి. ఆఫ్ఘనులకు, మొగలాయీలకు వచ్చిన యుద్ధములలో మాతండ్రి కొన్నియేండ్లపాటు సంస్థానమును గోల్పోయి దేశాటనము జేసెను ఆదినములలోనే నేను పుట్టితిని. నేను రెండేండ్ల పిల్లనైనప్పుడు మేము వీరనగరము వచ్చితిమి."

"ఓహో! వీరనగరమా నీవున్నది? ఆ సంస్థానమును గూర్చి కూడ విన్నాను—బహుశః నాబాలసపిల్లలవల్ల ఆ సంస్థానము దేవీపురమునకుం జాల దూరమా?"

"అవి యిరుగుపొరుగు సంస్థానములే, కాని యెన్నోతరములనుండి వాటికి మాత్సర్యము గలదు. అందుచే నవి స్పర్ధలు, యుద్ధములు గలిగి సంబంధము లేక యుండినవి."

"అక్కా! అప్పుడప్పుడు వివాహసంబంధములచేత ఈ సంస్థానములు నడుమ నడుమ కలిసినవి కావా?" అని చిఱునవ్వుతో బేగమనెను.

"అక్కా! మా బానిసలు మీకు సరియైన వార్తలే తెలుపుదురు. మీరు చెప్పినది నిజమె."

"అక్కా! నా బానిసలు నట్టి మొద్దులు. నేనిక్కడికి రాకమునుపు ఈ దేశమును గురించియు, ఇక్కడి జమీందారులను గురించియుం గొంత తెలిసికోవలెనని ప్రయత్నించితిని. నీవు వీరనగరములో నెందుకుంటివో, యెంతకాలముంటివో చెప్పుము?"

"అక్కా! మా తండ్రి సంస్థానము గోలుపోయెనని యిదివఱకే చెప్పితిని గదా! అనంతరము వీరనగరపు వారసుడు చిన్నవాడగుటచే దాని కమలుదారుడుగా చక్రవర్తి మాతండ్రిని నియమించెను. మాతండ్రికి దేవీపుర సంస్థానము మరల వచ్చువఱకు పది పదకొండు సంవత్సరములు మేమక్కడనే యుంటిమి."

"అక్కా! యిప్పుడు తెలిసినది. వీరనగరపు వారసుఁడిప్పుడు యుక్తవయస్కుఁడై సంస్థానము నేలుచున్నాఁడు గదా?"

"అక్కా! లేదు లేదు. అతని చరిత్ర విచారకరమైనది. అతఁడు సంస్థానభ్రష్టుఁడై దేశాంతరముల కేగినాఁడు. యుద్ధములో గాయపడినందున ఆగ్రాకు తీసికొని వెళ్ళినారట. అక్కా! ఆగ్రాలో మీ కతని సంగతి కొంచెము తెలిసి యుండవచ్చును." అని చెప్పుచుండ హేమలత నేత్రములనుండి యెంత యాపుకొన్నను నాఁగక బాష్పములు జారెను.

అతని పేరు ?

"అతని పేరు నరేంద్రనాథుఁడు."

అప్పటికి గదిలోని దీపములు వెలుఁగు కొంచెము తగ్గెను. హెచ్చు చేయుట ఇద్దరి కిష్టములేదు. హేమలత ముఖము చిన్నబోయెను. ఆ పారసీక స్త్రీ క్రిందఁ జూచుచున్నందున ముఖలక్షణము నిరూపించుటకు వీలులేదు.

కొంతసేపాగి మెహరున్నీసా యిట్లనియెను. "మేము తురక పడఁతులము గదా! మా కెప్పుడు ఘోషా యుండును. చక్రవర్తి దర్బారునకు వచ్చు పురుషులను గురించి మాకంతగాఁ దెలియదు. కాని, యతనిని గురించి కొంచెము తెలుసును. జోధుబాయిరాణిగారి వైద్యులాయనకు చికిత్స చేసిరి."

"అక్కా! బేగముసాహెబా! వారాయన జబ్బు కుదిర్చిరా? ఆయన పూర్ణారోగ్యము కలిగియున్నాఁడా?" అని యామాటలలో హేమలతయొక్క యాత్రమును బెంగయు వెల్లడియయ్యెను. ఆ లక్షణములు మెహరున్నీసా గ్రహించి యిట్లు నవ్వుచుఁ బలికెను.

"అక్కా! వీరనగరపు వారసుని విషయమున నీ కెంతో యభిమాన మున్నట్లు కనఁబడుచున్నది. రాజవైద్యులాయన జబ్బు కుదిర్చిరి.

మహాచక్రవర్తియు నాసికి స్వయముగా దర్శనమిచ్చి గౌరవించెను. దర్బారునకు వచ్చునట్టి ప్రసిద్ధ పురుషులను గురించి జనానా స్త్రీల మైనను, మేమేకో కొంచెము వినుచుందుము. అంతకంటె చక్కని జమీందారుడు ఆగ్రాదర్బారులో గూడ లేడని చూచినవాండ్రు నాతోఁ జెప్పిరి."

"ప్రియసోదరీ! ఈశుభ వర్తమానము చెప్పినందుకు పరమ దయాళువైన భగవంతుఁడు నీకు శుభములు గలుగఁజేయుఁ గాక!" అంతకన్న హేమలత యేమియు మాటాడలేకపోయెను. కన్నీరు మాటరానీయక చూపు జూడనీయక కాలువకట్టెను. స్త్రీ సహజమైన మర్యాదతో మెహరున్నీసా, యామె యవస్థ తెలియనట్లె నటించి, కన్నులర మోడ్చి హేమలతవంక నోరచూపులు చూచుచుండెను.

"అక్కా! నీమనోవేదన నడఁపఁజాలిన శుభవార్త నీకు దెలుపఁ గలిగినందుకు చాల సంతోషముగా నున్నది. నీవు విరనగరములో నున్నప్పు డీయువకుని బాగుగా నెఱుఁగుదువు గాఁబోలు?"

హేమలత మొగ మెత్తవడ సరిగా వినఁబడని స్వరముతో మెల్లగా నిట్లనియె: "ఎఱుఁగుదునమ్మా—మేము చిన్నబిడ్డల మైనప్పుడు."

"అక్కా! యిప్పుడతఁడు నిండు ప్రాయములోనున్న పురుషుఁడై నాఁడు. చక్రవర్తి దర్బారులోనున్న పురుషులందఱికంటె మిక్కిలి చక్కనివాఁడని చెప్పఁగా వింటిని. నేవిన్నది సరియో కాదో, వలు మాఱులు చూచి యెఱిఁగినదానవు, చెప్పవలెను"

"అతఁడు చక్కని పిల్లవాఁడె. చిన్నప్పుడు విడిపోయినాము. తిరిగి కలిసికో లేదు."

"అతఁడు మంచి యుత్సాహము, వీరరసము కలవాఁడు గాదా?"

"ఔను. అట్లె చెప్పుచున్నారు."

"గొప్ప వంశమునఁ బుట్టినందుకు తగిన గొప్పగుణము. దయాళు

త్వము పట్టుబడి వి.”

“ఔను. అట్టి వాఁడనే నాసమ్మకము” అని గదిలో వేఁడి యెక్కువ యై చెమట బోయుటచే హేమలత మొగము తుడుచుకొనెను.

“అట్లయిన నన్నతఁడు చిన్నప్పటినుండి యెఱుఁగు నన్నమాటే. తనునాఁడు యుద్ధములో పనిచేయుటకు నన్నువదలి వెళ్లిపోయెను గాఁబోలు? అక్కా! ఆఁడుదానికిట్టి ప్రశ్నలడుగుట సహజము. ఈప్రశ్న లడిగినందుకు క్షమింపుము.”

ఇది యడుగఁగూడని ప్రశ్నయనియు, నట్లడుగుట స్త్రీలకు సహజ లక్షణము గాదనియు హేమలతకుఁ దోఁచెను. అందుచే నామె కొంచెము సిగ్గుపడి ప్రత్యుత్తర మిచ్చెను. “బేగమిసాహెబా! అతని వంశ సంప్రదాయములను బట్టియు, మానసింగు మహారాజు నుత్తరువులఁ బట్టియు నతఁడు యోధుఁడై వెళ్ళిపోయెను.”

అనవుడు బేగము పకపక నవ్వెను. ఆనవ్వులో హేమలతకు మనోవికలత హెచ్చెను. అంతట బేగమిట్లు పలికెను: “నీవంటి చక్కని నెచ్చెలిని విడిచి, చక్రవర్తి యాజ్ఞచేతనో, మానసింగు నాజ్ఞచేతనో, యతఁడు వెళ్లినయెడల నతని మనస్సంత మంచిదిగాదని నేఁదలఁచెదను.”

హేమలత సహజముగ సుశీల, అయిన నీమాటలచేత నామె మొగమునఁ గోపము, విసుగును బొడకట్టుచుండెను. ఈ లక్షణములను బేగము తెలియనట్లు నటించి, శస్త్ర చికిత్సకుఁడు కత్తితో జాలిమాలి వ్రణమును గోసినట్లు శరశల్యములైన ప్రశ్నల నడుగసాగెను.

“అక్కా! అది తప్పుమాట. అతఁడు శూరుఁడని నేవిన్నాను. అతని మనస్సులో దయయున్నది. చిన్ననాఁటి నెచ్చెలిని మఱువలేఁడు. ఏమన నరేంద్రనాథుఁ డిప్పటికిని వివాహము చేసికొనలేదు.”

అని హేమలత తన పీఠమునుండి లేచెను. ఆమె తలతిరిగెను.

అందుచే బేగముసాహెబాకు నలాపముచేసి కంపితమైన స్వరముతో నిట్లనియె:

"అమ్మా! బేగముసాహెబా! ప్రొద్దుపోవుచున్నది. పోవుటకు నాకు సెలవిండు. మాలో మగపిల్లలు పెండ్లికూతుండ్రను వెదకికొనరు. ఆడుపిల్లలు భర్తలను స్వయముగా నేరుకొనరు. తల్లిదండ్రులే మాలో వివాహము లేర్పాటుచేయుదురు. ఈశ్వర సంకల్పవశమున మమ్మెవ్వరు పాణిగ్రహణము చేసిరో యట్టిభర్తలకు మేము విధేయులమై వారి యెడ భక్తికలిగి యుండవలసినదని మా మత ధర్మము. పతివ్రతలై సతీధర్మమును లోకములో నిర్వర్తించు స్త్రీల నారక్షను భగవంతుండు రక్షించును."

హేమలత చిట్టచివర పలికిన పలుకులు బేగమున కర్థముగాక పోలేదు. కాని మెహరున్నీసాయొక్క యాట ముగియలేదు. పిల్లిపిల్ల గాయపడిన పక్షితోఁ జెరలాట లాడినట్లామె హేమలతను బీడింపఁ జొచ్చెను.

"ప్రియమిత్రమా! దేవీపురపు రాణీ; ఒక్క నిముసము కూర్చుండుము. నీవు నాయందయగలదానవు గనుక నన్నుఁజూడవచ్చితివి. అంత త్వరలో వెళ్ళిపోకు. మీమానవ ధర్మముల నేనెఱుఁగుదును అవే మాయుత ధర్మములును. మామ్లేచ్ఛులు మగవారియొక్క స్వేచ్ఛా విహారముల నడఁపలేరు. ఏమందువు? ఏమందువు?"

అనవుడు హేమలత యిట్లనియె:—"అట్టి స్వేచ్ఛావిహార బుద్ధి పాపహేతువు. ఒకని భార్యను గుఱించి పరపురుషుఁడు తలఁచుకొనుట మహాపాతకము గాదా?"

"అక్కా! మగవాండ్రును పాపభూయిష్ఠులు కారా? తమనుండి విడిపోయి మఱి యొకరిని వివాహము చేసుకొన్న వెలఁదులను తలఁచుకొనుచుం దురు కాదా? కూడనుగాని, పరసతులైనతరువాత గూడ, కొందఱు

స్త్రీలు తమ విగ్రహములను హృదయములందు నిలుపుకొని తమకై పరితపించు పురుషులను క్షమించుచుందురు. అట్లు చేయరా?"

ఇది వట్టిదుర్న యము! దుర్నయముకన్న దుర్నయము! హేమలత చిట్టలుకతో మండిపడుచు బీరువునుండిలేచి యిట్లు బదులుచెప్పెను: "బేగముసాహెబా! మీరిట్లు మాట్లాడుదురని నేను మిమ్ము జూడ వచ్చునప్పుడు దనుకొనలేదు. మీరుచెప్పిన శుభవార్తకు నేను మీకు మిక్కిలి కృతజ్ఞురాలను. నేనింక వెళ్లెదను. సెలవిండు."

అంతట బేగముసాహెబా గంభీర స్వరముతో నిట్లనియె: "అక్కా! కూర్చుండుమమ్మా. నింకను నీకొక కథ చెప్పవలెను. ఎప్పుడైతే నేమి, యెట్లైతేనేమి. నాకన్నులతో నరేంద్రనాథుని చూచితిని. నేనెంత మందినో రాజకుమారులను, జమీందారులను చూచితిని. కాని నీచిన్ననాటి చెలికానివలె సాధుశీలము గలవానిని చూడలేదు. చిన్నతనమునందతఁడు ప్రేమించిన నెచ్చెలులు నతఁడింకను మఱచిపోలేదు."

హేమలత వడఁకి తనకు మూర్ఛవచ్చునేమోయని భయపడెను. అందుచే నామె ప్రత్యుత్తర మీయఁజాలకపోయెను.

"అమ్మా! నీపూర్వ చరిత్రమును, నరేంద్రనాథుని పూర్వచరిత్రము దెలిసికొనఁగోరి యందునీకు కొంత మనోవ్యథ గలిగించినందుకు క్షమింపుము. అక్కా! నన్ను నమ్ము. ఇట్లడుగుటకు కారణము నీగుట్టు మట్టు తెలిసికొనవలెనను తలంపుగాదు. నీమనస్సు నొప్పించవలెనను క్రూరభావముగాదు. విధికృతమున రెండు జీవితములు సమానము లైనవి."

అంతట వారూరకుండిరి. దీపముల వెలుఁగు తగ్గెను. అంత విచిత్రముగా మాటలాడిన యాసుందరి మొగము హేమలతకు సరిగా గనఁబడలేదు.

బేగము పిండియు నిట్లనియె: "హిందూస్థానమున మిక్కిలి గొప్ప

పురుషుఁ డొకఁడు వలచి మోహపడిన మఱియొక మగువను నే నెఱుఁగుదును. ఆ యంగన యిప్పుడు మఱియొకని భార్యయైనది. కాని మొదట వలచిన యా పన్నెకాఁడు నేఁడు నైతె మామె విగ్రహమును తన హృదయమునలో ముద్రితము చేసికొన్నాఁడు."

హేమలత నెల్లువఁకు లేచెను.

"అమ్మా, హిందూసోదరీ! ఇటువంటి చిత్రకథలు మహమ్మదీయుల లోను, హిందువులలోను జరిగెనవి. ఇంతకంటె రహస్యములను గ్రుచ్చి గ్రుచ్చి యడుగుట నా కిష్టములేదు. నీ మనసు నొప్పించినందుకు క్షమింపుమని వేఁడుచున్నాను. కానినీజీవితము నాకెంతో విన సొంపుగా నున్నది. నే నిప్పు డేయువతిని గుఱించి నీతో ప్రసంగించితినో — ఆయువతి జీవితము నీ జీవితమును నోలి మచ్చునఁ నున్నది. కాని, ఆమె యెవనిని వివాహము చేసికొనెనో యాయన యెడల భక్తియు, ప్రేమయుఁ గలిగి యున్నది; కాని యామె సి హాసనమును గోల్పోయెను."

పేరాష్ట్రునకు భక్తి విశ్వాసములుగల భార్యయైన మెహరున్నీసా యీ తెలుఁగున భాషించి హేమలతను బంపెను. ఈస్థితి రానియెడల నే నెట్లుందునో యని యాలోచించుకొనకుండ నెవ రుండఁగలరు? హేమలత వెళ్లిన తరువాత దీపకాంతి తగ్గిన యా గదిలోఁ గూర్చుండి యాసియా ఖండమందు మహోన్నతమైన సింహాసనము తనకు ముందు ముందు రాఁగలదని యామె కలలోనైన ననుకొన్నదా?

౨౫

బికనీరు సంస్థాన ప్రభువా! పృథివీరాజా! స్వాగతము. నీకు స్వాగతము. నీవు కవనమునకు, గాఢ విక్రమమునకు నమముగా పేరుపడితివి! మీరు నాఫేరాకు వచ్చి నన్నెంతో గౌరవించితిరి."

"కాదు. నరేంద్రనాథ! కాదు. మీరు సన్నాహ్వానించి యెంతో గౌరవించిరి. మన మీ రాత్రిమీఁద కొంతసేపు కూర్చుందము. పగలంతయు శ్రమపడి యుండుటచే నీ సాయంకాల మలయమారుత మను భవించుట నాకిష్టము. మన పని ముగిసినది. ఈ సంధి శుభముగా పరిణమింపఁ జేసినందుకు చక్రవర్తి నీ సేవను మఱచిపోఁడు."

"రాజకుమారా! ఈకీర్తి మీదే. ఈ రాజస్థానమునకు నేను క్రొత్తవాఁడను గదా. అందుచే మీ సాయము లేనియెడల నేను లేశమైన పనిచేయలేకపోదును. మీరు మన పక్షమున గట్టముగ వాదించితిరి. అనేకులు యుద్ధము యుద్ధమని గోలుసెత్తి యరచినప్పుడు సంధి శ్రేయమను మీ సలహా నెగ్గినది."

"నరేంద్రనాథ! ఔను. ఈ రాణా తండ్రిని ప్రతాపసింగును నే నెఱుఁగుదును. రాజపుత్రు లాత్మగౌరవము నిలఁబెట్టుకొనుటకు యుద్ధము చేయఁ దలఁచుచుండుటచే సంధిచేసికొమ్మని నే నాయన కెన్నఁడు సలహా యియ్యలేను. ఉన్నత చిత్తుఁడైన యట్టి ప్రతాపుని విక్రమ మెఱిఁగి, ఉమ్రావులు, మనసబుదారులు కలసి దీర్చుకొనవలసిన మొఱపెట్టినను, దేవీని యుద్ధమైన సమయమును మానెను. ప్రతాపుఁడు స్వతంత్రుఁడై యలజడిలేక మృతినొందెను. స్వాతంత్ర్యము చేకూరిన తరువాత ఆయనకొడుకు సంధి వలదనుట తెలివితక్కువ."

"చక్రవర్తి సందేశమును మనము రాణాయెదుటఁ బెట్టినప్పుడు, ఆ దర్బారులో నెందఱో మనల నెల నెగతాళి జేసిరి గదా! సూరులు కత్తి యెప్పుడు దూయవలెనో యెప్పుడు పోరవలెనో యెఱిఁగి యుండవలయును."

"నరేంద్ర! వారి శౌర్యమును గురించి సంశయింపఁ బనిలేదు. ఇరువదియేండ్లు జరిగిన యీ మహాయుద్ధములోఁ దగిలిన గాయపు మచ్చలను వారిలో నెందఱో చూపఁగలరు. అగ్రాకు, మీవారుకు ననేక

సంవత్సరముల నుండియో, శతాబ్దముల నుండియో పెరిగిన వైర మొక్కనాటిలో మఱపుగాదు గదా! ఈ సంస్థానపు శూరుల హృదయములలో చిత్తూరు పరాధీనమగుట యింకను క్రొత్త వ్రణముగా నే యున్నది."

"అక్బరుయొక్క ఉక్కుచేతినుండి చిత్తూరును విడిపింపఁగల మేటి మగఁడు హిందూ దేశములో బ్రతికియుండఁజాలఁడని యా మహాశూరు లందఱుఁ దెలిసియే యుందురు."

"కావచ్చునుగాని, మున్నూరు సంవత్సరముల క్రిందట ముస్లిములు చిత్తూరును జయించి పట్టుకొనఁగా రాజపుత్రులు దానిని మరల విడిపించిరి. మీవారు రాజపుత్రులు మునుపు గెలిచినట్లే యిప్పుడుఁగూడ గెలువవచ్చునని యాశపడుదురు."

"అందలి మంచిచెడ్డలు రాణాకే తెలుసును. చిత్తూరు మరల పట్టుకొనునాశ లడుగంటినవి. గనుక బుద్ధిమంతుఁడై సంధికి సమ్మతించెను."

"రాణా సంధికి సమ్మతించునప్పుడు గిజగిజ తన్నుకొనెను. నరేంద్ర నాథా! నీవు రహస్యము దాచలేవా?"

"అయ్యా! ఇదివఱకు రహస్యము దాఁచగలిగితిని. రాజా! ఇఁక ముందు నట్లే చేయఁగలను."

"అదియంత రహస్యమే కాదులే. రాజపుత్రులలో నది యెఱుఁగని వారు సాధారణముగా లేరు. అమరసింగు రాణా చిన్ననాఁటనుండియు యుద్ధములలోని కష్టములు చాల చూచినాఁడు. కాఁబట్టి కలహమంతే యంతయిష్టము లేదు. గౌరవమైన సంధి చేసికోవలెనని చక్రవర్తి సందేశ మంపినప్పు డతఁడు సంతోషపూర్వకముగా దాని కియ్యకొనెను. కాని యతనికొక చిన్న సందేహమున్నది."

"తన తండ్రియొక్క మంత్రులకు, మిత్రులకు కోపము వచ్చునేమో యని భయముగలదు."

"తన తండ్రియొద్ద తానుజేసిన బాస తప్పవలసి వచ్చునను భయము గూడను."

"హా?"

"సరిగా నట్లె. నూఱు యుద్ధములలో పోరాడిన ప్రతాపునకు చిత్తూరు స్వాధీనముగాని సంధి యిష్టములేదు."

"అనే నేను విన్నాను."

"ఆయాలోచనయే మరణ కాలమునఁ బ్రతాపుని పీడించెను. ఆసమయమున శూరశిఖామణులైన మీవారు యోగులలో నృద్ధు లచ్చటజేరిరి. వారందఱు మొదట చిత్తూరును బట్టుకొను ప్రయత్న మెన్నడు మానమని ప్రతాపుఁడు కుమారునిచేతఁ బ్రమాణము జేయించెను. అమరసింగు జనకుని యిచ్ఛాప్రకారము ప్రమాణము జేసెను. అంతట ప్రతాపుఁడు నిర్విచారముగా మృతినొందెను.

"అట్లయిన నమరసింగు మాటనిచ్చెనా?"

"రాణా తనమాట నెన్నడు తప్పఁడు. అవసరము వచ్చినప్పుడు చిత్తూరు పట్టుకొను ప్రయత్నములు చేసికొనుట కాక్షేపణ మేమియు లేదన్న షరతుమీఁదనే యక్బరుపంపిన సంధి సందేశమును రాణా యంగీకరించెను."

"అట్లయిన మన చక్రవర్తి యీషరతు నొప్పుకొనెనా?"

"ఒప్పుకొన్నాఁడు. ఏమనఁగా మొగలాయీరాజ్య మున్నంతకాల మట్టి యవసరము కలుగనే కలుగదు."

అంతట సిద్ధులు నేదో యాలోచించుచు క్షణ మూరకుండిరి. అంతట పృథ్వీరాజు మరల సంభాషణ మారంభించెను.

నరేంద్ర! రేపు ప్రొద్దు పొడవకమునుపె నేను నా బికనీరు సంస్థానమునకు బైలుదేరెదను. తక్కిన రాజపుత్రప్రభువులవలె నేనును చక్రవర్తి దర్బారులోఁ జాలకాల ముంటిని. కాని, నాస్వదేశము, బంధు

జనము నన్నుజూడ తహతహ పడుచుండును. దర్బారు మిక్కిలి శోభగా నున్నది. చక్రవర్తి మిక్కిలి మంచివాఁడు; దయగలవాఁడు. కాని రాజపుత్రకుమారుని రాజస్థానమునకు నంటఁగట్టునట్టి బంధము లంతకన్న గొప్పవి యున్నవి. వానిని ఆగ్రానగరములోని యాటలు, పాటలు, షోకులు త్రెంపఁజాలవు."

"రాజకుమారా! మొగలాయిదర్బారులోనున్న రాజకుమారులలో స్వదేశమునకై స్వజనమునకై తహతహ పడునట్టివారు మీ రొకరే. ఆ కారణమున మీయెడ నాకు మిక్కిలి గౌరవము గలదు."

"నా దగ్గఱచుట్టములను, నా తెగవారిని మఱచిపోవుట నాకు గౌరవము గాదు. నరేంద్రా! నీయిల్లు నీ సంస్థానము చిరకాలము క్రిందట పిడిచినందుకు నీ కప్పుడప్పుడు విచారము కలుగదా?"

అనవుడు నిట్టూర్పు విడిచి నరేంద్రుఁడు మెల్లగా నిట్లు బదులు చెప్పెను:

"రాజా! నేను దేశభ్రిమ్మరిని. మా తాతగారి సంస్థానమింకను నా క్రింద నున్నదో లేదో నాకు తెలియదు."

"నీ తాతగారి సంస్థానము నీక్రింద లేకపోయినను చక్రవర్తి చేతిలో కావలసినన్ని జాగిరు లున్నవి. ఇవ్వవలెనంటే ఒరిస్సానుండి రాజస్థానము వరకుఁ గల యావద్దేశములో నెన్నివిధములనో కొలువు చేసిన నీకంటె సర్వుఁ డెవఁడు?"

"రాజా! మూడువందల యేండ్లనుండి నాపూర్వులు సంపాదించి పాలించిన సంస్థానమునకు బదులుగా జాగీరు నాకేదియు వద్దు. మీరు చెప్పినట్లు స్వగృహము మనుష్యులను బంధించును. చిన్నప్పుడు నేనెఱిగిన కొందరిని గురించి, యాలోచనలు రాత్రి చీఁకటిలోను, నీయెడారిలోను నొంటిగా నున్నప్పుడు నా మనస్సునకు దగులుచుండును."

"ఎందుకు! దేశద్రిమ్మరి కాయాలోచనయే మనశ్శాంతి గలిగించు నది. అదే మహాకవినుండి వచ్చిన యావేశము."

"రాజా! నాకు భగవంతుఁడొక కవిత్వము ప్రసాదింపలేదు. నేను లోలోపలనే తలచుకొని విచారించెదను. అది నీవు ప్రతాపసింగును గురించి చేసిన క్రొత్తపాటను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. ఆపాట దర్బారులో నెంత యుత్సాహము పుట్టించి యక్బరునకు విన వేడుక పుట్టించెను గదా!"

"నరేంద్ర! నా పాటలు మిక్కిలి యుత్సాహము గలిగింపలేవు. ఏలయన చక్కగా కవనము చెప్పు శక్తి నాకులేదు. పద్యములు వ్రాయుట నాకు సంతోషకరము. అదిగాక చక్రవర్తి మెచ్చి నన్ను ప్రోత్సాహపఱుచుచుండును."

"రాజా! నీశక్తిని గురించి నీవు తేలికగా మాటాడుచున్నావు. ఆగ్రాలోను, రాజస్థానములోను గూడ నీవు గొప్పకవివని నేను విన్నాను."

"జనుల మాటకేమిలే. అవి నమ్మకు. రాజు కవిత్వము చెప్పినా యందఱు తప్పక మెచ్చుకొందురు. నిజమైన కవిత్వము వినవలెనంటె సారంగు చేతఁబట్టుకొని పల్లెపల్లెలకుఁ దిరుగునట్టి పేదవాండ్ర దగ్గఱకుఁ బొమ్ము, అట్టివాఁడు జాతియొక్క భావములను, సాంప్రదాయములను లోకులకు వినిపించుటకై భగవంతునివల్ల పంపఁబడి యుండును. రాజస్థానములోని కిసనులట్టివి; కవియు, దేవదూతయున్నైన కబీరట్టివాఁడు; అట్టివాఁడే తులసీద్దాసు. అతనికావ్య ముత్తర హిందూస్థాన జనులకు పిత్రార్జితమైన యాస్తి"

"సాటిలేని దొరరాజా! మీనోటనుండియే మీరు రచించిన ప్రతాప చరిత్రము వినగోరుచున్నాను. అది మిక్కిలి బాగున్నదని యాగ్రాలో వింటిని. ప్రతాపుని విక్రమములు జూచిన యీ పర్వతములు, ఆతనిని గురించి చేసిన గేయమును వినును. స్వయంతా

కాలపు మలయమారుతములు తమ ఱెక్కలమీఁద మీ పాటల నెక్కించి మోసికొని దూర దేశములకుఁ గొనిపోవును. ”

“ నరేంద్ర ! నీవుగూడ కవనము జెప్పవలసిన సమయము వచ్చినది. ఏమన నీ నోటినుండి ప్రయత్నములేక కవనము వెడలుచున్నది. నీవు వినఁగోరుచుంటివి గాన, నాపాటనే పాడెదను. నాశిబిరము నంటి వచ్చిన జమ్షెడు అను భిక్షుకబాలకుఁడు శ్రుతివేసి కలిసి పాడును. ఓయీ జమ్షెదా ! అక్కడున్నావా ? ”

ఆబాలుఁడు రాజకుమారుని వెంట నరేంద్రుని గుడారమునకు నుండేవచ్చెను. కమక నమస్కరించి ముందు నిలిచెను.

“ పిల్లవాఁడా ! నీ సారంగు దీసికొనిరా. ఈనడుమ నేను రచియించిన పాట ఈయన వినఁగోరుచున్నారు. నీవు సారంగు వాయించి యిదివఱకు వేసినట్లె శ్రుతి వేయుము. ”

పిల్లవాఁడు దండముబెట్టి వెళ్లిపోయెను.

“ ఇల్లు వాఁకిలిలేని యాకుఱ్ఱవాఁడు చక్కఁగా గానము చేయఁగలఁడు. వానికి రాజపుత్ర భాష తెలియదు. అయిన సంగీతమన్నను చెవిగోసికొనును. ఒంటిగా నేదోయొక రాతిమీఁదనో పల్లెటూరి బావి ప్రక్కనో వాఁడు కూర్చుండి తనసారంగు మ్రోయించుచు నెంత మనోహరముగానయినను పాడఁగలఁడు. అతని గానమువిని రాజస్థానమందలి చారణులుగూడ నీర్ష్యబూనుదురు. ”

చీఁకటి కొండలన్నిటిని గ్రమ్మెను. ప్రపంచమంతయు నిశ్శబ్దముగా నుండెను. జమ్షెడు సారంగు తెచ్చి నరేంద్ర పృథ్వీరాజులు కూర్చున్న రాతికిఁ గొన్నియడుగుల దూరమునఁ గూర్చుండెను. అతఁడు సారంగు వాయింప మొదలు పెట్టఁగానే ప్రతాపుఁడా చల్లగాలిలోఁ బాడ నారంభించెను. అదియెంతో మనోహరముగా నుండుటచే నరేంద్రుఁడు శ్రవణపర్వముగా విని మెచ్చెను.

## ౨౬

దీపములు వెలిగించిరి. అతిథి నిమిత్తము తయారు చేయబడిన యుపాహారములను వారిరువురు భక్షించిరి. పరిచారకుడు వెడలి పోయెను. పృథ్వీరాజు, నరేంద్రుడును మాత్రమే గుడారములో నుండిరి. భిక్షుక బాలకుడు డేరాకు వెలుపల నుండెను.

పృథ్వీరాజు నాటి సాయంకాలము మహానందముతో గడపి యొక గిన్నెడు మద్యము త్రాగెను. పాడుమని నరేంద్రుడు కోరకుండగనే పద్యములు పాడ నారంభించెను. శ్రోతలు మెచ్చుచున్నట్లును గని ప్రార్థనలేకయే సత్యములు చదువును.

"నరేంద్రా! రాజపుత్ర కవిత్వమును రాజపుత్రులకంటె నీవే బాగుగా మెచ్చగలవు. చక్రవర్తిగారు గీతములను విని ప్రశంసించిరో యవిగనీ నీవును మెచ్చుకొంటివి. బంగాళములో మన మున్నప్పుడు మానసింగు మహారాజు శిబిరములో నీవు నాపద్యములు కొన్ని వినియుండవచ్చును. నీవు వినగానే మంచి కవిత్వమేదో చెప్పగలవు."

"రాజా! కీర్తనము వినుటకు మానసింగున కవకాశ మెక్కడిది? అప్ఘనులు మనచేత వేణుపాటలు పాడించిరి" అని నరేంద్రుడు బదులు చెప్పెను.

"కావచ్చును. నీకు సహజమైన కవిత్వము వచ్చును. తూర్పు దేశము, కవనమునకు ప్రణయమునకు స్థానమని విందును. అది నిజమేనా? నీ పడుచు మనస్సు మొదటిదాని రుచిని గ్రహించినట్లు రెండవ దాని రుచినిగూడ గ్రహించినదా?"

రాజకుమారుడు మొదట త్రాగిన గిన్నె మద్యము జీర్ణమయి పోయినందున మరల నొక గిన్నెడు త్రాగి యీ విధమైన ప్రశ్నలడిగి యతని వృత్తాంత మరయజొచ్చెను. నరేంద్రుడు మాట తప్పించవలె

నని ప్రయత్నించెను గాని వ్యర్థమయ్యెను.

"మిత్రుఁడా! విచారకరమైన నీకట్టి వట్టి యూహలు పనికిరావు. యుద్ధములోను ప్రణయములోను గూడ నా మిత్రుఁడైన బంగాళా జమీందారుఁడు కొంత కొంత జయమును బొందెనని నేను విన్నాను."

"పృథ్వీరాజా! పిచ్చిపిచ్చి వాడుక లెన్నైన పడవచ్చును. ప్రణయములో నేను గొప్పవాఁడనని చెప్పకొనుటకుఁ దగిన ప్రజ్ఞ లేదు. ఆగ్రాలోని యందకత్తెలు చుట్టములు పక్కములు లేని పరదేశి క్రొత్తవానిని మోహింపరు. మహారాజులమీఁద వారి వలపులు గ్రుమ్మరింతురు."

"నరేంద్ర! పరాక్రమశాలురైన రాజకుమారులకు, క్రొత్తవాఁడయిన నీవంటి చక్కనివానికి,గలిగినట్లు అంతఃపురప్రవేశముదొరకదు."

"రాజా! నేనొడలు తెలియకుండ నున్నప్పుడు అంబర రాజభవనమునకుం దీసికొని పోయిరి. అక్కడ నేను జబ్బుచే మంచముమీఁద పడియుంటిని. అది మీరు మఱచితిరా? నామాటకేమిగానిమీరదృష్టవంతులు. ఏమన నిగనిగలాడు కన్నులుగల దర్బారు భోగముఁదుచులు బికనీరు రాజకుమారునిపై కన్నువేసిరని యెన్నో వాడుక లున్నవి."

"కావచ్చు కాకపోవచ్చు, నా ప్రశ్నకది యుత్తరము గాదు. మిక్కిలి చక్కని భోగముపడుచులకన్న మిన్న సొగసుకత్తెలగు బానిసపిల్లలు రాచనగరులో నున్నారు. జబ్బుగా నున్న యొక పడుచు జోదునకు జబ్బులో నుపచారము చేసి, చక్కని బానిసపిల్ల యొకతె వాని వలలోఁ దగిలినదని గట్టి ప్రవాద మున్నది."

"రాజా! నే నెవ్వతె నెఱుఁగను. ఎవతెను నేను వలచియుండలేదు. ఎవతెను నా యధీనము చేసికొనలేదు. క్రొత్తవాఁడు రాచనగరులోఁ బ్రవేశించెనా కొంత యపాయ ముండును. జబ్బు కుదురఁగానే నేను నగరు విడచి సామాన్యమైన బసకు పోతిని."

"అంతఃపురములోని వలపులముందఱ నపాయ మొక లెక్కా?

దాని నిమిత్తమే యపాయమైనం గడవచ్చును. రాణులకు, బేగములకు పరిచారికలైన నల్లకన్నుల బానిసలను గురించి నీకుం గొంత తెలిసి యుండవచ్చును."

"రాజా! జబ్బుపడి మంచ మెక్కినవానికి రాచనగరములోని నల్ల కన్నుల బానిసలను గలసుకొనుట కేమి యవకాశ ముండును?"

"ఎప్పుడైన లేంబ్రాయపు బానిస యొకర్తె యెవరినో పూని పోవచ్చును దానికేమిలే. అందులో నొకతె నగరునుండి పారిపోయిన దని చెప్పుకొనుచున్నారు. అది జోధబాయిదేవిగారి బానిస. అది మరల నగరు చేరునప్పటికి చాల కాలము పట్టును."

నరేంద్రుడు కొంచెము భయపడి తన భయమును గప్పిపుచ్చుకొని దొంగనవ్వు తెచ్చుకొని యిట్లు బదులు చెప్పెను: "ఆ మహారాజ్ఞి తప్పిపోయిన తన బానిసలను గురించి జవాబు చెప్పవలసినదని నన్నీను మహారాజుగారి నడుగవచ్చును."

"అడుగవచ్చు మానవచ్చు. దాని కేమి? ఇట్లు మాట తప్పించుట వల్ల నీవు దాటి పోలేవు. అప్సరసవంటి తార్తారబాలిక మాట యేమి? గడదొంగా! ఇప్పుడు దొరికినావా! నీ యిష్టమువచ్చిన సంకర మాటలు చెప్పు."

"రాజా! దయయుంచి క్షమింపుమని మొఱపెట్టుకొనుచున్నాను. ఆగ్రాకు వచ్చిన క్రొత్తనాం డంతఃపురము నుండి పారిపోయిన తార్తారీ, పారసీ, రాజపుత్రి, హిందూస్థానీ బాలికలను గురించి జవాబు చెప్పు మన్నచోం జెప్పం గలండా?"

"మిత్రుండా! ఆగ్రాకోటగుమ్మముదగ్గఱనుండి కారుచీకటి రాత్రి, నొక జవరాలిని తన వెనుక గుఱ్ఱముమీంద నెక్కించుకొని పలువది మైళ్ళు ప్రయాణముజేసిన మహాసాహసునిమీంద దయయుంచ నక్కఱ లేదు. ఆ చిత్రకథ నీవు విన్నావా?"

అద్భుతమైన యొక ధ్వని కేకవంటి సవ్వడి—గుడారము వెలుపలి నుండి వినఁబడెను.

"ఓరీ జస్మైండ్! జస్మైండ్! ఆచప్పుడేమిటి?"

జస్మైండు లోపలికి వచ్చి యజమానునికి దండముబెట్టి నిలిచె.

"నీకేదైనా చప్పుడు వినఁబడినదా? గుడారము వెలుపల నెవఁడైన తిరుగుచున్నట్లు నీవు చూచినావా?"

"మహాప్రభో? చూడలేదు."

"జాగ్రత్తగా కాచుచుండుము. గుడారమువద్ద కెవ్వరిని రానీకుము. జాగ్రత్తతో కాచుచుండుమని నరేంద్రుని యూరేకులతోఁ జెప్పుము. మేమిక్కడ రహస్యములు మాటాడుచున్నాము. అందుచే నెవ్వరిక్కడకు రాఁగూడదు."

అది విని జస్మైండ్ దండముబెట్టి యవ్వలికిఁ బోయెను.

ఈయంతరాయము నరేంద్రుని యదృష్టమువల్లనే కలిగెనది. ఏమన నతఁడంతలో నాలోచించుకొనుట కవకాశము గలిగెను. కనుక తత్తరపాటు లేక ప్రత్యుత్తరనిచ్చెను.

"రాజా! మీరు విన్నది నిజము. అది నేను కాదనను. ఆ తార్తార బానిస రాచనగరులో పంజరములోని గండభేరుండమువలె నుండెను. అది వలపునకుఁ గాక, స్వేచ్ఛకొఱకు తంటాలుపడెను. అది యంతఃపురపు కట్టుబాటుల నతిక్రమించి ముఖ్యుఁడైన కొజ్జాను పొడిచి గాయపఱచెను. అందుచే ప్రాణాపాయము గలిగెను. వలలో చిక్కుకొన్న దిక్కుమాలిన పక్షినైన విడిపించుట నా స్వభావము గనుక తప్పించుకొని ప్రాణము గాచుకొనుటకు దానికి నేను సాయము జేసితిని. జోద్బాయిరాణిగారికి చాలమంది బానిసలు గలరు. ఏమో దయదలఁచి దాని నామె రక్షింపఁగూడదా?"

"జోద్బాయిమహాదేవి దాని నదివరకే క్షమించినది. ఆమె యుక్తి

రువులు నాకు మున్ను నెయున్నవే చేరినవి. ఆ బానిస నాకుఁ గనఁబడిన యెడల దానికి స్వేచ్ఛ నిచ్చినట్లు జెప్పుమని నా కాజ్ఞాపించెను. అది క్రైదీవలె గాఁ బడుచున్నది. స్వస్థానమగు తార్తార దేశమును చూడ వలెనని యిచ్ఛపడుచున్నది. కాని తార్తారి దేశపు బోడికొండల కంటె ననుకూలమైన స్థానమే దానికి దొరికినదిలే.”

“రాజా, మీరన్నట్లు కావచ్చు కాకపోవచ్చు.”

“నాగుట్టు దాఁచుకొన్నట్లే నీ గుట్టు దాచుకొనుటకు నీకు హక్కు గలదు. నామిత్రుని సంతోషపెట్టి సుఖింపఁజేయఁగల యచ్చరవంటి లేజవరాలుండఁగా గుడారములో నే నొంటిగాఁడనై పరితపించుట చాల కష్టముగదా. నరేంద్రా! నీవిచ్చిన షరబతు త్రాగి సాయంకాలపు మలయమారుతము హాయిగా ననుభవించుచున్న యీ సమయమున, తార్తార బాలిక మనోజ్ఞ స్వరముతో హాయిగా కొన్ని పాటలు పాడిన పక్షమున, ప్రియజనమును విడిచి విదేశమున నున్న నా వంటి వానికి మనోల్లాసము గలుగదా?”

“రాజా! నాదంతయు నీదే. మీరు తార్తార బాలికయైన జహ్రేఖను గురించి మాటలాడుచున్న పక్షమున నది మాటలు, పాటలు నేర్చినది గాదు. అది బానిసయైనను ఉన్నత చిత్తము, గొప్ప యాశయములు గలది. అది పాఱిపోయిన నాఁటి రాత్రి పిశాచమువలె సంతర్హితురాలయ్యెను. మంత్రములచేత, తంత్రములచేత నదృశ్యులగు పిశాచముల నావాహనము చేయుచుండెడిదని నా నమ్మకము.”

రాజకుమారుఁ డామంత్ర తంత్రముల మాట నమ్మక పెద్ద నవ్వు నవ్వి యిట్లనియె.

“ఆ మంత్రములు కొన్ని రక్తమాంసములతో నిండిన యొక ఘటముమీఁద నేదో ప్రయోజనముకొఱకుఁ బ్రయోగింపఁబడెను. అదృశ్యురాలయిన యచ్చర దేవతవలె యెప్పుడప్పుడు కనఁబడవచ్చును.

ఏమి, కనఁబడదా? ఒక్కరేయి నొక ముద్దులగుమ్మను దన వెనుకఁ బెట్టుకొని నలువదిమైళ్ళు గుఱ్ఱపుసవారి చేసిన యోధుఁడు గాలిలో దానిని విడిచి పెట్టి పోవునా?"

"రాజా! నే నెఱిఁగిన దేదో చెప్పితిని. నీయిష్టము వచ్చినట్లు నమ్ముము. మానుము." అని విసుగుతో నరేంద్రుఁ డనెను.

అప్పుడు మరల కికకిక నవ్వుచు రాజకుమారుఁ డిట్లనియె: "నరేంద్రా! మేమందఱము నిట్టూర్పులు విడుచుచు చూచుచుండ బంగాళమునుండి వచ్చిన క్రొత్తవాఁడవు నీవు. ఆగ్రాలో నున్న పడఁతులందఱకంటె నందగత్తె యగుదానిని దీసికొనిపోవుట చిత్రముగాదా!"

"రాజా! నామాట నమ్ముమని వేఁడుకొనుచున్నాను. నీ యనుమానములకు కారణము లేదు. ఆపిల్ల తాను దాల్చునట్టి యుక్కుముక్కవలె చేవగలది."

నరేంద్రుని విన్నపములు చెవిని బెట్టకయే రాజకుమారుఁడు వెండియు నిట్లు బలుకసాగెను: "ఎక్కడో కొండలలో నుండి వచ్చిన తార్తార బాలిక రాజస్థాన కవీశ్వరుఁడు పద్యవర్షము గురిపించి వలపించుటకు సిద్ధముగా నుండఁగా, ఎక్కడో తూర్పుదేశమునుండి వచ్చిన చిన్న జమీందారుని మంత్రశక్తికి లోఁబడిపోవుటయేమి! హా! అది యేమిధ్వని?"

మఱియొకసారి వింతధ్వని వినఁబడెను. సన్నని యేడుపు, పిమ్మట కికకిక నవ్వు. అది వినఁగానే వారిరువురుఁ జివాలున లేచిరి.

రాజకుమారుఁ డప్పటికి నవ్వుచు "వన్నా కాఁడా! అది నీకు హెచ్చరిక. నీకును, నీ యచ్చరలేమకును నడ్డముగా నేను చాలసేపుంటిని. అర్ధరాత్రమైనది. ఆకాశవాణి నన్ను పొమ్మని చెప్పుచున్నది. ఇట్టి సమయములందే యచ్చరలు తమ మాంత్రికులకై కనిపెట్టుకొనుచుందురు." అని పలికెను.

కొంత కళవళపాటు, కొంత కోపము మల్లడిగొన, నెంతో గౌరవ

నీయుఁడైన తన యతిథియెడ విధేయత జూపుచునే యుండుచు తీవ్ర ముగా నిట్లు బదులు చెప్పెను.

"రాజా! మనము క్రొత్తదేశములో, క్రొత్తచోట కలసి యున్నాము. ఆకాశదేవతలలో, యచ్చరలలో, భూదేవతలలో నెవరు మనలను గనిపెట్టి చూచుచున్నారో నే నెఱుఁగను. కాని మీరు నెల్లికి మునుపు నేనొక్కమాట చెప్పినను చిత్తగింపలేదు. నామీఁద నెట్టి యనుమానము లున్నను వ్యక్తము సేయుము. నేను నిర్దోషుఁడను. నీ మిత్రుఁ డనుగూడ గావచ్చును. పాప మాబాలిక జవేఖ నారోగములో నా కుపచారము చేసి, మహాపాయములలో నాకెంతో సాయము చేసెను. కాన, నవమానకరముగా నామెను గురించి చెప్పుట నాకెంతమాత్ర మిష్టములేదు. ఆమె మంచి శీలము గలదని దైవసాక్షిగా నేను నమ్ముదను. నాప్రాణము రక్షించిన యాబాలిక మీఁదను, నామీఁదను మీ కనుమాన మున్నయెడల నన్ను పరాభవించినట్లే. గొప్పవంశ స్థులు పరాక్రమశాలురు నైన మీ కిది తగదు."

నరేంద్రుని మాట లగు స్వీకరణపద్ధతిగా నచ్చుటచే, పృథివీరాజు దాని యాథార్థ్యము గ్రహించి, తన జాతి కుచితమైన యుదారభావ ముతో నిట్లు వచించెను:—

"నరేంద్రా! నీ మనస్సు నేను నొప్పించినయెడల నన్ను క్షమిం పుము. కాని నిన్నవమానపరుపవలెనని నా కుద్దేశము లేదు. అట్టి విషయముల గురించి యోధులమైన మనము తేలికగానే మాటాడు చుందుము. నీ తలంపులకు నే నడ్డమురాను. నీ రహస్యము నీ హృద యములో నుంచుకో. ఇదిగో! తన మిత్రుల కెప్పుడు విశ్వాసపాత్రుఁ డైన రాజపుత్రుఁడు చేయూత నిచ్చుచున్నాడు. అందుకొనుము!"

నరేంద్రుఁడు హృదయపూర్వకముగా నాతని హస్తము గ్రహించి మృదువుగా నిట్లు బలికెను.

"రాజా! నేను కొంచెము తీవ్రముగా మాటాడియుందును. క్షమింపుడు. నాకు దిక్కులేక యా దాసీస్త్రీ ముబాలిక గతి యయ్యెను. నేను మృత్యుముఖమునఁ బడియున్నప్పుడు దాదియయ్యెను. ఆమె నెప్పుడు తలఁచుకొన్నను కృతజ్ఞతతోనే తలఁచుకొందును. ఆమెను మరలఁ గలసికొందునను నాసలేదు. ఆమెవిషయమున నాకు మఱియొక తలంపు లేదు రాజా! ఆఁడుదాసీవలపులలోఁ దగుల్కొను కాలము నాయెడ నతిక్రమించినది."

"నరేంద్రా! అంత చిన్నవాఁడవు—ఇంత విచారముగా మాటాడెద వేమి? ప్రొద్దు పోవుచున్నది నీగుట్టు మట్టు దెలిసికొనుటకు నేఁ బ్రయత్నింతును. ఈరాత్రి మనము విడిపోవుచున్నాము. బహుశః మరల మనము కలిసికొనము. నేను బికనీరు వెళ్ళుదును. నీవు బంగాళము పోవుదువు. నేను నిన్నెప్పుడు గౌరవముతోనే కలిసికొందును. అట్టి రాజపుత్రుఁడనైన నామైత్రి జ్ఞాపకముంచుకో."

నరేంద్రుఁడు పృథ్వీరాజును వాని గుడారము గుమ్మమువఱకు సాగనంపి మరలఁ దనడేరాకు నెమ్మదిగా వచ్చెను. జెప్షదు దీపము బట్టుకొని దారిజూపుట కతనివెంట వచ్చెను.

"ఓయీ! నీవు తెలివిగల పిల్లవాఁడవు. మనము రాజస్థానములో నున్న దినములలో నీవు పెక్కుసారులు పాడితివిగాని, యాపాటలన్నిటికంటె నేఁటి పాటలు మిక్కిలి రసవంతములుగా నున్నవి. ఈ నాణెము దీసికొనుము. నీ వేర్పఱచుకొన్న వృత్తిలో సంపూర్ణప్రజ్ఞ సంపాదించుకొనుము."

"అయ్యా! నేను పాటలు పాడుకొనుచు దేశములవెంటఁ దిరుగు బిచ్చగాఁడను. మా రాజపుత్రప్రభువుగారి పాటలు వినుటయే నాకోరిక. ఆయనవల్ల జీత మేమియు నేను పుచ్చుకొనను. దేవరవారియొద్ద గూడ నే నేమియు గ్రహింపను అట్లను గ్రహింపఁడు."

"కుఱ్ఱవాఁడా! పాటలంటె నీకు పరమప్రీతి. నీకు పాటలే జీవితమైన యెడల నా డేరాలోకి రా! ఆ రాజుగారు నిన్ను రమ్మనక పోయిన యెడల సారంగు వాయించి కొన్ని పాటలు పాడుము. మాదేశపు పాటలు నీ వెప్పుడు వినలేదు. ఆ పాటలు పాడి నీ కష్టము మరలించెదను."

"ఆయన మరల నన్ను రమ్మనలేదు. ఏమంటె నే నాయనతో బికనీరు వెళ్లదలఁచుకొనలేదు. మీరు మీ దేశపు పాటలు పాడుదురేని నాకీరాత్రి నిద్ర రాదు."

## ౨౭

ఆరాత్రి నరేంద్రనాథునకుఁ గూడ నిద్రపట్టలేదు. తాను పృథివిరాజుతోఁ జేసిన సంభాషణము, పృథివిరాజు తనతోఁ జేసిన సంభాషణము తన మనస్సు నిట్టటు నూఁచఁ జొచ్చెను. అదిగాక నానావిధములైన యాలోచనలు గూడ, పరంపరగా మనంబునకు వచ్చి పోవఁ దొడఁగెను. నేర్చుకొనని భావములతో భయంకరములైన యూహలతో నున్న జలేఖయొక్క విగ్రహము మాటిమాటికి తన మనోవీథిని నిలువఁ జొచ్చెను. ఆకుఱ్ఱని మోటసారంగుస్వరము వినినప్పుడును, తాను బంగాళదేశపు పాటలు పాడినప్పుడును వాని మనస్సు ప్రాక్తనస్థానములు మీఁదికిఁ బారి వెనుకటి వృత్తాంతములు జ్ఞప్తికిఁ దెచ్చెను. ఆతఁడు కొంతసేపుండి యిట్లు ముచ్చటించెను.

"పిల్లవాఁడా! పాపము నీవు మిక్కిలి చిన్నతనమందే దేశములు వెంటఁ దిరుగ నారంభించితివి. నీకిల్లు లేదా?"

"అయ్యా! బిచ్చగానికిల్లెక్కడ నుండును?"

"నిన్ను పెంచుటకు తల్లిదండ్రులు లేరా?"

"నా తల్లి దండ్రులు నా పసితనములోనే పోయిరి."

"అట్లయిన నీ వెక్కడ నేవిధముగ జీవించితివి ?

"అయ్యా! ఆగ్రాకోటదగ్గఱ. నావంటి దిక్కుమాలినపిల్ల లెందఱో తగిన జీవనాధారము సంపాదించుకొనుట కాచుట్టుపక్కలఁ దిరుగుచుందురుగదా."

"పిల్లవాఁడా! అది చాల దీనజీవనము."

"అయ్యా! అంత దీనమైనది కాదు. ఏమన ఉమ్రావులు, మనసబుదారులు, నాపాట విని గోపసింహ పృథ్వీరాజుగారు గూడ నాయెడ మిక్కిలి దయగలిగియున్నారు."

"పిల్లవాఁడా! ఆరాజు నిన్ను తన కొలువులోనికి దీసికొన్నాఁడా ?"

"అయ్యా! నాకు కొలువు పనికిరాదు. నేను జీతము పుచ్చుకొనను. నాయిష్టము వచ్చినప్పుడు వెళ్లుదును. నాయిష్టము వచ్చినప్పుడు పోవుదును. ఆగ్రానుండి యీరాయనతో వచ్చితిని. నాకాయన అన్నము పెట్టెను."

"ఆగ్రాలోనే యెప్పుడైన రాచనగరులో సారంగు వాయించితివా ?"

"అయ్యా! చాలసారులు వాయించితిని. రాచనగరులోనే నేను డబ్బు సంపాదించుకొని బ్రతికినది."

"ఎప్పుడయిన రాజకుమారుల యెదుట, వాయించితివా ?"

"స్వామీ! రాజకుమారులయెదుట, రాజకుమారికల యెదుట గూడ వాయించితిని. అప్పుడప్పుడు రాణులు, బేగములుగూడ నన్ను బిలిపించి నాపాటలు వినుచుండిరి."

"అట్లయిన నీవు అదృష్టవంతుఁడవైన పాటకుఁడవే. నిన్నెవరు పిలిపించిరి ?"

"అయ్యా! నన్ను పేరులడుగవద్దు. ఒక పేరునకు నొక పేరునకు నాకు భేదము తెలియదు. కాని యొక రాజపుత్రస్త్రీ చక్రవర్తిగారి

భార్య—పెద్దకుమారుని తల్లి నామీఁద నెంతో దయగలిగి యుండెడిది. ఆమెచేత నాకుఁ దెలిసినయెడల బ్రతికి యున్నంతకాలము నామెకీర్తి పాడెదను."

"నీవు మాట్లాడుచున్నది జోధ్బాయి రాణీగారిని గురించి. క్రొత్త వారంటజీయెడలఁ గూడ నామె మిక్కిలి దయాగలిగి యుండును."

"అయి యుండవచ్చును స్వామీ! నేనొకసారి పెద్దరాణీగారియెదుటను, ఆసమయమున నామెను జూడవచ్చిన యొక పారసీక యువతి యెదుటను పాడితిని. ఆ యువతి మిక్కిలి చక్కనిది. ఈయువతి యంత చక్కనిది రాచ నగరులో లేదు."

"ఓహో! ఆమె పేరునీ వెఱుఁగుదువా ?"

"అయ్యో! ఆ గొప్పగొప్ప స్త్రీలపేళ్లు నాకు జ్ఞాపక ముండవలెనా! పెద్దకుమారుఁ డామెను పూర్వము పెండ్లియాడఁ దలఁచెనని చెప్పు కొందురు."

"నీవు మాటాడుచున్నది మెహరున్నీసా బేగమును గురించి. అంత చక్కనిదానిని—అంత దర్పముగల దానిని—నీ వెప్పుడైన చూచితివా ?"

"స్వామీ! అట్లయిన మీరామెను చూచినారన్న మాట."

"ఊరకో. ఊరకో. నీవు బేలచూపులు చూచుచున్నను ఇట్టి పసి కట్టు కుక్కవంటి వాఁడవు. కాని, నీ వామెవద్ద కెట్లు వెళ్లఁగలిగితివి ?"

"నేనొకనాఁడు కొద్దిగాలిదగ్గఱను నగరులోని బానిసలదగ్గఱను పాడు చుంటిని. అప్పు డామె సభలో నన్ను పిలిపించినది."

"ఆశ్చర్యము లేదురా కుఱ్ఱవాఁడా! రాణులు, బేగములు పిలిపించి నీ పాట విను పక్షమున ఈ వృత్తి నీకు చాలయిష్టమై యుండవచ్చును. ఆ బానిస లందఱి నెఱుఁగుదువా ?"

"చెడ్డముండలు స్వామీ, వాండ్రు. వాళ్లకు ఎన్నెన్నో దుర్బుద్ధులు, ద్వేషములు లోలోపల నున్నవి. వాళ్లంటే నాంకెంతో భయము.'

"వారిలో నొక తార్తార బానిస యున్నది. అది జోద్పాయిరాణి గారి దాసి. దాసిపేరు జలేఖ. దాని నెఱుఁగుదువా ?"

"అదంటేనే నాకెక్కువ భయము. వాండ్రలో నదే యెక్కువ భయంకరమైనది. తీవ్రమైనది. అది పిచ్చిదని చెప్పుకొన్నారు. నగరులో నొక కొట్టులో కాలుచేతులు గట్టి దానిని పడవేయఁ దలఁచుకొన్నారు."

"దాని నిఁక నెవ్వరు కొట్టులో బెట్టలేరు. అది గాలిలాగునే స్వేచ్ఛగా దిరుగుచున్నది. అది పిచ్చిదని యెందుకన్నారు ?"

"అది నే నెఱుఁగను స్వామీ! ఆ మది కాని యాఁడుది దానిని కన్నదని చెప్పుకున్నారు. అది పిశాచ జాతిలోనిదఁట. ఆపిశాచము వలన నామె రాత్రి పిలువఁగలదఁట, పడిగేయు నామెగదిలో పక్షులు, పెడబొబ్బలు, నవ్వులు వినఁబడుచుండునఁట. మీ రెప్పుడైన నటువంటి ధ్వనులు విన్నారా ?"

"కుఱ్ఱవాఁడా! నేనాగ్రాలో నున్నప్పుడటువంటి ధ్వనులు పలుమారులు వింటిని. ఈరాత్రి యిక్కడ గూడ కొన్నిక్రొత్త ధ్వనులు విన్నాను. గాలిలోఁ దిరుగు దయ్యాలకంటె భయంకరమైన భూతములు భూమిమీఁదనే యున్నవి. నీకథ కాని! జలేఖనుగురించి యింకేమివిన్నావు ?"

"గాలిలోని దయ్యములతో నామె ముచ్చటించునని నగరులోని వారు చెప్పుకొనిరి. ఆమెతోటిదాసీ మంత్రములు వెడలుచుండును. ఒక పిశాచముతో చెట్టాపట్టాలు వేసుకొని యామె నడచుచుండఁగా కొందఱు చూచిరఁట."

"నిజమే! అయితే ఆపిశాచ మేయాకారముతో కనఁబడినది ?"

"ఆపిశాచము యామె యక్కగారి యాకారము ధరించి వచ్చినది. పెద్దకొజ్జా కత్తి ఝుళిపించి యామె నాపినప్పు డామె దీపమార్పినప్పుడు వచ్చునట్టి పొగరూపము ధరించి కనఁబడకుండ మాయమైపోయెను."

నరేంద్రుడు కథ జాగ్రత్తగా వినుచుండెను! ఆవిచిత్రకథ వినఁగానే

కూర్చున్న మంచ మదిరిపోవునట్లు పెద్దనవ్వు నవ్వెను. కొంతసేపటికి శాంతవహించుకొని మరల నాకథ చెప్పుమని యాతడు నట్టువానిని హెచ్చరించెను.

అంతట నా బాలకుఁ డిట్లు చెప్పెను : "కథ తుదవఱకు వినుఁడు. ప్రథమమున మీరు నవ్వారు. ఇప్పుడు జలేఖ యొకర్తయే పోవలెనని పోయెను. పోయి పారసీకస్త్రీ గదిలోనికి వెళ్ళి చూచినపుడు — ఆమె నేమికనెనండీ?"

"నిన్ను మోహించుకున్న సాబేగము నేను గాంచుచున్నాను."

"జలేఖ ఆ పారసీక స్త్రీ గదిలో నున్నప్పుడు పిశాచము మరల కనఁబడెను. ఈసారి స్త్రీ రూపమునఁ గాక తూర్పుదేశపు ప్రభువు రూపమున కనఁబడెను."

అది నవ్వఁదగిన విషయము కాదు. పురుషుఁడు జనానాలోఁ బ్రవేశించినాఁడని తెలిసి యది నలుగురు చెప్పుకొనుచున్న పక్షమున నరేంద్రుఁడు రాజస్థానములోఁ గాని బందీఖానాలోఁ గాని బ్రతుకుట యరిది. "కానీ, కథ కానీ!" యని యతఁడు మరల నట్టువానిని హెచ్చరించెను.

అనవుడు బాలకుఁ డిట్లనియె: "ఆతూర్పుదేశ ప్రభువు చక్కని మొగము, గొప్ప మనస్సు కలవాఁడు. అతఁడు జలేఖను పట్టుకొని దయతో మాటలాడెను. కాని యాపారసీకస్త్రీ గొప్ప మంత్రశక్తి. ఆమె పిశాచముల భావముల మనుష్యుల భావముల కనిపట్టఁగలదు. ఆమె యాప్రభువును జూచి 'నీవు గొప్ప యోధుఁడవు, చక్కనివాఁడవు. కాని నీమనస్సు నీస్వదేశముమీఁద నున్నది" యని పలికెను.

తనకాళ్ళదగ్గఱఁ గూర్చున్న నట్టువాని నోట వెడలిన యావిచిత్ర కథ విన్నతోడనే నరేంద్రుఁడు భయవిహ్వలుఁ డయ్యెను. దీపముల మందకాంతిలో నతఁడా నట్టువానివంక పలుసారులు చూచి తనలో నిట్లనుకొనెను "వీఁడు నిజముగా భిక్షుక బాలకుఁడేనా? లేక యట్టి

వేసము వేసికొనెనా? వయికి మాటలాడినదానికంటె నెక్కువ విషయమితనికిఁ దెలిసియుండునా? వీఁడు పిశాచములతో మాట్లాడి యీ సంగతులు తెలిసికొనెనా? లేక, జలేఖయే చెప్పెనా?"

అమాయకుఁడైన యాపిల్లవాని ముఖమై ఖరిని పట్టి యేమనుకొనుటకు వీలులేక పోయెను. ఈలోకమునఁ దన కానందము నిచ్చు సారంగిను సరిజేసికొనుచు నాబాలుఁడు కూర్చుండెను.

"ఓరీ శ్నమడు! నీకథ ముగించుము. నడుమ ఆఁగుటకు వీలులేదు. తుదదాఁక నేవినియెద."

"స్వామీ! చెప్పవలసిన దంతగా లేదు. ఆతూర్పు ప్రభువు తెల్లని పొగరూపముగా మాయమైపోయెను. ఆరాత్రియే జలేఖ జనానాలో నుండి పాఱిపోయెను. పెద్దకొజ్జా మరువాఁడు నెత్తుటి వరదలో దొర్లుచుండెను."

నరేంద్రుఁ డంతకంటె నెక్కువ వినఁజాలక గుడారము వెలుపల నంధకారములోనికిఁ బోయెను.

రాత్రి గాలి కొండలమీఁదనుండి, చెట్లమీఁదనుండి తీవ్రముగ వీచుచుండెను. చుక్కలు మినుకు మినుకుమని వెలుఁగుచుఁ జీకటిం జూపఁగలిగెను. కావలివాండ్రు గుడారమునకుఁ గొంచెము దూరముగాఁ దాముండవలసిన చోటనుండిరి. ఆభిక్షుక బాలకుని నోటనుండి నరేంద్రుఁ డదివఱ కెన్నఁడు వినియెఱుఁగని యద్భుత గానము గుడారములో నుండి వినఁబడెను.

నిశ్శబ్దమయిన యారాత్రి యాగానము చక్కఁగా వినఁబడెను. అరగంట తరువాత నతఁడు మనస్సు కుదురుపఱుచుకొని గుడారముఁ జొచ్చి బాలకుని దగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొని యిట్లనియె.

"కుఱ్ఱవాఁడా? నీ సంగతిగాని, నీ భూతపిశాచముల సంగతిగాని నా కర్థమగుటలేదు. కాని నేనొక్కమాట చెప్పెద. జాగ్రత్తగావిను!

అది నీ మేలుకొఱకే. నీకు కొంచెము తెలిసియుండవచ్చు; చాల తెలిసి యుండవచ్చు. నీవీరాత్రి నాతో జెప్పిన సంగతులు మఱొకచోట జెప్పితివా నీనాలుక కోసివేయుదురు. ఒకప్పుడు నీతల పడిపోవచ్చును. తూర్పుదేశ ప్రభువు జనానాలోఁ బ్రవేశించినాఁడన్న కథ మరచిపో. చక్రవర్తియు, కొడుకులుతప్ప మరెవ్వరు జనానాలోఁ బ్రవేశించుటకుత్తరవులేదు. భూతపిశాచములు పొగరూపున నూరుచుండునన్న మాటకూడ మరచిపో. ఇటువంటి వెఱ్ఱివెఱ్ఱి కథలు చెప్పినవారి కిదివఱకు చాల ప్రమాదములు జరిగినవి. యుద్ధములో గాయపడిన తూర్పుదేశపు ప్రభు వొకఁడు రాజభవనమునకు రాఁగా, నీవిప్పుడు దేవతెనుగురించి చెప్పుచున్నావో ఆ తార్తార పిల్ల వానికుపచారము జేసెను. అది శౌర్యముగలది. మంచిది. సమ్మతగినది. కొజ్జాలు దానిమీఁద నేవో కొన్ని నిందలు మోపియుందురు. అవి నట్టియబద్ధములు గావున నమ్మకు. తార్తారుపిల్ల స్వాతంత్ర్యముగా బ్రతుకవలెనను కోరిక కలిగి యున్నది. తూర్పు దేశప్రభువు కష్టములోనున్న మాత్రమే యాఁడుదానికైనను జేసినట్లె, దానికి సాయముజేసెను. జరిగినదింతే. ఆమెను గురించి వారు చెప్పిన యితరవిషయమంతయు కల్పితకథ. ఇతరులకుఁ దెలిసిన విషయము నీకుఁ దెలిసినచో భయములేదు. జలేఖకు సాయమును జేసిన తూర్పు దేశపు ప్రభువును నేనే.”

ఆబాలకుఁడు నరేంద్రుని మాటలువిని పరవశుఁడై యెంతో యుత్సాహముతో నిట్లనియె: “అయ్యా! నేను మిమ్ము నమ్మితిని, ఏమన సత్యమనునది మీ మొగమున వ్రాసియున్నది. అది మీమాటల వల్లనే తెలియుచున్నది. ఆఁడుదానికిఁగాని, మగవానికిఁగాని మీరు ద్రోహము చేయుదురని నేను నమ్మను.”

“కుఱ్ఱవాఁడా! నీకు తెలియని విషయములను గురించి మాటలాడుచున్నావు. కాని నీమాటలు నాచెవుల కింపుగానున్నవి. నేనెన్నో

తప్పులు చేసియుండవచ్చును. ఆతప్పులలో నన్ను నమ్మిన యాడుదానిని మాత్రము మోసపుచ్చిన తప్పు నేనెప్పుడు జేసియుండలేదు. నాచిన్నప్పుడు నేనొకతెను వలచితిని. అది జ్ఞాపకముండుటచేతనే నేనిట్టి తప్పు చేయకుంటిని."

అత్తఱి నరేంద్రుని కంఠస్వరము చాల మందముకాఁగా గుసగుసలాడినట్లు కొంతజెప్పి పిమ్మట చిఱునవ్వు నవ్వి యిట్లనియె: "నీవు పెద్దవాఁడవైన తరువాత నిట్టి విషయములు నీకర్థమగును, నీవెట్టి తప్పులు చేసినను న్యాయమైన మనిషివి కమ్ము."

అమాయకుఁడైన యా పిల్లవాఁ డదివిని యజమానుని వంక జూచి యమాయక పద్ధతినే యిట్లనియె.

"స్వామీ! ఈ సంగతులు నాకర్థమగును. మగవాండ్రు తాము వలచిన యాఁడువాండ్రను పెండ్లియాడుదురు. కానండీ? మీరు వలచిన కన్యను మీ రేందుకు పెండ్లియాడలేదు?"

అనవుడు నరేంద్రుఁడు నవ్వుచు నిట్లు బదులుచెప్పెను; "క్రొత్తసంగతులు తెలుసుకోవలెనని నీ కెంత కుతూహలమున్నదిరా పిల్లవాఁడా! కాని, యప్పటి కామె చిన్నపిల్ల. అమాయకురాలైన యామెకు నా భావము తెలియలేదు. ఇప్పటికామె నాకన్న మంచివానిని, గొప్పవానిని పెండ్లిచేసికొని యుండును; నేను లోకములో మఱియే స్త్రీని వలచి యుండలేదు."

అప్పుడు తగ్గిపోవుచున్న దీపము నెగసన ద్రోయుటకు బాలకుఁడు లేచెను. కాని, దీప మారిపోయెను. గుడార మంతయు గాఢాంధకారమయమయ్యెను.

చాలసేపిద్దఱుఁ బలుకక యూరకుండిరి. ఎట్టకేలకు బాలకుఁడు మందస్వరముతో నిట్లనియె—"అయ్యా! అర్ధరాత్రమైనది. ప్రభువువారిసెలవైనయెడల పోయి పండుకొందును."

"వెళ్ళునాయనా! సుఖముగా బ్రతుకుము. నీ వేంపాలుమాటను మావల్ల వచ్చుకొనవు గనుక, యాశీర్వచనములె నీకిచ్చుచున్నాను."

"స్వామీ! దేశద్రిమ్మరికి లోకములో కష్టములుండవు. నే నెన్నో చోటుల గరుగుదును. ఎండ అనో కలిసికొందును. నే నేనైన నీవద్దనుండి రాయబారములు ఎవరికైన తీసికొనిపోవలసియున్న వేమో చెప్పుడు!"

"అబ్బాయీ! లేవు."

"బికనీరు రాజుగారు త్వరలోనే యాగ్రానగరమునకు పోవుదురు. ఆయనకుగాని, అంతఃపురములో ఆయన యొక్క మఱియొకరికిం గాని తెలుపవలసిన వర్తమానము లున్నవా?"

"లేవు. నేనంతఃపురములో నెవ్వరి నెఱుగను. అక్కడ నున్నన్ని నాళ్లు నేను జబ్బులోనే యుంటిని. ఐనను నాజబ్బులో నన్నంత దయతోం జూచి సంరక్షణముజేసిన యాపిల్లను మాత్రము చూడవలెనని యున్నది. ఆ తార్తాకపిల్ల స్వతంత్రురాలై సుఖముగా నున్నదన్నమాట వినవలెనని యున్నది."

"మీారు మనసార జలేఖను జూడవలెనని కోరినయెడల చూడ వచ్చును."

"నీ యభిప్రాయ మేమిటి?"

"మఱచిపోక తలంచుకొనుచున్నయెడల దూరమందున్న వారి వద్దనుండి వార్తలు వచ్చుచుండును."

"నీమాటలు చిత్రముగా నున్నవి. పిల్లవాడా! నాకర్థమగుటలేదు."

"ఒకప్పుడు మహామోఘుండొకడొక స్త్రీని రక్షించెను. చాల కాలము తరువాత సతి దొంటిగా నున్నప్పు డామెనగ్గలకుంబోయి యూడిపాడి సంతోషపెట్టెను. ఎందుచేత? మఱచిపోలేదు గనుక."

"ఇది నీ పిశాచ కథలలో నొకటా యేమిటి? దూరమందున్న వాండ్రను మనము చూడంగలమా?"

"దేహము విడిపోవుచున్నప్పుడు మనస్సు చూడఁగలదు"

"సరే! నీవు పాతపుస్తక కథలు పఠించినట్లు మాటాడుచున్నావు. అవి నే సరిగాఁ దెలిసికొనలేను! పిల్లవాఁడా! వెళ్లు. నీ సంచారములలో నీకు సుఖమగుఁ గాక! నీ వృత్తిలో నీకు జయమగుఁ గాక! నీ వెప్పుడైన జలేఖను గలిసికొన్న, పక్షమున జబ్బులో నుపచారముచేసి ఆపదలో నుండి రక్షించి, కాపాడిన యా శౌర్యవంతురాలిని, మంచిహృదయము గలదానిని నరేంద్రనాథుఁడు కంఠములో ప్రాణ ముండఁగా మఱచి పోఁడని చెప్పు. బ్రతికి యుండఁగా నే నామెను కలిసికొనుట సంభవింపదు కాని యామె దయ నా హృదయములో నెప్పుడు జ్ఞాపకముండును."

అంతట నిద్దఱు మాటాడక యూరకుండిరి. జెస్సిమె మాటలలో కంపము గనఁబడె...

"ఆమెయు నిన్ను మఱచిపోలేదు పురుగు నంట వెంటవగిలినట్లు జలేఖ తెలియకుండ, కనఁబడకుండ, కొండలనక గుట్టలనక, యడవి యనక పట్టణమనక నెల్లచోట్లు తిరిగి నిన్ననుసరించి వచ్చినది. దాసియైనను ఆమె యోఁధురాలు గనుక యామె హృదయము జాలి గలిగి యున్నది. ఆమె కాని విశ్వాస మూమ్మె కున్నది ఆమె యింకను గొన్ని సంగతులు తెలిసికొనవలెనని తత్తరపడుచున్నది. అవి యీ రేయి తెలిసికొనఁగలదు. భగవంతుఁడే నిడఁదీయును. భగవంతుఁడు సర్వశక్తుఁడు. ఎవరిని నీవు వెదకికొనుచున్నావో పున్నమినాఁటి యుత్సవములో నీ వెవతెను మధురలో గలిసికొనఁగలవో, యామెనుండి భగవంతుఁడు నిన్ను వేఱు చేసినాఁడు జలేఖ తన స్వదేశ పర్వతములను జ్ఞాపకముంచుకొన్నట్లు ఆమెను నీవు జ్ఞాపక ముంచుకో. ఆమె విడిపోవును. కాని, తార్తాగశాల యుపకార మెన్నడు మఱువను. జలేఖ మిత్రు నెన్నఁడు మఱువదు. శుభమగుఁ గాక!"

ఆ కంఠము మునుపు తాను విన్న స్త్రీ కంఠ మగుటచే నగేంద్రుఁడది విని యద్భుత రసమగ్నుఁ డయ్యెను. కాని గుడారము నిశ్శబ్దమై యంధకార బంధురమై యుండెను. జెమ్మైమ వెళ్ళిపోయెను.

## ౨౮

నవరోజా యుత్సవము వచ్చెను. అది ప్రతియేఁడు సంవత్సరాది నాఁటి రాత్రి జరుగు నుత్సవము. రాత్రియైనతోడనే యాగ్రాలోని నాచనగరు విద్యుల్లీలా శోభావంతమయ్యెను. చలువరాతి స్ఫటిక శిలానిర్మితములైన భవనములమీఁదను, భవనములమీఁదను వెండినీరు పోసినట్లు తన కాంతులు వెదఁజల్లెను. లాంతరు స్తంభములు తీఁగలతోను, తోరణములతోను సింగారింపఁబడెను. ఫవ్వారాలు గుత్తుల నడుమ నొంటొంటిగా మనోజ్ఞముగా జలబిందువులను ముత్యములట్లు చిమ్ముచుండెను. సుగంధ తైలపూరితములైన దీపములు లెక్కలేనన్ని ద్వారములనొద్ద నెలుఁగుచు, పొదరింటిలోనుండి తొంగి తొంగి చూచుచుండెను. మేనుల నిండ వెలలేని నగలు దాల్చిన చక్కని సీమంతినులు గుంపులు గుంపులుగా స్ఫటికశిలలు తాపటముచేసిన చప్టాలమీఁద జేరి, గలగల నవ్వుచు మేలిలేని మోదము నొందుచు విహరించుచుండిరి.

ఈ యుత్సవమునాఁటి రాత్రి పూర్వాచారమును బట్టి యంతఃపురము లోపల నొక వేడుకబజారు జరుగును. ఉమ్రావులయొక్కయు, మన్సబు దారులయొక్కయు, రాజులయొక్కయు భార్యలు సరుకులు తెచ్చి యంగళ్ళలోఁ గూర్చుండి యమ్ముచుందురు. రాణులు బేగములు వెలకు సరకులు గొనుచుందురు. మెడలు వంగిపోవునట్లు రతనాలు చెక్కిన మేలిమిబంగారు నగలు ధరించిన గొప్పగొప్పస్త్రీలు, మొకమలుటోపీనో, సన్నదువ్వలువ రుమాలునో బేరమాడి కొనుట కెంతో పెనగులాడి

తమలోఁదా.ు నాగులాడుదురు. రాణి యెవ్వరైన కొనఁబోయినప్పుడు నరుకు మంచిదికాదని పెదవి ఱఱిచి, వెలతగ్గింపవలెనని బేరమాడు చుండును. అంగడిలోఁ గూర్చున్న గొప్పపడఁతి సరకుఁ గొనవచ్చిన రాణియొక్క పిసినిగొట్టుతనమునకు నవ్వి యెగతాళిజేసి, తక్కువ వెలకు సరకులు కావలసినయెడల మఱియొకదుకాణమునకుఁ బొమ్మని కసరుచుండును. పరిహాసోక్తులు, చమత్కార సంభాషణములు, మొద లగునవి యాబేరములకు మెఱుగుపెట్టుచుండును. అందఱు స్త్రీ జనము నకుఁ బ్రియముగా బేహారపు వివాదములు పడుచుండెదరు. బేరము కుదరిన తరువాత నదియొకప్పుడు వెల దిమ్మోడికంటెఁ దక్కువైనను సరేఁగొనవచ్చిన విలాసవతి పొంబాటుచేఁ బొఱవైచినట్లు, తుకాణము మూఁదఁ దానియ్యవలసిన వెలకుఁ దోడుగాఁ గొన్ని బంగారు నాణెము లను నదలి పెట్టి తానుకొన్న వస్తువును గర్వముతోఁ దీసికొని పోవు చుండును.

ఈ యాచారము జనసమ్మతమయ్యెను. ఏలయన గొప్పయింటి పడఁ తులు పాదుషా నగళులఁ బ్రవేశించుటకును, జనానా స్త్రీలతోఁ బరిచ యము చేసికొనుటకును, నీ బజారు నుంచి యవకాశము గలుగఁ జేసెను. మహమ్మదీయ ప్రభువులు చక్రవర్తి భార్యల పరిచయము గలిగించు కొనుటకును, వారి యనుగ్రహము సంపాదించు కొనుటకును దమ కూఁతులను, భార్యలను నీ బజారుకుఁ బంపుచుండిరి. నగరులోని రాణు లకు, బేగములకుఁ దమ్మొకఁతీగించుకొనుట కిదే యవకాశమని హిందూ రాణులుగూడ నీబజారునకుఁ బోవుచుండిరి. పలుమాటలేల! పూర్వపు సమావేశములలో నెందును లేనంతగా నీ సమ్మేళనమున దేశముతోఁ బేరు ప్రతిష్ఠలు, వన్నెవాసియుఁ గన్న నెలఁది మిన్న లందఱు నొక్కచో గానఁబడుచుండిరి. ఈ బజారునకుఁ బాదుషా యొక్కఁడు మాత్రము రావచ్చును. మఱియేపురుషుఁడు రాఁగూడదు. అందుచే నతఁడు తది

తెర సమయములం దనకుం జూడవీలులేని నారీరత్నములను జూచి వా రెవరో తెలిసికొనుటకు నవకాశము గలిగి యుండెను.

అక్బరు సింహాసనమున నున్న కాలమున నీయవకాశముం బురస్కరించుకొని పరపురుషుని మొగముజూడని రాజకన్యకలను సందర్శింప వలెనని కుతూహలపడి యంగళ్లకడకుం బోవుచుండినట్లును, నాతని కంటంబడకుండ సిగ్గుచే ననేక శుద్ధాంతకాంత లంగళ్లు విడిచి, తొలంగి యావలకుం బోవుచుండినట్లును నగరులోం గొన్ని కథలు కలవు. అక్బ రిప్పటికి వృద్ధుండు, కవయిత్రియైన తన రాణి సలీమా బేగము వెంట రాంగ, నతండు రాజకీయ వ్యవహారములను మఱచిపోయి, కొండొక సేపు మెల్ల మెల్లగా నొక యంగడినుండి యొక యంగడికిం బోవంజొచ్చెను. చమత్కృతిగలగ యుత్సాహము గలిగించు నీమీనవనమం దక్బరుకు మిక్కిలి ప్రీతి; ఆస్థానజనులకిది యానందకరము, ఆమె మహారాజ్ఞియగుటచే లోకములో నామె 'మాక్షి' యను పేరుబెట్టు కొని కవిత్వము బ్రకటించెను. మాక్షీయనంగా, చాటుపడంతి. అంబరు రాజకుటుంబమునుండి వచ్చిన యొక స్త్రీ యంగడిలో విక్రయమునకుం బెట్టిన బంగారుకంకణము మహామదృష్టి నాకర్షింప నిమేషకాలము భర్తను విడిచి యది బేరమాడుట కక్కడకుంబోయి యిట్లనియెను.

"ఓ రాజపుత్రి సుందరీ! నా కాలములో సంగళ్లలోం గూర్చుండి విక్రయింపవచ్చిన రాజపుత్రీ కాంతల నెందఱినో చూచితిని. కాని, వ్యాపారములో నీయంత తెలివైన దానిని జూడలేదు. ఈ కంకణము ముప్పదివరాల కిమ్మంతువుగలదా? చెప్పు. ఇది పటవర హాలయిం నుండెను. రాజస్థానములో సంధియైన తరువాత నక్కడి కడియములు చౌకవైనవి. ఎఱుంగుదువా?"

"సంధియైనదని యనుచున్నారా, మహారాణీ? అంబరుకు మీాపంరు నకు నడుమ నెత్తురుటేరులు పాఱుచున్నవి. ఈ సంధిగట్టులు దాని నాంప

లేవు. బంగాళమునుండి మానసింగు రాజు రాసీ. అంబరు కడియము లెంత ప్రియము గా నమ్మునో చూతువుగాక ! మీరు చౌకనగలు తప్ప నిటువంటివి చూచియుండరు ; మఱొక దుకాణము మీఁదికి వెళ్లండి. మీ సొమ్ముకుఁ దగిన సరుకులక్కడ దొరకును. ”

“ అడివికోడి నెమలిని జూచువఱకు తానే గొప్ప పక్షినని గర్వించును. అంబరుస్త్రీలు, పురుషులు పైపైమెరుగులు గల తమ బంగారు సరుకులే మంచివని, ఆగ్రాలో మేలిమి బంగారు సరుకులు చూచువరకు భావించుచుందురు. కాని, అంబరు, ఆగ్రా మిత్రములు. అంబరు రాజైన మానసింగు మమ్ము విశ్వాసముతోఁ గొలిచెనని మేమెఱుఁగమా ? పండ్రెండు వరహాలిచ్చెద నేమందువు ? ”

“ ఔనౌను, క్రొత్త రాణా తన పూర్వులవలె నెనలఁ గూర్చుకొని చిత్తూరు ముట్టడింపఁబోయి నప్పుడు మీకంబరు మహారాజు మరల కావలెను. బికనీరు రాజును, బంగాళమునుండి వచ్చిన జమీందారుఁడును తాత్కాలపుసంధియొకటి కచ్చా పచ్చాగా చేసినను, అంబరు—మేవారు రాజులకు విరోధము రక్తముతోనే పుట్టినది. ఈకడియము మీరు ధరింపఁగోరుదు రేని, మీసంచిలోనున్న పక్షమున ఇరువదియైదు వరహాలిచ్చి పుచ్చుకొనుడు. సంచి తేలికగానున్నది. అంతసొమ్ము లేదేమో ? ఇరువదయైదు వరహాలన్నమాటేగాని, ఈబేరములో నాకర్ధవరహాయైన లాభము మిగులదు. ”

“ ఎంత మోసకత్తెవమ్మా నీవు ! అర్ధవరహాయైన లాభముండ దనుచున్నావా ? పైమెరుపులుగల ఈకడియము హారెవరైన నీవు చెప్పినవెలకుఁ గొందు రేని ఈబేరములో నీ కిరువది వరాలకంటె నెక్కువ లాభముండును, రా. రా. సబబుగాఁ జెప్పు ధర అంబరు స్త్రీలన్న నాకు మిక్కిలి యిష్టము. మానసింగు మేనత్తయైన అంబరు రాణికి నామీఁద చాలదయ. ఆమె వైద్యులే బంగాళా జమీందారు

గాయపడి యొడలు తెలియక వచ్చినప్పుడు వానిజబ్బు కుదిర్చెను. పదియేను వరాలకిచ్చెదవా? ఔనో కాదో వెంటనే చెప్పు? నేనింకను వెలగలసరుకులు కొనవలెను పైమెరుగులుగల సివస్తువుల కోసము చాలసేపిచ్చట నిలువఁజాలను."

"బంగాళా జమీందారుఁడు తనకు రాణీగారు చూపిన దయకు మంచి ప్రత్యుపకారము చేసినాఁడు. నగరులో మిక్కిలి యందకత్తెయైనబానిసను లేవఁదీసికొని పోయినాఁడు. అది తార్తారపిల్ల గూడ. అతఁడో హిందువుఁడు. అమ్మా! బంగాళములోని జనులు విచిత్రపు మనుష్యులు. అక్కడ స్త్రీలు రవికెలు తొడుగుకొనరు. చీరలు మాత్రము కట్టుకొందురు. మగవాండ్రు తలపాగ చుట్టుకొనుటకైన నిప్పటికి నేర్చుకొనలేదు. అమ్మా! మీదారిని మీరు వెళ్లండి. ఈకంకణము మీకు పనికిరాదు మీసంచిలో సరిపడనైదు వరహాలుండినగాని మీకిది దొరకదు. అంతమట్టుకు లేదేమోయని నాసంశయము."

"ఇంతకంటె నెక్కువ న్యాయముగా విక్రయించు దుకాణమునకు పోవలెను. ఆయంగడిలో చీరెకట్టుకొని యొకపడఁతి యమ్ముచున్నది; ఈరాజధానినగరమున కామె బంగాళమునుండి యేమైన వింతనగలు తెచ్చినదేమో చూడవలెను."

"ఔనౌను! ఆబంగాళా స్త్రీ కొంచెము నెలకు వెండి తాటవస్తువులమ్మగలదు. అవేవో చూచుకొనండి. అవి పక్షి యీకలవలె తేలిక. సన్న దువ్వలువలలోను, వెండిపనులలోను బంగాళీలు చాల జాణలన్నమాట నేను కాదనను. కాని, ప్రశస్తమైన బంగారుమలామా వస్తువులు కావలెనన్న అంగడివే కొనవలెను. నేను కడపటిమాట చెప్పెద వినండి! ఇరువది వరహాలిచ్చితిరా కంకణమిచ్చెదను. అంతసొమ్ము మీసంచిలో లేనియెడల మీభర్తగారి నడుగుడు. అదె! వచ్చుచున్నారు." అని యా రాజపుత్రస్త్రీ మేలిముసుగు దిగవేసికొనెను."

"ఆహా! నారాణి కవిత్వము చెప్పుటమాని, ప్రపంచ వ్యవహారములోఁబడి యీ నరకులపై దృష్టినిలిపినదా! కాని, ఆయుంగడిమీఁద నున్న పడఁతి యంబరు స్త్రీయని నాయూహ. నాయూహ నిజమైనచో బేరమునకు మంచి నెఱజాణ దొరికినది. ఆగ్రా ఖజానాలోనుండి బంగారు లాగివేయుటకు అంబరు స్త్రీలు మిక్కిలి గట్టివారు."

"దేవా! అలాగే, అంబరు పురుషులు గట్టి చేతిపట్టుగలవారు; అంబరు స్త్రీలు మంచి మాటనేర్పు గలవారు. పదివరహాలైన చేయని యీ కంకణమునకీమె యిరువది వరహాలు తెమ్మనుచున్నది. నేను వెఱ్ఱిదాననై పదియేను వరహాల కిమ్మంటిని. ఓమహాచక్రవర్తీ! అంబరు కాంతలతో బేరమాడునప్పుడు మిక్కిలి జాగ్రత్త. ఆనల్ల కన్నులకు, ఆగడుసు మాటలకు, మీరు సామ్రాజ్యమంతయు బేరములో గోల్పోవఁసి యుండును."

"రాజపుత్రసుందరీ! ఇందు కేమందువు" అని చక్రవర్తి యడిగెను.

అనవుడు స్ఫటికపు నేలమీఁద చూపులు నిలిపి, గరువముతో నారాజపుత్రాంగన యిట్లుత్తరము చెప్పెను:—"మహాప్రభూ! ఆగ్రా ఖజానాలోని బంగారము కొంత యెప్పుడైన అంబరు చేరినయెడల, అంబరులోని ఉక్కు ఎక్కువ తరుచుగా నాగ్రాలో కావలసియుండును. అంబరు స్త్రీలు చురుకు నాలుకల నుపయోగించుటలో నేర్పుగలుగకున్నను లేరి—అంబరు పురుషులు సన్నని యీటెల నుపయోగించుటలో మిక్కిలి ప్రౌఢులు."

"రాజపుత్రసుందరీ! చక్కఁగా జెప్పితివి. సామ్రాజ్యమునకు రాజపుత్రులు చేసినసేవ నక్బరెన్నఁడు మఱువఁడు నుంచిదానవు. దీని నిజమైన వెలయెంతో చెప్పు? మంత్రకత్తెలవంటి రాజపుత్రసుందరులు మాహృదయము లెల్లప్పు డపహరించుచున్నారు. మా బంగారమైనను మాకు విడిచి దయజూడుఁడు."

నెఱజాణయైన యా రాజపుత్రసుందరి వెనుకటివలె మరియాదగా నిట్లుత్తర మిచ్చెను:—"మహాప్రభూ! దేవరవారి నగరును భటులు లెన్నఁగా గాచుచున్నారు. మంత్రిగాండ్రు గాని, సుప్రశిక్షితులుగాని దొంగిలించుట కవకాశము లేదు. కానైతే—"

"కల్యాణీ! భయపడకు. నీమనసులోనున్న దేమో చెప్పు కానైతే అంటివి. అదేమిటి?"

అనవుడు రాజపుత్రి సుందరి చిఱునవ్వు నవ్వి యిట్లనెను! "కానైతే రత్నరాశి కధిపతియైన రాజు నీచవ్యాసక్తయును గలవాఁడై నప్పుడిట్టివి జరుగుచుండును."

అనవుడు సలీమారాణి యిట్లనెను:—"ప్రియురాలా! ఈకంకణ మునకు మతియైదు వరహాలు. నీవు నిజము చెప్పితివి. ఈకంకణమునకు కిరువదివరహాలు పుచ్చుకో. తమ చక్రవర్తియెదుట మంత్రులు, సామంతులు పలుకలేని సత్యమును నీవు పలికితివి."

అంతట నక్బరు నవ్వుచు నిట్లుబలికెను:—"ఇది యంతఃపురములో రాజద్రోహముగాదా? స్నేహముగా రాజపుత్రసంస్థానమునుండి యొక యువతి వచ్చి చక్రవర్తిమీఁద నిందవేయుచున్నది. ఆకుట్రలో మారాణియు చేరుచున్నది. తమ ప్రియురాండ్రను నిరంతరము మెప్పించుటకై ప్రయత్నములు చేయునట్టి పురుషుల గుణములు మెచ్చుకొనుచు నీవొక్కమాటయిన నాడలేవా? నీవు కవితాదేవతా పుత్రికవు గదా!"

ఆకవయిత్రి భర్తృవచనమును విని చిఱునవ్వు నవ్వి తలయూఁచి వెంటనే కొన్ని పద్యములతో నుత్తరమిచ్చెను.

సలీమాబేగము వెంటనే రచియించి పద్యములు చదువుచుండఁ జాలమంది పడఁతులక్కడ గుంపుగూడి చదువుట ముగిసినతరువాతఁ జక్రవర్తి పరాభవమునకుఁ జప్పటలుగొట్టి నవ్విరి.

చక్రవర్తియు వారితోఁ గలిసి నవ్వి "నా యందు కొంచెము దయ యుంచండి! రాజపుత్రియు, మొగలాయిపడఁతియుఁ గలసి తాఁకిన యెడల వానిదెబ్బ కాచుకొన శక్యముగాదు. హల్దీఘట్టములో నిది యిట్టిదేయని ప్రతాపసింగు కనిపెట్టెను. అది నా నగరులో నేఁడు నేను కనిపెట్టితిని." అని చక్రవర్తి యచ్చోటునుండి మూవలకుఁ దొలఁగి పోయెను.

"హా! సుభానల్లా! మోహనురంబరుకళ్యాణి! ఇదిగో నీ కిరువదివరహాల నిచ్చుచున్నాను. మరల యుద్ధములకలసిన యీ యవఖకెన్నఁడు పగవానికి భయపడి పాఱిపోవని శత్రువును గుర్తించినాను." అని యిరువది వరహాలుగల సంచి యామెముందుపెట్టి తనగూడవెంటఁ బోవలెనను తొందరగాఁ గ... బట్టుకొని వెళ్ళమఱచెను.

వెంటవెళ్ళి నలీనూ బేగము నవ్వుచు భర్తతో నిట్లనియె; "అయ్యా! మీ రక్కడే యుండదలఁచుకొన్నను ఆ యంగడిలో తూర్పు దేశమునుండి వచ్చిన యొక యింగనసరకు లమ్ముచున్నది. ఆమె తెచ్చిన తూర్పు దేశపు సరకులు జూచుటకైన—లేదా యామె సుందర ప్రాచ్య దేశ ముఖమైన—జూచుటకైన మీ రక్కడే యుండదలఁచుకొన్నాను."

"ఊరుకో ఊరుకో! నిర్దయురాలా! ఊరుకో. క్రొత్తవాండ్ర యెదుట మగనిని నీచపఱచకుము. చక్రవర్తికి తననగరులో గౌరవము లేక పోయినను తూర్పు దేశపు జనులవల్ల నిప్పటికిని కొంతగౌరవము పొందుచున్నాడు. ఓ చక్కని యాఫ్ఘనుపడఁతీ! నీ వెవరవు? ఆ సుందర విశాల నేత్రములను నేను మున్నొకసారి చూచియుంటినని జ్ఞాపకము. వింత వేషములో వచ్చిన యీ క్రొత్తయువతి యెవరు? నా కగపడకుండ నీ వామెను దాచుచున్నావేమి?"

అనవుడు వినయముతోఁ జక్రవర్తికి సలాముచేసి యా యాఫ్ఘను యువతి యిట్లు మనవిచేసెను; "మహాప్రభూ! నాకిది యెంతో గౌర

నెఱజాణయైన యా రాజపుత్రసుందరి వెనుకటివలె మరియాదగా నిట్లుత్తర మిచ్చెను:—"మహాప్రభూ! దేవరవారి నగరును భటులు లెస్సగా గాచుచున్నారు. మంత్రగాండ్రుగాని, మాంత్రికత్తెలుగాని దొంగిలించుట కవకాశము లేదు. కానైతే—"

"కల్యాణీ! భయపడకు. నీమనసులోనున్న దేమో చెప్పు. కానైతే అంటివి. అదేమిటి?"

అనవుడు రాజపుత్రీసుందరి పెద్దనవ్వు నవ్వి యిట్లనెను! "కానిస్తే రత్నరాశి కధిపతియైన రాజు నీచప్రాయము కలవాడై నష్టాష్టిని జరుగుచుండును."

అనవుడు సలీమారాణి యిట్లనియె:—"ప్రియురాలా! ఈకంకణమునకు మఱియైదు వరహాలు. నీవు నిజము చెప్పితివి. ఈకంకణమున కిరువదివరహాలు పుచ్చుకో. తమ చక్రవర్తియెదుట మంత్రులు, సామంతులు పలుకలేని సత్యమును నీవు పలికితివి."

అంతట సర్కారు నవ్వుచు నిట్లుపలికెను:—"ఇది యంతఃపురములో రాజద్రోహముగాదా? స్నేహముగా రాజపుత్రసంస్థానమునుండి యొక యువతి వచ్చి చక్రవర్తిమీఁద నిందవేయుచున్నది. ఆకుట్రలో మారాణియే చేరుచున్నది. తమ ప్రియురాండ్రను నిరంతరము మెప్పించుటకై ప్రయత్నములు చేయునట్టి పురుషుల గుణములు మెచ్చుకొనుచు నీవొక్కమాటయైన నాడవేలా? నీవు కవితాదేవతాపుత్రికవు గదా!"

ఆకవయిత్రి భర్తృవచనములను విని చిఱునవ్వు నవ్వి తలయూచి వెంటనే కొన్ని పద్యములతో నుత్తరమిచ్చెను.

సలీమాబేగము వెంటనే రచియించి పద్యములు చదువుచుండఁ జాలమంది పడఁతు లక్కడ గుంపుగూడి చదువుట ముగిసినతరువాతఁ జక్రవర్తి పరాభవమునకుఁ జప్పటలుగొట్టి నవ్విరి.

వరము. నన్ను మీరు గుర్తించుట నాభాగ్యము. నేను మీయంతఃపుర ములో పెరిగినదాననే. పూర్వకుటుంబము మీయనుగ్రహముచే వర్ధిల్లి నది. దేవరవారు మాయన్నగారైన షేరాఫ్ఘనునకు బంగాళములో గొప్పజాగీరు దయచేసినారు. దేవరవారికి కతఁడు సలాములు బంపి నాఁడు. అతనిభార్య మెహరున్నిసా కూడా సలాములు చెప్పుకొన్నది."

"షేరాఫ్ఘనుఁడు శూరుఁడు, తగినవాఁడు. ఎంతగొప్ప జాగీరిచ్చి నను అతనిప్రజ్ఞకు తగదు. దేవుఁడతనికింతకన్న గొప్పమేలు చేసి నాఁడు మహాసుందరియు, పతివ్రతయునైన భార్యను ప్రసాదించి నాఁడు." అని యక్బరు బదులుచెప్పెను.

"దేవుఁడు చక్కఁగా నాలోచించినాఁడు. ఆమె కన్నులలో ప్రమాద మున్నదిగనుక దేవుఁడామె నాగ్రానుండి పంపివేసినాఁడు." అని తనలోఁ దాననుకొని యట్లామె గొణుగుకొనెను.

"తెలివితక్కువ పిల్లా! చాలు చాలు, ఊరుకో. నడిబజారులో నట్టి విషయములు ముచ్చటింపఁగూడదు. నీక్రూర నేత్రములలోఁ గూడ ప్రమాదమున్నదని నాయభిప్రాయము. చక్కని పడుచు వాని నొకని నీకొఱకుఁగూడఁ దెచ్చి మంచిజాగీరుతో గూడ నిన్ను వానికంటఁ గట్టినచో నీవల్లగూడ చాల మేలు కలుగవచ్చును. నాసైనికులు పడ మట పారసీకులను, తూర్పున నాఫ్ఘనులను, ఎకుర్కాని గెలువఁగలరు. కాని, రాచనగరులోనే పారసీకయువతులు, ఆఫ్ఘను కాంతలు తాఁకిన యెడల, దుర్బలుఁడైన యీచక్రవర్తి నెవరు రక్షింపఁగలరు?"

అనవుడు నా యాఫ్ఘనయువతి తలవంచుకొని కన్నులు మూసికొనెను. అక్బరు మందహాసముచేసి యిట్లడిగెను: "ఈ దుంగడిలో నీప్రక్కను గూర్చున్న యాక్రొత్త యువిద యెక్కడినుండి వచ్చినది?"

"అయ్యా! ఈమె బంగాళమునుండి వచ్చిన యొక గొప్పయువతి, మావదిన మెహరున్నిసా వద్దనుండి నాకు సిపారసులు తెచ్చినది.

ఆగ్రాలోని ముఖ్యప్రదేశము లన్నిటిని ఈమెకు నేను జూపి యీ బజారునకు రమ్మని బలవంతపెట్టి తీసికొనివచ్చితిని. ఆమె దూరమందున్న తన స్వగ్రామమునకు బోకమునుపు పాదుషాగారి దివ్యాంతఃపురములలో నున్న రాణులను, బేగములను జూచి సంతోషించునని యీ పని చేసితిని.''

"నా యంతఃపురమున కామె వచ్చుట సంతోషము. ఆమె తిరిగి స్వదేశమునకు వెళ్లినప్పుడు, దూరమునను దాపునను నున్న తన ప్రజలందఱను సంతుష్టులఁ జేసి పరిపాలించుటయే నియమముగాఁబెట్టుకొన్న యీచక్రవర్తినిగురించి మంచి తలంపులు కలిగి యాతని పేరు జ్ఞాపకము చేసికొనుఁగాక'' యని కోరుచున్నాను.

"హిందూసోదరీ! యిందఱికి వచ్చి చక్రవర్తిగారికి సలాము చేయుదమా'' అని యామెతోనాప్ఘను యువతి చెవిలోఁ జెప్పెను.

పాపము హేమలత దేవతల కథలు విన్నట్టుగానే హిందూస్థానము బరిపాలించు చక్రవర్తిని గురించి వింతవింత కథలు వినెనే గాని, సామాన్య మనుష్యుల కనులకుఁ గన శక్యముగాని యీ సార్వభౌము నెన్నఁడుఁ జూడలేదు. నవరత్న ఖచితమైన కిరీటము ధరించు తలయు, హిందూస్థానమున కంతకు నభయప్రదాన మిచ్చి పాలించుహస్తములు నాఁ డక్కడ తన యెదుట నున్నవని యామె నమ్మలేదు. చక్రవర్తి యంగడి యెదుట నిలువఁబడినప్పుడు హేమలత మేలిముసుగు చాటు నుండి, యాతని విశాలమైన ముఖమును, నెఱసిన మీసములును గడ్డమును, నల్లని నేత్రములును జూచెను. ఆ నౌరోజా బజారులో సార్వభౌముఁడు, నాతని ప్రజలు హెచ్చుతగ్గులు లేక సమానులుగ సంచరించుట యాచారమైనను నది యెఱుఁగక. హేమలత, తన హృదయమున దాఁగియున్న యొకానొక కోరికం బురస్కరించుకొని చక్రవర్తికి మోఁకాళ్లపై నిలిచి వినయ విధేయతలతో నమస్కరించుచు

నలాము జేసెను. నలీమూరాణి నవ్వెను. కరుణాళువైన చక్రవర్తి హృదయము కరంగెను.

అనవుడు సహజముగా దయామయమైన హృదయమునుండి వెలువడు మాటలతో నతం డామె నుద్దేశించి యిట్లనియె: "బంగాళాదేశపు సోదరీ! లే లెమ్ము. నేనిరాత్రి చక్రవర్తిగ మీకడకు రాలేదు. అన్న, చెల్లెలను జూచినట్లు జూడవచ్చితిని. నీ భక్తి గౌరవములకు మిక్కిలి సంతసించితిని. హిందువుల యొక్కయు మహమ్మదీయుల యొక్కయు దేవుండు నావల్ల నెన్నిలోపములున్నను, నాకు తా నప్పగించిన యీపరిపాలనాకృత్యము జనానురంజకముగాం జేయున ట్లనుగ్రహించుంగాక!"

"హృదయేశ్వరా! ఇది నిజమయిన కవిత్వము, దేవరవారి నోటనుండి యప్రయత్నముగా వెడలిన మాటలముందఱ నా కవనము నిస్సారమై చప్పగా నున్నది." అని యాశ్చర్యముతో మగనిని జూచుచు నలీమూరాణి పలికెను.

"కవయిత్రివైన యో రాణీ! నేను నిరక్షరకుక్షిని. నాహృదయములో నుండి యేమి వచ్చునో యదియే వెలికిం బలికెదను."

"మహాకవీశ్వరుండు మాత్ర మింతకన్న నెక్కుడుగా నేమి చేయం గలండు? దేవా!"

"ఏపట్టణమునుండి వచ్చినదో, యే వంశమునం బుట్టినదో యీ బంగాళాయువతి నడుగుము."

ఆ మాట కాష్ఠను యువతి వెంటనే యిట్లుత్తరము జెప్పెను; "స్వామీ! యీామె దేవీపురమునుండి వచ్చుచున్నది. ఆమె భర్త దేవీపుర సంస్థానమున కిప్పటి ప్రభువు. క్రొత్తగా తమ యధికారము క్రిందికి వచ్చిన బంగాళాదేశములో నది. మిక్కిలి పురాతన సంస్థానములలో నొకటి."

"ఓహో! దేవీపురమా! ఇది నేను విన్న ల్లే జ్ఞాపకము. దానికి ప్రక్కనున్న మఱియొక సంస్థానముతో నెడ తెగని పోరాటముగాదా? దాని పేరేమిటి?"

"మహాప్రభూ! వీరనగర సంస్థానము" అని యప్పుడప్పుడు హేమలత నడుగుచు నాష్టను పడంతియే చక్రవర్తి కుత్తరము జెప్పుచు సంభాషణము సాగించెను. ఏమన హేమలతకు ఉత్తర హిందూస్థాన భాష బాగు రాదు. అర్థము చేసికొను శక్తిమాత్రము కలదు. అదిగాక చక్రవర్తియంతటి వానితో మాటలాడుట కామె సిగ్గు వడెను. "వీరనగరమునకు, దేవీపురమునకు చిరకాలవైరము గలదు. అది యిప్పుడు ముగిసినది. ఇప్పుడీమె భర్త వీరనగర ప్రభువునకుం బ్రాణమిత్రుడు." అని వెండియు నాష్టను పడంతి చెప్పెను.

"వీరనగర ప్రభువా! దేశద్రిమ్మరియైన యాకుట్టివానిని గురించి నేను కొంచెము మెఱుంగుదును. అతడీ నగరున కొంత తెలివితక్కువపని చేసెనుగాదా? అందు కతనిని రాజస్థానమునకుం ద్రోసివేసితిమిగాదా?" అని నవ్వుచుం జక్రవర్తి పలికెను.

చక్రవర్తి నోట వెడలిన యాపలుకులువిని హేమలత భయమున వడంకెను. ఆమె మనసులోనున్న కోరిక మఱియొకసారి యామె కప్పుడు జ్ఞప్తికి వచ్చెను. ప్రక్కనున్న యాష్టను మిత్రముతో నామె జంకుచు నేదో చెవిలోంజెప్పెను. అదివిని యాష్టను పడంతి యిట్లనియె:

"అట్లు కాదమ్మా! చక్రవర్తితో నీవిజ్ఞాపనము స్వయముగానే చేసికొనుము. నీకు మాభాష కొంచెము వచ్చును. తమ కష్టనిష్ఠురములు స్వయముగానే మనవిచేసికొను వారియెడల చక్రవర్తి మిక్కిలి జాలిగలిగి యుండును."

కృపాళువయిన చక్రవర్తియు నామె కుత్సాహముగలుగ నిట్లు హెచ్చరించె: "సోదరీ! చెప్పు. ఏదో నీకు బాధకరమైన విషయ

మున్నదని తోచుచున్నది. నీవేదైన సహాయము గలంపిన పక్షమున నది నాశక్తిలో నున్నయెడల, తప్పక నీకోరిక ఫలింపఁజేసి నీకు సంతోషము గలిగించెదను."

సమయము గాఁటిపోయిన యెడలఁ గలిసిరాదని హేమలత చిత్తక్షోభమును జయించి, కంటనుండి జాఱిన నీరు తుడుచుకొని, మేలిముసుగు దీసివైచెను. ఆమె మొగము వెలవెలఁ బాఱుచుండెను. కంఠస్వరము సిష్కంపమై గంభీరముగనున్నను తడఁబడు మాటలతో నిట్లు విన్నవించెను!

"మహాప్రభో! నన్ను క్షమింపవలయును. పూర్వులు పాలించిన సంస్థానమునుండి దేశాంతరముల పాలైన యొక పురుషునిగురించి నేను దేవరవారితో మనవిజేయ సాహసించుచున్నాను. అతని పేరు నరేంద్రనాథుఁడు. అతఁడు మీనిమిత్తము పోరాడెను. మీనిమిత్తము నలుకులఁతిని గాయఁపడెను. ఈ మహాసామ్రాజ్యములో నతనికన్న పరాక్రమశాలియు నతనికన్న రాజభక్తుఁడును మఱియొకఁడు లేఁడు. అతఁడు పొరబాటున జేసిన పసుచుతనపు తప్పులను బరిపూర్ణానుగ్రహామున దేవరవారు క్షమించి, వాని సంస్థానము వానికియ్యవలెనని వేఁడుచున్నాను. ఈపనికి బంగాళములో కోట్లకొలఁది జనులు సంతసించి మిమ్ము దీవింతురు. ఇక్కడ లేనివానిఁగురించి యాఁడుది విన్నవించినందుకుఁగూడ క్షమింపుఁడు. అతనిని నేను చిన్నప్పటినుండి యెఱుఁగుదును."

ఈ కడపటి మాటలు పలుకునప్పుడు హేమలత సిగ్గుపడెను. మొగము, చెక్కులు జేవురించెను బాష్పబిందువులు విడిచి తలవంచుకొనెను.

"ప్రియురాలా! సలీమా! ఇది నిజమగు కవిత్వము కాదా! ఈ బంగాళీయువతి కన్నీటితో వాదించిన వాదముకంటె నీకవితారచనలతో తప్పులు చేయుచున్న నీభర్తను గురించి యెక్కువ పాటవ

ముగా వాదింపఁగలవా?” యని చక్రవర్తి తన రాణి నుద్దేశించి పలికి, యంతవఱకు మోకాళ్ళపైఁ నిలిచియున్న హేమలత కిట్లు బదులు చెప్పెను:

“బంగాళ దేశ సోదరీ! లెమ్ము. నరేంద్రనాథుఁ డెల్లప్పుడు పరాక్రమశాలి యనియు, మంచి మనుష్యుఁడనియు నేఁ దెలిసికొంటిని. అతఁడు పరమభక్తితోఁ జేసిన కొలువు నే నెఱుఁగుదును. రాజస్థానములో నీవదును నతఁడు జేసినసేవఁగూడ ప్రశంసనీయము. మాకోరికయు, నీవాదమును సరిపోయినవి. కొలఁది కాలములోనే కొన్ని గౌరవములతోఁగూడ నతని సంస్థానము నతనికిచ్చునట్లు మేము ఫర్మానా పంపెదము. నీపతిని మరల కలిసికొన్నప్పుడు నీవంటి సాధుశీలము, నీవంటి యుత్తమ చరిత్రముగల నారీరత్నముయొక్క యభిమానమునకు పాత్రమయిన యాపరాక్రమశాలి, కనకసింహాసనముపైఁ గూర్చుండు చక్రవర్తికి సైతము మాశ్చర్యము గలిగించుచుండుటచే నతని జీవితము ధన్యమైనదని చెప్పుము.”

హేమలత లజ్జావినయ సంభ్రమంబులు పెనఁగొనఁ జక్రవర్తికి వెడియు మోకాళ్ళపై నిలిచి సలాముచేసెను. అంతలోనే చక్రవర్తి యటనుండి యావలకుఁ బోయెను.

## ౨౯

యమునానదీ తీరమునయున్న మధురాపురముకన్న నెక్కువసుందరమై యనేకచరిత్రాత్మకమై వెలయు నగరము లోకములో మఱియొకటి లేదు. పవిత్రులైన చీనాయాత్రికులు క్రీ. శకమున నైదవ, యేడవ శతాబ్దములల వచ్చినప్పుడు సైతము మధురానగరము హిందూమతమునకు నిలయమై విద్యాపీఠమైయుండి యిప్పటికిఁగూడ నట్లె యున్నది.

శ్రీకృష్ణుని జన్మస్థానమైన యీపురము బహుకవితా రచనలతో, ననేక గాథలతో నిండిన కృష్ణమతమున కునికిపట్టయి, హిందూదేశ మందలి నానాభాగములనుండి వేలకొలంది తీర్థయాత్రికులను నాక ర్షించుచున్నది.

అన్ని మతముల సామరస్యముగల హిందూధర్మములో ననేకమత ములుపుట్టి వర్థిల్లినవి. కాని, యన్నిటిలో శ్రీమహావిష్ణు నవతారమైన శ్రీకృష్ణుని మతము సర్వోత్కృష్టమై జనులలో విరివిగా వ్యాపించి యున్నది. శివుడుగూడ దేవుడుగా బూజింపబడుచున్నమాట నిజము. ఆదేవుడు పూర్వకాలమున గాళిదాస, భారవికవుల కావ్య ములలో బ్రశంసింపబడినాడు. మధ్యకాలమున గాశ్మీరము మొదలు కొని యుత్కళదేశము వఱకుగల యావద్దేశమున ననేక దేవాలయ ములలో సేవింపబడుచుండెను. వానిలోగొన్ని యిప్పుడు పాడువడి నను బూర్వపు ప్రాశస్త్యమును జాటుచున్నవి. ఇప్పటికిని శివుడు వారణాసిలోను, ద్వారకలోను బ్రధానదైవతము. ఎన్నో తెగలలో శివున కనేకభక్తులు గలరు. వారు ముఖ్యముగా నగ్రవర్ణములలో నున్నారు. కాని, శ్రీకృష్ణభక్తి జనసామాన్యములో నెక్కువగా వ్యాపించినది. కడచిన వేయిసంవత్సరములలోను హిందూదేశమున నది యింతింతనరాని ఆవేశముతో దేశమంతట సామాన్యజనుల మన స్సుల నాక్రమించినది.

మానవుల మతములను గురించి వ్రాయు చరిత్రకారులు మొదటి నుండియు హిందూదేశ చరిత్రమందేగాక, యన్ని జాతుల యొక్కయు, నన్నియుగముల యొక్కయు జరిత్రములలో గూడ నీశైవ వైష్ణవ మతద్వయముల యుత్పత్తి వృద్ధులనుగురించి వివరముగ లిఖింపవలసి యుండును. హిందూదేశమున బూర్వకాలమున వైదికధర్మములు, కర్మములు పైవర్ణములవారికే కరణీయములై యుండెను. ఇంక

దక్షిణాపథమునందు, నుత్తరదేశమందు, విష్ణునామమువిని యశోదకొడుకే పరాత్పరుడనియు, బూజనీయుడనియు విశ్వసించి, మధురలో జన్మించిన యీ వాసుదేవునిగూర్చి వారివారి భాషలలో, గేయములు రచియించి కీర్తించి కృతార్థు లగుచుందురు.

అది శీతకాలము. బంగాళమునుండి శిరీషుని మొదలగు వారెక్కిన పడవ లొకనాటి యుదయమున మధురాపురము జేరెను. అది మేఘచ్ఛన్నముగాక సంపూర్ణ సూర్యప్రభ వెలిగిన ప్రాతఃకాలము. ప్రాతఃకాలపుయెండ గుడులమీదను, గోపురములమీదను వ్యాపించెను. గోపురములు, మేడలు, నెత్తియి యాకాశ మొఱయుచుండెను. ఉదయస్నానములుజేసి ప్రార్థనలు చేయుటకు జనులు మెట్లమీదినుండి నదిలోనికి గుంపులు గుంపులుగా దిగుచుండిరి. తొమ్మలోతు నీటిలో దిగి బ్రాహ్మణులు యమునానదిలో నిలిచి జందెములు పట్టుకొని సూర్యనుద్దేశించి, గాయత్రీమంత్రము బఠించి, యర్ఘ్యప్రదానములు చేయుచుండిరి. ఈమంత్రము బ్రాహ్మణులు మూడువేలేండ్లనుండి ననుదినము బఠించుచున్నారు.

"ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్"

ఉత్తమ స్త్రీలు మేలిముసుగులు దీసి, సూర్యభగవానుని జూచి నీట మునిగిరి. హిందూప్రపంచముయొక్క నానాభాగములనుండి వేనవేలు జనులు మెట్లెక్కి దిగుచుండిరి. ప్రాతఃకాల కైంకర్యముల నిమిత్తము కోవెలలోనికి రమ్మని గంటలు గణగణ మ్రోగుచుండెను.

నాటి ప్రాతఃకాలమున హేమలతయు, దల్లియు, శైవలినియు నచ్చటి గుడులను, గోపురములను, మేడలను మిద్దెలను మిక్కిలి యక్కజంపడి చూచిరి. చిన్ననాడు తామెవ్వరిని గూర్చి విచిత్రకథలు వినిరో, యెవ్వనిగూర్చి పాటలుపాడిరో యట్టి కృష్ణుడు పసిబాలుడై గో

లకుఁడై వలపుకాఁడై జగద్రక్షకుఁడై గావించిన లీలలన్నియు నాదిన మున మొట్టమొదటిసారి యతని జన్మస్థానమును జూచినతోడనే మనో వీధిని తాండవమాడుచు వారికి జ్ఞప్తికి వచ్చెను. ఆయనుభవమును వర్ణిం చుటకు మాటలుచాలమి వివశులై వారానందబాష్పములు విడచిరి. వారి హృదయములనుండి పవిత్రమయిన యానందరసము, విపరీతమైన భక్తి, పరమేశ్వరుని దెలిసికోవలయునను నాసక్తి, యొక్కసారి బయలు వెడలెను. తెల్లవారిన తరువాత నాపడఁతులు ముగ్గురు పడవలు దిగి నదిలో స్నానములు జపములు జేసిరి.

శిరీషుడు స్త్రీల కేర్పాటు జేయుటకై యొక దేవాలయమునకుఁ బోయెను. పిమ్మట వారందరుఁ బ్రభాతసేవ నిమిత్తమై యొక దేవాల యమున కరిగిరి. అది యునయహారతి సమయము. జను లనేకులు- ముఖ్యముగా స్త్రీలు, కోవెలలో విగ్రహముల కభిముఖముగా నిలువఁ బడిరి. కొందరు పూవులు దెచ్చిరి; కొందరు గంపలనిండ స్వామికి సమర్పించుట కితరవస్తువులను దెచ్చిరి; కొందరు రూపాయలను సమర్పిం చిరి. పూజారి సంస్కృతముతో స్తుతులు పఠించెను. సాంబ్రాణి ధూపముతో గర్భాలయము నిండిపోయెను. సేవాకాలము తరువాత, గంటలుకట్టి కడసారి మ్రోగినపిదప, యాత్రికులు విగ్రహములకు సాగిలఁ బడి మ్రొక్కి యర్చకుల దీవనలఁ బడసిరి.

ఆపుణ్యక్షేత్రమునఁగల కోవెలలు మొదలగు వానిని జూచుచు వారుదయకాలము గడిపి, సాయంకాలమునఁ బావనమైన బృందా వనముఁ జూడఁ బోయిరి.

మధుర కృష్ణుని జన్మస్థానము. బృందావనము కృష్ణుని బాల్యయౌ వన క్రీడలగాథలు గలది. మానవబాలకుఁడైపుట్టి, మానవచాపల్య ములుగలిగిన కృష్ణుడు మిక్కిలి యల్లరిపిల్లవాఁడనియు, నెన్నెన్నో తప్పులు చేసెననియుఁ దెలియపరచుగాథ లనేకములు గలవు. కృష్ణుఁడు

ణమై సౌఖ్యప్రదమై యుండునట్లు గాపుగూడ జేయుము. నీ యింటికి వచ్చిన పేదల నాదరింపుము. ఆకలితో వారిని నీయింటినుండి వెడల నీయకుము. ఇదే మనమతప్రకారము స్త్రీల ధర్మము, దేవుని దయవల్ల నీకడుపుచల్లగా కొడుకులు కూతుళ్లు పుట్టిపెరిగి పెద్దవారైనతరువాత మన ధర్మప్రకారము జీవయాత్రతో కృతార్థులైనవారికి విధింపబడిన మార్గము ననుసరించి నీవును ఈశ్వరధ్యానము జేసికొనుచు సుఖముగా చరమదశ గడుపవచ్చును.

అనవుడు నప్పటికి నూరటజెందక హేమలత యిట్లుపలికెను:—
"అమ్మా! మేము చిన్నవాండ్రము. అనుభవశూన్యులముగాము. పరిపక్వమైన నీజ్ఞానమువల్ల నీచేయూతవల్ల మేము మెలగవలసినవారము. దేవీపురవ్యవహారము లు నీవు లెస్సగా నెఱుగుదువు. ఆవిషయమున దగుసలహాలిచ్చుటకు నీవు మాదాపున నుండవద్దా? వీరనగరము నీపుట్టినిల్లేగదా. నీవు నీకుమారునిగాలెనే పెంచిన నరేంద్రునకు సంస్థానము మరల ప్రాప్తించుచున్న సమయము వచ్చుచున్నది. అది కన్నులార నీవుజూచి యానందింపవా? భగవంతుడు దయగలిగి నీవన్నట్లు బిడ్డలు నాకు గలిగినప్పుడు—అమ్మమ్మ అమ్మమ్మయని వాండ్రు నీపేరు తలంచుకొనుచుండ వినవా? ముద్దుపెట్టుకొనవా?" ఇట్లుపలికి యామె వలవలయేడ్చెను.

కూతురిట్లన దల్లి కన్నీరు తుడుచుకొని యిట్లు మందలించెను. "బిడ్డా! నన్నింక భ్రమపెట్టకుము. ప్రపంచమంతయు మాయ. దేవీపుర వీరనగరములు స్వప్నములు. మన మీమాయలోబుట్టి పెరిగి సంసారములో గిజగిజ తన్నుకొని, ముక్తిబడయుటకు జగము మిథ్యయనియు, బ్రహ్మ సత్యమనియు దెలిసికొనువఱకు నానాబాధలు పడవలసినదనియు సర్వేశ్వరుని యాజ్ఞ. ఈలోకవ్యవహారములలో నేను చిరకాలము నిద్రించినాను. ఆవ్యవహార విషయమై చిరకాలము స్వప్న

ములుగంటిని. నాకిప్పుడు శ్రీకృష్ణుని చరణమే శరణము అదే సత్యము. తక్కినది మిథ్య. ఈభూలోక బంధములనంచి జగన్నాథుడు నన్ను విడి పించువఱకు ఈపుణ్యక్షేత్రమే నాకు నివాసము. ఆయన సంకల్పమే నెఱవేరును. ”

అని హేమలతతల్లి చెప్పెను. హిందూస్త్రీ లందఱికి స్త్రీ యుండునుపేమిన వారికి జగత్తుమిథ్య, పతిధర్మమే సత్యము.

# 30

వదినే, శైవలిని ! ఇదే మధురాపురపు సువర్ణ గోపాలయము. ఈపండు వెన్నెలలో బంగారుపూత బూసిన యాగోపుర మెట్లు మెఱయు చున్నదో చూచితివా ? ఈ యుత్సవమునాఁటిరాత్రి చిరకాలము క్రిందట విడిపోయిన మిత్రుని మనము కలిసికొందుమని యాభిక్షుక బాలుఁడు చెప్పలేదా ? ”

“హేమలతా ! ఔను. చెప్పినాఁడు. ఆజెమ్మెకు చిత్రమైన పిల్లవాఁడమ్మా. వాఁడు మనకెన్నో సంగతులు చెప్పెను, అవన్నియు నిజమైనవి. ఈతొమ్మిదేండ్లనుంచి మనకుఁ గనబడకుండపోయిన నరేంద్రునిగురించి చెప్పలేదా ? ”

“ఆ. చెప్పినాఁడు” అని హేమలత మెల్లగా బదులుచెప్పెను.

“ఆగ్రాలో నున్నప్పుడు బంగాళాదేశపు జమీందారుని గలసి కొన్నట్లును, అతని ముఖలక్షణములనుబట్టి యతని చరిత్రము తెలిసి కొన్నట్లును వాఁడు చెప్పినాఁడుకాదా ? నరేంద్రుఁడు స్వగృహమున సుఖపడఁడనియు, బయట సుఖపడుననియు, బంగాళములో సంస్థానమును గౌరవమును గోల్పోవుననియు, కాని యాగ్రాలో గౌరవమును కీర్తిని సంపాదించుననియు వాఁడు చెప్పెను. ”

లలో తిరుగుచున్నప్పుడు మీ యన్న నీకోసము బెంగపెట్టుకొని మా యమ్మాయి యింకను రాలేదని పరితపించుచుండెడి జ్ఞాపకములేదా?"

"వదినే! జ్ఞాపకమున్నది."

"నిన్ను పడవమీద నెక్కించి మా తమ్ముడును నరేంద్రుడును తెడ్లువేచి, గంగానదిలో పడవ నడుపుచుండుట, పడవ కన్నులకు గనబడక చాలదూరము పోయినప్పుడు, మీ నాయన మీకై మిత్త మెంతో యాత్రపడుట జ్ఞాపకమున్నదా?"

"వదినే! జ్ఞాపకమున్నది. ఆ దినము మాట తలపెట్టకు, గతకాలము తిరిగి రాదు"

"కాదు. గతకాలస్మృతి వచ్చినదాక మన మనసులో నుండును. నీ వప్పుడు చిన్నపిల్లవు గనుక వెనకటి వృత్తాంతము మఱచియుండ వచ్చును."

"వదినే! నేను మఱచిపోలేదు. కాని, యాదినములు తలపెట్టకు."

"కాదు. ఆదినము లీరాత్రి నాకు జ్ఞప్తికి వచ్చుచున్నవి. ఈ నది, ఈవెన్నెలరాత్రి, యీపడవ, మొదలగు నన్నియు వెనుకటి వృత్తాంతమును జ్ఞాపకము చేయుచున్నవి. మనము వీరనగరములోనే యున్నట్లును, నరేంద్రుడు నీకోసము, నా తమ్మునికోసము ఆ యిసుకతిన్నెలలో వేచియున్నట్లును నాకు తోచుచున్నది. ఈలాటి వెన్నెలరాత్రులలో నిసుకతిన్నెలమీద మీ రాడుకొనుచుండెడివారు. జ్ఞాపకమున్నదా?"

"వదినే! జ్ఞాపకమున్నది. మే మిప్పుడు పిల్లలము కాము గదా! అందుచే నవి తలచుకొన్నందున లాభము లేదు."

"హేమలతా! వెనుకటి సంగతులే మరల జరుగవచ్చును. నరేంద్రుడు వీరనగరము వచ్చును. అప్పుడప్పుడు దేవీపురమునుండి మన మతనిని జూడబోవచ్చును. ఆ తోటలోనే పూవులు కోయవచ్చును. ఆ గుడిలోనే పూజ చేయవచ్చును. ఆ యిసుకతిన్నెలలోనే

మునుపటివలె నాడుకొనవచ్చును చిరకాలమునకు కలసికొన్న మన యందఱమీఁద నక్షత్రములు మునుపటివలె ప్రకాశింపవచ్చును."

"వదినె! శైవలిని, వెన్నెకళిక వృత్తాంతము మరల జరుగదు."

"హేమలతా! మన మాశచే బ్రతుకుచున్నాము. స్థితిగతు లెట్లున్నను మన కృత్యములు మనము నెఱవేర్చుకొనవలెను. హేమలత! నీ విషయమై నాకు విచారము. మీ నాయన బ్రతికియున్నప్పుడు, మీ తల్లిదగ్గఱ నున్నప్పుడు ఉన్నట్లు మీ యిల్లిక మీఁద నుండదే. కాని, పోయినవారు పోయినను ఉన్నవారు బాగుండవలెనని మనము దేవుని వేడుకొందము. హేమలతా! నరేంద్రుఁడు మనతో వచ్చునట్లు నీవు గట్టిగా జెప్పు. అతఁడు నీమాట త్రోసివేయఁడు. చెల్లెలువలె నిన్నతఁడు చిన్నప్పటినుండి చూచుకొన్నాఁడు."

"చేయఁగలంత పని చేసెదను వదినె! ఉండుండు! తెడ్లు వేసిన చప్పుడు నాకు వినబడుచున్నది."

ఆ చప్పు డిద్దఱు నాలకించిరి. ఇద్దఱు వెన్నెలలోఁ జూచిరి.

దూరమునఁ దేలికయైన పడవ యొకటి తెడ్లవల్ల విసురుగా నీటి మీఁద వచ్చుచున్నట్లు కనఁబడెను. పొడుగుపాటి విగ్రహ మొకటి సిపాయివేషముతోఁ బడవమీఁద నిలిచెను. వెన్నెల యతని మొగము మీఁదఁ బూర్తిగాఁ బడెను. హేమలత మేను వడఁకెను. ఆమె తన పడవలోని కిటికీలో నుండి మరలఁ జూచెను.

"అతఁడేనమ్మా."అని కేకవైచి, గండె తన చేతితో నొక్కుకొనెను.

అంతకంతకు నావ దగ్గఱకు వచ్చి మెల్లగ నడిచెను. అది సువర్ణ దేవాలయము ముందఱకు వచ్చి యాగకమునుపే యా యోధుఁడు మెట్లమీఁది కుఱికి గుడిలోనికి నడిచిపోయెను.

"హేమలతా! అతఁడు నరేంద్రుఁడేనా? గుడిలోనికి వెళ్ళుచున్నందున మొగము నాకు సరిగా కనబడలేదు."

"అతఁడేనమ్మా!" అని హేమలత మరలఁ బలికి కన్నులు మూసికొనెను.

"మెల్లగా వెళ్లి యతఁడు నరేంద్రుఁడైన పక్షమున నేను సాయంకాల ప్రార్థనలు ముగించి మీకడకు వచ్చువఱకు నీవతనితో మాట్లాడుచుండుము."

"శైవలినీ! నీవే వెళ్లి కుశలప్రశ్న మడుగుము. నేను—తొమ్మిదేండ్లనుండి కలిసికొనలేదు గనుక మాటలాడుటకు సిగ్గుపడుచున్నాను."

"సిగ్గుపడుచున్నావా? ఎందుకు! నీకు చిన్నప్పటి ప్రియమిత్రుఁడు; సోదరప్రాయుఁడు. చెల్లెలు అన్నగారి నొంటిగాఁ గలిసికొనుటకు భయపడునా?"

"అతనికి నీవు కూడా చెల్లెలివంటిదానవే. వెళ్ళి పలుకరించు. నేనాతని నొంటిగాఁ గలిసికొనఁజాలను."

"హేమలతా! చిన్నపిల్లలాగేమిటీ సిగ్గు? ఆతఁడు మనలను కలిసికొనేందుకు వచ్చినాఁడు. తప్పక వెళ్ళు వెళ్ళి, మనము బంగాళమునకుఁ బోవుచున్నామనియు, సంస్థానము మరల వచ్చినది గనుక మనతో రావలసినదనియు గట్టిగాఁ జెప్పు."

"వదినే! నన్ను క్షమించు. క్షమించు, నేనతని నొంటిగాఁ గలిసికొనఁజాలను. మొదట నీవు వెళ్ళి కలిసికొనవమ్మా! నీవు వెళ్ళిన తరువాత నేను వచ్చెదను."

"ఏమి హేమలతా! నీవిలా గెప్పుడు మునుపు చెప్పలేదు. నీవెప్పుడు సరిగాను, తెలివిగాను మాటలాడుచుండెడిదానవు. విశంతువు జపము తపము చేసికొనకుండ రాత్రి దేవాలయమునకు వెళ్లఁగూడదని నీ వెఱుఁగవా? నిజము గంటయిన పట్టదు."

"అట్లయిన వదినే! నీ జపమైన తరువాత మన మిద్దఱము కలిసే వెళ్ళుదము."

"అట్లుకాదు. కోవెలలో సేవలైన తరువాత నతఁ డిక్కడ డాఁగఁడు. మనము కనఁబడకపోయిన యెడల వెళ్ళిపోవును. మునుపు విన్నట్లే యీమాటు కూడ నామాట వినుము. వెళ్ళి యతనిని కలిసికో! జపము కాఁగానే నేను వచ్చెదను."

హేమలత కొట్టుకొనుచున్న తన గుండెమీఁదఁ జేయి వైచుకొని పడవ దిగి వెన్నెలలో నడిచి గుడికిఁ బోయెను. దేవాలయ ద్వారమునఁ బ్రవేశింపఁగానె సన్న దీపపు వెలుఁగున గర్భగుడిలో నున్న దేవతా విగ్రహ మామెకుఁ గనఁబడెను. హేమలత యక్కడ నాఁగి, విగ్రహమునకు నేల జాగిలఁబడి మ్రొక్కి యీ లోకమునందుఁ గలుగు చిక్కులలోఁ దన కెట్టి కీడు సంభవింపకుండఁ జేయుమని వేడుకొనెను.

ఆలయములో గంటలు మ్రోఁగెను. మొదటిజామున జరుగు నారతి కైంకర్యము జరిగెను. నరేంద్రుఁడు మఱికొందఱు భక్తులతోఁ గలసి విగ్రహమున కెదుట నిలువఁబడెను. అర్చకుఁడు మంత్రపుష్పములు చదివి తీర్థము వారిమీఁదఁ జల్లెను. అంతట మఱియొక యర్చకుఁడు మఱికొన్ని శ్లోకములు చదవెను. ఆ శ్లోకములు పూర్వము భారవి మహాకవి రచించినవి. అందలి భావ మన్నియుగములయందు మానవ హృదయమునుండి ప్రవహించునట్టి భక్తిరసముతో నిండియుండెను.

సేవ ముగిసెను. దీపము లారిపోయెను. యాత్రికులు, భక్తులు కోవెల విడిచిపోయిరి. హేమలత యొక స్తంభముచాటున స్థిరమై ప్రశాంతమైన హృదయముతో నిలువఁబడెను.

## ౩౧

ఆ యోధుఁడు మెల్లగాఁ గోవెలనుండి వెన్నెలలోనికిఁ బోవుచుండఁ "నరేంద్రా!" అని హేమలత మెల్లగఁ బలుకరించెను.

నరేంద్రునాథుఁ డాఁగి వెనుకకుఁ దిరిగి స్తంభపు నీడనున్న యావిగ్రహమును జూచెను. అతఁడు తెప్పవాల్పక యామెవంక జూడఁ జూడ శరీరము వడఁకెను. ఏవిగ్రహమును బాల్యమున వీరనగరములోఁ జూచెనో, దూరదేశములలో నున్నప్పుడు పలుమాఱు రాత్రుల నేవిగ్రహమును స్వప్నములోఁ జూచెనో యాకాంతిముఖము నతఁడు మరలఁ జూచెను. ఆవిగ్రహ మిప్పుడు యౌవనము బ్రాపించి సంపూర్ణ వికాసము నొందియుండెను. తానొక్కసారియైన మఱచిపోక జ్ఞప్తిలో నుంచుకొన్న యాస్ఫటిక లలాటమును విశాలనేత్రములను, మఱియొకసారిచూచెను. చూచిచూచి పెద్ద కేకవైచి, కనమనోవీధిని గాపురమున్న యామెకై చేతులు చాఁచెను.

హేమలత కొంచెము వెనుకకుఁ బోయెను. ఆమెను దనను నెడము చేసిన కాలమును, స్థానమును దలఁచుకొని సిగ్గుపడి నిశ్శబ్దముగ నుండెను. హేమలత నెమ్మదిగా నిట్లనియె ;

"నరేంద్రా ! అనేకసంవత్సరములు తరువాత మనము నేఁడు కలిసికొంటిమి మనము చిన్నప్పుడు కలసి యాడుకొని స్వప్నములవంటి పిచ్చిపిచ్చి కోరికలెన్నో పెట్టుకొంటిమి. కాని, మన జీవితములు మాఱిపోయినవి. యోధుఁడవై నీవు చేయవలసినపని ముగిసినది. నీవు జమీందారుఁడవై తివిగాన నింటికి వెళ్ళి కార్యములు నిర్వహింపవలెను. నేను ఉత్తమగుణసంపన్నుఁడైన యొకపురుషుని వివాహమాడితిని. నేను మహాపతివ్రతనై యాయన సేవలఁ జేయునట్లు భగవంతుఁ డనుగ్రహించుఁగాక !"

అప్పుడు నరేంద్రుఁ డేమిప్రత్యుత్తరము చెప్పగలఁడు ?

హేమలతయొక్క మృదుమధుర వచనములు వానిహృదయమును గత్తితోఁ గోసినట్లు జేల్చెను. పాఁతుగా, మకుమారమై, చక్కఁదనము నకు నిలయమై, తనజీవితానందమై, తన ప్రణయమునకు నిధానమై

యున్న యానారీరత్న మతనియెదుట నిలిచెను. ఆమె యప్పుడు మఱియొకని ధర్మపత్నియై యుండెను. పెదవులు తడబడ నరేంద్రుం డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను:

"హేమలతా! నేను నాకర్మమేదో యెఱుంగుదును. దానిని జ్ఞాపకముంచుకొనుటకుం బ్రయత్నించెదను. కాని, పూర్వస్మృతి నాజీవితమున నీడవలెను, నన్ననుసరించి యుండును."

"నరేంద్ర! పూర్వస్మృతి యెల్లవారికి నుండును. కాని యది నీవంటివాని జీవితమును గప్పివేయగూడదు. మానసింగురాజు నీవు మేటి జోదువని కనిపెట్టినాఁడు. పాదుషా నిన్ను గౌరవించినాఁడు. నీకీర్తి నేనప్పటి కప్పుడు విని హృదయమున మిక్కిలి సంతసించితిని."

"హేమలతా! కీర్తి పక్షపాతములతో పలుకును. నీకు నాయెడం గలగౌరవమునకు నేను పాత్రుఁడ నయిన బాగుండును. యోధుని చరిత్రము దుఃఖభాజనమైనది. మాలో శ్రేష్ఠులుగూడ క్రూరులై యనర్హకృత్యములు జేసినవారై కలంకితులై యుందురు అందఱి కంటె నే మొనగాఁడనుగాను. నేను జేసినపాపములను భగవంతుఁడు క్షమించుగాక! నాసంసారములలోను, నాదౌర్బల్యములలోను దైవసాక్షిగా బాల్యమున నేను ప్రేమించిన విగ్రహమును, నాహృదయమున నిలకొల్పుకొనియుంటిని. ఆవిగ్రహమే నన్నింత కాలము రక్షించినది."

"నీయుదారభావము, నీసత్యనిత్యత నిన్ను తప్పక కాపాడియుండును. నరేంద్రా! చిన్నతనమందే యది నీయందు నేను కనిపెట్టితిని. పెద్దవాఁడయిన తరువాత నేడుకూడ నీమొగముమీఁద నే నదే చదువగలను. నీస్వభావమున కనుగుణముగా వర్తించి నీకులమునకు, నీజాతికి ననువుగా విధింపఁబడిన కృత్యములను శ్రద్ధగా నిర్వర్తింపుము."

"హేమలతా! అవి గొప్పకృత్యములె. నాతల్లిపోయిన తరువాత మీతల్లియె నాకు తల్లియై నాకుటుంబధర్మములను మరచిపోక నా కుపదేశించెను."

"మానాయనగారు పోయినారు. మాయమ్మజీవితశేషమును విరాగిణియై గడుపవలెనని వచ్చి యీయూరనే యున్నది. నే నిప్పు డొంటికత్తెనైతిని." అని హేమలత కన్నీరు వెట్టుకొని వెండియు నిట్లనియె: "కాదు. నొంటికత్తెనుగాను. ఈదుఃఖమును నేను భరించుటకు ధైర్యశాలియైన నాభర్తగారు నాకుం దోడ్పడుచున్నారు. నైనలిని యాడుపడుచన్నగారేగాని, నేనంటే యెంతో అంతప్రేమ నరేంద్రా! నీవు బంగాళమునకు రమ్ము; వచ్చి తిరుచుగా మాతోం గలిసియుండుము. అట్లుండుట కిష్టములేదా?"

ఏమనలేక నరేంద్రుం డూరకుండెను. ఏలయన కన్నీరు వెట్టుకొనుచు వినయముతో మాటాడిన యామెకోరిక నిరాకరించుట క్రూరత్వమగును; ఆమెతోం గలిసి బంగాళమునకుం బోవుట నరేంద్రుండు భరింపలేనిపని. అయిన నెట్ట కేల కతఁడిట్లనియె: "హేమలతా! నీగృహమందు నీకృత్యములు నెరవేర్చుకొనుచు హాయిగా నుండుము నాకృత్యములు నన్ను వేఱొకచోటికిం గొనిపోవును."

"అట్లు కాదు. యోధుండవై నీవుచేయవలసిన కృత్యములు ముగిసినవి. నీనగరములో నీగృహము, నీమిత్రులు నీరాక నపేక్షించుచున్నారు."

"హేమలతా! నీనగరము పూర్వము నానివాసము. ఇప్పుడు నాక్రింద నదియున్నదో లేదో నేనెఱుంగను."

నరేంద్రా! అది నీనివాసమే. నా భర్తగారు నీయాస్తి, తన యాస్తివలెనే జాగ్రత్తచేసి నిలిపినారు. నీసంస్థానమును నీకు మరల నిచ్చివేయవలసినదని పాదుషా ఉత్తరవులు పంపెనని వింటిని.

"చక్రవర్తి నామీఁద మిక్కిలి దయగలిగి యున్నాండు. నీమగఁడును నాకు సోదరునికంటె నెక్కువవాఁడు. ఒకప్పుడు నేనతనిని గురించి తప్పభిప్రాయము పడితిని. అతనికి నే నపకారము చేసితిని:

నన్నతఁడు క్షమించి నాయెడ నౌదార్యముజూపి యుపకారము చేసెను. నే నతనిదయకుఁ దగినవాఁడ ననిపించుకొని ప్రత్యుపకారమేమి చేయఁగలను?"

శిరీషుని భార్యతో నరేంద్రుఁ డంతకన్న నధికమేమియు ననలేక పోయెను ఎవనిని బాల్యమునఁ దాను కొట్టియుడఁ దలఁచెనో యతఁడే తనకుఁ బ్రాణమిత్రుఁడై మహోపకారి యగుటచే మనసున నతని కెంతో సిగ్గుకలిగెను.

"నీవు మాతో బంగాళమునకు వచ్చుటే యాయనకు ప్రత్యుపకారము. ఆయనకు నీమీఁద చాలా ప్రేమగౌరవములు గలవు గనుక నిన్నుఁ గలుసుకొనుట సంతోషము. ప్రేమగల చెల్లెలు చేసినట్లు నీవు సుఖపడునట్లు నేను చేయుదును." ఈ మాట లనునప్పుడు హేమలత స్వరములో నించుక కంపము పొడకట్టెను.

నరేంద్రుని యాలోచనలు చిక్కులి కష్టముమీఁద వ్యాసంగమున వెఁబడెను పరకాంతతో ముఖ్యముగా శిరీషునిభార్యతోఁ — జెప్పఁదగని విషయము లతనిమనస్సులో నుండెను. అట్లుండుటయే "నాకుఁ గొంత యవకాశమిమ్ము. దీనిని గురించి యాలోచించుకొనవలెను." అని మాత్రమే యప్పుడతఁడు చెప్పఁగలిగెను.

"నరేంద్రా! నేను చిన్నపిల్లనైనప్పుడు నేఁజెప్పినపని చేయుటకు నీవెన్నడు నవకాశమిమ్మని యడుగలేదు. ఇటీవల నీవు మాఱిపోయి నావా? నేను మునుపటిదానను గానా?"

"హేమలతా! మన చిన్నప్పటికి, ఇప్పటికి స్థితిగతులు మాఱినవి." అని నరేంద్రుఁడు పరుషముగ నుత్తరమిచ్చెను.

హేమలత కన్నులు బాష్పపూరితములయ్యెను. తిరస్కార భావముతో నామెను దానుజూచినట్లు నరేంద్రునకుఁ దోఁచెను కాని తన భావములెట్లు వెలిబుచ్చవలెనో యెఱుఁగఁ డయ్యెను.

" హేమలతా ! తొమ్మిదేండ్ల తరువాత నిన్ను నేను గలసికొంటిని. నేను నీకు మనోవ్యాధి గలిగింపను. కాని, నీకోరిక చెల్లించునెడల నేనెంత బాధపడవలెనో నీవు తెలియఁజాలవు. " అని యెట్టకేల కతఁడు పలికెను.

" బాధల సంగతి యాఁడుదిగూడ కొంత యెఱుఁగును. " అని హేమలత మృదువుగా నుత్తరము చెప్పెను.

" హేమలతా! యీరాత్రి నేను మాటలాడుటకిష్టములేని విషయములు కొన్నియున్నవి. నేనొకవేళ మాటాడినను నీవుగ్రహింపఁజాలవు. చెల్లెలివలె నీవు నన్ను ప్రేమించితివి, కాని యంతకన్న లోతుగానున్న భావమును, నిరాశవల్ల గలిగిన పరితాపమును, దృఢమయిన గుండె భిన్నమగుటను నీవెఱుఁగవు. నిష్కళంకమయిన నీహృదయము నాపడుచున్న తాపము పడియెఱుఁగదు. నేను భరించినంత తాపమును ఆడుదాని మృదుహృదయము సహింపలేదు. హేమలతా ! నీవు హాయిగా నుండుము. దుఃఖము నన్ను సహింపనీ, నన్ను వేరుగా బ్రతుకనీ. " .

" నరేంద్రా ! ఆడుదిగూడ సహింపగలదు. " అని హేమలత మృదువుగాఁ జెప్పెను.

"నీ యుమాయుకత్వముచేత నాకు వెఱ్ఱియెత్తించుచున్నావు హేమలతా ! ఆశ లడుగంటి, జీవితము శూన్యమయినప్పుడు మగవాఁడు సహించు మనోవ్యథను నీవు తెలిసికొనలేవు ; భావించుకొనలేవు. "

"నరేంద్రా ! ఆడుదిగూడ ఎంతో చూడఁగలదు. ఎంతో భావింపఁగలదు. "

" నీకంతయుఁ దెలిసినయెడల నాపూర్వపు మందిరములలో వసించి, యాశాభంగమునకు, మనస్తాపమునకు నిలయమయిన పాడుబ్రతుకు బ్రతుకుమని సెలవిచ్చెదవా? అక్కడ ప్రతితావు పూర్వగాథలను జ్ఞప్తికిఁ దెచ్చుచుండునే. హేమలతా ! నీవు భర్తృగృహమున పతివ్ర

త్వవై యాయన సేవలు చేయుచు హాయిగా నుండుము. ఏదృశ్యము లను నేను చూడ సాహసింపనో వాటిని వదలి నన్ను దూరముగాఁ బోసి. నేను వృద్ధుఁడనయిన తరువాత పూవు వాఁడిపోయినట్లు పూర్వ వృత్తాంతమంతయు వాడి స్మృతిపథమును దాటిపోయిన తరువాత మన మొండొరులము మఱియొకసారి చూచుకొనవచ్చును. అప్పుడు నీవు సోదరివలె దుర్బలుఁ డయిన వృద్ధమిత్రుని కుపచారములు చేసి పోషించి సుఖముగా కాలధర్మము నొంద నీయవచ్చును."

" సోదరా, నరేంద్రా ! నీవు మాట్లాడితివిగాని, విచారముగా మాట్లాడితివి. చెప్పుచున్న దాఁడుదయినను కొంచెము చెవియొగ్గి శ్రద్ధతో వినుము ! నీవు దేనిని సహించితివో దానిని సహించిన స్త్రీలు గూడ లోకమునఁ గొందఱుందురు. కాని, వారు జీవితములో తమ ధర్మములు తాము నెఱవేర్చిరి. మనకు వేరువేరు కృత్యముల విధిం చిన పరమేశ్వరుఁ డొక్కఁడు కలండనియు, ఆయన యేర్పరచిన రంగములలో విధిగా మనమనుజులు మనము జేయవలెననియు నాకుఁ దోఁచుచున్నది. మన మశక్తులమయిన మనుష్యులము. మనమువట్టి కోరికలు కోరుదుము. మాత్సర్యము బెంచుకొందుము. అల్లరి చిల్లరి విషయములను గురించి మాటాడుదుము. మనకు విధించిన కృత్యములు నిర్వర్తించి కృతకృత్యులయిన పురుషులట్లు, కృతార్థులయిన స్త్రీలట్లు బ్రతికి చనిపోయితిమా ధన్యులమగుదుము. నరేంద్రా ! నీకు గొప్ప సంస్థానమున్నది. భక్తిగల ప్రజలున్నారు. సుఖదుఃఖములలో నిన్ను నమ్ముకొన్న జనులు వేనవేలున్నారు. ఇవన్నియు వదలిపోవుదువా? యోధుఁడు తనకృత్యమునుండి యెన్నఁడు మరలఁడు గదా ! ఏవో వట్టికోరికలు కొన్ని నీమనసులోఁ బెట్టుకొంటివని సమస్తము చెంగ నాడుకొనవచ్చునా ? "

హేమలత కొంచెమాఁగెను. నరేంద్రుఁడు మాఱుమాటలాడలేదు. కావున నామె మరల నిట్లు హెచ్చరించెను :

"నరేంద్రా! నీ వింతకుమున్ను చేసిన యుద్ధములకన్న గొప్ప యుద్ధ మొకటి చేయవలెను. ఈ జీవితయుద్ధములో నిజమైన యోధుండవై బ్రతికి పోరాడి జయింపుము. కాలమువచ్చినప్పుడు జీవితములో తన కృత్యమును సుఖపడియో కష్టపడియో నిర్వర్తించిన వానివలె వీర మరణమొందుము. మనము చేసిన కృత్యములే లెక్కకు వచ్చును గాని, మన కోరికలు, మన స్వప్నములు లెక్కకు రావు. మనము కోరిన కోరిక నెరవేరిన నెంత, నెరవేరకపోయిన నెంత! విచారముతోను ఆశా భంగముతోను క్రుంగిపోయిన నది యొక లెక్కలోనిది గాదు. మనకు విధింపఁబడిన ధర్మము నెరవేర్తుమేని, పరమేశ్వరేచ్ఛ ననుసరించిన వారమగుదుము. మనము దుర్బలుల మైనప్పుడు దేవుని హస్తము కనఁబడకుండ మనకు సాయము జేయును. నరేంద్రా! నీ జీవితధర్మము నీవు నిర్వర్తింపుము. తన కృత్యము యథావిధిగా నిర్వర్తించిన ప్రియ సోదరునిగూర్చి నీ చెల్లెలు గర్వపడును. పురుషుఁడవై మెలఁగుము. పురుష కృత్యము నీవు చేయవలసి యున్నది."

సువర్ణ దేవాలయములో రెండుజాముల రాత్రి గంట కొట్టబడెను. చంద్రకాంతి జీవితములోఁ దన కృత్యమును సంపూర్ణముగ నెరవేర్చిన యా ప్రౌఢబాలిక మొగముమీఁదను, గన్నులమీఁదను బ్రసరించి వింతవిలాసము దెచ్చెను. నరేంద్రుఁడు తొమ్మిదేండ్లు మహాయోధుఁడై యుండియు, నా బాలికచేత ధర్మోపదేశములు బడయవలసినంత వంద యు, వ్యర్థుఁడు, తానయినట్లు భావించెను. కన్నులెత్తి పైకిఁ జూచు నప్పటి కతనికి ధ్రువనక్షత్రము కనఁబడెను. అది చూడఁగానే తన కృత్యము మాట యతనికి జ్ఞప్తికి వచ్చెను. వచ్చుటయు నతఁ డిట్లనియె:

"కోమలతా! నేను నీయాజ్ఞ చేసెదను. నేను నీతో బంగాళమునకు వత్తును. నాకృత్యమంతయు నేను నెరవేరునట్లు దేవుఁడనుగ్రహించుఁగాక!"

"నరేంద్రా! ఆతండ్రి కొడుకువై నందు కాయనవలెనే మాట లాడితివి. నీవు చిన్నప్పటినుండియు నాకు సాయము జేయుచునే యుంటివి. ఈ లోకములో తనకు విధించిన కృత్యములు నిర్వహించుటలో, తన కష్టములు తాను పడుచున్న యాందుదానికి తోడు పడుము."

ఇద్ద ఱూరకుండిరి. ఓపికగల యా యువతి సహించి జయింపఁగలిగిన కష్టములను నరేంద్రుఁడు తెలిసికొనెను.

"శైవలిని జపము చాలించి యిక్కడికి వచ్చును. ఆమె రాకమును పొక్కమాట! నీవు వీరనగరములో నన్ను కడసారి చూచితివి. అది జ్ఞాపక మున్నదా?"

జ్ఞాపకమున్నదని నరేంద్రుఁడు బదులు చెప్పెను.

"ఆ శీతకాలపు ప్రాతఃకాలము, మంచు గ్రమ్మిన తెలుపు, చెట్ల తోఁపులో నున్న గుడి, నీకు జ్ఞాపక మున్నవా?"

జ్ఞాపకమున్నవని యతఁడు చెప్పెను.

"మనము పాతిన మల్లెమొక్కయు, అందు పూచిన పూవులు జ్ఞాపక మున్నవా?"

అన్నియు జ్ఞాపకమున్నవని నరేంద్రుఁడు బదులు చెప్పెను.

"అట్లయిన తొమ్మిదేండ్లక్రిందట నీవు నాకిచ్చిన యా యభిజ్ఞానము (గుర్తు) నీకు జ్ఞాపక మున్నదా?" అని హేమలత మృదువై ధవళమైన తన హస్తము చాపి, తన్ను విడిచిపోవునప్పుడు చేతి కతఁడు కట్టిన యా మల్లికాకంకణము జూపెను. వాడి త్రుత్తుపియలైన యా మల్లికాకంకణమును నరేంద్రుఁడు చూచెను.

అది ముక్క లయినను హేమలత దారముతో గ్రుచ్చి దాచి హేమలత కోవెలకుఁ బోవునప్పుడు మరల నొకసారి ధరించెను.

"నరేంద్రా! ఇది నీ బహుమానము. అది విప్పివేయను. దానిని

తీసికొనుటకు నీ కొక్కనికే హక్కు కలదు.” అనునప్పుడామె కంఠము కొంచెము కంపించెను.

“నన్ను నీ మనస్సులో జ్ఞాపక ముంచుకొనుట కిది యొక గుర్తు. హేమలతా! నన్ను నీవు మఱతువా యేమి?” అని నరేంద్రుఁడు పలికెను.

“అన్నా! కంఠములో ప్రాణ ముండఁగా మఱువను. కాని యీ యభిజ్ఞానమునం దింతకన్న నెక్కువ యర్థ మున్నది. నేను మనశ్శాంతి గోరినప్పుడు నా కది దొరకనీక యిది వైకల్యము గలిగించినది. నేను గృహకృత్యములు నిర్వర్తించునప్పుడు నా కన్నుల కిది మైకము గలిగించినది. నరేంద్రా! నే నిది ధరింపఁగూడదు. మరలఁ దీసికొనుము! నేను నా భర్తకు విధేయురాలను. పతివ్రతను.”

అప్పు డిద్దఱు మాటాడఁజాలరైరి. కాని, యొండొరుల భావములు గ్రహించిరి. నరేంద్రుని గుండె కొట్టుకొనెను. అతఁడు బాష్పపూర్ణ నేత్రుఁడై దానిని విప్పి యమునానదిలోఁ బాఱవై చెను.

హేమలతయు, నరేంద్రుఁడును నీటిమీఁదఁ దేలి యది కొట్టుకొని పోవుచుండఁగా దృష్టిపథమును దాఁటి పోవువఱకుఁ జూచిరి.